ప్రథమ ముద్రణ : 1989

ప్రతులు : 1000



తెలుగు విశ్వవిద్యాలయంవారి ఆర్థిక సహకారంతో ముద్రితం.

ముఖచిత్రం : శ్రీ బాలి

**వెల: రు. 40-00**

ప్రతులకు :

**కె. మల్లీశ్వరి,**

శాంతి పబ్లికేషన్స్,

**H. No.** 8–519.

శాంతి నివాసం,

మంగళగిరి.

ముద్రణ :

మోహనదుర్గా ప్రింటర్స్,

విజయవాడ – 1.

దేశ దేశాల్లో మతానికి, మూఢనమ్మకాలకు

వ్యతిరేకంగా పోరాడి అశువులర్పించిన

మ హ నీ యు ల కు

అం కి తం

# కృతజ్ఞతలు

విశ్వవిద్యాలయంలో విద్యాభ్యాసం చేసే రోజుల్లో అభిమానించటమే కాక పరిశోధనలో అత్యంత ఆదరంతో నన్ను పరిశోధకునిగా తీర్చిదిద్దిన మా గురువర్యులు డాక్టర్ లకంసాని చక్రధరరావుగారికి నా మనఃపూర్వక కృతజ్ఞతలు.

పరిశోధనలోనూ, విషయ గ్రహణంలోనూ నాకు సహకరించిన శ్రీ బి. రామకృష్ణ M.A., (ప్రిన్సిపాల్, చార్వాక విద్యాలయం, నిడమర్రు) గారికి

పరిశోధనలో సహకరించిన సోదరుడు డా॥ తోటకూర ప్రభాకరరావుకు

మా కళాశాల ప్రిన్సిపాల్ డా. K. S. R. R. శర్మగారికి

నన్ను అన్నివేళలా అభిమానించే నా మిత్రబృందానికి

ముఖచిత్రానికి కొత్త అందాలు తెచ్చిన ఆర్టిస్ట్ శ్రీ బాలిగారికి

ఈ పుస్తకాన్ని అందంగా తీర్చిదిద్దిన మోహనదుర్గా ప్రింటర్స్, శ్రీ బత్తూరి మోహనరావుగారికి, ప్రెస్ సిబ్బందికి

పుస్తక ముద్రణలో నాకు సహకరించిన మిత్రుడు శ్రీ జంజనం నాగేశ్వరరావుకు

పుస్తక ముద్రణకు రు. 5,750 లు ఆర్థిక సహాయం అందించిన తెలుగు విశ్వవిద్యాలయంవారికి

నన్ను పరిశోధనకు పురికొల్పి అనునిత్యం నాలో స్థైర్యాన్ని, ఆలోచనల్ని, ఆవేశాన్ని రేకెత్తించి ఈ సిద్ధాంత వ్యాసం వెలువడటానికి కారణభూతురాలైన నా జీవిత భాగస్వామిని మల్లీశ్వరికి

ఇంకా ఎందరో మహానుభావులు... అందరికి నా అభివందనాలు.

# నా మాట

తెలుగు సాహిత్యం అనంతమైంది. అగాధమైంది. సాహిత్యంలో నిగూఢమైన ఎన్నో సామాజిక అంశాలు చోటు చేసుకున్నాయి. సమాజానికి, సాహిత్యానికి వున్న సంబంధం పాలు-నీళ్ళ కలయిక లాంటిది. సామాజిక జీవితానికి అద్దం పట్టేది సాహిత్యమే. శతాబ్దాలనాటి సామాజిక స్వరూపాన్ని నేటికి మనం సాహిత్యం వల్లనే చూడగలుగుతున్నాం.

అనాగరిక దశలో ప్రారంభమైన నమ్మకాలు, నాగరికత తెచ్చిన మార్పుకు స్పందించకపోగా, ఆధునిక నాగరికుడు నాటి నమ్మకాల్ని నేటికీ మూఢనమ్మకాలుగా ఆచరిస్తున్నాడు. అనుసరిస్తున్నాడు. సంస్కృత సాహిత్యం తెలుగు భాషలో ప్రతిబింబించింది. ఆర్య ద్రావిడ సమ్మేళనంతో ఏర్పడ్డ నమ్మకాలు దీనికి దోహదం చేసాయి. తత్ఫలితమే సమాజంలో మూఢనమ్మకాలు.

నా ప్రస్తుత సిద్ధాంత వ్యాసం 'తెలుగు సాహిత్యంలో మూఢనమ్మకాలు' అనే అంశం. ఇతః పూర్వం ఈ సిద్ధాంతాన్ని ప్రయత్నపూర్వకంగా విశ్లేషిస్తూ సమగ్రమైన పరిశోధన లేకపోవడంచేత ఈ సిద్ధాంత గ్రంథంలో మూఢనమ్మకాల్ని విశదీకరించి, వాటి తీరుతెన్నుల్ని పరిశీలించి పరిష్కార మార్గాల్ని అన్వేషించాను.

చివరిగా ఒక్కమాట.

నా సిద్ధాంత వ్యాసాన్ని ఆమూలాగ్రంగా చదివించుకున్న సాహితీ కళా తపస్వి శ్రీ నార్ల వెంకటేశ్వరరావుగారు "ఇది సమాజానికి కొత్త రక్తం ఎక్కించే టానిక్" అన్నారు. ఆంధ్ర విశ్వవిద్యాలయం తెలుగు విభాగం ఆచార్యులు శ్రీ S. V. జోగారావుగారు "ఇది సమాజాన్ని విషపూరితం చేసే పాయిజన్, ఇది ప్రచురణార్హం కాదు" అన్నారు.

ప్రియమైన పాఠకులారా! ఈ భిన్నస్వరాలలో ఏది వాస్తవమో! మీదే తుది నిర్ణయం.

అభివందనలతో

మంగళగిరి

12-8-89

మీ

పీరాంజనేయులు.

# యోగ్యతాపత్రం



**డా॥ లకంసాని చక్రధరరావు**
ఎమ్.ఏ; పి.హెచ్.డి.
రీడరు, తెలుగు శాఖ
డైరక్టరు, ప్రధాన సంపాదకులు
తెలుగు వ్యుత్పత్తికోశ పథకం
ఆంధ్ర విశ్వకళా పరిషత్, విశాఖపట్నం.

"తెలుగు సాహిత్యంలోని మూఢనమ్మకాలు" అనే విపుల విషయంపై కూలంకషంగా నా పర్యవేక్షణలో పరిశోధన కావించి ఆంధ్ర విశ్వకళా పరిషత్ ద్వారా 1986 లో పి.హెచ్.డి పట్టాన్ని డాక్టర్ కె. వీరాంజనేయులు పొందారు. వీరు మూఢనమ్మకాల పూర్వాపరాల్ని పరిశీలించి వీటికి వ్యతిరేకంగా పోరాడిన వేమన, పోతులూరి వీరబ్రహ్మం, కందుకూరి వీరేశలింగం, గురజాడ అప్పారావు, కవిరాజు త్రిపురనేని రామస్వామి, గోరాగార్ల అభిప్రాయాల్ని తేటతెలుగు మాటలలో తెలిపి అందరి హృదయాలలో ఆసక్తిని, స్ఫూర్తిని కలిగించారు. ఒక కార్యకారణ సంబంధం ఏర్పడ్డ తర్వాత మాత్రమే మానవుల్లో నమ్మకం అనేది స్థిరపడుతుంది. ఈ విధంగా స్థిరపడ్డ విశ్వాసం శాస్త్రీయమైనా అశాస్త్రీయమైనా మనిషి ఆలోచనా పరిధికి వాస్తవంలా అనిపిస్తుంది. అశాస్త్రీయంగా మన సమాజంలో దృఢంగా నాటుకొని ఉన్న నమ్మకాలు మనిషిని అజ్ఞానాంధకారంలోకి తోసివేస్తూ, మానవతను, విజ్ఞతను, ఆలోచనాశక్తిని, వ్యక్తిత్వాన్ని సర్వనాశనం చేస్తూ మూఢ నమ్మకాలుగా ఏ విధంగా మారాయో వీటిని కొన్ని స్వార్థపరశక్తులు ఏ రకంగా వినియోగించుకొంటున్నాయో ఈ గ్రంథం వివరిస్తోంది. మానవుల శ్రమశక్తిని ధన మాన

ప్రాణాల్ని అపహరిస్తున్న కుత్సితులయిన పరాన్నభుక్కులపై డా. వీరాంజనేయులు చేసిన శాస్త్రీయ శస్త్ర ప్రహారమే ఈ సిద్ధాంత వ్యాసం.

బౌద్ధం నాటినుండి విమర్శలకు గురియైన యజ్ఞ యాగాదుల్నే కాకుండా స్వల్ప విషయాలుగా భావించబడే ఆహారపు అలవాట్లలోని మూఢనమ్మకాల్ని కూడా రచయిత ఖండించారు. పండుగల్ని, ఆచార వ్యవహారాల్ని అభినివేశంతో చెప్తున్నట్లు, జాతర్లను, క్షుద్రవిద్యల్ని చక్కని కథకుడుగా వివరిస్తున్నట్లు, వాస్తు, హస్తసాముద్రిక జ్యోతిశ్శాస్త్రాదుల్ని తెలిపేటప్పుడు వ్యాఖ్యానిస్తున్నట్లు, వివిధ సంఘటనల పూర్వాపరాల్ని పరిశీలించేటప్పుడు సమాజశాస్త్ర పరిశోధన చేస్తున్నట్లు డాక్టర్ కె. వీరాంజనేయులు మనకు కనిపిస్తారు. హేతువాది అయిన వీరాంజనేయులు ప్రజలలోని మూఢనమ్మకాల్ని పోగొట్టవలసిన ఆవశ్యకతను నొక్కి వక్కాణించి సమాజంపట్ల తమకున్న బాధ్యతను నిర్వహించారు.

సమాజంలోని మూఢనమ్మకాల్ని సహేతుకంగా వివరించి ఖండించిన డాక్టర్ కె. వీరాంజనేయుల్ని అభినందిస్తూ సంఘానికి వీరు సాహిత్యం ద్వారా ఇతోధికసేవ చేస్తారని ఆశిస్తున్నాను.

# విషయ సూచిక

# మూఢనమ్మకాలు - పూర్వాపరాలు

ప్రకృతిలోని జీవరాసులన్నింటా విలక్షణత గలిగినది మానవుడే. తన జిజ్ఞాస, ప్రతిభా పాటవాలతో మిగిలిన జీవులన్నింటికంటె ఎప్పటికప్పుడు తన ఆధిక్యతను నిరూపించుకున్నాడు. పరస్పర వైరుధ్య భావాలతో నిరంతర పరిశీలనా దృక్పథంతో మేధావిగా రూపొందాడు.

జంతువులతో సహజీవనం ప్రారంభించిన మానవుడు తన జిజ్ఞాస కారణంగానే వేల, లక్షల సంవత్సరాల తరువాత నాగరికంగా మిగిలిన జీవరాసుల కన్నా మేల్తరంగా తన జీవితాన్ని మలచుకున్నాడు. జంతుకోటినుంచి విడివడిన మానవుడు తనలోని ఆలోచన, పరస్పర వైరుధ్యాల కారణంచేత ప్రకృతి శక్తుల్ని జయించి, దాన్ని సాధ్యమయినంతవరకు లోబరుచుకుని ఎప్పటికప్పుడు నూతన జీవితానికి నాందిపలికాడు.

ఒకనాటి ఆదిమానవుడు ప్రకృతి శక్తిని గమనించేదశలో లేనప్పుడు తన చుట్టూవున్న పరిసర ప్రభావాల ఉత్పాదనల్ని తెలుసుకోలేక భయకంపితుడయ్యాడు. ప్రకృతి చేసిన ఉత్పాదనల్ని ఉరుములు, మెరుపులు, తుఫానులు, భూకంపాలు భయంకరమైన అడవుల్ని సైతం బూడిదచేయగల అగ్నిని చూసి ప్రకృతికి తల వంచాడు. ప్రకృతిముందు మోకరిల్లాడు. నాటి మానవునికి ఈ ప్రకృతి ఒక దేవతగా తోచింది. తనకంటె ప్రకృతే ఒక అతీతమైనశక్తి అని భావించాడు. అందుకే ప్రకృతిని ప్రార్థించడం అలవాటుచేసుకున్నాడు. తన ప్రార్థనల్ని ఆలకించి ప్రకృతి తన ప్రచండత్వాన్ని తగ్గించుకుందని భ్రమపడ్డాడు. ప్రకృతి శక్తుల్లోని వర్షం, హిమం ఆ యా సమయాల్లో ఉద్భవిస్తూ, ఉపశమిస్తాయనే జ్ఞానం నాటి మానవుడికి కలగకపోవడమే దీనికి ముఖ్య కారణం. అందుచేత ఆ యా శక్తుల్ని నిరోధించగలిగేది తన మోకరింపేనని అంచనావేసుకున్నాడు. జన్మించిన ప్రతి జీవి మరణించక తప్పదు. ఇది ప్రకృతిలో ఒక ముఖ్యమైన పరిణామం. కాని ఆదిమ మానవుడు మరణానికి, రోగానికి ఇతర ఈతిబాధలకు ప్రకృతిశక్తే కారణమని ఊహించాడు. అందుకే ప్రకృతికి కొన్ని శక్తుల్ని అంటకట్టి వాటిని ప్రార్థించడము, తాను తినే ఆహార పదార్థాల్ని నైవేద్యాలుగా సమర్పించడం అలవాటు చేసుకున్నాడు. మొట్టమొదటిగా ఆదిమ మానవుడిలో ఇలాంటి నమ్మకాలు ఏర్పడ్డాయి.

ఆ నమ్మకాలే క్రమంగా జీర్ణించుకుపోయాయి. తన జీవితంలో పొందిన అను భవాలు, అలవాట్లను తరువాతి తరాలవారికి మార్గదర్శకంగా చేశాడు. ఈ రూపంలో వచ్చినవే నమ్మకాలు. సహజంగా మానవునిలోని అజ్ఞానం, ఆలోచనారాహిత్యం భయాన్ని ఆధారంగా చేసుకునే నమ్మకాలు ఏర్పడ్డాయి.

ఈ విధంగా నమ్మకాలు ఏర్పరచుకున్న మానవుడు పెరుగుతున్న విజ్ఞా నాన్ని ఆధారంగా చేసుకుని నవ్యజీవితం సాగిస్తున్నా ప్రకృతికి భయపడ్డాడు. చెట్ల తొర్రలలోనో, కొండ గుహల్లోనో వంటరిగా జీవించిన మానవుడు సమాజ పరంగా, గణాలుగా జీవించటం నేర్చుకున్నప్పటికి, ప్రకృతిలోని భాగమైన నిప్పును, నీటిని వుపయోగించుకోవటం తెలిసినప్పటికి, ప్రకృతికి మాత్రం మొక్క రిల్లటం మానలేదు. తనకున్న నమ్మకాల్ని త్యజించలేదు. నాటి ఆటవికయుగం నుంచి నేటి అణుయుగం వరకు తనకున్న నమ్మకాల్ని పరంపరాగతంగా కొన సాగిస్తూనే వున్నాడు.

ఈ విధంగా పెరిగిన, పెరుగుతున్న నమ్మకాలు అనంతరూపాల్లో ఆవహించి మనిషిని మూఢంగా తయారుచేయడమే కాక ఈనాడు మానవుడ్ని నిత్యజీవితంలో ఏదో ఒకరకంగా పట్టి పీడిస్తూనే వున్నాయి. ఒకప్పుడు ప్రాకృతిక పరిణితి తెలియని అమాయక మానవుడు చేసుకున్న నమ్మకాలు నేటికి మూఢంగా ఆచ రిస్తూనే వున్నాడు.

"ఆచారం అంటే నడవడి మూఢంగా అంటే వివేకంతో పని లేకుండా దానితో నిమిత్తం లేకుండా ఆచరించటం మూఢాచారం అవుతుంది. ఋజువులతో నమ్మవలసినదాన్ని ఋజువులు లేకుండానే నమ్మటం మూఢవిశ్వాసం. ఒక రహస్యాన్ని మరో రహస్యం ద్వారా గణించటం మూఢవిశ్వాసం. ఈ ప్రపంచ మంతా దైవంచేతనే పాలించబడుతున్నదని నమ్మటం మూఢవిశ్వాసం. ఈ ప్రకృతి నిర్మాణంలో ఏదో ఆలోచన, ఏదో ఉద్దేశం. ఇంకేదో కళాదృష్టి ఉందని నమ్మటం మూఢవిశ్వాసం. కారణ కార్యాలకున్న సరైన సంబంధాన్ని కాదనటం మూఢ విశ్వాసం. మానవ మస్తిష్కం ఎవరిచేతనో సృష్టించబడ్డదని, ఇది పదార్థాల్ని నియమబద్ధం చేస్తుందని నమ్మటం మూఢవిశ్వాసం. అద్భుతాలున్నాయని, మంత్రా లున్నాయని కలలు రావటానికి ఏదో కారణముందని, సోదె నిజమని నమ్మటం

మూఢవిశ్వాసం. కంటికి కనిపించని ఈ ప్రకృతి కాపలం, దీన్ని సృష్టించిన అగోచరమైనదేదో వుందని నమ్మటం మూఢవిశ్వాసం" [1]

ప్రకృతిలో ప్రారంభమైన నాటి మానవుడు ప్రకృతిని గురించి కొంత తెలుసుకున్న తరువాత ప్రకృతికి అతీతంగా ఏదో ఒక శక్తి వుందని వూహించు కున్నాడు! దానికి అనుగుణంగా కొన్ని విశ్వాసాల్ని ఏర్పరచుకున్నాడు. నాటి విశ్వాసమే నేటి నమ్మకానికి మూలం. ఒకనాడు తెలియని శక్తిని నమ్మిన మానవుడు నేడు ప్రకృతిని, కార్యకారణ సంబంధాల్ని తెలుసుకున్న తరువాత కూడా ఆయా నమ్మకాల్ని మూఢంగా అనుసరించటంతో మూఢనమ్మకాలు ఉత్పన్నమయ్యాయి.

అందుచేత అజ్ఞానంతో ప్రకృతిలోని సహజత్వాన్ని గమనించలేక, సమాజంలో సహజంగా ఏర్పడిన తన నమ్మకాలకు కార్యకారణాల్ని తెలుసుకోలేక గ్రహించిన సత్యాన్ని సైతం ఆచరించలేక మూర్ఖంగా గత తరాలవారు పేర్చిన నమ్మకాన్ని అనుసరించటమే మూఢనమ్మకం.

ఈ మూఢనమ్మకాలు సమాజాన్ని— నేడు వ్యక్తిని పీల్చి పిప్పిచేస్తున్నాయనటంలో విప్రతిపత్తి లేదు. ఆదిమ నాగరికతలో నాటిన నాటి అశాస్త్రీయ మూఢబీజాలు నేడు నాగరిక సమాజంలో మహావృక్షాలుగా అభివృద్ధి చెందాయి. వివిధ రూపాల్లో పరిణితి చెందాయి. నేడు మానవ మస్తిష్కంలో ఏర్పడిన మూఢ నమ్మకాలన్నీ ఒకసారి కలిగినవి కాదు. కాలం గడిచినకొద్దీ క్రమంగా ఆయా నమ్మకాలు అనంతంగా పెరుగుతూ వచ్చాయి. నాటి మానవుడికి ప్రకృతికి సంబంధించిన నమ్మకాలు ఏర్పడితే నేటి ఆధునికుడు తన పెరిగిన నాగరికతకు అనుకూలంగా నమ్మకాల్ని కూడా పెంచుకున్నాడు. శాస్త్రీయంగా మలుచుకోదానికి ప్రయత్నిస్తున్నాడు.

సమాజంలో బలమైన ఒక వర్గం బలహీనమైన వర్గాన్ని తన గుప్పెట్లో వుంచుకోవటానికి ఏర్పరచిన వుక్కు చట్రమే నమ్మకాల వెల్లువ. పరాన్న భుక్కులైన కొందరు స్వార్థపరులు తమ సుఖవంతమైన జీవిత విధానం కోసం కొన్ని మూఢనమ్మకాల్ని ప్రవేశపెట్టారు. ప్రపంచవ్యాపితంగా అన్ని దేశాల్లోనూ ఈ వర్గాలు తాము ప్రాతినిధ్యం వహించే విధంగా కొన్ని నమ్మకాల్ని నియమాల్ని

1. నాస్తిక యుగం, సెప్టెంబరు 1976 పు 26.

ఏర్పాటు చేశాయి ప్రపంచవ్యాపితంగా వ్యాపించిన ఈ వర్గం ఈ నియమాల ఆధారంగా మతాన్ని, దేవుణ్ణి సృష్టించారు. ప్రతి మతంలోనూ దేవుణ్ణి ఆధారంగా చేసుకుని ఏర్పరచిన నియమ నిబంధనలే మూఢనమ్మకాలకు ఆలవాలం అయ్యాయి.

**మతం - మూఢనమ్మకాలు :**

మానవుని సాంఘిక వ్యవస్థకు మెట్టమొదటగా అడ్డుకట్ట వేసింది మతమే. మానవుడు అజ్ఞానదశలో వున్నంత కాలం మతం అతడికి సిద్ధాంతాల్ని ఏర్పరు స్తుంది. సంఘం మారినకొద్దీ మతం – మత నియమాలు కూడా మారుతూనే వుంటాయి. అందుచేత సమాజం – సంఘం నాగరికత ఏ విధంగా వున్నదో కొలబద్దగా నిరూపించేదే మతం. మతం అంటే దేవుడు అని సహజంగా భావించ వచ్చు. ప్రపంచంలో వున్న అన్ని మతాలకూ మూలం దేవుడే. మూఢనమ్మకాలే మతానికి పునాదులు. ఈ పునాదిని కదిలించగలిగినప్పుడు దానిమీద నిర్మించబడ్డ అసామాజిక భవనాలు కుప్పకూలిపోతాయి.

ఉదాహరణకు మనం హిందూ మతాన్నే తీసుకుందాం ఈ మతం ప్రత్యేక మైన మత సిద్ధాంతాలమీద కాక కేవలం మూఢనమ్మకాలమీద, అసందర్భమైన గ్రుడ్డిభావాలమీద ఆధారపడి వుంది. మతదృష్టితో పరిశీలిస్తే హిందూ మతం మిగిలిన అన్ని మతాలకంటె వెనకబడి వుందనే చెప్పాలి. ఎందుకంటే మిగతా మతాలన్నీ ఏకత్వాన్ని బోధిస్తే హిందూమతం ఏకత్వంలో భిన్నత్వం చూపించింది. మత సిద్ధాంతాల్ని పరిశీలిస్తే ఏకత్వ సిద్ధాంతమే మతానికి చరమదశ. అయితే హిందూమతం ఈ దశకు ఇంతవరకు చేరలేదు. ఇప్పటికే అనంతకోటి దేవతలు. శతకోటి ఉపదేవతలు

"ప్రతి మతంలోనూ ఏదో ఒక దేవుడో లేక కొంతమంది దేవుళ్ళో ఉండి వారే భౌతిక ప్రపంచంలో జరిగే కార్యకలాపాలకు కర్తలుగా పరిగణించబడుతున్నారు. ఎప్పుడైతే మానవుడు తన శరీరాన్ని, మనస్సునూ దేవుని కప్పగించి వేస్తున్నాడో అప్పుడే అతని హేతువాదం మూఢ విశ్వాసానికి బలి చేయబడుతుంది. దైనందిన జీవితంలో గడిస్తున్న ప్రపంచానుభవం, జ్ఞానం అతనికి దూరమైపోతుంది. అతనికి

అంతా దేవుని లీలగా కనబడుతుంది. అతనిలో విమర్శనాజ్ఞానం నశిస్తుంది. చివరకు సత్యం తెలుసుకోవాలనే జిజ్ఞాస అతనికి రోతగా కనబడుతుంది". 1

మొట్టమొదట అనాగరక మానవుడు ప్రకృతిని, ప్రకృతిలోని భీభత్సాన్ని చూచి భయపడి తనకర్థంగాని ప్రకృతి శక్తుల్ని ప్రార్థించాడు. ఒక్కొక్క ప్రకృతి శక్తిని ఒక్కొక్క దేవతగా భావించాడు. ఇదే మూఢ నమ్మకానికి మొదటి మెట్టు. ఈ మూఢ నమ్మకమే ఆయా దేవుళ్ళను తృప్తిపరచటానికి నైవేద్యాలు, బలులు సమర్పించటానికి కారణమైంది. ఈ కార్యక్రమంలో భాగంగానే మతానికి ఒక నాయకుడో లేక అధిపతో కావలసివచ్చాడు దైవతృప్తికి చేసే ప్రతి ప్రయత్నానికి దేవుని మాతగానో దైవ ప్రతినిధిగనో అతడ్ని భావించడం జరిగింది వీరే క్రమంగా మతానికి ప్రత్యేక ప్రాతినిధ్యం పొంది మతాధిపతులుగా, పీఠాధి పతులుగా తయారయ్యారు. ఆనాడు సంఘంలో వారికున్న ప్రత్యేక విలువల్ని ఆధారంగా చేసుకొని సమాజం మొత్తాన్ని తమ చేతిలోకి తీసుకొని, సామాన్య ప్రజల శ్రమశక్తిని దోచుకుని, తాము సుఖవంతంగా జీవిస్తూ పరాన్న భుక్కులయ్యారు. ఈ విధంగా పెత్తందారులైన వీరు ఇంకా ఇంకా అనేక మూఢ నమ్మకాల్ని పెంచి పోషించి తమ మనుగడకు మార్గం సుగమం చేసుకొన్నారు దైవానికి కొన్ని కోరికలు కల్పించి దాన ధర్మాల పేరుతో, నిత్య నైవేద్యాల పేరుతో, ప్రజల్ని దోచుకోవడం ప్రారంభించారు. వారికి మంత్రశక్తి వుందని, దేవుడు వారికి ప్రత్యక్షమౌతాడని పూజారి లేక మతాధికారికి ముడుపు చెల్లిస్తే దేవుడికి చేరుతుందనే మూఢ నమ్మకాల్ని కలిగించి సామాన్యుల ఆలోచనా శక్తిని హరించి వేశారు. తమ దోపిడి విధానానికి మార్గం సుగమం చేసుకున్నారు. ఈ సమాజంలో మూఢ నమ్మకాలు ఎంతగా సామాన్యుల్లో పాతుకుపోతే ఆయా పురోహిత వర్గానికి అంత లాభం.

మత ప్రభావం చేత ఏర్పడ్డ మూఢనమ్మకాలు సమాజంలో భౌతికమైన, మానసికమైన, సామాజికమైన మౌఢ్యాన్ని పెంచుతాయి. ఈ మూఢ నమ్మకాలు నేటి మానవుడ్ని వేదకాలానికి నెట్టివేస్తుందనటంలో సందేహం లేదు. ఆనాటినుంచి నేటివరకు పెరిగిన విజ్ఞానానికి ఆనకట్టవేయగలిగింది మతమే.

---

1. యం. యన్. రాయ్ వ్యాసాలు. పు 26

"ఇప్పటికి వేలసంవత్సరాలు గడిచాయి. కాని హిందూ సంఘంలో ప్రజల్లో అప్పటికి యిప్పటికి పెద్ద మార్పు ఏమీలేదు. అప్పుడున్న ఆచార వ్యవహారాలు సాంఘిక వ్యవస్థ ఇప్పటికీ ఉన్నవి. హిందూమతంలోని సాధారణ వ్యక్తికి వొక స్పష్టమైన సిద్ధాంతం కాని మతం కాని లేదు. భగవంతునిమీద అతనికున్న భావం యెలాంటిదో అతనికే తెలియదు. భగవంతునికోసం అతనిలో క్రమబద్ధమైన ఆచరణ మృగ్యం. నిజంగా అతడు పూర్తి మతస్థుడు అని చెప్పటంకంటె మతంలేనివాడు అని చెప్పవచ్చును. కాని అతనిలో మూఢవిశ్వాసాలు ప్రకోపించి అతని నిత్య జీవితంలో ప్రతిబింబిస్తూ వుంటాయి. అతడు మూఢంగా కర్మ సిద్ధాంతాన్ని నమ్ముతూ వుంటాడు. వేలసంవత్సరాలనుంచి అన్నింటికి వెనుక భగవంతుడే వుండి నడిపిస్తున్నాడనే విశ్వాసం అతనిలో జీర్ణించుకుపోయింది. అందుకోసం అవసరమైన పూజా పునస్కారాలు, ఆచారాలు నిర్మించుకున్నారు. హిందూ సంఘంలో ఉన్న హెచ్చుతగ్గులు, లోటుపాట్లు అన్నింటినీ కర్మ సిద్ధాంతం అంగీకరిస్తుంది. వెనుకటి జన్మలో చేసిన కర్మ సంచయాన్నిబట్టి యీ జన్మమేర్పడుతుందని, కాబట్టి యీ హెచ్చుతగ్గులు సహజమని కర్మసిద్ధాంతం బోధిస్తుంది ఈ సిద్ధాంతం ఒక రంగుల రాట్నంగా తయారయింది. హిందూ సంఘం ఇందులోనుంచి బయటపడలేకపోతుంది కర్మ సిద్ధాంతం మానవుని జిజ్ఞాసను చంపి అతన్ని బంధించివేస్తుంది. వేల సంవత్సరాలనుంచి వస్తున్న సాంఘిక దురాచారాల్ని గౌరవించి వాటికి లొంగి పోవటమే అతని బాధ్యతగా యెంచబడుతుంది [1]

అందుచేతనే తరతరాల సంఘర్షణలో పెరిగిన మూఢనమ్మకాలు స్థిరపడి సంప్రదాయాలుగా మారిపోవటం తరువాతి తరాలవారు వాటిని ఆసవాయితీగా అనుసరించటం జరిగింది.

## సంప్రదాయం :

గత తరం మానవునిలో ఏర్పడిన సమ్మకాలు తరువాత తరాల వారికి మార్గ దర్శకమవుతాయనటంలో సందేహం లేదు. తన తండ్రి లేక తన తాతముత్తాతల ఆచరణలు తనకు శిరోధార్యం అని సహజంగా ఊహించుకుంటాడు. దానికి కార్య కారణ సంబంధాల్ని వెతకడు. మా తాత ఈ విధంగా చేశాడు, మా నాన్న

1. యం. యన్. రాయ్ వ్యాసాలు పు ౩౨.

ఈ విధంగా చేశాడు, నేనూ దాన్ని ఆచరిస్తాననే భావిస్తాడు తప్ప తాను ఎందుకు చెయ్యాలి? ఎందుకు పూర్వుల్ని అనుసరించాలి అని ఊహించకపోవడమే సంప్రదాయానికి పునాది.

"సంప్రదాయమనగా పరంపరాగతమైన పరిజ్ఞానము, లేక ఒకానొక సుప్రతిష్ఠమైన ఆచారం" [1]

పూర్వులు అందించిన ఆచారాలు సంప్రదాయాలుగా మారిపోవడం తరువాతి తరాలకు మార్గదర్శకంగాను అవి నిర్మాణాత్మకంగాను తయారవుతాయి.

"గతతరము వర్తమాన తరమునకు సంప్రదాయ మూలధనము నందించి పోవును. ఒకానొక సాంఘిక వ్యవస్థను సంబంధించిన ప్రజలందరు ఆమోదించి నప్పుడే ఒకానొక సాంప్రదాయము వేరూని నిల్చును". [2]

ముందు తరాలవారు అందించిన సంప్రదాయ విలువల్ని తరువాత తరాల వారు ఆచరించినప్పుడు అవి స్థిరంగా నిలబడతాయి. సమాజంలో అవి బలంగా వేళ్లూని స్థిరంగా పాతుకుపోతాయి. ఆ విధంగా బలపడిన సంప్రదాయాల్ని తరువాతి వారు త్రోసిరాజనలేరు. తన పూర్వుల నమ్మకాల్ని కాదనే ధైర్యం తరువాతి తరాలకు కలగనప్పుడు గుడ్డిగా ఆచరించడం ప్రారంభమవుతుంది. అవే మూఢ సంప్రదాయాలు, గుడ్డి సంప్రదాయాలుగా మారిపోతాయి. క్రమంగా ఈ భావాలు గట్టిపడి చిట్టెంకట్టి మానవ సమాజాన్ని పీడించే విధంగా తయారవుతాయి.

ఈ విధంగా ఏర్పడిన సంప్రదాయాల్ని నూతనమైన తన భావాల ద్వారా, విప్లవాన్ని కలిగించటం ద్వారా, తన ప్రతిభను కనబరచటం ద్వారా మార్పుకోరే చైతన్యవంతమైన తరం వచ్చినప్పుడు ఈ సంప్రదాయాలు ఛిన్నాభిన్నం కాక తప్పదు.

"అపార ప్రతిభావంతుడైన ఒక వ్యక్తి తన పూర్వులు నడిచిన బాటలో నడవక ఏదో ఒక క్రొత్తదనము చూపును. అప్పుడిట్టి వ్యక్తులు ఘంటాధ్వములను

1. ఆధునికాంధ్ర సాహిత్యము పు 2
2. ఆధునికాంధ్ర సాహిత్యము పు 4

కాదని కంటక మార్గములందు కాలూని స్వశక్తిచే వానివి పూలబాటలుగా మలచు కొందురు. వారేర్పరచిన బాటలోనే వారికన్న అల్ప ప్రతిభ, పరిమిత బుద్ధియు గల వారు నడచుకొందురు. నడచువారి సంఖ్య ఎంతగా అధికమైన అంతగా ఆ బాట నలిగిపోవును గమ్యమును సులభముగా అందుకొన వచ్చునను విశ్వాసము పథకుల కేర్పడును. ఆ బాటలో నడచుట ఒక సంప్రదాయముగా మారిపోవును". [1]

పాత సంప్రదాయాల స్థానంలో కొత్త సంప్రదాయం చోటు చేసుకొంటుంది కొత్త సాంప్రదాయం విప్లవాత్మకమైన మార్పు. ఒకరకంగా ఇది కూడా నమ్మకమే. అయితే కార్యకారణ సంబంధాల్ని ప్రశ్నించగలిగిన సంప్రదాయమైతే అది హేతు బద్ధమౌతుంది. కానినాడు కొంతకాలానికి అదికూడా మూఢ నమ్మకంగా మారి పోతుంది.

"మూఢనమ్మకం బానిసత్వానికి ముద్దుబిడ్డ"[2]

స్వతంత్రంగా ఆలోచించలేనప్పుడు ప్రతి నమ్మకం మౌఢ్యంగా మారుతుంది. ఇది బానిసత్వానికి ప్రతీక. విజ్ఞానం ఆలోచల్ని రేపుతుంది పరీక్షకు నిలబడుతుంది. సత్యాన్ని వివరిస్తుంది అజ్ఞానం గతాన్ని అనుసరిస్తుంది– పాత నిర్ణయాల్ని అమలు పరుస్తుంది. నమ్ముతుంది.

"మూఢనమ్మకానికి పునాది అజ్ఞానం. మూఢ నమ్మకం అజ్ఞానానికి ముద్దు బిడ్డ. అది దారిద్ర్యానికి తల్లి". [3]

అజ్ఞానం పునాదులపైన మూఢ నమ్మకాల భవనం నిర్మించబడుతుంది. అజ్ఞానమే మూఢనమ్మకాల్ని పెంచి పోషిస్తుంది. అజ్ఞానమే ప్రాకృతిక మానవుడి నుండి నేటి నాగరిక మానవుడి వరకు గుడ్డిగా నడిపిస్తుంది. విజ్ఞానం గురించి ఆలోచించనీయదు.

"సమస్త లోకంలో విజ్ఞానశాస్త్రానికి ఏకైక శత్రువు మూఢనమ్మకమే". [4]

---

1. ఆధునికాంధ్ర సాహిత్యము, పు– 8 & 9
2. The liberation of man - woman & child. P – 109
3. అదేపుస్తకం. పు. 141
4. అదే పుస్తకం. పు 155

నేడు పెరుగుతున్న విజ్ఞానం మనిషిని ఆలోచింపచేస్తుంది. ఒకప్పుడు వ్యాధులకు భయపడి దేవతల్ని ప్రార్థించటం తప్ప మరోమార్గమే లేదనే మూఢ నమ్మకాల్లో మునిగిన మానవుడు నేడు విజ్ఞానశాస్త్ర సహాయంతో వైద్యశాస్త్రాన్ని వైద్యుణ్ణి నమ్ముకుంటున్నాడు దేవతలకు నైవేద్యాలు సమకూర్చటం ద్వారా మశూచి, కలరా వంటి వ్యాధులు పోతాయని నమ్మిన మానవుడు వైద్య శాస్త్రాన్ని, గుర్తించక నేడుకూడా గత తరం పేర్చిన మౌఢ్యాన్నే అనుసరిస్తే విజ్ఞానానికి ప్రత్యక్ష శత్రువు మూఢ నమ్మకాలు కాక మరేమౌతాయి. జ్వరం వస్తే దేవతకు మొక్కు, వ్యాధి వస్తే దేవుడికి ముడుపు, బాధవస్తే దైవపూజ, ఇటువంటి ఆలోచన లతో దేవుణ్ణి ప్రసన్నం చేసుకోవటం ద్వారా తన ఈతి బాధలు తీరిపోతాయని భావించటంచేతనే మూఢనమ్మకాలు సమాజంలో అసత్యానికి ప్రతీకలయ్యాయి.

"మూఢనమ్మకాలే దేవుళ్ళను, దేవమాతలను, దయ్యాల్ని, పిశాచాల్ని సృష్టించాయి. కార్యకారణాల గొలుసును విచ్ఛన్నం చేశాయి". [1]

వ్యాధి పీడితులైన అనేక మందికి దయ్యం పట్టిందని మంత్ర తంత్రాల ద్వారా నయమవుతుందని అనాదిగా వస్తున్న నమ్మకం. విజ్ఞానం అది దయ్యం కాదని హిస్టీరియా అనే వ్యాధి సోకిన మనిషి చేసే వికృత చర్య అని వివరిస్తుంది. దానికి చికిత్స సరియైన సాధనం. ఆ విధంగా కాక దయ్యం సోకిందనే మిషతో రోగిని మరింతగా హింసించే సంఘటనలు మనం చూస్తూనే ఉంటాం.

ప్రకృతిని చూచి భయపడిన మానవుడు ప్రాకృతికంగా కొన్ని నమ్మకాలు ఏర్పరచుకున్నాడు. తన మానసికమైన బలహీనతల ఫలితంగా మానసికమైన నమ్మ కాల్ని ఏర్పరచుకున్నాడు. మతపరంగాను, సమాజపరంగాను, సాంస్కృతికంగాను కొన్ని నమ్మకాల్ని మానవుడు ఏర్పరచుకున్నాడు. ఈ నమ్మకాలు క్రమంగా ముదిరి నేడు సమాజంలో మూఢనమ్మకాలుగా చోటుచేసుకున్నాయి. ఈ మూఢ నమ్మకాలు సాంఘిక, ఆర్థిక సామాజిక రంగాల్లో స్థిరపడి నేడు మానవుణ్ని పీల్చి పిప్పిచేస్తున్నాయి.

చరిత్రగతిని పరిశీలిస్తే బలవంతుడిదే రాజ్యం. బలహీనుణ్ని అణిచి వారి శ్రమశక్తిని దోచుకుని జీవించటమే బలవంతుడి పని. మధ్య ఆసియానుండి

1. The liberation of man - Women & Child. P. 150

భారతదేశానికి వచ్చిన ఆర్యులు ద్రావిడుల్ని దక్షిణ ప్రాంతానికి తరిమివేయటమే కాక వారిని నాల్గవ వర్ణంగా విభజించారు. అస్పృశ్యులని, అంటరానివారని పంచము లనే ఐదోవర్ణంగా విభజించారు. నాటి పురోహిత వర్గం క్షత్రియుల సహకారంతో సమాజాన్ని తమ చేతుల్లో వుంచుకొని స్వైరవిహారం చేసారు. పరాన్న భుక్కులై మిగిలినవారి శ్రమశక్తిని దోచుకున్నారు. మిగిలినవారిలో వైరుధ్యాల్ని పెంచి పోషించారు మతమని, దేవుడని, మత నియమాలని విధించి సామాన్యుల్ని అణిచి వేసారు. కర్మ సిద్ధాంతాన్ని, పునర్జన్మ సిద్ధాంతాన్ని స్వర్గ నరకాల బూచిని చూపటం ద్వారా వారిని తమ బానిసలుగా చేసుకున్నారు. ఆర్య సంస్కృతి నుండి ప్రారంభ మైన ఈ వైదిక సాంప్రదాయ, మతనమ్మకాలే తరువాతి తరాలకు మార్గ దర్శకం అయ్యాయి. తరువాతి తరాలు వాటిని నయానో భయానో అనుసరించక తప్ప లేదు.

ఈ మూఢనమ్మకాలకు ప్రధానంగా బలిపశువులైంది స్త్రీజాతి. మాతృ స్వామిక యుగంలో కుటుంబానికి, సమాజానికి ప్రాతినిధ్యం వహించిన స్త్రీ వీటి ఫలితంగా వంట ఇంటికి పరిమితమై పురుషుడికి బిడ్డల్నికనే యంత్రంగా మారి పోయింది. ఆమెపై రకరకాల ఆంక్షలు విధించబడ్డాయి. పాతివ్రత్య మహత్యం పేరుతో వారు అతి దారుణమైన స్థితికి దిగజార్చబడ్డారు. పురుషుడికి బానిసగామారి పోయారు. సహగమనం పేరులో, వైధవ్యం పేరులో వారి జీవన అస్తిత్వమంత కలసిపోయింది.

సమాజంలో దిగువ వర్ణంగా పేర్కొనబడిన శూద్రులు, పంచములు ఈ మూఢనమ్మకాల యజ్ఞానికి సమిధలయ్యారు. వారి శ్రమశక్తి దోచుకోబడింది. అతిహేయంగా చూడబడ్డారు సామాజిక విలువల్ని కోల్పోయారు.

మూఢనమ్మకాలు అవిచ్ఛిన్నంగా కొనసాగటానికి ముఖ్యమైన మలుపు అర్థికరంగం. నాటి పురోహితవర్గం పరాన్నభుక్కులై తాము ఏర్పరచిన నమ్మకాల్ని సామాన్యులపై రుద్దారు. హైందవ మత ప్రాబల్యాన్ని పెంచారు. మతం ముసుగులో మతాధికార ప్రభావంతో సామాన్యుల్ని తమ అధీనంలోకి తీసుకున్నారు. మనిషి పుట్టిన నాటినుండి మరణించేవరకు మత సంప్రదాయాల్ని మతనియమాల్ని రూప కల్పనచేసి కొన్ని నమ్మకాలు ఏర్పాటుచేసారు. ముహూర్తాలపేరుతో జననాలపేరుతో వివాహాది విధులతో, మరణ కాండలతో ఈ మూఢనమ్మకాల్ని ముంచివేసారు.

ఆలోచన లేని సగటు మానవుడు ఈ ప్రవాహంలో కొట్టుకుపోయాడు. దానాలు, ధర్మాలు, అభిషేకాలు, పూజలు, నైవేద్యాల సమర్పణతో ప్రారంభమైన నాటి నమ్మకాలు మనిషిని బ్రతికి ఉండగా పీడించటమే కాక మరణించిన తరువాత కూడా నరకం అనే మిషతో గోదాన సువర్ణ దానాలతో వారిని అనేక విధాలుగా హింసించాయి. తమ ఆర్థిక అవసరాలకు అనుగుణంగా ఈ నమ్మకాల్ని మలిచారు.

ఈ విధంగా ఏర్పడిన నమ్మకాలు నేటికి సమాజంలో మిగిలి వున్నాయంటే దానికికారణం మతం కొన్ని వేల సంవత్సరాలనాటి నమ్మకాలు నేటికీ కొనసాగుతున్నాయంటే నేడు మానవుడు సాధించిన ప్రగతికి విలువలేదనే చెప్పాలి. విజ్ఞానవంతులు సైతం ఈ మూఢనమ్మకాల్ని వదలలేకపోతున్నారు. నిరంతరం పరిశోధనతో విజ్ఞాన వీధుల్లో సంచరించే సైంటిస్టులు. విజ్ఞానవేత్తలు ప్రకృతి రహస్యాల్ని అందించే శాస్త్రజ్ఞులు ఈ మూఢనమ్మక బంధనాల్ని ఛేదించలేక పోతున్నారనే నిజాన్ని గ్రహిస్తే ఈ మూఢనమ్మకాలు మన రక్తంలో ఎంత గాఢంగా జీర్ణించుకు పోయాయో అర్థం అవుతుంది.

ఈ మూఢనమ్మకాలకు అనుకూలంగా వాటిని పెంచి పోషించిన మతం దేవుణ్ణి గురించి ప్రతికూలంగా పోరాడిన ఉద్యమాల గురించి సోదాహరణంగా చర్చించుకుందాం.

# 1. మతం

మతం అనే పదానికి అభిప్రాయం అని అర్థం. సామాన్యార్థంలో మతం అంటే దైవంతో ముడిపెట్టబడిన సిద్ధాంతం అని అర్థం. దీన్ని పూర్వకాలంలో 'ధర్మం' అని వ్యవహరించేవారు.

ఆదిమ మానవుడు ప్రకృతిలో ఉన్న పరిణామాలు భయోత్పాతాలు, ఉరుములు, మెరుపులు, తుఫానులు, వరదలు మొదలైనవన్నీ చూచి భయపడి ప్రకృతి శక్తిమీద ప్రకృతికి అతీతమైన శక్తులమీద కొన్ని నమ్మకాలు పెంచుకున్నాడు.

"ప్రకృతిని గురించిన భయమే మతావిర్భావానికి దారి తీస్తుంది" [1]

ప్రకృతిని గురించిన అహేతుకమైన ఆలోచనలే మానవుని మౌఢ్యానికి మూలకారణం అయ్యాయి.

"మతగ్రంథాలన్నిటిలోనూ ఆదిమ విజ్ఞానం కొంత క్రోడీకరించబడింది ఈనాటి ప్రమాణాల ప్రకారం అందులో మనకు పనికివచ్చేది అత్యంత స్వల్పం." [2]

నాటి మత గ్రంథాలలో చోటుచేసుకున్న ఆచారాలు, సంప్రదాయాలు, ఆనాటికి ఒకరకంగా సహేతుకమైనవే. విజ్ఞానాభివృద్ధి మానవుని హేతువాద దృక్పథం, మతగ్రంథాల్ని, మతసమ్మతాల్ని తల్లకిందులు చేశాయి. పాశ్చాత్య విజ్ఞాన ప్రపంచంలో కోపర్నికస్, గెలీలియో, డార్విన్‌లు, భారతదేశంలో చార్వాకుడు, కణాదుడు, గౌతముడు, కపిలుడు, జినుడు, బుద్ధుడు మొదలైన తాత్త్వికులు సృష్టి గురించి, సృష్టి క్రమం గురించి చేసిన తాత్త్విక చింతన ఫలితంగా మతభావాలకు భరతవాక్యం పలికారు. ప్రపంచంలో వున్న అన్నిరకాల మతాలు దేవుణ్ణి, దైవశక్తిని గౌరవించినవే. అయితే తాత్త్వికుల భావనలు మత సంప్రదాయాల్ని సవాల్ చెయ్యటంతో వాటి ప్రాముఖ్యం దెబ్బతిన్నాయి

"ఒక మతానికి ఇతర మతాలకంటె శత్రువులు మరెవ్వరూ వుండరు." [3]

ఒక మతం మరొక మతాన్ని గౌరవిస్తుందా ! సమాధానం లేదు అని వస్తుంది.

ఏ మతానికి ఆ మతమే తన మత సంస్కృతి ఇతర మతసంస్కృతికి మార్గదర్శకమని, ఆదర్శప్రాయమైనదని విశ్వసిస్తుంది. హిందువు మహమ్మదీయుణ్ణి, మహమ్మదీయుడు హిందువును మతపూర్వకంగా, సామరస్యంగా గౌరవిస్తాడా ! ఏ దేశంలో ఏ మతచరిత్ర చూసినా ఇటువంటి గర్వించదగిన అంశం కనిపించదు. గత చరిత్రలో చోటుచేసుకున్న మతయుద్ధాలు, అవి సాగించిన రక్తపుటేరులు

---

1. సృష్టికిమూలం ఏమిటి ? పు. 13

2. హేతుత్వం – మతతత్వం – పు. 8.

3. An Idealist view of life – P. 44.

ఈ అంశానికి నిదర్శనంగా నిలుస్తాయి. ఇస్లాం మతానికి, క్రైస్తవ మతానికి యూరప్‌లో జరిగిన పోరాటాలు ఏం చూపిస్తున్నాయి ?

భారతదేశంలోనే ఒక మతానికి చెందిన (హిందూ) రెండు విభిన్న శక్తుల మధ్య సంఘర్షణలు లేవా ? వీరశైవం, వీరవైష్ణం ముదుపాకాన పడి ఒకరినొకరు నరుక్కు చావలేదా ! ఆదిశంకరుడు మతపాషండులని, నాస్తికులని, బౌద్ధుల్ని గానుగల్లో ఆడించిన సంఘటనలు ఏం రుజువు చేస్తున్నాయి ? రోమన్ కాథలిక్కులకు ప్రొటెస్టెంటులకు జరిగిన అంతర్యుద్ధాలు, ఇస్లాం మతంలో సున్నీలకు షియాలకు జరిగిన పోరాటాలు, మారణహోమాలు, నరమేధాలు కావా ? ఇదంతా మత ఆస్తికభావాల నైతిక పతనానికి పరాకాష్ట కాదా ? సమాజంలో తన మతమే గొప్ప అని, ఇతర మతాలు నీచమైనవనే భావన ఇతర మతాలపై నికృష్టమైన నిందారోపణకు కారణాలు కావా ?

"మతాల చరిత్ర చూస్తే భిన్న విధానాల మధ్య పోరాటాలచరిత్రగా మనకు అర్థం అవుతుంది. అందులో దేనికదే తాను అంతిమమైనదాన్నని, పరమ సత్యమైన మతం తనేనని వాదిస్తుంది అది అబద్ధం అనేది ఈ బహుళ వాదనల్ని బట్టి అర్థం అవుతుంది" [1]

మతం అనేది చిన్నతనంలో సోకిన మనఃకల్పితమైన దీర్ఘవ్యాధి. చిన్నతనం నుంచి మతభావాలు పెద్దవాళ్ళు పిల్లలకు అందించటంతో, ఉగ్గుపాలతో నేర్పటంతో మతబీజాలు ఆరంభమౌతాయి. మతం ప్రశ్నించవద్దు, ఆచరించమంటుంది. ఈ విషవలయంతో చిక్కుకున్న చిన్నవాడు పెరిగి పెద్దవాడయిన తరువాతకూడా ప్రశ్నించే హక్కు కోల్పోతాడు. ఒకవేళ ప్రశ్నించినా, మతగ్రంథాలు, మత దురహంకారుల ప్రభావానికి లోనుకాక తప్పదు.

"అన్ని మతాల అజ్ఞాన ఫలితమే; వాటి విత్తనాలు ఒక చీకటి రాత్రివేళ వెదజల్లబడి మొలకెత్తాయి" [2]

ఈ విధంగా నాటిన విషబీజాలు మానవుని తరతరాలుగా నిర్వీర్యుణ్ణి చేశాయి. మతం తాను పేర్కొన్న భావాలకు విరుద్ధంగా ప్రశ్నించే హక్కును హరించివేసింది.

---

1. An Idealist view of life – P. 37
2. Ingersall lectures and essays – P. 17

"మతం మానవుణ్ణి ఎప్పుడూ నాగరికునిగా చేయలేదు. మానవుడే మతాన్ని నాగరికంగా తయారుచేశాడు. [1]

మానవుడు సృష్టించిన మతం, మానవుడు ఏర్పాటు చేసుకున్న మత సిద్ధాంతాలు ఒకనాటి సత్యాలే కాని మారుతున్న పరిణామం, తాను ఆర్జించిన విజ్ఞానపరంపరను గాలికి వదిలి ఒకనాటి సత్యాలే నేటికీ నిత్యసత్యాలే అని భావించటం, మత సంప్రదాయాల్ని గౌరవించాలనడం అవివేకం. వేదాలు ఏనాడో సృష్టించబడ్డాయి అందులో పేర్కొనబడిన అంశాలు, నమ్మకాలు ఆనాటి మానవునికి సత్యాలుగా గోచరించాయి. ఇప్పుడు కూడా వేదసాహిత్యం – వేదాలు అపౌరుషేయాలని, వేదనిర్ణయం, వేదసంస్కృతి తిరుగులేదని భావించడం భావ్యమా? కొన్ని వేలసంవత్సరాలనాడు రాయబడిన వేదాలు నేటికి పరమ ప్రమాణం అయితే మనం ఇప్పటికి ఆనాటి సమాజంతో ఉన్నట్లు కాదా! మరి మనం సంపాదించిన విజ్ఞానానికి ఫలితం ఏమిటి? ఇది నాగరిక తిరోగమనం కాదా! వైజ్ఞానిక తిరోగమనం కాదా! అని ప్రశ్నించాలి. మారుతున్న సమాజంతో మనం కూడా మారాలనే సిద్ధాంతాన్ని గానీ, తత్త్వాన్నిగాని మతం అంగీకరించదు.

కానీ విజ్ఞానశాస్త్రం ఆ విధంగా ఉండదు! విజ్ఞానం అంటే ఇలాంటిది– ఇది అని చెప్పగలుగుతోంది. సైన్సు ఒక సిద్ధాంతం చెప్పినట్లయితే అది ప్రయోగ పూర్వకంగా నిర్ణయించి చెప్తుంది. కానీ మతం అంటే ఫలానా అనే నిర్ణయాన్ని చెప్పలేదు. ఒక్కొక్క మతం ఒక్కొక్క రకమైన సిద్ధాంతాన్ని ఆచరణను అప్పచెప్తుంది. ఏ రెండు మతాలు సమాన సందేశాన్ని అందించవు.

అందుచేత మతానికి శాస్త్రానికి సామరస్యం లేదు.

"మతం – శాస్త్రం శత్రువులు. ఒకటి భయ విశ్వాసాల ఫలితం, రెండవది పరిశోధన – హేతువుల ఫలితం" [2]

మతం అంగీకరించమంటుంది. శాస్త్రం పరిశీలించమంటుంది.

"మతం మూఢనమ్మకాల్ని కలిగి ఉంటుంది. మనం కనుగొనిన విషయాలని కూడా నమ్మమంటుంది. వాటిమీదే ఆధారపడాలంటుంది". [3]

---

1. Ingersall lectures and essays – P. 132
2. హేతుత్వం – మతతత్త్వం – పు. 118.
3. An Idealist view of life – P. 18.

హిందూ మతగ్రంథాలు సూర్యుణ్ణి దేవుడిగానూ, భూమి చుట్టూ ప్రదక్షిణం చేస్తున్నట్లుగాను, సప్తాశ్వ రథారూఢుడై ప్రయాణిస్తుంటే మందేహులనే రాక్షసులు అడ్డగిస్తుంటారని వారిని చంపుకుంటూ ప్రయాణం చేసుకుపోరాదని, అందువలన సూర్య భగవానుడు ఎక్కువ శ్రమలకు లోనవుతాడని వివరించాయి. మందేహుల మరణాన్ని కోరుతూ ఇహలోకంలో పురోహితవర్గం సంధ్యావందన కార్యక్రమం ముగించి వెదజల్లిన నీటితుంపరలు అస్త్రాలుగా మారి మందేహుల్ని నశింపచేస్తాయి అని వివరించడం జరిగింది కానీ మనం కనుక్కున్న విజ్ఞాన ఫలితం సూర్య కేంద్ర సిద్ధాంతం సూర్యుడి చుట్టూ భూమే తిరుగుతుంది అనే విషయాన్ని సైన్సు చెప్పినా హిందూధర్మాపలంబులు అంగీకరిస్తారా ?

మతానికి దేవుడే మూలం. సైన్స్‌కు మానవుడే మూలం ఒకటి దక్షిణ ధ్రువం అయితే, రెండవది ఉత్తరధ్రువం మతం దేవుణ్ణి నమ్మమంటుంది. దేవుడిని నమ్మకపోతే దేవుడు అస్తిత్వాన్ని ప్రశ్నిస్తే మతం కూలిపోతుంది.

"మతాలు విభజించనూ గలవు, ఐక్యపరచనూ గలవు. అందుచేత దాని విభాజిక గుణాలను అర్థం చేసుకుంటేతప్ప మానవుల్ని ఏకం చేసే సిద్ధాంతాన్ని నిర్మించుకోవటం సాధ్యం కాదు." [1]

మతం మానవునికి మత్తుమందు ప్రసాదిస్తుంది దాని మత్తులో మునిగినవాడు మూఢుడిగా మారతాడు.

"మానవజాతి అన్ని దశల్లోనూ మతమనేది మహా మౌఢ్యంగా నిలచి పోయింది." [2]

"మతాలు ప్రేమను, సౌభ్రాతృత్వాన్ని పెంపొందించడానికి ఉద్దేశించ బడ్డాయని చెపుతారు. కానీ తద్విరుద్ధంగా శతృత్వాన్ని పెంచి మతాలు రక్త పాతానికి దారితీస్తున్నాయి." [3]

మతం మానవుని శాంతిని కోరిందా

---

1 Knowledge - morality and destiney – P. 107.
2. An Idealist view of life – P. 44
3. ప్రసారిత జూలై–సెప్టెంబరు 1981 పుట 74

*మత పవిత్రత, నైతిక శుద్ధత్వాన్ని, సునిశితమైన మానవవాదాన్ని నాశనం చేస్తున్నట్లు కన్పిస్తుంది. ఎందుకంటే మిగతా మతాల్ని నాశనం చేయడానికి అది సర్వసన్నద్ధం అవుతుంది. సామాజికాభివృద్ధి కోసమో ప్రపంచశాంతి కోసమే కాదు. అసూయపరుడైన తన దేవుని ప్రీతికోసమే పూనుకుంటుంది.

మతం మానసిక ఆనందాన్ని ప్రసాదిస్తుందని మతవాదులు చెప్తారు. కాని మత చరిత్రను పరిశీలిస్తే శాంతిని కలిగించకపోగా విభాజకశక్తుల్ని పెంపొందించింది.

**మతం - దేవుడు :**

ప్రపంచంలోని మతాలన్ని దేవుడిని అంగీకరించాయి. అయితే ఒక్కో మతానికి ఒక్కో దేవుడు. హిందూమతంలో కోటానుకోట్లు. మనం మతచరిత్రల పుటల్ని తిరగేస్తే ఈ మతాలు తమ తమ అస్తిత్వ ప్రాబల్యం కోసం మిగిలిన మతాల నాశనానికి కృషి చేశాయనడంలో సందేహం లేదు.

"అన్ని మతాలు క్రూరమైనవే. అన్నీ రక్తం పునాదులమీద నుంచి బయలుదేరినవే. ఎందుకంటే అన్నీ త్యాగభావంమీద ఆధారపడినవే. అంటే అన్నీ దైవత్వంయొక్క తృప్తితీరని కసికోసం మానవజాతిని బలి ఇచ్చినవే "[1]

తాను నమ్మిన దైవం కోసం, తాను సృష్టించిన దైవంకోసం తనకు తానే శిక్షించుకొనే వ్యవస్థను "ఐన్‌స్టీన్" అసహ్యించుకున్నాడు.

"తాను సృష్టించిన దేవుడికి బహుమానాలు సమర్పించడం తనకు తాను శిక్షలు వడ్డించుకోవడం, వీటిని ప్రోత్సహించే దేవుడినిగురించి నేనూ ఊహించలేను"[2]

నిర్వికార, నిర్గుణ, నిరంకారుడని స్తుతించబడ్డ దేవుడి ఆస్తిత్వం ఎలా ఉంటుంది అని ప్రశ్నించుకుంటే ఏమి తెలుస్తుంది ?

"మనిషి నిజంగా దేవుడిని తన రూపంలోనే సృష్టించాడు. గుర్రాలకు, ఎద్దులకు, మనుష్యుల కులాగా దేవుళ్ళుంటే వాటి దేవుళ్ళు గుర్రాల్లాగ, ఎద్దుల్లాగ ఉండేవారు."[3]

---

1. God and the state - P. 27
2. The Indian Rationalist - March P. 14
3. The Human Universe - P. 6

మనకు భౌతిక వస్తువులు మాత్రమే దృగ్గోచరమవుతాయి తప్ప దేవుడి అస్తిత్వం గురించి మనకు వాస్తవంగా ఏమీ తెలియదు.

"దేవుణ్ణి శాస్త్రపరిధిలోకి తీసుకురావాలంటే ఒక ఉపాధిని ఏర్పరుచుకోవాలి. అంటే దాని అర్థం ముందుగా దేవుడిమీద నమ్మకం వదిలివేసుకోవాలి. చాలా సిద్ధాంతాలు రుజువు కానపుడు వదిలివేశాం, దేవుడిని కూడా అదేవిధంగా వదిలి వేయాలి."[1]

అనాదిగా ఈ దేవుడి భావన మనిషిలో భానిసత్వ లక్షణాలని ప్రేరే పించింది. అతడి స్వేచ్ఛను హరించివేసింది.

"దైవభావనలో అంతర్గతంగా మానవుడు హేతుత్వాన్ని, న్యాయాన్ని నిరాకరించడం అనేది ఉంది. మానవ స్వేచ్ఛకు నిర్ద్వంద్వంగా అది వ్యతిరేకి. ఆచరణలో అది మానవజాతిని దాస్యంలో ముంచటమే దాని లక్ష్యం."[2]

దైవం పేరుతో మతం పేరుతో మనలో వ్యాపించిన మూఢనమ్మకాలు మనిషిని మౌఢ్యంలో ముంచివేశాయి.

# 2. హేతువాదం

హేతువు అంటే కారణం. ప్రతి కార్యానికి కారణం వుండాలి కదా ? అని ప్రశ్నించటం అన్నమాట. ఇది మానవుని ఆలోచనా విధానానికి దారి తీస్తుంది. ఒక అంశాన్ని తీసుకుని తర్కబద్ధంగా ఆలోచించి నిజాన్ని వెలికితీసే వాదమే హేతువాదం. హేతువాదం గురించి విజ్ఞానవేత్తలు తమ తమ అభిప్రాయాల్ని ఈ విధంగా వివరించారు.

"అభిప్రాయాలు ఏర్పాటు చేసుకోవడం, ఆచరణలో వాటిని సక్రమంగా నిర్వహించటం, హేతువును మాత్రమే ప్రమాణంగా తీసుకునే సిద్ధాంతమే హేతు వాదం".[3]

---

1. Men without Gods - P. 60 &.61
2. God and The state - P. 26
3. Websters New Twentieth centuary dictionary - P. 1

మానవుడు తనకు కలిగిన అనుమానాల్ని నివారణ చేసుకోవడానికి హేతువును మాత్రమే ఆధారంగా తీసుకొని, అహేతుకమైన నావనల్ని, అనుమాన ప్రమాణాల్ని నిరాకరించి శాస్త్రబద్ధంగా చర్చించే జీవనతత్త్వమే హేతువాదం.

"హేతువు జ్ఞానానికి మూలంగానూ, పరీక్షాసాధనంగానూ నిర్ణయించే తాత్త్విక దృక్పథమే హేతువాదం".[1]

తరతరాలుగా మతం – మతవాదులు ప్రవేశపెట్టిన మౌఢ్యాన్ని, మూఢ నమ్మకాల్ని తాత్త్వికులు ఎందుకు? ఏమిటి? ఎలా? అని ప్రశ్నించడం ప్రారంభించారు గత కొన్ని శతాబ్దాలుగా మతం ప్రవేశపెట్టిన సిద్ధాంతాల్ని తర్క శాస్త్రజ్ఞులు, తత్వవేత్తలు ప్రశ్నించారు

తర్కబద్ధమైన ఆలోచనా విధానం ద్వారా ప్రాకృతిక విజ్ఞానాన్ని గ్రహించడమే దీనికి ఆధారం అవుతుంది ప్రతి తత్త్వవేత్త తనకు ముందున్న మత సిద్ధాంతాల్ని, తాత్త్విక సిద్ధాంతాల్ని పరీక్షించి, హేతువుద్వారా ఆలోచించి తమకు నచ్చినవాటితో ఏకీభవించి, తమకు నచ్చని సిద్ధాంతాలతో విభేదించి కొత్త సిద్ధాంతాల్ని ప్రతిపాదించారు. ఈ విధంగా వారు చేసిన నిర్ణయాలు లేక భావనలు తరువాతి తరాలవారికి సమ్మతం కాకపోవచ్చు తర్కానికి నిలబడకపోవచ్చు. అయితే అవి ఆనాటికి సహేతుకాలే. ఆనాటికి అవి పరమసత్యాలే తరువాత తరాలవారు కాలక్రమేణా కలిగే మార్పుల్ని ఆహ్వానించి, కొత్తసిద్ధాంతాల్ని సహేతుకంగా పరిశీలించి ఆచరిస్తారు.

మత సిద్ధాంతం ఆ విధంగా వుండదు ఏ మతమైనా గాని తాను పూర్వం చెప్పిన సిద్ధాంతాల్ని, నమ్మకాల్ని వదులుకోదు. వేల సంవత్సరాలకు పూర్వం చేసిన తాత్త్విక నిర్ణయాలు నేడు సత్యాలు కావు సూర్యుడు, మిగిలిన గ్రహాలు నక్షత్రాలతో కలిసి భూమిచుట్టూ తిరుగుతున్నాయని దాదాపు అన్ని మతగ్రంథాలు, మతవాదులు ఏకగ్రీవంగా అంగీకరించిన సత్యమే. విజ్ఞాన ప్రపంచంలో భూకేంద్ర సిద్ధాంతం కాక, సూర్య కేంద్ర సిద్ధాంతాన్ని ఆధునిక శాస్త్రవేత్తలు సిద్ధాంతీకరించే వరకు భూకేంద్ర సిద్ధాంతం సత్యమే అని నూహించడం జరిగింది తరువాత అది

1. The encyclopedia of Britanica 5 – 527

అసత్యం అని ఋజువయ్యింది. తనవంటి రూపంతోనే దేవుడు మానవుడ్ని సృజించాడని ఆదిగ్రంథం వివరిస్తుండే, జీవ పరిణామ సిద్ధాంతం మానవ శరీరం కణ నిర్మితమైందని, ఏకకణ జీవినుండి ప్రాకృతిక పరిణామదశలో క్రమ పరిణామంలో మానవుడుగా రూపొందాడని సిద్ధాంతీకరించింది. జీవ పరిణామ సిద్ధాంతాన్ని క్రైస్తవులు అంగీకరించడంతో ఈ విషయంలో మత గ్రంథాల ప్రాముఖ్యానికి విలువ లేకుండా పోయింది

మతం తన నమ్మకాల్ని వదలదు. శాస్త్రం ఆ నమ్మకాల్ని తోసివేస్తుంది. మతం పరిణామాన్ని అంగీకరించదు. శాస్త్రం మార్పును ఆహ్వానిస్తుంది. మౌఢ్యాన్ని మూఢనమ్మకాల్ని అంగీకరించదు. మతాన్ని, మతగ్రంథాల విలువల్ని నిరాకరించటమే హేతువాద లక్ష్యం. గతంలో మతం కొంత సత్యాన్ని ప్రమాణం చేసింది. అది అపౌరుషేయమని పేర్కొంది. అందుచేత మతానికి నిత్యసత్యాలుంటాయి. హేతువాదం ఎప్పుడూ మారే సత్యాల్ని అంగీకరిస్తుంది. కాబట్టి హేతువాదానికి శాశ్వత సత్యాలుండవు.

పరిణామం సహజం అనుకున్నాం గదా! నిరంతర పరిణామంవల్ల ప్రకృతిలో జరిగే మార్పుల్ని గమనిస్తూనే వున్నాం ప్రతి పరిణామాన్ని కార్యం అనుకొందాం. దానికి కారణం తప్పకుండా వుండాలి కదా! ఈ రెంటికి అవినాభావ సంబంధం వుందన్నమాట. అందుచేత ఇది అవిభాజ్యమైన అంశం. ఈ విధంగా ప్రకృతిలో ఉన్న రెండు వస్తువుల్ని, సంఘటనల్ని, వాటికి ఇతర వస్తుజాలంతో వున్న సంబంధాల్ని ఒకదానికి ఒకటి కారణంగానూ మరొకటి కార్యంగానూ తెలుసుకోవచ్చు.

అహేతుకమైన ఆలోచనలపైనా, నమ్మకాలపైనా నిరంతరం పోరాటం సాగించి శాస్త్రీయ దృక్పథంతో ముందుకు సాగిన ఉద్యమమే హేతువాదోద్యమం.

తరతరాలుగా మానవుడు తాను ఆర్జించుకుంటూ వచ్చిన సమాచారాన్ని తూర్పారబట్టి, కొత్త సిద్ధాంతాలు నిర్మాణం చేసుకోవడానికి వీలుగా వాటిని పరిశీలించడం, విమర్శించడం, సంశయించటం హేతువాదంయొక్క ఆదర్శం. లక్ష్యం.

**హేతువాదం — మూఢనమ్మకాలు :**

సమాజంలో అనాదిగా పేరుకుపోయిన మూఢనమ్మకాలను తొలగించడానికి హేతువాదం ప్రయత్నించింది. హేతుబద్ధంగా చేసే ఆలోచన మతాన్ని, మత గ్రంథాల్ని, మతాచారాల్ని, దేవుణ్ణి ప్రశ్నించడం ప్రారంభించింది.

భారతదేశంలో ఈ ఉద్యమం చాలా ఆలస్యంగా ప్రారంభమయిందనే చెప్పాలి. పాశ్చాత్య సంస్కృతి, పాశ్చాత్య భాషాపరిచయం, శాస్త్రజ్ఞానం అభివృద్ధి వీటికి మార్గదర్శకాలయ్యాయి. కోపర్నికస్ భూమిచుట్టూ సూర్యుడు తిరగడంలేదని భూమే సూర్యునిచుట్టూ తిరుగుతూందని సిద్ధాంతీకరించిన తరువాత మత గ్రంథాల ప్రాముఖ్యం ప్రశ్నగా మిగిలిపోయింది. డార్విన్ జీవ పరిణామ సిద్ధాంతం - మెండల్ సిద్ధాంతం చూపిన పరిణామం మానవజాతికి క్రొత్త వెలుగు ప్రసాదించింది. మానవుని పుట్టుకకు దేవుడు కారణమనే సిద్ధాంతం శూన్యవాదం అయ్యింది. మతం పేరుతో దేవుడు పేరుతో జరిగే మతాచారాలకు, మూఢ నమ్మకాలకు గండికొట్టబడింది.

"మశూచి" ఒక వ్యాధిగా కాక "అమ్మతల్లి"గా భావించారు మశూచి సోకినపుడు మశూచి తల్లికి చద్ది నైవేద్యాలు పెట్టడం, బలులు ఇవ్వడం, పూజా పురస్కారాలు చెయ్యడంవంటి చర్యలద్వారా తగ్గిపోతుందనే నమ్మకం వ్యాపించింది శాస్త్ర పరిజ్ఞానం, హేతువాదం మశూచి అమ్మతల్లి కాదని, అది ఒకరకమైన వ్యాధి అని వివరించడం, ఎడ్వర్డ్ జెన్నర్ అనే శాస్త్రజ్ఞుడు "వేరియోలా వైరస్" (Variola virus) అనే రోగజీవుల వలన మశూచి ఏర్పడుతుందని తన పరిశోధనల ఫలితంగా వివరించి తన్నివారణకు టీకాలు మందు కనిపెట్టిన తరువాత మానవ ప్రపంచంనుండి మశూచి దూరంగా పారిపోయింది.

మతగ్రంథాల్లో వివరించిన అహేతుకమైన సమస్యలన్నీ మూఢనమ్మకాలే. ఉదాహరణకు హిందూమతాన్నే తీసుకొందాం

ఈ మతానికి మూలగ్రంథాలు వేదాలు, ఉపనిషత్తులు. వేదనిర్ణయం ప్రకారం వర్ణవ్యవస్థ ఈ మతంలో చోటు చేసుకుంది ఆర్యులు భారతదేశానికి వలస వచ్చే నాటికి మూడు వర్ణాలు అని ఋగ్వేద ఆరంభంలో వివరించబడింది. ఈ మూడు వర్ణాలు క్రమంగా అనార్య సంపర్కంలో నాలుగు వర్ణాలుగా మారి ద్రావిడులు

నాల్గో వర్ణంగా విభజించబడ్డారు ఆ తరువాత క్రమంలో మరో వర్ణం పంచమ వర్ణం వెలిసింది. ప్రపంచంలో ఎక్కడా లేని, ఏ దేశంలో లేని ఈ వర్ణవ్యవస్థ ఈ దేశానికే ఎందుకు దాపురించింది? ఇంతకు పూర్వం లేని ఈ వ్యవస్థ తరువాత ఎందుకు వచ్చింది? ఈ ప్రశ్నలకు ఋగ్వేదం, ఆదిదేవుడైన బ్రహ్మ ముఖం నుంచి ఒక వర్ణం, బాహువులనుంచి మరో వర్ణం, ఊరువులనుంచి ఒక వర్ణం, పాదాలనుంచి ఇంకో వర్ణం వచ్చినట్లుగా వివరించింది మరి పంచమవర్ణం ఎక్కడ నుంచి ఉద్భవించింది అనే ప్రశ్నకు జవాబు లేదు. ఆనాడు నాలుగు లేక ఐదు వర్ణాలుగా నిర్ణయించబడ్డ వర్ణాలు నేడు పావురాయిగూళ్ళలా వర్ణాలు, కులాలు అనే విషవృక్షాలుగా వ్యాపించి పుష్పించి ఫలించి సమాజాన్ని విచ్ఛిన్నం చేసాయి.

హేతువాద దృష్టితో పరిశీలించిన తరువాత ఈ వర్ణవ్యవస్థ కేవలం కల్పితం అని ఇది కొంతమంది తమ స్వార్థప్రయోజనాల కోసం సమాజంపై, తమ ఆధిపత్యంకోసం చేసిన సాంఘికకుట్ర అని తేలింది.

మాతృస్వామిక సమాజంలో స్త్రీ ఆస్తికి కుటుంబానికి అధికారిణి, పెద్ద. క్రమంగా ఆర్య జాతులు భారతదేశాన్ని స్వాధీనం చేసుకొన్న తరువాత పితృస్వామ్యం, పురుషాధిక్యతతో స్త్రీ నీచంగా చూడబడటం జరిగింది. దీనికి సమర్థనీయంగా మతగ్రంధాలు పురుషాధిక్యాన్ని వివరించాయి.

ఆధునిక యుగంలో హేతువాదం ప్రతి మతాన్ని, మత గ్రంథాల్ని, మత గ్రంథాల్లో చోటు చేసుకొన్న మూఢనమ్మకాల్ని ప్రశ్నించడం ప్రారంభించింది. మానవుడు అజ్ఞానదశలో తనకు తెలియని ప్రతి అంశాన్ని, ప్రకృతికి అతీతంగా భావించాడు. ఆనాటి ఆచారాలే మతగ్రంథాల్లోను, మతాల్లోను ప్రవేశించాయి. అయితే ఆనాడు భావించిన, ఊహించిన భావాలు నేడుకూడా నిత్యసత్యాలుగా భావించడం మూర్ఖత్వం అవుతుంది. అందుకే హేతువాదం ప్రశ్నించమంటుంది. మతవాదం ప్రశ్నల్ని నిరాకరిస్తుంది. గతంలో మతం చెప్పిన నియమాల్ని సాంఘిక సూత్రాల్ని యధాతధంగా అంగీకరించమంటుంది. హేతువాదం ఆ నియమాల్ని తోసివేస్తుంది. విజ్ఞానం పెరిగినకొద్దీ మానవ సమాజంలో ప్రశ్నించే శక్తి పెరిగింది. ఈనాడు మనం అనుభవిస్తున్న విజ్ఞానశాస్త్ర పురోగతి, సామాజిక చైతన్యం, నాగరికత హేతువాదానికి ప్రతీకలే.

తర్కబద్ధమైన ఆలోచనల ఫలితంగానే మతాలు, మతగ్రంథాలు వివరించిన అవాస్తవికాల్ని ఎదిరించి ఆనాటి మూఢనమ్మకాల్ని తుదముట్టించడానికి మానవుని హేతువాద ఆలోచనా సరళి విమర్శనాదృష్టి పెంపొందించింది. విశ్వమానవ ప్రయోజనం కోసం, మానవత్వ విలువల్ని కాపాడటం కోసం, సాంఘిక సామాజిక జీవనంలో సమానతను పెంపొందించింది. మూఢనమ్మకాలను పారద్రోలటం, హేతువాద విమర్శనాదృష్టిని పెంపొందించటం, శాస్త్రీయమైన ఆలోచనా విధానాన్ని రూపొందించటం హేతువాదం యొక్క ప్రాథమిక కర్తవ్యం.

# 3. మానవతా వాదం

మానవుడు సహజంగా స్వతంత్రజీవి, సంఘజీవి. సంఘంలో ఉన్న ఇతర వ్యక్తులమీద, మిగిలిన జీవజంతుజాలం మీదా సదభిప్రాయం కలిగి ఉంటాడు. అతనిలోని వ్యక్తిత్వం మిగిలిన జీవరాసులమీద దయ, కరుణలతో నిండి ఉంటుంది.

"జంతువులమీద ముఖ్యంగా మనుష్యులమీద కారుణ్యభావాన్ని ప్రదర్శించే మానవతా వైఖరే మానవతావాదం (Humanism) అంటాం. దీనినే ఇంగ్లీషులో హ్యూమనిజం అంటారు."[1]

సామాన్యంగా ప్రతి మనిషి మానవతావాది అయి ఉంటాడు. భూతదయ, సర్వమానవ సౌభ్రాతృత్వాన్ని కోరుకుంటాడు. తన సాటి మానవులు పడే బాధలు, కష్టాలు చూసి సహించలేడు. వారి బాధల్ని తన బాధలుగా పంచుకోవడానికి సైతం ఇష్టపడతాడు. మానవసేవే మాధవసేవ అని ఆలోచిస్తాడు ఈ విధంగా భావించే మనస్తత్వం కలిగినవారిని మత భావాలకు అనుకూలంగా, దైవానికి అనుకూలంగా ఉండి దైవసేవ కంటే మానవసేవే ముఖ్యం అని, ప్రతి మనిషిలోనూ దేవుడున్నాడనే నమ్మకంతో ఊహించే ఈ వ్యక్తులందరు మానవతావాదులుగానే గుర్తించబడతారు. అయితే మతానికి అనుకూలంగా, దైవశక్తి భావనతో నిండిన ఇలాంటి మానవతా వాదులందర్ని మత మానవతావాదులు అనే విభాగంగా పరిగణించడం జరిగింది. ఈ మానవతావాదానికి చెందినవారు సహజంగా సత్యం-

1. A Ratınalıst encyclopedia - P. 299

అహింస – న్యాయం – ధర్మం – కర్మ అనే పంచ సిద్ధాంతాలకు లోబడి ఉంటారు. ఈ మత మానవతావాదులకు కేంద్రం దైవం. ఏది జరిగినా ఏది జరగవలసి ఉన్నా దైవప్రేరణే దానికి ముఖ్యం అని భావిస్తారు ఇలాంటి కోవకు చెందినవారే ఏసుక్రీస్తు, మహాత్మాగాంధీ, వివేకానందుడు, ఠాగూర్ మొ॥లైన తాత్త్వికులు.

వీరు మానవునిలోని అతీతశక్తిని దైవప్రేరణగా భావించి ఆ భావాన్ని మానవతావాదానికి ఆలంబనగా చేసుకొని సాటి మానవులపట్ల దయ, కారుణ్యం చూపిస్తారు. వీరు మతాన్ని మాత్రం వదలరు. దైవాన్ని, దైవశక్తిని గౌరవిస్తారు. అందుచేతనే వీరిని మత మానవతావాదులుగా గుర్తించడం జరిగింది.

వీరు తమ మతానికి తమ భావాలకు అనుకూలంగా ఉన్న తోటివారిపై జాలి, దయ, కరుణ చూపిస్తారు అయితే ఈ మత మానవతావాదులు తమ మతం కాక మరో మతానికి చెందిన వారిపై ఇంత కారుణ్యాన్ని చూపించకపోవచ్చు. సహజంగా ఒక మతభావాలు మరొక మతభావాలకు వర్తించవు కదా! ఇది చరిత్రలో నగ్న సత్యం.

"మత వాదం ప్రకారం జీవితం ఒక మజిలీ. దాని ఆశయాలు అంతకు ముందే దేవుడు ఏర్పాటుచేసి ఉంటాడు. శాస్త్రీయ–మానవవాదంలో మానవుడే తన జీవితాశయాలను ఏర్పరచుకుంటాడు." [1]

అందుచేత దైవాన్ని, దైవంయొక్క ఆధిక్యాన్ని సమర్థించే మత మానవతా వాదుల్నుంచి, సర్వమానవాధిక్యమును గుర్తించే మానవతావాదుల్ని విభజించాలి.

ప్రస్తుతం ఆధునిక మానవతావాదాన్ని గురించి ఇక్కడ ప్రస్తావించవలసిన అవసరం ఉంది. పాశ్చాత్య సంస్కృతి వాటితో మనకు కలిగిన అనుబంధం ఫలితంగా వచ్చిన వాదమే ఈ మానవతావాదం (Humanism). ఈ శాస్త్రీయ మానవతావాదానికి నియమ నిబంధనలు లేవు.

---

1. The Humanist revolution – P. 68

"అది అన్ని ప్రదేశాలలోను, అన్ని యుగాల్లోను ఉన్న మానవ ఆలోచనా సారం. అందువల్లనే ఏ ఆలోచన ఐనా ప్రముఖంగా హ్యూమనిస్టు ఆలోచనే. అయితే మానవుని అసమగ్ర జ్ఞానంవల్ల అది దారితప్పి వచ్చింది. అందువల్ల మానవతావాదం అనేది మొత్తం మానవజాతి సౌశీల్యానికి, వారసత్వానికి ప్రతీక." [1]

మానవులందరిని ఏకభావంతో చూడటం, కులమతాలు, సాంఘిక అసమానతలు, వివిధ జాతులు, వివిధ విభాగాలుగా విభజించడం మానవతావాదం సహించదు ఇటువంటి చాయలన్నీ నిర్హేతుకమైనవి. ప్రకృతిలో నియమబద్ధమైన జీవన విధానంలో ఉన్న మానవుల్ని రకరకాలుగా వర్గీకరించడాన్ని మానవతావాదం సహించదు.

"అన్నిరకాల నిర్హేతుకములకు మానవతావాదం వ్యతిరేకం." [2]

మనిషి సహజంగా హేతువాది. ప్రతి వ్యక్తి తనలో ఉన్న మానవతా విలువల ఆధారంగా మంచిని నిర్ణయించుకోగలుగుతాడు. సహేతుకమైన ఆలోచన నైతిక ప్రవృత్తికి ఆధారం అవుతుంది. అందుచేత మానవతావాదం జాతి, మత, వర్గాది చెడుభావాలతో నిమిత్తం లేకుండా ప్రతి వ్యక్తిని సమాన హోదాగా గౌరవిస్తుంది.

"మానవుడు చేసిన హేతుయుతమైన ప్రతి ప్రయత్నం యొక్క ఫలితమే ఈ ప్రయోజనం. అనుక్షణాభివృద్ధిగా స్వేచ్ఛను పొందడమే. స్వేచ్ఛ అంటే స్వయం సంపూర్ణ మానవుడుగా ఉన్న వ్యక్తి పరిపూర్ణ వికాసానికి అడ్డుదగిలే ప్రతిబంధకాలన్నీ క్రమానుగతంగా అదృశ్యం కావడమే." [3]

---

1. The Philosophy and practice of radical Humanism – principles – P. 21.
2. The Humanist revolution – P. 135
3. Principles of radical Humanism – P.

కాబట్టి మానవతావాదం స్వేచ్ఛ, స్వాతంత్ర్యాలకు సత్యాన్వేషణ, జ్ఞాన సముపార్జనకు మార్గదర్శకమౌతుంది. మానవతా విలువలకు అడ్డుగోడలుగా నిలిచే ఏ సిద్ధాంతాన్నిగాని, ఏ నిర్ణయాలనుగాని మానవతావాదం అంగీకరించదు.

“పరీక్షాసాధనంగా సారథిగా హేతువుమీద ఆధారపడటం అనే దానికి హ్యూమనిజం నిబద్ధమై ఉంటుంది [1]

హేతువుపై ఆధారపడటం అంటే హేతువాదాన్ని ఆధారంగా మానవతా విలువలకు మార్గదర్శక సూత్రాలు నిర్మాణం చేయటం.

“హేతువాదం సృజనాత్మకదశలో మారుతూంది. క్రొత్తదానిని నిర్మాణం చేయబోయే ముందు పాతదానిని నాశనం చేయాలి ఈ రోజున హేతువాద ఉద్యమములోనికి భిన్న తరహాలు, తర్వాలకు చెందినవారు వస్తున్నారు. మానవ సమస్యను, మానవ సమస్యలుగా వైజ్ఞానిక నైతిక మూలలనుంచి పరిష్కరించుకోవాలి అని అందరమూ అంగీకరిస్తున్నాము. ఈ రోజున దేవుడు, వేదాలు, మహాత్ములు లేవు. మనిషి స్వతహాగా మంచివాడు కాదు; చెడ్డవాడు కాదు పరిసరాలు అతనిని బాగుచేయవచ్చు; చెడగొట్టవచ్చు. మన వ్యక్తిగత జీవితాన్ని, సామాజిక జీవితాన్ని సుసంపన్నం చేసుకోడానికి మనం ఏమి చేయాలనేదే నేటి ప్రశ్న. శాస్త్రజ్ఞానం దానికి సాధనమే కాని లక్ష్యం కాదు అది మాత్రమే మనిషిని భయం, నిరాశ, దారిద్ర్యం, అనారోగ్యం నుంచి కాపాడగలుగుతుంది. హేతువాదం యొక్క ఈ నిర్మాణాత్మక అంశాన్ని మానవతావాదమని పిలుద్దామని కొందరంటున్నారు. ఈ శాస్త్రీయ యుగంలో ఈ రకమైన హేతువాదమే మనకు కావాలి.” [2]

మొత్తంమీద సృజనాత్మక దృక్పథంలో మానవతా విలువల్ని కలిగి మానవతా సూత్రాన్ని గౌరవిస్తూ సమసమాజ నిర్మాణానికి సర్వమానవ సౌభ్రాతృత్వానికి కృషి చేసే వాదనే మానవతావాదం అనవచ్చు.

---

1. The plain view vol 4 - May 1962 – P. 33.
2. The Indian liberation rationalist supplement, Jan 1960 P. 3

ఈ నవీన మానవతావాదానికి భారతదేశంలో నాంది పలికిన మహాసుభావుడు యం. యన్. రాయ్‌గారు హ్యూమనిజం అభివృద్ధికి ఆయన నిరంతరము శ్రమించారు. ఈ భావాలు కలిగిన హ్యూమనిష్టుల్ని రాయిస్టులు అని వ్యవహరించటం కూడా కద్దు. ఇందులో తీవ్రభావాలు కలిగిన మానవతావాదుల్ని రాడికల్ హ్యూమనిష్టులు అని వ్యవహరిస్తారు.

**మానవతావాదం - మూఢనమ్మకాలు :**

మానవతావాదం అన్ని దేశాల్లోను వ్యాపించింది. సర్వమానవులు ఈ వాదం ముందు సమానులే. వర్ణవ్యవస్థ ప్రశ్నించబడింది. ఇది సమాజంలో వ్యాపించిన మూఢనమ్మకాల్ని ప్రశ్నించింది. అనేక మూఢనమ్మకాల ద్వారా సమాజంలో వ్యాపించిన సామాజిక అసమానతల్ని ఖండించింది. మనిషిని మనిషిని విభజించే వ్యవస్థను వ్యతిరేకించింది. సమాజంలో స్త్రీల ఔన్నత్యానికి అవిరళకృషి సలిపింది.

# 4. నాస్తికవాదం

నాస్తికవాదం గురించి తెలుసుకోవాలంటే ముందు ఆస్తికత్వంగురించి తెలుసుకోవాల్సిన అవసరం వుంది. నాస్తికతకు వ్యతిరేకతే ఆస్తికత, ఆస్తికతకు వ్యతిరేకతే నాస్తికత.

"దేవునియందు నమ్మకం కలిగివుండటమే ఆస్తికత్వం". [1]

సూర్యరాయ ఆంధ్ర నిఘంటువు ఆస్తికత, ఆస్తికభావము, ఆస్తికుడు అనే పదాల్ని గురించి వివరిస్తూ "భగవంతుడు, పరలోకము కలదు అనే భావాన్ని ఆస్తికత్వంగా పరిగణించింది". [2]

"భగవంతుడున్నాడని నమ్మువాడు ఆస్తికుడు. ఆ ఆస్తికుని భావమే ఆస్తిక్యము." [3]

---

1. Athiesm the case against God – P. 7
2. సూర్యరాయ ఆంధ్ర నిఘంటువు పు. 452.
3. శబ్దరత్నాకరము పు. 66,

పై నిర్వచనాల్ని బట్టి కేవలం భగవంతుని (దేవుడ్ని) నమ్మేవారు ఆస్తికులని తెలుస్తుంది.

"భూమ్యాకాశాలు అందులో వుండేవన్నీ వాటికి భిన్నంగా వాటినుంచి వేరుగా ఉన్నా ఒక అత్యున్నత, స్వయం సమర్థ, సర్వేశ్వర, సర్వజ్ఞ, పరిశుద్ధ, దయార్ద్రమైన వ్యక్తియొక్క జ్ఞానం, సంకల్పంవల్లనే కలుగుతున్నాయనే దృక్పథాన్ని ఆస్తిక్యమంటారు" [1]

నాస్తికు డెవరు? అనే ప్రశ్నకు ఆస్తికుడు కానివాడు అని సమాధానం.

అయితే నాస్తికుడ్ని గురించిన వివరాలు కొన్ని తెలుసుకోవాల్సిన అవసరం వుంది.

దైవంపట్ల విశ్వాసం వున్నప్పటికినీ, వైదిక ప్రామాణికతపట్ల వైముఖ్యం ప్రదర్శించినట్లయితే అట్టివారు నాస్తికులుగనే పరిగణించబడినట్లు మను ధర్మశాస్త్రం వివరించింది.

"యోఽవ మన్యేతే తేమూతే హేతుశాస్త్రాశ్రయాద్ద్విజః
ససాధుభిర్బహిష్కార్యో నాస్తికో వేదనిందకః" [2]

వేదాల్ని నిందించినవాడు వేదప్రామాణ్యాన్ని అంగీకరించనివాడు నాస్తికుడుగా పరిగణించబడ్డాడు.

"ఇది ఆస్తిత్వానికి వ్యతిరేకము. 'నాస్తి' అంటే 'లేదు' అని అర్థం. ఏ పదార్థానికి యథార్థమైన వునికి లేదనేవారు నాస్తికులు. అయితే కాలాంతరాలలో అర్థాలు మారాయి. పరలోకం లేదనేవారు నాస్తికులని-పాణిని, వేదాలను ప్రమాణంగా అంగీకరించనివారు నాస్తికులని మనువు, సాంప్రదాయికంగా చార్వాక, జైన, బౌద్ధాలను నాస్తిక దర్శనాలుగా భావించారు. స్వభావ వాదంలోనూ, యదృచ్ఛా వాదంలోనూ, కొందరు ప్రముఖ తీర్థంకరులలోనూ నాస్తిక భావాలు గోచరిస్తాయి. భగవంతునిమీద విశ్వాసం లేని వారినందరినీ సామాన్యార్థంలో నాస్తికులుగా పరిగణిస్తున్నారు." [3]

---

1. Philosaphycal concept of Athiesm antiques of God – P. 4
2. మను ధర్మశాస్త్రం – 2 – 11
3. తత్త్వశాస్త్ర నిఘంటువు – పు. 15 & 16

'అనాగ్జోగరస్' అనే గ్రీకు తత్త్వవేత్త దేవుడున్నాడు, కానీ సూర్యుడు మాత్రం దేవుడు కాడు. సూర్యబింబం సామాన్యమైన భౌతికవిషయమే అన్నందుకు గ్రీకులు ఆయన్ను ఆనాడు నాస్తికునిగా పరిగణించారు.

"నాస్తికత్వమంటే అవిశ్వాసం మాత్రమే కాదు. ఏ విధంగానూ విధ్వంస యుతమై, రాగశూన్యమై బీడువారినదీ కాదు. తద్భిన్నంగా నాస్తికత్వమంటే ఉత్సాహయుతమై సఫలమైన సత్యస్థాపన. ఉన్నత మానవత్వంయొక్క ఆచరణను నిర్మాణయుతంగా సమర్థించడం". [1]

ఉన్నత మానవత్వపు విలువల్ని పెంచే సత్యమైన వాదమే నాస్తికవాదమని పై నిర్వచనంవల్ల తెలుస్తుంది.

నాస్తికత్వం సత్యాన్ని ప్రగాఢంగా అన్వేషించడానికై తన్ను తాను అంకితం చేసుకుంటుంది. అంతే కాదు అది సత్యంకోసం సత్యమనేదాన్ని అత్యున్నతమైన ఆదర్శంగా నమ్ముతుంది. దైవ విశ్వాసంపట్ల కాక మానవ విలువలపట్ల ఉన్నతమైన ఆదర్శ దృక్పథం కలిగి వుంటుంది." [2]

పై నిర్వచనంవల్ల కేవలం దేవుడు లేడు అనడమే కాక అత్యున్నత ఆదర్శాల ద్వారా మానవతా విలువల్ని పెంచి ఆదర్శ దృక్పథం కలిగి వుండటమే నాస్తికత్వం అని అర్థమౌతుంది.

"నాస్తికవాదం అనే పదం అపవిత్రతకు, మతవ్యతిరేకతకు, అవిశ్వాసానికి, నైతిక దుస్థితికి పర్యాయపదంగా ఆస్తికులు భావిస్తారు." [3]

నాస్తికత్వమనేది ఏ ఒక్క సమాజ సిద్ధాంతం కాదు. ఏ ఒక్క జాతి సిద్ధాంతమో, ఒక వర్గసిద్ధాంతమో కాదు అది అన్ని కాలాల్లోనూ, అన్ని దేశాల్లోనూ అన్ని వర్గాలలోనూ వున్న మనిషికి సంబంధించిన సత్యపరమైన తాత్త్విక సిద్ధాంతం." [4]

---

1. నాస్తికత్వం కావాలి – పు. 6
2. American Atheist Vol. 23 – P. 13
3. The New Encyclopedia of Britanica Vol. 2. – P. 258
4. నాస్తికులున్నారు జాగ్రత్త – పు. 13.

పై విషయాలు పరిశీలించినప్పుడు

"నాస్తికతకు - ఆస్తికతకు భేదం అంటే పురోగతికి తిరోగతికి వున్న భేదం." [1]

మొదటిది మతం చెప్పిన వాదం నమ్మమంటుంది. రెండోది మతవాదాన్ని తోసిపుచ్చుతుంది. ఆస్తికత్వం దైవాన్ని నమ్మి కర్మ సిద్ధాంతం అవలంబించమంటే నాస్తికత్వం దైవాన్ని తోసివేసి కార్యకారణ సిద్ధాంతాన్ని, సత్యనిరూపణను కోరి జీవితాన్ని సుఖమయం చేసుకొమ్మంటుంది దైవం పేరుతో, మతం పేరుతో సాగే దోపిడీ విధానాన్ని విమర్శిస్తుంది నాస్తికత్వం మతగ్రంథాల మాయతో వర్ణదృక్పథాన్ని కలిగించిన ఆస్తికత్వం ఈ వాదాన్ని అంగీకరించదు.

## నాస్తికత్వం — మూఢనమ్మకాలు :

నాస్తికత్వం ఒక ఉద్యమం ఇది మతం పుట్టినప్పటినుంచి అహరహం సాగిన వాదం. మతం పెంచి పోషించిన మూఢనమ్మకాల్ని అడుగడుగునా ఎదిరించి పోరాడిన మహోద్యమం. ఈ వుద్యమంలో అనేకమంది మతమారణ హోమానికి బలిపశువులయ్యారు. సూర్యుడు భూమిచుట్టూ తిరగడం లేదు, భూమే సూర్యుని చుట్టూ తిరుగుతుందని చెప్పిన 'కోపర్నికస్'ను కంకరరాళ్ళతో కొట్టి చంపించింది మతవాదం. అనేకమంది బౌద్ధులను గానుగలో ఆడించిన సంఘటనలు భారత చరిత్రలో లిఖించబడ్డాయి. వీరందరూ అన్ని మతాలకూ-మతసిద్ధాంతాలకు వ్యతిరేకంగా పోరాటం సాగించినవారే. ఈ వుద్యమం ఒక ప్రాంతానికో లేక ఒక దేశానికో పరిమితమైంది కాదు. ప్రపంచంలోని అన్ని దేశాల్లోనూ ఈ వుద్యమం అన్ని మతాల్ని ఎదిరించి నిలిచింది. అయితే మత మహామారికి ప్రపంచ నాస్తికులలో చాలామంది సమిధలయ్యారు.

నాస్తికవాదం మూఢనమ్మకాల్ని వ్యతిరేకించింది. నాస్తికవాదం అంటే కేవలం దేవుడు లేడు అనే వాదానికి మాత్రమే పరిమితం కాలేదు. హేతువాదం అజ్ఞానాన్ని ప్రశ్నిస్తే నాస్తికవాదం పోరాట పటిమద్వారా ఉద్యమంద్వారా మూఢ నమ్మకాలకు వ్యతిరేకంగా నిలబడింది.

---

1. నాస్తికత్వ సిద్ధాంతం - పు. 1.

# 5. సామ్యవాదం

కారల్‌మార్క్స్ అనే జర్మన్ ఆధునిక విప్లవాత్మక సామాజికవాదం స్థాపించాడు. ఈ వాదం తెలుగులో సామ్యవాదం అని ఆంగ్లంలో కమ్యూనిజమ్ లేక మార్క్సిజం అని పిలవబడుతుంది.

"మానవ చరిత్రను విస్తృతమైన దాని వివిధ పరిణామ దశలను కార్యకారణ సంబంధముద్వారానే వివరింప వీలగుసని మార్క్స్ నమ్మాను." [1]

మార్క్సిజంలో ప్రధానంగా నాలుగు ముఖ్యమైన అంశాలు పేర్కొనదగినవి.

1. ద్వంద్వ తార్కిక భౌతికవాదం : మార్పు చెందుతున్న పరిణామ దశల్లో ఆర్థిక శక్తుల స్వభావాన్ని గ్రహించి ఆయా వ్యవస్థల్లోని గుప్తతర్కాన్ని అనుశీలనద్వారా బహిరంగపరచగలిగినప్పుడు ఆ దశలో కన్పించే వ్యతిరేకతను వెలిబుచ్చగలిగినట్లయితే తరువాత దశలో ఆ పరిణామ స్వభావం ఇప్పుడున్న వ్యవస్థలో గుప్తంగా గల పరిణామాల ధోరణి తెలుసుకోవడం. దీనినిబట్టి మానవ జీవిత కార్యక్రమాన్ని సంవిధాన్ని సిద్ధపరచుకోవచ్చు.

2. మార్క్స్ అర్థశాస్త్రం : ఈ సిద్ధాంతానుసారంగా పెట్టుబడిదారుడు తన పెట్టుబడితో యంత్రసహాయంతో ఉత్పత్తి ప్రారంభించి కార్మికులకు తక్కువ కూలి చూపి తాను ఎక్కువ లాభం పొందుతున్నాడు. ఈ అదనపు విలువ పెట్టుబడిదారునికి చెందుతుంది. తద్వారా పెట్టుబడి కేంద్రీకరణ జరిగి వ్యాపారంలో పోటీవల్ల పెట్టుబడిదారుల సంఖ్య క్షీణిస్తుంది. దీనినిబట్టి పెట్టుబడిదారీ వ్యవస్థ అనివార్యంగా పతనం అవుతుందని మార్క్స్ సిద్ధాంతం.

3. వర్గసంఘర్షణ : ఈ సిద్ధాంతం ప్రకారం సమాజంలో రెండే విభాగాలుంటాయి. 1. శ్రామికుడు 2. యజమాని. ఒకటి దోపిడీకి గురయ్యే వర్గం. రెండు దోచుకునే వర్గం. ఈ రెండు వర్గాల మధ్య వర్గపోరాటం ప్రారంభమై శ్రామికవర్గం కార్మికవర్గ నియంతృత్వాధీనంలో పెట్టుబడిదారీ వ్యవస్థను విచ్ఛిన్నం చేసి శ్రామిక శ్రేయోరాజ్యం ఏర్పరుస్తుంది.

---

1. తెలుగు విజ్ఞాన సర్వస్వము 7-612.

4. మార్క్స్ నీతిశాస్త్రం : నైతిక విలువలు పరిణామం చెందుతాయని సమాజాభివృద్ధిని అనుసరించి అవి మారతాయని మార్క్స్ నీతిశాస్త్ర ఉద్దేశం. ప్రతి వ్యక్తియొక్క సంపూర్ణ స్వేచ్ఛాయుత అభివృద్ధి సార్వభౌమ తత్త్వంగా గల సమాజమే మార్క్స్‌వాద లక్ష్యం.

మార్క్సిజం అనుసరించే వారందరూ మార్క్సిస్టులు లేక కమ్యూనిస్టులు అని వ్యవహరించబడతారు భారతదేశంలో మొట్టమొదటిసారిగా 1925 లో కమ్యూనిజం ప్రారంభమయింది ఈ సిద్ధాంతాన్ని అనుసరించేవారు వర్ణవ్యవస్థను అంగీకరించరు. సామ్యవాద సిద్ధాంతం ప్రకారం కుల వర్ణవ్యవస్థలు వుండవు. రెండే రెండు వర్గాలుంటాయి. ఒకటి పీడించే వర్గం, రెండు పీడించబడే వర్గం. అందుచేత అనాదిగా ఈ దేశంలో నాటుకట్టిన వర్ణవ్యవస్థను వీరు వ్యతిరేకించారు. గతితార్కిక భౌతికవాదం, చారిత్రిక భౌతికవాదం మార్క్సిజానికి ఆయువుపట్టు. ఈ సిద్ధాంతాన్ని అనుసరించి దేవుడు - మతం - కర్మ అనే మూఢనమ్మకాలు తోసివేయబడ్డాయి.

కార్యకారణ సిద్ధాంతం అనుసరించబడింది కర్మసిద్ధాంతం జన్మ, పునర్జన్మల నమ్మకాలు, మతసిద్ధాంతాలు, సమాజంలో వున్న హెచ్చుతగ్గులు తొలగించడానికి సామ్యవాదం కృషి చేసింది ఎప్పుడైతే సామ్యవాదులచేత మతం ప్రశ్నించబడిందో అప్పుడే మూఢనమ్మకాలపై దాడి ప్రారంభమయిందని చెప్పాలి. నిసలైన సామ్యవాద సిద్ధాంతాన్ని అనుసరించినప్పుడే మూఢనమ్మకాలు, దాని గుట్టుమట్టులు తుడిచివేయబడతాయి.

# 6. చార్వాకం - లోకాయతం

చార్వాక మతాన్ని అనుసరించినవారు చార్వాకులు. వీరిని లోకాయతులు అని పిలవడం కూడా కద్దు. వేదకాలంలో వీరిని గురించిన వివరాలు లేవు. కానీ స్మృతుల్లో, అష్టాదశపురాణాల్లో వీరిని గురించిన చర్చ సాగింది. రామాయణంలో జాబాలికి రామునికి జరిగిన చర్చ, హరివంశంలో వేనరాజు, భారతంలో ధర్మరాజునకు చార్వాకునకు జరిగిన సిద్ధాంతచర్చ, మనుస్మృతిలో మనువు చేసిన

చార్వాకుల నింద, ప్రబోధ చంద్రోదయం, వేణీసంహారం, పండితారాధ్య చరిత్రలో చార్వాకుల వివరాలు మనకు లభిస్తాయి. హరిభద్ర సూరి షడ్దర్శన చరిత్ర, మాధవాచార్యుని సర్వదర్శన సంగ్రహంలో చార్వాక సిద్ధాంతాన్ని గురించిన నిందలు, తెలుగు విజ్ఞాన సర్వస్వం ఏడవ సంపుటంలో చార్వాకుల గురించి వివరాలు మనకు కన్పిస్తాయి

మొత్తంమీద చార్వాకుల సిదాంత గ్రంథాలు గాని, చార్వాకులు చేసిన ప్రసంగాలు గాని మనకు లేవు. వారిని గురించి చేసిన నిందాప్రచారాలు మాత్రమే మనకు పూర్వగ్రంథాల్లో లభించాయి.

భారతదేశంలో యజ్ఞయాగాలు, స్వర్గనరకాలు, ఆత్మ-పరమాత్మ-పునర్జన్మ మొదలైన సిద్ధాంతాలకు వ్యతిరేకంగా పోరాడిన మొదటి నాస్తికులే చార్వాకులు.

వారు జ్ఞానం ముఖ్యం- కర్మ ముఖ్యం కాదన్నారు ప్రతి కార్యానికి కార్య కారణ సంబంధం ఉండాలి కదా. కారణం లేకుండా కార్యం జరగదు కార్యానికి కారణం ఉండాలి కదా ! అని ప్రశ్నించారు. వ్యక్తికి చైతన్యం అవసరమని మూఢాచారాల్ని పట్టుకొని వేలాడవద్దని వీరు ప్రబోధించారు. అందుకే హిందూ మతంలోని ఆస్తికులందరు వీరిని నిందించారు, హింసించారు, అడుగడుగునా వేధించారు.

"హేతువాదముపై స్వతంత్రాలోచన చేయుచూ భౌతికవాదములో పరవశించుచున్న ఈదర్శనము వేదప్రామాణ్యము నంగీకరించువారికి, పరలోక పునర్జన్మ, ఈశ్వరాస్తిత్వాదులను విశ్వసించువారికి గిట్టలేదు. వారు లోకాయతమును నిందించిరి" [1]

చార్వాకులు చచ్చినవారికి పిండాలు పెట్టే ఆస్తికుల్ని పరిహసించారు

"స్వర్గ స్థితా యథాతృప్తిం గచ్ఛేయుస్తత్రా దానతః
ప్రాసాదోస్యోపరిస్థానా మత్రాకస్మోన్న దీయతే"

---

1. సంగ్రహ ఆంధ్ర విజ్ఞానకోశము సం. 7, పు. 69.

చచ్చినవారికి పిండాలు పెడితే స్వర్గంలో ఉన్న పితరులకు చేరేటట్లయితే మేడ పై భాగంలో ఉన్నవారికి బదులుగా క్రిందివారికి పెడితే ఆహారం వారికి చేరదా ! అని పరిహసించారు అంతేకాక పునర్జన్మవాదం పరిహాసవాదమని వారు నమ్మారు. ఈ వాదం పురోహితవర్గ కార్యసాధనకు మాత్రమే ఉపకరిస్తుందని వారు వాదించారు.

"చచ్చిన తిరిగిరాము. కాబట్టి బ్రతికినన్నాళ్లు సుఖముగా బ్రతుక యత్నింప వలయును "[1]

మనకు కనిపించేది సత్యం అని, కనిపించని వాటిని గురించి ఊహించి మానవ జీవిత సౌఖ్యాన్ని వృధా చేసుకోవడమేనని వారు నమ్మారు.

"లోకాయత మతం దృశ్యమానమగుచున్న లోకమునే సత్యమని భావించును. ఇంద్రియములకు అందుబాటులో నున్న ప్రపంచము కంటె మించినదేమియు లేదు. ఇంద్రియ గోచరము కానిదంతయు అసత్యమే. శబ్దప్రమాణమునుగాని, అనుమాన ప్రమాణమును గానీ లోకాయుతులు స్వీకరించరు [2]

చార్వాకులు ఆత్మను అంగీకరించలేదు శరీరానికి భిన్నంగా ఆత్మ అనేది మరొకటి ఉంటుందనే వాదాన్ని లోసిపుచ్చారు

"దేహమే ఆత్మ అని చెప్పే లోకాయుతులు దేహానికి భిన్నంగా ఉన్న ఆత్మను అంగీకరించరు." [3]

ప్రకృతి గురించిన సత్యాన్ని మాత్రమే చార్వాకులు అంగీకరించారు. సృష్టి – సృష్టికర్త – దైవాల్ని వారు అంగీకరించలేదు.

---

1. ఆంధ్ర విజ్ఞాన సర్వస్వము – సం. 7, పు. 78.

2 సంగ్రహ ఆంధ్ర విజ్ఞానకోశము – పు. 124.

3. ప్రాక్పశ్చిమ తత్వశాస్త్రము – పు. 127.

ప్రకృతి స్వభావసిద్ధము. తనంత తానే ప్రభవించినది వేరే సృష్టికర్త, దైవమును కవకాశము లేదు చార్వాకమతము శరీరము కంటే వేరుగా ఆత్మను అంగీకరించదు సరి గదా మానవులు సుఖ దుఃఖరహితమైన స్థితి నందుకొనగల రనియు అంగీకరించదు... ఆనందమే స్వర్గము బాధయే నరకము " [1]

ఇట్టి భావప్రేరితులైన చార్వాకులు నాడు సమాజంలో ఉన్న స్థితిగతుల్ని అర్థం చేసుకొన్నారు. మతం పేరుతో దైవం పేరుతో నాడు పురోహితవర్గం చేసిన దైవతాత్త్విక చింతనను ఖండించారు. మరణించినవాడి పేరుతో, కర్మకాండల పేరుతో దానధర్మాల పేరుతో వారు సామాన్యుల్ని చేసే దోపిడీ వ్యవస్థను నాటి చార్వాకులు వ్యతిరేకించారు. యజ్ఞయాగాల పేరుతో చేసే ఖాద్య పదార్థాల దుబారా లను వారు పరిహసించారు. యజ్ఞాల గుట్టుమట్టుల్ని వారు అపహాస్యం చేశారు. పురోహితవర్గ ఛాందసభావాల్ని వారు గేలి చేశారు. స్వర్గం, రంభా సంభోగాన్ని వారు కూటవాద మన్నారు. వీరు చేసిన నాటి తాత్విక చింతనలో హిందూమతం అట్టుడికినట్లుగా ఉడికిపోయింది దానిలో చార్వాకుల్ని వెంటాడారు వేటాడారు. వారిని అడుగడుగునా హింసించారు వారి మతాన్ని పాషండ మతమన్నారు. చార్వాకుల్ని పాషండులన్నారు

**చార్వాకులు – మూఢనమ్మకాలు :**

చార్వాకులు మూఢనమ్మకాల్ని వ్యతిరేకించారు దైవం పేరుతో జరిగే కర్మకాండల్ని వ్యతిరేకించారు. స్వర్గ నరకాల బూచిని తోసిరాజన్నారు. నాటి సమాజంలో హిందూమతంలో ఉన్న అనాచారాల్ని, మూఢనమ్మకాల్ని అడుగడు గునా ఎదిరించి పోరాడారు. కేవలం దైవాన్ని అంగీకరించకపోవడమే గాక తమ హేతువాద దృక్పథంతో నాటి సమాజంలో వ్యాపించి ఉన్న మూఢనమ్మకాలను వీరు వ్యతిరేకించి పోరాడారు.

---

1. ప్రాక్పశ్చిమ తత్వశాస్త్రము – పు. 126,

# 7. బౌద్ధం

గౌతమబుద్ధుడు స్థాపించిన మతమే బౌద్ధమతం. ఇతడు క్రీస్తు పూర్వము 6 వ శతాబ్దివాడని ప్రతీతి. ఇతడు నేపాళ్ ప్రాంతంలో క్రీ.పూ. 563 లో లుంబినీ వనంలో జన్మించాడు. తల్లి మాయాదేవి తండ్రి శుద్ధోధనుడు అనే రాజు. ఇతడు యుక్తవయసులో రాజ్యాన్ని, సంసారాన్ని త్యజించి బోధి వృక్షం కింద తపస్సిద్ధి పొంది బుద్ధుడయ్యాడు.

క్రీ. పూ. ఆరవ శతాబ్దినాటికి హిందూ సంఘంలో రాజకీయ సాంఘిక అసమానతలు పరాకాష్టకు చేరుకున్నాయి. అగ్రవర్ణాలుగా ముద్రవేయబడిన పురోహితులు. క్షత్రియరాజులు కింది వర్ణాలను విపరీతంగా దోచుకుతినేవారు. వైశ్యులు శూద్రులు నీచంగా చూడబడ్డారు హిందూమతం పేరిట యజ్ఞయాగాల పేరిట జరిగే అత్యాచారాలకు అంతం లేకుండాపోయింది. అయితే అధికారంకోసం బ్రాహ్మణులు క్షత్రియులు పోటీ పడటం మనకు ఈ కాలంలో గోచరిస్తుంది. బ్రాహ్మణాధిక్యతను నాటి క్షత్రియవర్గాలు అంగీకరించలేదు. నాటి క్షత్రియవర్గానికి చెందిన వర్ధమాన మహావీరుడు, గౌతమ బుద్ధుడు మొదలైనవారు వైదిక మతాన్ని, మత సంప్రదాయాల్ని, వేద ప్రామాణ్యాన్ని, యజ్ఞయాగాల్ని, జంతుబలుల్ని, వైదిక కర్మకాండను, వర్ణ వ్యవస్థను, మతం పేరుతో సాగుతున్న మూఢనమ్మకాల్ని తీవ్రంగా వ్యతిరేకించారు

"వర్ణవ్యవస్థను ఖండించాడు. బానిసలను గౌరవించటమేగాక వారిని విముక్తి చెయ్యాలని స్పష్టం చేశాడు. బ్రాహ్మణుల సిద్ధాంతాన్ని, యజ్ఞ యాగాదుల పేరుతో బ్రాహ్మణులు చేసే పశు హింసను నిరసించాడు వేదాలలో చెప్పిన ప్రతిముక్క పరమ సత్యమన్న ఛాందసభావాన్ని తోసిపెశాడు". [1]

బుద్ధుడు తన బౌద్ధ సంఘాన్ని వర్ణ వ్యవస్థపై కేంద్రీకరించాడు. వర్ణ వ్యవస్థను ఖండించిన బుద్ధుడు మానవులందరూ జీవ పరిణామంలోగాని, చావు పుట్టుకల్లోగాని సమానులేనని ఒకరు ఎక్కువని మరొకరు తక్కువనిగాని, హీనమని గాని భావించడం నీచమని తెలిపాడు.

---

1. భారతీయ తత్త్వశాస్త్రము. పుట 58

"గంగ, యమున, అచిరావతి, సరభు మొదలైన నదులు సముద్రాన్ని జేరినప్పుడు పాతపేరు కొట్టుకుపోయి వాటికి మహాజలధి అనే నామం. ఏ విధంగా వస్తుందో ఆ విధంగానే బౌద్ధ ధర్మం ప్రకారం, బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులు, బౌద్ధ సన్యాసం స్వీకరించినప్పుడు వారి వారి వర్ణాలను వంశనామాలను పోగొట్టుకొని బౌద్ధ భిక్షుకి లేక భిక్షువు అనే పేర్లలో పిలవబడతారు." [1]

బౌద్ధం సృష్టి నిర్మాణాన్ని సృష్టికర్తను అంగీకరించలేదు.

"ప్రపంచం ఈశ్వరునిచే సృష్టించబడినదే అయితే పరిణామము అంతము ఆపద, దుఃఖము, తప్పొప్పులు ఉండటానికి వీలులేదు. కల్మషము, అ కల్మషము కూడ ఈశ్వరుణ్ణుండే ఏర్పడాలన్నమాట, అన్ని కార్యాలు ఈశ్వరుని సృష్టియే కాబట్టి తప్పుచేసినా ఒప్పు చేసినా ఒకటేకదా ! జగత్తు, స్వయంభువు అనాది సిద్ధము అని చెప్పాడు ప్రపంచానికి ఆది అంతులేదంటే సృష్టికర్త లేడనటమే". [2]

ఆత్మను బౌద్ధం అంగీకరించలేదు. అనంతంగా వుంటుందని నమ్మడం కేవలం పరిపూర్ణమైన మూర్ఖవిశ్వాసం.

"ఆత్మ ఎక్కడాలేదు శరీరమందు ఏదో వున్నది. అని అనుకోవడం సత్కాయదృష్టి. ఈ దృష్టి బంధహేతువని, అది నశించనిదే జ్ఞానప్రాప్తి లేదని బుద్ధుని మతము. సంసార తృష్ణయే సత్కాయదృష్టికి కారణము అనుభవకర్త, అనుభవ విషయము అగు ఆత్మ వున్నదని, అది నిత్యముగ, అపరివర్తన శీలముగ అనంతముగ ఉండును. అని నమ్ముట కేవలము పరిపూర్ణమగు మూర్ఖ విశ్వాసము అని బుద్ధుడు చెప్పెను". [3]

## బౌద్ధం - మూఢనమ్మకాలు :

బౌద్ధం హిందూమతంలో పేరుకుపోయిన మూఢనమ్మకాల్ని వ్యతిరేకించింది. వర్ణ వ్యవస్థను అంగీకరించలేదు. యజ్ఞయాగాల్ని, దైవాన్ని, స్వర్గనరకాల్ని దైవం పేరుతో మతం పేరుతో సాగే కర్మకాండల్ని, వేద ప్రామాణ్యాన్ని పిండ ప్రదానాది కార్యాల్ని జంతుబలులు, సాంఘిక అసమానతల్ని బౌద్ధం పూర్తిగా వ్యతిరేకించింది.

1. ధమ్మపథం. 3-2-8
2. భారతీయ తత్త్వ శాస్త్రపరిశీలనము. పు. 198
3. భారతీయ తత్త్వ శాస్త్ర పరిశీలనము పు 94

# 8. జైనం

జైనమత స్థాపకుడు వర్ధమాన మహావీరుడు వర్ధమాన మహావీరునకు ముందు ఇరవై మూగ్గురు తీర్థంకరులున్నారని, ఇతడు ఇరవై నాల్గవ తీర్థంకరుడని ప్రతీతి. మహావీరునికి జినుడు అనే నామాంతరం కూడా వుంది జైనమతం హిందూమతంలో వున్న మూఢనమ్మకాల్ని అశాస్త్రీయ విధానాల్ని వ్యతిరేకించింది జైనులు దైవాన్ని అంగీకరించలేదు. నాటి పురోహితవర్గం జైనమతాన్ని నాస్తిక మతంగా అభివర్ణించారు.

"జైనాన్ని నాస్తిక మతంగా సంప్రదాయవాదులు లెక్కగట్టారు సృష్టిస్థితి లయకారకుడైన భగవంతుని ఆధిపత్యాన్ని జైనులంగీకరించకపోవడమే దానికి కారణము జైనులు విశ్వము శాశ్వతము. దానికి వినాశనం లేదు. అందువల్ల దాని సృష్టికి దైవంతో పనిలేదు. ప్రపంచములో అనేక పరివర్తనలు సంభవిస్తుంటాయి. ఎంతో వైవిధ్యం గోచరిస్తుంది. ఈ వైవిధ్యమంతా కాలము, స్వభావము, నియతి, కర్మ ఉద్యమము అనే సహకారక అంశాలవల్ల సంభవిస్తుంది", [1]

జైనులు పదార్థాన్ని–జ్ఞానాన్ని అంగీకరించారు వాటి పరిణామ దశను అంగీకరించారు.

"జైనులు పదార్థ బహుత్వాన్ని అంగీకరిస్తారు. ప్రపంచంలో ఉన్న పదార్థాలన్నీ జీవులుగానీ, అజీవులు గాని యథార్థాలేనంటారు అందువల్ల వారిది అనేకవాదం అవుతుంది. వారిది బహుత్వయథార్థ వాదమంటాడు సర్వేపల్లి రాధాకృష్ణన్. ఈ పదార్థాలన్నిటికి ఉత్పత్తి, సృష్టి, స్థితి లయాలుంటాయి". [2]

హిందూమతంలో ఉన్న వైదిక కర్మకాండను జైనం వ్యతిరేకించింది. దహనానంతరం కర్మకాండకు జైనంలో స్థానం లేదు. వారు విగ్రహారాధనను తీవ్రంగా నిరసించారు. యజ్ఞయాగాలు చేయరాదన్నారు. అయితే జైనులు హైందవ మత విగ్రహాలపై మలమూత్రాదులు విసర్జించి నాటి సమాజంలో అపఖ్యాతి పాలయ్యారు.

---

1. జైన ధర్మము పు 50
2. జైన ధర్మము పు 74

"బౌద్ధం వలెనే జైనం కూడా వర్ణవ్యవస్థను యజ్ఞయాగాదులను అందులో జరిగే హింసను తీవ్రంగా ఖండించింది". [1]

జైనులు హింసావాదాన్ని అంగీకరించలేదు. వారు ముక్కు మీద గుడ్డ కప్పుకొని గాలి పీల్చటం, నడుస్తూ నెమలిపింఛంతో దారి తుడుచుకోవడం, రాత్రి దీపం వెలిగించకుండా వుండటం వంటి కొన్ని చాదస్తపు ఆచారాలకు పాల్పడ్డారు.

జైనులు పరమాత్మను అంగీకరించలేదుగాని ఆత్మను అంగీకరించారు. వర్ణవ్యవస్థను అంగీకరించలేదు. మానవులందరూ సమానమేనని వారి వారి అభిరుచులను అనుసరించి గృహస్థాశ్రమ ధర్మాల్ని స్వీకరించవచ్చునవి నమ్మారు

## జైనం - మూఢనమ్మకాలు :

జైనమతం హిందూమతంలో పేరుకుపోయిన మూఢనమ్మకాల్ని వ్యతిరేకించింది. మతం పేరుతో, దేవుడి పేరుతో సాగే యజ్ఞయాగాల్ని, పశుహింసను వ్యతిరేకించారు. వర్ణం పేరుతో సాగే అసమానతల్ని వారు ఖండించారు. మంత్రతంత్రాలు దైవ సృష్టి బూటకం అని తెలిపారు అనాటి హిందూమతానికి వ్యతిరేకంగా పోరాడిన జైనం నాటి సమాజంలో నెలకొన్న మూఢనమ్మకాల్ని రూపుమాపడానికి ప్రయత్నం చేసింది.

---

1. భారతీయ తత్త్వశాస్త్రము. పు 101

# మూఢనమ్మకాలకు వ్యతిరేకంగా పోరాడిన మహనీయులు

## 1. వేమన

ఆంధ్రదేశంలో మూఢనమ్మకాలపై దాడిసల్పిన సంస్కర్తలకు వేమన మార్గదర్శకుడు ఈయన కవితా విశేషాన్ని ఆంధ్రులు గమనించలేకపోవడం శోచనీయమైన విషయం. విదేశీయుడైన 'బ్రౌన్' మహాశయుని పుణ్యమా అని వేమన వెలుగులోకి వచ్చాడు. 'బ్రౌన్' వేమన పద్యాలన్నీ సేకరించి ప్రచురించేవరకు వేమనలోని విశిష్టత మనవారికి అర్థంకాలేదు. వేమనకు ముందే తెలుగునాట పల్నాటి సీమలో బ్రహ్మనాయుడు తన చాపకూడు ద్వారా వర్ణవ్యవస్థను విచ్ఛిన్నం చెయ్యటమే కాక నాటి అసమానతల్ని అవహేళన చేశాడు

"వేమన ఆంధ్రులలో సాటిలేని వ్యక్తి అతీంద్రియములైన తత్త్వములను దెలిసికొనవలెనను నాశ, వాని ననుభవ పూర్వకముగా సాధించు సాహసము, తనకుఁ దెలిసినవానిని నిర్భయముగా ప్రపంచమునకు బోధించు ధైర్యము, దానికి సాధనమైన యుక్తిప్రక్కలందును మఱుఁగులేని మంచి పదనుగల చురకత్తివంటి కవితాశక్తి దానికి మెఱుఁగిచ్చునట్టి సంకేత దూషితము కాని ప్రపంచవ్యవహారములందలి సూక్ష్మదృష్టి, గాయపుమందు కత్తికే పూసి కొట్టినట్లు తిట్టుచునే నవ్వించు హాస్య కుశలత". [1]

తెలుగు కవిత్వంలో ఇన్ని గుణాల మేలుకలయిక గలిగిన కవి మరొకరు లేరని చెప్పవచ్చు.

ఆచార్య గంథం అప్పారావుగారు వేమన వాదాన్ని ఒక్కమాటలో వివరించారు.

---

1. వేమన–రాళ్ళపల్లి పీఠిక. పు 1

"మనకు కావలసినది ఈతని కవిత్వము. ఈతని మానవతా వాదము" [1]

వేమన సంప్రదాయాల్ని, ఆచారాల్ని పాటించలేదని అందుకే ఆయన్ను కవిగా గుర్తించలేదనే వాదుపుంది.

"కుల, మత, జాతి విచక్షణలనే సరిహద్దుల్ని చెరిపివేసే ఆయన మానవతా దృక్పథం అందులో ప్రథమస్థానాన్ని అలంకరిస్తుంది మానవులమధ్య సమానత్వం సౌభ్రాత్రాలను నింపే ఆయన అమర సందేశం రెండవది. ఇక మూడవది ఆయన స్వచ్ఛమూ, సరళమూ, హృదయావర్జితమూ అయిన భావప్రకటన.

కాని వేమనకున్న దృక్పథమే వేరు పుస్తకాల కళ్ళజోడు తగిలించుకొని అతను జీవితాన్ని పరిశీలించడు. పరోక్ష జ్ఞానంతో దాన్ని వివరించడు. ఆ పరో జ్ఞానుభూతి ఒక్కటే అతనికి దివ్యజ్యోతి". [2]

వేమన సర్వమానవతావాదం సమాజానికి విద్యుత్తేజం అయింది. అతడు చూపిన బాట తరువాతి వారికి మార్గదర్శకం అయింది. సహజంగా అతడు హిందూ మతావలంబి. అందునా వీరశైవుడని పరిశోధకులందరూ అంగీకరించిందే. మతానికి మూలం మతగ్రంథాలు. మతగ్రంథాలు వర్ణించిన నీతుల్ని మతం - మతావలంబులు అంగీకరించి తీరవలసిందే. వేమన వేదాల్ని, సాంప్రదాయాల్ని అనాదిగా వస్తున్న ఆచారాల్ని మూఢనమ్మకాలక్రింది జమ కట్టాడు. సమాజంలో పేరుకుపోయిన ఈ నమ్మకాలపై ధ్వజం ఎత్తాడు. దిగంతాల లోతులో కూరుకుపోయిన ఈ మూఢనమ్మ కాల మహావృక్షాన్ని కూకటి వేళ్ళతో పెకలించడానికి పూనుకున్నాడు. తన కవితా కుఠారాన్ని ఝళిపించాడు. నాడు సమాజంలో వ్యాపించిన అస్తవ్యస్థ పరిస్థితుల్ని, అసమానతల్ని సాంఘిక దురాచారాల్ని, కర్మకాండల్ని నిర్ద్వంద్వంగా ఖండించాడు. వాటిపై తన ఆగ్రహాన్ని వెల్లడించాడు. ఆయా నమ్మకాల్ని అవహేళన చేసాడు. నిచ్చెన మెట్లలా ఏర్పడిన వర్ణవ్యవస్థ క్రింది వర్గాన్ని పై వర్గంచేసే అవహేళనలు బ్రాహ్మణాధిక్యతను వెమన ఖండించాడు. బ్రాహ్మణ కులంలో పుట్టిన ప్రతివాడు బ్రాహ్మణుడు కాదని అందరూ సమానమేనని అంటాడు వెమన.

---

1. వేమన పద్య రత్నాకరము - పీఠిక పు iii
2. వేమన- డా॥ జి. వి. కృష్ణారావు

"కన్నె పిరుఁదు చేరి కదియంగ నొక్కప్పు
డుచ్చ యందుఁ బెంచి ముద్భవించు
హెచ్చుకులజుఁ డెవఁడు హీనుఁడెవండురా— విశ్వ

వేమన విగ్రహారాధన నిరసించాడు. రాతిబొమ్మలకు గుడులు, గోపురాలు నిర్మించి నైవేద్యాది బలులు చెయ్యడం అర్థం లేనిదని విమర్శిస్తాడు. ఆడంబరాలు అసందర్భమంటాడు.

రాతిబొమ్మ కేల రంగైన వలువలు
గుళ్ళు గోపురములు కుంభములును
కూడుగుడ్డఁ దాను గోరునా దేవుఁడు— విశ్వ॥ [1]

భగవంతుడనే వాడున్నాడో లేదో తెలియదు. ఒకవేళ వున్నాడనుకున్నా ఆ భగవంతుని పేరుతో జరిపే ఆడంబరాలు వ్యర్థం అంటాడు. ఆయన గుళ్ళు, గోపురాలు, కూడు గుడ్డ కోరతాడా? అని ప్రశ్నిస్తాడు వేమన.

రాతి ప్రతిమఁ దెచ్చి రాజసంబుగ నుంచి
పూజసేయ నరుఁడు బుద్ధిమాలి
భావమందు నరుఁడు భావింపనేరఁడు— విశ్వ॥ [2]

మన మనస్సే మనకు భగవంతుడు మన భావమే మనకు పరమాత్మ. అటువంటి భావాన్ని వదిలిపెట్టి రాతిప్రతిమలకు పూజ సేయటం న్యాయమా అంటాడు వేమన.

వేమన ఖండనకు గురయిన గుడ్డినమ్మకాల్లో యజ్ఞ-యాగాలు పేర్కొన దగినవి. యజ్ఞయాగాల్లో జరిగే జంతువధకు అర్థం లేదు అంటాడు వేమన. ఈ యజ్ఞాలన్నీ పరలోక సుఖంకోసం, ఇది వ్యక్తుల స్వార్థంకోసం, సోమయాజులు మేసే మేక మాంసం కోసమే; వారి నంజుడుకోసమే అని వేమన అభిప్రాయం. లేదా ఇదంతా తమ కామవాంఛ తీర్చుకోవడం కోసమే. యజ్ఞయాగాలు చేసినవారికి స్వర్గంలో రంభాసంభోగం దొరుకుతుందని, పుణ్యం లభిస్తుందని మతం ఘంటా ఘోషగా చెప్పింది. వేమన ఈ నమ్మకాన్ని తోసివేసాడు.

---

1. వేమన— పు. 80.
2. వేమన పద్య రత్నాకరము— ప. 2144.

"లంజ కొంకకు మేక సంజుడు తినసాగి
యజ్ఞమెల్లఁ గామ యజ్ఞమాయె !
మొదట సోమయాజి తుది కామయాజిరా- విశ్వ॥ [1]

ముందు మేక నంజుడు తిని సోమయాజి అట యజ్ఞం చేసిన తరువాతనే కామయాజి అట. ఆహా ! ఏమి వేమన చమత్కారం ? ఏమి హాస్యచతురత?

పేరు సోమయాజి పెను సింహబలుఁడాయె
మేకపోతుఁబట్టి మెడలు విరుచు
క్రతువు చేయు ఫలము కామంబుకే గద- విశ్వ [2]

సోమలతల రసము సోలల కొలఁ దిని
త్రావనేల ? తాము మేలటంద్రు
క్రతుఫలంబు కంఠగతమగు గాబోలు- విశ్వ॥ [3]

నిత్యం సోమరసం సోలల కొద్దీ తాగి రుచికరమై నేతిలో వేగిన జంతు మాంసం తిని చేసే యజ్ఞయాగాలు అర్థరహితం అంటాడు వేమన. యజ్ఞయాగాలు జుగుప్సాకరమైనవి అనే విషయం అంగీకరిస్తాడు. శృంగారాన్ని అంగిరసంగా కలిగిన ఈ యజ్ఞాల్ని చేయటాన్ని వేమన అసహ్యించుకుంటాడు.

'ఆలి రంకు దెలుప సఫల యజ్ఞంబులు'
తల్లి రంకుఁ దెలుపు తద్దినములు.

పౌండరీకం ఆచరించే సోమిదమ్మ, సోమిదయ్య యజ్ఞవాటిక పై భాగంలో కట్టిన బహిరంగ పందిరిపై వ్యభిచరించటం ఆ యజ్ఞంలో ముఖ్యమైన అంశం. అశ్వమేధ యాగంలో "యజమాన ప్రమదావికస్వరభగన్యస్తాశ్వ దీర్ఘ స్ఫురి ధ్వజ దండం" అని వివరించబడింది. అందుకే వేమన ఈ యజ్ఞయాగాల్ని దుయ్య బట్టాడు. ఈ చేసే యజ్ఞాలన్నీ ఇంద్రపదవికే గదా ! దేవసాని పొందుకే కదా ! అని ప్రశ్నిస్తాడు.

---

1. వేమన- పు. 81.
2. వేమనయోగి పద్యరత్నములు - పు. 49.
3. వేమన పద్యరత్నాకరము - ప. 2342.

ఇంద్ర పదవిఁ గోరి యింపుగా యజ్ఞముల్
కలిమి చేతఁజేసి కాములైరి
పరమ యోగమూని పట్టఁగ లేమిని‌- విశ్వ॥ [1]

వేమన సహపంక్తి భోజనాల్ని కాంక్షించాడు. మనిషికి మనిషికి మధ్య వున్న అంతరాల్ని ఎత్తి చూపేది ఆహారం — పానీయం — ఆచారం విషయమే. అందుచేత—

ఉర్వివారి కెల్ల నొక్క కంచము బెట్టి
పొత్తుఁగుడిపి కులము పొలియఁజేసి
తలను చేయి బెట్టి తగనమ్మఁ జెప్పరో— విశ్వ॥ [2]

కులం — వర్ణం కూలడానికి సహపంక్తి భోజనం తప్ప శరణ్యం మరొకటి లేదని వేమన నమ్మకం.

వేమన అస్పృశ్యతను నిరసించాడు. అంటరానివారిని నిందించేవారిని వేమన సూటిగా ప్రశ్నిస్తాడు.

మాలవాని నేల మఱిమఱి నిందింప
నొడలు రక్తమాంస మొకటి గాదె
వానిలోన మెలంగు వానికులంబేది- విశ్వ॥

అందరి శరీరంలోని రక్తమాంసాదులు ఒక్కటే కదా. మరి ఈ విభజన ఎందుకు? అని ప్రశ్నించిన వేమన ఒక కులంకంటె మరో కులం ఎక్కువ అని గాని మరొకటి తక్కువ అని గాని అనడం నీచం అంటాడు.

వేమన వేదమంత్రాల్ని వేదప్రోక్త వివాహవిధిని అంగీకరించలేదు.

'విప్రులెల్లఁ గూడె వెఱ్ఱికూతలు గూసి
సతి పతులను జేసి సమ్మతమున
మును ముహూర్తముంచ ముండెట్లు మోసెరా- విశ్వ॥ [3]

---

1. వేమన పద్యరత్నాకరము — ప. 2027.
2. వేమన పద్యరత్నాకరము — ప. 280.
3. నేదునూరివారి ప్రతి— 4420.

"వైదిక వివాహ మంత్రాలలో వెట్టిరూత లున్నవన్నాడు. మంత్రబలము, ముహూర్త బలమన్నది హుళి, హుళక్కి-యని దీన ప్రకటించినాడు." [1]

నాడు-నేడు అనే విచక్షణ లేకుండా వివాహ వ్యవస్థకు ఆర్థిక వ్యవస్థ లంకె వేయబడింది. నాటి కన్యాశుల్కం నేటి వరకట్నం దాని అవశేషాలే. వేమన వీటిని దుయ్యబట్టాడు. వయోభేదమున్న వివాహాల్ని, బహుభార్యాత్వాన్ని నిరసించాడు.

"కలిమిఁ జూచి యీయ క్రయమిచ్చినట్లుండు
సమునికీయ మంచి సరస గుణము
పేదకీయ మనువు పెనవేసినట్లుండు- విశ్వ॥ [2]

"ముద్దరాలి కేల ముసలి మగడు" [3]

ఈడుగాని దాని తోడుకు పాల్పడి
గోడుగూడుటేమి సూటి గాదు [4]

సకల సంపదలను స్వారస్యముల జూచి
వలచి యిచ్చు మనువు వాడిపోవు [5]

నాటి వివాహ వ్యవస్థను వేమన ఈ విధంగా నిరసించాడు.

వేమన శకునాల్ని ఖండించాడు. సర్వసామాన్యంగా మతవాదు లందరూ శకునాల్ని పాటించటం కద్దు. శుభకార్యానికి, ప్రయాణానికి, ముహూర్తాలకు శకునాలు పాటించటం ఆచారం. వేమన వీటిని వ్యతిరేకించాడు. మానవుడు తాను ఆచరించే కర్మనుబట్టి పనులు జరుగుతాయే తప్ప శకునాలవల్ల మార్పు జరగదని చెప్పాడు.

---

1. విశ్వదాభిరామ వినుర వేమ- పు. 60.
2. బ్రౌను ప్రతి - 1186.
3. నేదునూరి- ప. 3902.
4. నేదునూరి- 565.
5. బ్రౌను- 1182.

మంచి శకునములను ఎంచి పెండ్లాడిన
నారలున్న వారె కోరిచూడ
జనుల కర్మములకు శకునముల్ నిలుచునా— విశ్వ॥ [1]

పశువులు, పక్షులు, క్రిమికీటకాదుల్ని శకున ఫలాలుగా భావించటం తప్పని స్పష్టపరుస్తాడు.

"పాలపక్షి శకున ఫలమిచ్చునందురు
పాలపక్షి కేమి ఫలము దెలియు
తనదు మేలుకీళ్ళు తన తోడనుండగా— విశ్వ" [2]

"శక్తిపూజ చేసి సరవి కుంభము పోసి
మ్రొక్కుచుండువేళ కుక్క యేడ్వ
నూరుపాడటంచు నూరెల్ల నేడ్తురే— విశ్వ॥ [3]

కుక్క ఏడుపు శక్తి పూజామహిమను కూడ దిగదుడుపు చేయగలదన్నట్లే గదా." [4]

వేమన క్షుద్రదేవతల్ని ఆరాధించడం, వాటికి మద్యమాంసాదుల్ని బలిగా పెట్టడాన్ని వ్యతిరేకిస్తాడు.

"మద్య మాంస రుచిని మాదిగ దైవాల
యెంగిలి తినఁగానె నింగి గలదె?" [5]

మాదిగదైవం అంటే వేమన తాత్పర్యంలో క్షుద్రశక్తులని అర్థం. క్షుద్ర శక్తులకు మద్యమాంసాలు నైవేద్యం సమకూర్చి వాటిని తిన్నంతనే స్వర్గము రాదని వేమన భావించాడు.

---

1. వేమన యోగి పద్యరత్నములు— పు. 58.
2. వేమనయోగి పద్యరత్నములు పు. 58.
3. నేదునూరి ప్రతి— 4592.
4. విశ్వదాభిరామ వినుర వేమ — పు. 64.
5. వేమన పద్యరత్నాకరము — 724.

వేమన నాటి సమాజంలో వున్న కర్మకాండ విధుల్ని పితృదేవతలకు సమర్పించే పిండ ప్రదానాది చర్యల్ని విమర్శించాడు. పక్షులలో కాకి నీచమైనది కదా ! మరి దానికి పిండాలు సమర్పించి నమస్కరించుటెందుకు? అని ప్రశ్నిస్తాడు.

"కాకి పక్షులందు కడునీచ మందురు
కాకి పెండ్లివేళ గదియనీరు
దాని కన్నమిడుచు దండంబు లిడుటేల" — విశ్వ॥ [1]

పిండములను జేసి పితరులఁ దలపోసి
కాకులకును బెట్టు గాడ్దెలార
పెంట తినెడి కాకి పితరుఁ డెట్లాయెరా— విశ్వ॥ [2]

కాకులకు పిండాల్ని పెట్టి అవి తమ పెద్దలకు చెందుతాయన్న మూఢ నమ్మకాల్లో మునిగిన ప్రబుద్ధుల్ని గాడెదలని నిందిస్తాడు. కాకులకు పెట్టేఅన్నాన్ని అన్నార్తులకు పెట్టడం మంచిదని నిర్మాణాత్మకమైన సూచన చేస్తాడు.

ప్రేత యన్నమునకు ప్రీతితో పిలిపించి
కాకులకు నిడుదురు కచ్చ[illegible]ార
కాకుల కది యేల ఘనులకుఁ బెట్టుఁడీ— విశ్వ॥ [3]

ఈ విధంగా వేమన నాటి వ్యవస్థకు ప్రతిబింబంగా వున్న మూఢనమ్మకాల్ని ఖండించాడు.

---

1. బ్రౌను ప్రతి — 629.
2. నేదునూరి ప్రతి— 3164.
3. గోపాల్ అండ్ కో— 1406.

# 2. పోతులూరి వీరబ్రహ్మం

వీరబ్రహ్మంగారు 1601 నుంచి 1690 ప్రాంతం వరకు జీవించినట్లుగా చారిత్రక అంశాలవల్ల తెలుస్తుంది. ప్రస్తుత రాయలసీమ ప్రాంత నివాసి శ్రీ వీర బ్రహ్మం. సుమారు మూడు శతాబ్దాలనాటి మహానుభావుడు. శ్రీకృష్ణదేవరాయలు మరణించిన తరువాత విజయనగర సామ్రాజ్య వైభవం క్షీణించింది. ఆ పిమ్మట రామరాజుతో స్వర్ణయుగమని పేరు గాంచిన విజయనగర సామ్రాజ్య వైభవం నేలమట్టమయింది. ఆ తరువాత మహమ్మదీయుల విజృంభణ; వ్యాపార మిషతో భరత ఖండమందు ప్రవేశించిన పాశ్చాత్యులు తమ క్రైస్తవ మత ప్రచారానికి మిషనరీలు స్థాపించిన సంఘయుగం.

వీరబ్రహ్మం హిందూ మతావలంబి. ఈయన తన ఆధ్యాత్మిక విద్యా ప్రచారంద్వారా శిష్యులను సేకరించి దాదాపు ఆంధ్రదేశం అంతా సంచరించాడు. సంఘ సంస్కరణాది నియమాల్ని చేపట్టి సంఘము నుద్ధరించుటకు కృషి సల్పిన మహానుభావుడు. ఈయన్ను ఆయన శిష్యులు, ఇప్పటికి ఆ ప్రాంతవాసులు 'జేజి నాయన' అని భక్తిప్రేమలతో పూజిస్తారు. ఈయన సంసారిక సుఖం అనుభ వించిన రాజయోగి. సంఘంలో నాడు పేరుకుపోయిన కొన్ని మూఢనమ్మకాల్ని వ్యతిరేకించాడు. ఖండించాడు. సర్వ మానవ సమత్వానికి, సమానత్వానికి కృషి చేసాడు.

"హిందూ ముసల్మాను లేకీభవించుట
మేలని సిద్ధుని నేలినాఁడో
అస్పృశ్యతాజాడ్య మంతరింపం జేయఁ
దలఁచి కక్కని వీపు దట్టినాఁడో
ప్రజ కహింసావ్రతరాజంబు బోధింప
నెంచి జంతుబలి వారించినాఁడో" [1]

సిద్ధయ్య అనే ఒక భక్తుని మహమ్మదీయ మతస్థుని వీరబ్రహ్మం చేరదీసి మతసామరస్యానికి కృషి చేసాడు. ఆనాడు 'అస్పృశ్యత' అమితంగా పాటించబడు

---

1. శ్రీ వీరబ్రహ్మేంద్రస్వామి చరిత్ర – 4–24.

తుండేవి అనే విషయం మనకు సాంఘిక చరిత్రలో అవగతం అవుతుంది. శ్రీ వీర బ్రహ్మంగారు కక్కయ్య అనే హరిజనుణ్ణి మన్నించి తన శిష్యునిగా స్వీకరించాడు. ఆ రోజులలో మశూచి, కలరా వ్యాధులని గ్రహించక మూఢనమ్మకాలలో మునిగిన సమయం. పోలేరమ్మ జాతర్లు, కొలుపులు వ్యాధుల నివారణకు జరిపే కాలం. వీరబ్రహ్మం అమ్మ జాతర్లను ఆపుచేయించడమే గాక జంతుబలుల్ని నివారించాడు.

వీరబ్రహ్మం కులవ్యవస్థను వర్ణవ్యవస్థను వ్యతిరేకించాడు. సిద్ధయ్యను శిష్యునిగా స్వీకరించినందుకు ఆయన కుమారులే వ్యతిరేకించగా స్వాములవారు

"నాయనలారా కులమును పాటించుట అవివేకము. కులం బేదైననేమి? జ్ఞానము ప్రధానము. అందరును మూత్ర పురీష సంయుతంబైన రజస్సంభూతులే కదా! కులాతిశయంబులు పాటింపక సిద్ధయ్యను మీతో సమానముగ గౌరవింపుడు" [1]

అని వారికి జ్ఞానోపదేశం చేసిరి.

వీరబ్రహ్మంగారు సమాధిగతుడయిన తరువాత ఆయన భార్య గోవిందమ్మను ముత్తయిదువుగనే వుండునట్లుగా శాసిస్తాడు సామాన్యంగా హిందూ మతాచారంలో భర్త మరణించిన తరువాత స్త్రీ వైధవ్యం అనుభవించవలెను. లేక భర్త దేశాంతర గతుడై పదినెలలలో తిరిగి రానట్లయిన ఆమె విధవరాలుగా గుర్తించబడుతుంది. ఇతడు ఈ మూఢనమ్మకాన్ని తోసివేసాడు.

పోతులూరయ్య (వీరబ్రహ్మం కుమారుడు) చేతినుంచి మునిమడుగు గ్రామస్థులు తీర్థప్రసాదం స్వీకరించక నీ తల్లి వైధవ్యం అనుభవించడంలేదు. ఆమె పసుపు, కుంకుమ, గాజులు, మెట్టియలు ఉపయోగించటం మానినప్పుడు మాత్రమే ప్రసాదాదులు స్వీకరిస్తామన్నారు. పోతులూరయ్య తిరిగి తల్లి వద్దకు వచ్చి ఆ విషయం వివరించగా

"నాయనా! నీకు చిన్నతనము. మీ తండ్రిగారి శక్తి సామర్థ్యంబులు గ్రహించలేవు. ఆయన సమాధిని ప్రవేశించుటకు ముందు నాతో 'నేను సమాధిని

---

1. శ్రీ పోతులూరి వీరబ్రహ్మంగారి జీవితచరిత్ర – పేజీ 110.

ప్రవేశించితినని పసుపు, కుంకుమ, గాజులు, పూసలు, మట్టెలు వదిలి వైధవ్యము నవలంబింపవలదని ఆనతిచ్చిరి. ఆ యానతిని తిరస్కరించుట అధర్మమని నేను వాటిని ధరించుచున్నాను." [1]

అని వీరబ్రహ్మంగారి భార్య గోవిందమ్మ తన కుమారునకు చెప్పెను.

ఆనాడు వ్యాపించిన కొన్ని మూఢనమ్మకాల్ని వీరబ్రహ్మంగారు ఖండించారు. మతావలంబి అయినప్పటికి సమాజ కృషికి, సంఘసంస్కరణకు పూనుకున్న మహానుభావుడు శ్రీ పోతులూరు వీరబ్రహ్మేంద్రస్వామి.

# 3. కందుకూరి వీరేశలింగంగారు
## (1848 - 1919)

పందొమ్మిదో శతాబ్దంలో ఆంధ్ర దేశంలో సంఘ సంస్కరణోద్యమానికి వీరేశలింగంగారు వేగుచుక్క. మూఢనమ్మకాలతో, మతవైషమ్యాలతో, కుల తత్త్వాలతో, అంటరానితనంతో, సాంఘిక దురాచారాలలో కుప్పలు తెప్పలుగా మునిగి తేలుతున్న ఆంధ్ర దేశాన్ని మహత్తరమైన తన సాంఘిక విప్లవ చైతన్యంద్వారా తెలుగుజాతిని మేల్కొల్పిన నవయుగ వైతాళికుడే మన కందుకూరి వీరేశలింగం పంతులుగారు.

ఆనాడు వర్ణవ్యవస్థ, అంటరానితనం జోరుగా వున్న రోజులు. నిచ్చెనమెట్ల వంటి ఈ కులవ్యవస్థలో అట్టడుగువర్గం అధోగతిలో వున్న కాలం. ఛాందస భావాలు, సనాతన సాంప్రదాయాల ఉక్కుకౌగిళ్ళ నుండి హరిజన, గిరిజనుల జీవితాల్ని వెలుగులోనికి తీసుకువచ్చిన సంస్కర్త మన పంతులుగారు. పేదప్రజల జీవితాల్ని బాగుచేయాలని వాళ్ళ జీవితాలు బాగుపడకుండా ఈ సమాజం, ఈ దేశం బాగుపడదని నమ్మి, అందుకు ఆయన చేసిన కృషి మరువలేనిది. విద్యార్థులను, యువతీ యువకుల్ని పల్లెలకు తీసుకువెళ్ళి ఆ పల్లెల్లో నివాసాలు ఏర్పాటు చేసుకొని

---

3. శ్రీ పోతులూరి వీరబ్రహ్మంగారి జీవితచరిత్ర (సంపూర్ణ చరిత్ర) పుట 341.

వారిలో వున్న అజ్ఞానాన్ని పోగొట్టి ఆరోగ్య సూత్రాలు బోధించి, వారి బిడ్డల్ని ప్రోత్సహించి, వారికి తన సహాయ సౌకర్యాలు అందజేసి వారి చదువు సంధ్యలకు శ్రీకారం చుట్టిన మహనీయుడు వీరేశలింగంగారు.

స్త్రీజాతిని మత మత్తునుండి బయటకు లాగి చైతన్యవంతాన్ని పూరింపజేసిన సంఘ సంస్కర్త మన పంతులుగారు. ఆనాడు మహిళలకు విద్య అందుబాటులో లేదు. వారి జీవితం అటు వంటఇంటికి ఇటు పడకటింటికి పరిమితమైన రోజులు. చదువుకున్న మగవాని కంటె చదువుకున్న స్త్రీ తన బిడ్డల్ని విజ్ఞానవంతులుగా చేయగలదని, సమాజాన్ని, సంఘాన్ని చక్కదిద్దగల నేర్పు ఓర్పు స్త్రీకే వున్నా యని అందుకు స్త్రీ విద్య అవసరమని, అందుకై ఆయన ప్రజలను చైతన్యపరచి వారి సహకారంతో స్త్రీలకు కళాశాలలు- ఉన్నతవిద్య అందేలా కృషి చేసారు.

వీరేశలింగంగారు వేశ్యావృత్తిని అసహ్యించుకున్నారు. కూటికోసం, గుడ్డ కోసం తమ శరీరాన్ని అమ్ముకుని జీవించే వేశ్యావృత్తిలో వున్నవారిపై జాలి చూపించారు. వేశ్యావృత్తిని, వ్యభిచారాన్ని నిరసిస్తూ నిర్విరామంగా కృషి చేసి ఆ వృత్తిలో జీవించేవారికి అనేక జీవనోపాధులు కల్పించి వారి భవిష్యత్తును బంగారు బాటగా తీర్చిన మహనీయుడు కందుకూరి. వేశ్యావృత్తిలో వున్న అనేకులకు ఆయన స్వయంగా వివాహాలు జరిపించారు

నాడు కన్యాశుల్కంద్వారా పండు ముసలి పెళ్ళికొడుకులు ముక్కుపచ్చ లారని పసిపాపలకు తాళికట్టే రోజులు. పసుపుతాడు రంగు మారకముందే వైధవ్యం అనుభవించాల్సిన పరిస్థితులు కూడా వుండేవంటే ఈ వివాహాలు ఎంత అనాగరికంగా జరిగేవో వూహించుకోవచ్చు ఆ నాడు వితంతువుల జీవితాలు ఎంతో నికృష్టంగా వుండేవి. వారికి పునర్వివాహ యోగ్యతను హిందూమతం నిషేధించింది. హిందూ మతావలంబి అయినప్పటికి మన పంతులుగారు విధవా వివాహాల్ని ప్రోత్సహించారు. వారు జీవితాంతం వితంతువులుగా వుండరాదని వారికి మరో కొత్త జీవితాన్ని ప్రసాదించవలసిన అవసరం వుందని ఆయన ఆక్రో సించారు. దీనితోపాటుగా బహుభార్యాత్వం కూడదని ఇందుకు ప్రతిగా నాటి ఆంగ్లేయ ప్రభుత్వ సహకారంతో బహుభార్యాత్వ చట్టాన్ని నిషేధించేందుకు ఈయన ప్రయత్నించి సఫలీకృతుడయ్యాడు.

జ్యోతిశ్శాస్త్రం, వాస్తుశాస్త్రం, హస్తసాముద్రికం, శకునాలు, ముహూర్తాలు మొదలైన అశాస్త్రీయమైన మూఢనమ్మకాల్ని వ్యతిరేకించిన మనీషి మన వీరేశ లింగం పంతులుగారు.

వీరేశలింగంగారు మంచి కవి, రచయిత, ఉపన్యాసకుడు, సంఘ సంస్కర్త, సంస్కృతాంగ్ల భాషలందు నిష్ణాతుడు. తన పాండితీ ప్రకర్షను సంఘసంస్క రణకు వుపయోగించాడు. తన మృదువైన సరళమైన వచన రచనద్వారా జాతిని మేల్కొల్పి సాంఘిక దురాచారాల్ని నిర్మూలించి సంఘాభివృద్ధికి కృషి చేసాడు.

# 4. గురజాడ అప్పారావుగారు

కందుకూరి వీరేశలింగం పంతులుగారి అడుగుజాడల్లో శ్రీ గిడుగు రామ మూర్తి పంతులుగారి సహచరులుగా సంఘ సంస్కరణకు నడుం గట్టిన ప్రముఖు లలో శ్రీ గురజాడ అప్పారావుగారు పేరెన్నిక గన్నవారు. వ్యావహారిక భాషో ద్యమానికి తన కన్యాశుల్క నాటకంద్వారా తెలుగు ప్రజలకు చిరపరిచితుడు. అప్పటివరకు గ్రాంథిక భాషలో నడిచిన గ్రంథాలే తెలుగు సాహిత్యంలో వుండగా సామాన్యులకు సైతం అందుబాటులో వున్న వ్యావహారిక భాషకు జీవం పోస్తూ వెలువడ్డ గ్రంథం కన్యాశుల్కం. శ్రీ గురజాడ తన కన్యాశుల్కం నాటకంద్వారా వ్యావహారిక భాషకు పట్టం కట్టారు.

శ్రీ అప్పారావుగారు నాడు సమాజంలో వ్యాపించిన మూఢనమ్మకాల్ని ఖండించారు గాంధీజీ హరిజనోద్యమం ప్రారంభించక ముందే ఆయన అస్పృశ్య తను వ్యతిరేకించారు. "మంచి యన్నది మాల అయితే మాల నేనౌతాను" అన్నారు శ్రీ గురజాడ. హరిజనులు మనలాంటి మనుషులే ఎందుకు వారిని అసహ్యించుకుంటారు అని ప్రశ్నిస్తాడు. సమాజంలో హెచ్చు-తచ్చు లుండరాదని మనుషులంటే మట్టి కాదని నమ్మిన మహనీయుడు శ్రీ అప్పారావుగారు.

సమాజంలో నాడు వ్యాపించిన మూఢనమ్మకాలలో కన్యాశుల్కం ఒకటి. కాటికి కాళ్ళు చాచిన ముసలివాడు సైతం ధనమదాంధత్వంలో కన్నెల్ని కోరే కాలం. కన్యాశుల్కాన్ని వ్యతిరేకించి కన్నెపిల్లల జీవితాలు చీకటిమయమ్మ

చెయ్యొద్దని ఆయన తన రచనల్లో విమర్శించారు 'పూర్ణమ్మ' కథలో 'పూర్ణమ్మ' జీవితాన్ని వివరించి సామాన్యులకు సైతం కళ్ళనీళ్ళు కురిపిస్తాడు. బాల్యవివాహాలు సమ్మతం కాదని, ముక్కుపచ్చలారని వాళ్ళ జీవితాలకు పసుపుతాడు పేరుతో వురితాడు తగిలించవద్దని సమాజానికి సందేశం ఇస్తాడు.

వితంతువులపై జరిగే దాడిని శ్రీ గురజాడ నిర్ద్వంద్వంగా ఖండిస్తాడు. వితంతువులకు పునర్వివాహం ద్వారా వారికి పునర్జన్మ ప్రసాదించాలని వాదిస్తాడు. వారి జీవితం సుఖమయం చెయ్యవలసిందిగా యువతను ప్రబోధిస్తాడు.

గురజాడ 'వ్యభిచారాన్ని' అన్యాయంగా భావిస్తాడు. వ్యభిచారం పేరుతో కొంతమంది యువతుల జీవితాల్ని కుప్పలా కూల్చే నాటి సమాజాన్ని అసహ్యించు కున్నాడు. వారిని సమాజం చీడపురుగుల్లా అసహ్యించుకోవడాన్ని చూచి వారి బాధను తన బాధగా పంచుకున్నాడు. సామాజిక చైతన్యంద్వారా వారి జీవితాల్ని తీర్చిదిద్దాలని, వారికి జీవనోపాధి కల్పించాలని ఆయన ప్రబోధించారు.

## 5. త్రిపురనేని రామస్వామి

ఆంధ్ర దేశంలో త్రిపురనేని రామస్వామిగారిని గురించి తెలియని సాహిత్యాభిలాషి అరుదు. ఆంధ్ర దేశంలో హేతువాద ఉద్యమానికి బీజాలు నాటటమే గాక దాన్ని మహావృక్షంగా తీర్చిదిద్దిన ఘనత కూడ కవిరాజు రామస్వామిగారిదే. తన పాండితీ ప్రకర్షద్వారా నాడు సమాజంలో వ్యాపించిన మూఢనమ్మకాల్ని హేతువాద ఉద్యమంద్వారా ఖండించిన సంఘ సంస్కర్త శ్రీ త్రిపురనేనివారు. రాజారామ్మోహనరాయ్ స్థాపించిన బ్రహ్మసమాజం ఈయన్ను ఆకర్షించింది. తత్ఫలితంగా కవిరాజు మూఢనమ్మకాల్ని, అలౌకికవాదాన్ని నిరసించారు వేదాలు ప్రమాణం కాదని, విగ్రహారాధన, పితృకర్మలు, యజ్ఞయాగాలు, పూజా పురస్కారాలు మొదలైన మతవిధానాల్ని వ్యతిరేకించారు.

త్రిపురనేని రామస్వామి వర్ణ వ్యవస్థను బ్రాహ్మణాధిక్యాన్ని నిరసించాడు. అస్పృశ్యతా నివారణకు కంకణం కట్టిన మహానుభావుడు.

సంఘంలో వ్యాపించిన మూఢనమ్మకాలకు మూలకారణం మతం - మత గ్రంథాలే అని ఆయన విశ్వసించారు. అపౌరుషేయాలనే పేరుతో కొందరు స్వార్థపరులు సృష్టించినవే వేదాలని ఆయన తన రచనల్లో విశ్లేషించి చెప్పారు. మత గ్రంథాలన్నీ బ్రాహ్మణాధిక్యాన్ని పేర్కొన్నవి. మతం దేవుడనే మత్తుమందు ప్రసాదించిందని ఆయన నమ్మారు. అయితే ఆయన మతప్రమేయం లేని సనాతన ధర్మాన్ని అంగీకరించారు.

వివాహం వేదసమ్మతం అని మతం ఘోషిస్తుంది. అయితే హిందూ మతంలో వివాహ వ్యవస్థకు సంబంధించిన మంత్రాలన్నీ సంస్కృతంలోనే రాయబడ్డాయి. అందుచేత ఆయా మంత్రాల్లో ఏముందో ఎవరికి తెలియదని ఆయన వివాహవిధిని నిరసించారు. వివాహవిధిని బ్రాహ్మణులే చేయనవసరం లేదని ఎవరికి వారే ఈ పౌరోహిత్యాన్ని చేసుకోవచ్చని ఆయన వివరించారు. రామస్వామిగారు అన్ని కులాలలోని వారందరికి పౌరోహిత్య విధానాన్ని నేర్పారు. బ్రాహ్మణాధిక్యాన్ని నిరోధించడానికి రామస్వామిగారు సృష్టించిన ఈ పురోహితులు ఆయా కులాల పురోహితులుగా బయలుదేరారు. దీనివల్ల బ్రాహ్మణాధిక్యత తప్పిందే గాని వివాహవిధి మారలేదు.

కవిరాజుగారు పితృకర్మల్ని, శ్రాద్ధవిధిని అంగీకరించలేదు.

"చనిపోయినవారికి పిండాలను అర్పించే పద్ధతి కూడా కవిరాజు విమర్శకు గురయింది.

సాధారణంగా చనిపోయినవారిని తృప్తిపరచడానికి పిండాలు వండి కాకులకు పెట్టడం హిందూ మతాచారం. తమ పితృదేవతలు కాకుల రూపంలో వచ్చి ఆ పిండాలను తింటాయని వారి నమ్మకం. ఈ నియమాన్ని ఖండిస్తూ

"చచ్చిపోయిన వానికే సరణిఁజేరఁ
గలవు పిండములు నివాప జలముగూడ
నావులును భోక్తలును దృప్తులగుట కొఱకుఁ
గూర్చి పెట్టిరి గాకేమి కుప్పుస్వామి" [1]

---

1. కుప్పుస్వామి శతకము - పు. 76.

పిండప్రదానాన్ని నిరసించారు కవిరాజు

మూఢనమ్మకాలతో కొట్టుమిట్టాడుతున్న సంఘయుగంలో మునిగిన అమాయక జనబాహుళ్యానికి కాంతివలయాన్ని చూపిన మహనీయుడు శ్రీ త్రిపురనేని.

ప్రజాస్వామ్యాన్ని అజ్ఞానాంధకారంలో ముంచెత్తుతున్న మూఢవిశ్వాసాలను నిర్మూలించి జ్ఞానజ్యోతిని ప్రసరింపజేయటానికి కవిరాజు నిర్విరామంగా కృషి గావించారు.

ఈ విధంగా ఆంధ్ర దేశంలో రచనలద్వారా ఉపన్యాసాలద్వారా మూఢ నమ్మకాల్ని తన హేతువాద కుఠారంద్వారా ఛేదించిన సంఘసంస్కర్త త్రిపురనేని రామస్వామిగారు.

# 6. గోపరాజు రామచంద్రరావు (గోరా) గారు

ఆంధ్ర దేశంలో నాస్తికాచార్యులుగా ప్రఖ్యాతి గాంచిన ప్రముఖుడు శ్రీ గోపరాజు రామచంద్రరావుగారు. గాంధీజీ ప్రారంభించిన స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొని గాంధేయవాదిగా చిరకీర్తిని ఆర్జించారు. ఈయన తన పేరులో మతప్రసక్తి – దైవప్రసక్తి వున్నదని దాన్ని తొలగించి తన పేరును 'గోరా'గా మార్చుకున్నారు. అఖిలాంధ్రులకే కాక యావద్భారతంలో గోరా పేరు తెలియనివారు లేరనే చెప్పవచ్చు.

శ్రీ గోరాగారు వర్ణవ్యవస్థను వ్యతిరేకించారు. తన కుమార్తెలకు కుమారులకు కుల మత వ్యతిరేక వివాహాల్ని జరిపారు. తన కుమారుడు శ్రీ లవణం గారికి ప్రముఖ కవి శ్రీ గుర్రం జాషువాగారి కుమార్తె హేమలతతో వివాహం జరిపారు. గాంధీజీ నిర్వహించిన హరిజనోద్యమానికి ఈయన బాసటగా నిల్చారు. హరిజనవాడల్లో సహపంక్తి భోజనాలు, పారిశుధ్య కార్యక్రమాలు నిర్వహించారు.

గోరాగారు మూఢనమ్మకాల్ని గాఢంగా వ్యతిరేకించారు. గ్రహణాలపై హిందువులకున్న మూఢనమ్మకాల్ని తీవ్రంగా గర్హించారు. ఒకసారి ఆయన కొలంబోలో సైన్సు ఉపన్యాసకులుగా పనిచేసే రోజుల్లో గ్రహణం రావడం సంభవించింది అప్పుడు ఆయన సతీమణి గర్భవతి. గర్భవతులు గ్రహణకాలంలో కదలకూడదని, ఏ పని చెయ్యకూడదని, ఆహారం తీసుకోకూడదనే నమ్మకాలు పాటించేవారు. శ్రీ గోరాగారు తన భార్యను స్వేచ్ఛగా తిరగనిచ్చారు. సంతానం మొర్రిపోతుందని బిడ్డ అవిటివాడు అవుతాడనే నమ్మకాల్ని ఆయన వమ్ము చేసాడు. అప్పుడు వారికి కలిగిన సంతానం ఆరోగ్యంగానే వుంది.

గోరాగారు మతాన్ని, మతగ్రంధాల్ని, మతాచారాల్ని వ్యతిరేకించారు. తనకు కలిగిన సంతానానికి సామాజికమైన, సహజమైన పేర్లు పెట్టారు. లవణం, సమరం, విజయం, మైత్రి, నియంత, మారు, నౌ మొదలైన పేర్లు పెట్టారు.

హిందువులు గోవును పవిత్రంగా భావిస్తారు మహమ్మదీయులు పందిని అసహ్యకరమైన జీవిగా భావిస్తారు. శ్రీ గోరాగారు పవిత్రత – అపవిత్రత నియమాల్ని ఛేదించే విధంగా సర్వసమానతను కలిగించడానికి ఆయన ఆవు మాంసం పంది మాంసం రుచికరమైన వంటకంగా తయారుచేయించి సహపంక్తిని వడ్డించారు.

హిందూమతం కర్మకాండకు అధిక ప్రాధాన్యం ఇచ్చింది. ఆయన తన మరణశాసనాన్ని స్వయంగా రాసుకున్నారు. తనకు ఎట్టి కర్మకాండలు తన వారసులు జరపకూడదని శాసించారు. తన శరీరాన్ని ప్రభుత్వ వైద్యశాలకు అప్పగించవలసిందిగా కోరారు.

మన దేశంలో అందరూ తమ తమ పెరడుల్లో పూలమొక్కలు, ఆడంబరం కోసం వుపయోగించే ఇతర మొక్కలు పెంచరాదని, కూరగాయల మొక్కలు పెంచాలని కోరేవారు. మంత్రులకు, ప్రభుత్వ ప్రతినిధులకు కూరగాయల దండలు వెయ్యాలని ఆయన అభిమతం. మంత్రులు నిరాడంబరంగా వుండాలని, పార్టీ రహిత ప్రజాస్వామ్యం తన లక్ష్యమని ఆయన వాదం.

నిప్పులపై నడవటం అందరికీ సాధ్యం కాదని కేవలం దైవ వుపాసకులకు, దైవభక్తులకు మాత్రమే సాధ్యమనే మూఢనమ్మకాన్ని ఆయన వమ్ము చేసాడు. నిప్పులపై నడకను ఆయన సామాన్యమైన విషయంగా నిరూపించాడు.

ఆంధ్రదేశంలో మూఢనమ్మకాలకు వ్యతిరేకంగా వుద్యమాలు నడిపి విజయవాడలో నాస్తిక కేంద్రం స్థాపించి తన చివరి శ్వాసవరకు నిరంతరం సమసమాజ నిర్మాణానికి కృషి చేసిన మహానుభావుడు శ్రీ గోరాగారు.



# రెండవ ప్రకరణము

## ప్రాకృతిక ప్రకరణం

సృష్టికి ప్రకృతి మూలం. ప్రకృతినుంచి వుద్భవించిన మానవుడికి ప్రకృతికి వున్న సంబంధం అవిభాజ్యమైంది. అనాగరికమైన మానవ జాతికి ప్రకృతిని గురించిన అవగాహన లేదు. ప్రకృతి చేసే భయోత్పాతాలకు భయ పడటం అతనికి నిత్యకృత్యమైంది. భయంకరమైన తుఫానుల్ని చూసి, ఉరుములు, మెరుపులు, పిడుగుపాట్లు గమనించి చలించిపోయాడు. వాటినుండి రక్షణ పొంద టానికి ప్రయత్నాలు చేశాడు. అవన్నీ నిష్ఫలం కాగా ప్రకృతిని ప్రార్థించడం తన ముఖ్యావసరం అనుకున్నాడు. ఈ ప్రకృతికి అతీతంగా ఏదో ఒక శక్తి వుందని నమ్మాడు. ఆ శక్తి తన్ను తన కుటుంబాన్ని తన జాతి తెగల్ని నాశనం చేస్తుందని భయపడ్డాడు. ప్రకృతిలో వున్న అసాధారణ పరిస్థితుల్ని అంచనా వేసుకోలేకపోయాడు. అనారోగ్య పరిస్థితులవల్ల ఏర్పడే రోగాలకు, రొష్టులకు ప్రకృతే మూలం అని భావించాడు. చావుకు భయపడ్డాడు. ఆనాటి మానవుడికి చావు సహజం అనే సత్యం తెలీదు.

ప్రాణభీతితో ఆనాటి పరిస్థితినుండి తప్పుకోవటానికి మార్గాలు అన్వేషించి నప్పటికి ప్రకృతి శక్తికి అతీతంగా మరేదో శక్తి వుందని భ్రమపడ్డాడు. వానలు కురవడానికి వానదేవుడని. వాటంతటవే ముట్టుకొని అరణ్యాల్ని కాల్చే అగ్నికి అగ్నిదేవుడిని, వురుములు, మెరుపులు, అగ్నిపర్వతాల తాకిడి, వెల్లువలు వీటన్నిటికి ఒక్కో దేవుడున్నాడని నాటి మానవుడు వూహించాడు. ఈ శక్తులనుండి రక్షణ పొందటానికి ఆయా దేవతల్ని ప్రార్థించటం తప్ప మరో మార్గం లేదని తలంచాడు.

తాను స్వీకరించే ఆహారం, పానీయాల్ని ఆయా దేవతలకు అర్పణ చేస్తే ఆ దేవతలు వాటిని స్వీకరించి తమ జోలికి రావని వూహించాడు. తత్ఫలితంగా తాను తినే పదార్థాల్ని నైవేద్యాలుగా చెల్లించాడు. తాను తీసుకునే పానీయాల్ని వాటికి పెట్టాడు. ప్రకృతి చేసే భీభత్సం కొంతసేపటికి తగ్గకపోదు. తగ్గింది దేవత మహాత్మ్యం అని తనకు తాను భావించాడు. దేవతలకు నైవేద్యం సమర్పించడంద్వారా తన భయం తీరుతుందని తన బాధలు తొలిగిపోతాయని ఆశించాడు. ఆ విధంగా కొన్ని నమ్మకాలు ఏర్పాటు చేసుకున్నాడు.

ఆనాటి వ్యవస్థలో అప్పటి మానవుడు చేసుకున్న వూహలు, నమ్మకాలు ఆనాటికి సహేతువులే. ప్రకృతి శక్తిని గమనించలేని ఆనాటి అనాగరికుని భావనలు ఆనాటికి పరిమితమైనవే. గ్రహణాలు, వర్షాలు మొదలైనవి ఎలా ఏర్పడతాయో తెలియని దశలో వాటికి మొక్కరిల్లాడు, పూజించాడు. తద్వారా కొన్ని నమ్మకాలు ఏర్పాటు చేసుకున్నాడు. విషజీవుల్ని చూసి భయపడ్డాడు. పూజించటం ద్వారా, వాటికి ఆహారాదులు సమకూర్చటంద్వారా తనకు అపకారం చెయ్యవని ఆశించాడు. ఆయా నమ్మకాల్ని తాను తూచా తప్పకుండా పాటించాడు.

ఆ విధంగా ఏర్పడిన నాటి నమ్మకాలు విజ్ఞానం సంపాదించిన నేటి మానవుడు ఆచరించటం, మూఢనమ్మకాలు కాక మరేమౌతాయి ?

ప్రాకృతికమైన ఈ మూఢనమ్మకాలు ఈనాడు మనిషిని పీల్చి పిప్పిచేస్తున్నాయి. జ్యోతిష్యం, వాస్తుశాస్త్రం, శకున శాస్త్రం, పండుగలు మొదలైన మూఢనమ్మకాలు ఈనాటికి పాటించబడుతూనే వున్నాయి. విద్యావేత్తలు, వైజ్ఞానిక వేత్తలు సైతం ఈ నమ్మకాల్ని పాటించటం మనం ఈనాటికీ చూస్తూనే వున్నాం. ప్రకృతిని గురించిన పరిజ్ఞానం పొందిన మేధావులు కూడా ఇలాంటి నమ్మకాల్లో కూరుకుపోవడం గమనించదగిన అంశం.

ఈ ప్రకరణంలో ప్రాకృతికమైన మూఢనమ్మకాల్ని పరిశీలిద్దాం.

# 1. వర్షాల కోసం

వర్షాలు కురవడం ప్రకృతిలో ఒక భాగం. వేసవికాలంలో ఎండ వేడి, వర్షకాలంలో వర్షం, శీతాకాలంలో చలి, మంచు తమ తమ ప్రకృతి ధర్మాలు. సూర్యుని ఎంత వేడికి భూమిమీద వున్న నీరంతా ఆవిరిరూపంలో పొగగా మారి పోయి పైకి పోతుంది. మనం దానిని మేఘం అని పిలుస్తాం. ఆ మేఘం ఎక్కడ చల్లగాలి తగిలితే అక్కడ నీరుగా మారి వర్షం రూపంలో భూమిమీద పడుతుంది. భూమి తన చుట్టూ తాను తిరుగుతూ సూర్యుని చుట్టూ తిరగడంచేత ఒక్కొక్కసారి ఒక్కొక్క దేశంలో వర్షాకాలం వస్తుంది. ఇది ఋతుధర్మం.

ఈ సత్యసత్యాన్ని గమనించలేక మనవారు వర్షాలు భగవంతుడు లేదా ప్రకృతిశక్తి మానవుల్ని కనికరించి వర్షాలు కురిపిస్తున్నాయని భావించారు.

"కాని మనవాళ్లు వానకో దేవుడున్నాడని, అతడే కురిపిస్తూ వుంటాడని అంటారు. అంతేకాకుండా వానలు కురవకుండా వుంటే వానదేవుడి కోసం పాటలు పాడటం చూస్తుంటాము. గ్రహాలకు పూజలు చేస్తుంటారు. యాగాలు చేస్తుంటారు. ఇంకా కొంతమంది కప్పను పట్టుకొని కప్పా తల్లీ నీళ్లాడే- కడవల నిండా వాన గురిసే మొర్రో వానదేవుడో అని పాడుకుంటూ వీధులవెంట తిరుగుతూ వుంటారు. కొంతమంది భారతంలో విరాటపర్వం చదివితే వర్షాలు కురుస్తాయని నమ్మి విరాటపర్వం చదవడంకూడా వుంది. నిజంగా వర్షాలు లేకపోతే మంత్రా లతో పూజలతో వర్షాలు కురుస్తాయా! అట్లా అయితే లోకంలో కరువులు లేకుండా వుంటాయి కదా! నిజమాలోచిస్తే వీళ్ళు చేసే తతంగమంతా వట్టి అబద్ధమన్న మాట. సూర్యుడి మూలాన వర్షం కురుస్తుందే గాని ఒకమూల కూర్చుని ముక్కు మూసుకుని జపతపాలు చేస్తే వర్షాలెలా కురుస్తాయి? పూర్వకాలంలో తెలివితేట ల్లేని రోజుల్లో వర్షాలెట్లా కురుస్తాయో తెలియక చేసే చేశారేమో: ఈ దినాలలో కూడా అట్లాగే చేస్తామంటే తెలిసినవాళ్ళు ఫక్కున నవ్వుతారు.

(మూఢవిశ్వాస వనకుఠారము – 35 పు.)

శివాలయాలలోని శివలింగాలకు అభిషేకం చెయ్యటంవల్ల వర్షాలు కురుస్తా యనే నమ్మకం వుంది. భీమేశ్వరాలయంలోని వరుణ లింగానికి ఘటాభిషేకం చెయ్యటంవల్ల వర్షాలు కురుస్తాయని నమ్మారు.

"వరుణ లింగమునకు తీర్థవారి ధార
వేయి ఘటముల నభిషేకవిధి యొనర్ప
వఱపు దోసంబు వాయంగ వాన గురియుఁ
గొండ్రలంబండు నారంభ కోటులెల్ల"

(భీమేశ్వర పురాణము- 3-123)

ఇప్పటికి మనం గ్రామాల్లోని గ్రామదేవతకు (గంగానమ్మ, పోలేరమ్మ మొ॥న దేవతలు) వెయ్యి బిందెల నీళ్ళు పోయటం, శివలింగాలకు ఘటాభిషేకం చెయ్యటం చూస్తూనే వున్నాం.

ఈ నమ్మకాలు ఒక్కొక్క ప్రాంతంలో ఒక్కో రకంగా వుంటాయి.

"మధ్యప్రదేశ్‌లో హర్దా అనే చోట మొన్న కొందరు గ్రామీణ స్త్రీలు పురుష వేషాలు ధరించి హలాలు పట్టుకొని పొలాలు దున్నారట ఇలా చేస్తే మేఘాధినాధుడైన ఇంద్రుడు సంతోషించి వర్షాలు కురిపిస్తాడట.

ఒక్కొక్క ప్రాంతంలో ఒక్కొక్క నమ్మకం. మన వైపున కూడా నిన్న మొన్నటివరకు కప్ప తిరుణాళ్ళ చెయ్యటం ఒక ఆచారం. ఇప్పటికి ఇది కొన్ని వూళ్ళల్లో వున్నదేమో. కప్పలకు పెళ్ళి చేసి ఒక పెద్ద పాత్రలో వుంచి, నీళ్ళు పోయడం ఆ పాత్రను మోస్తున్న వారిపై పేడనీళ్ళు చల్లడం, ఊరేగింపుగా వెళ్ళి కప్పలను చెరువులో కలపడం చేస్తారు ఇలా చేస్తే వానలు కురుస్తాయని నమ్మకం.

వరుణ పూజ చేస్తే, దేవాలయాల్లో ప్రార్థనలు చేస్తే వానలు కురుస్తాయని కొందరు నమ్మడం లేదా ! అటువంటివే ఈ నమ్మకాలు కూడా.

(ఆంధ్రజ్యోతి 15-7-86)

"కొన్ని ప్రాంతాలలో స్త్రీలు దిగంబరంగా వీధులలో వానలు కురవాలని అరవడం, నాగళ్ళతో పొలాలు దున్నడం వంటి నమ్మకాలు కూడా వున్నాయి.

వరుణ దేవుని కరుణా కటాక్ష వీక్షణాల కోసం 30 మంది మహిళలు ఎండిపోయిన పిల్లకాలువలో ఇటీవల పది రాత్రిళ్ళు నగ్నంగా తిరిగి ఆనందించారు.

ఇది ఎప్పటి మాటలో కాదు అక్షరాల ఇటీవల అనంతపురం జిల్లా పెనుగొండ తాలూకాలోని కొత్తకోట గ్రామంలో జరిగిన ఘటన. ఎండి బీటలు పడ్డ తమ భూములపై వరుణ దేవుడు కరుణిస్తాడని ఆశ మాట అలా ఉంచి ఎంతటి దుర్భిక్షంలో అమాయకత్వంలో ఉన్నామన్నది ప్రస్తుత సమస్య.

భారత ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధీ ఈ నెల 14 న ఆ గ్రామాన్ని సందర్శించనున్నారు. ఇటీవలి సంవత్సరాలలో తీవ్ర కరువు నెలకొన్న గ్రామం అది.

ఇతర గ్రామాల్లో వానదేవుని కరుణకై కప్పలకు పెళ్ళిళ్లు జరిపి వానదేవుణ్ణి కొలిచారు.

మరో విచిత్ర సంఘటన ఏమంటె కదిరి తాలూకాలోని ఒక గ్రామంలోని మొత్తం జనాభా తమ పాపాలకు ప్రాయశ్చిత్తంగా తాము లేకపోతే గ్రామంలో వర్షం పడుతుందన్న ఆశతో ఒకరోజు గ్రామం విడిచి పోయారు."

(విశాలాంధ్ర—10-10-84)

వర్షం సంగతేమోగాని చోరులకు జారులకు మాత్రం నిజంగా ఆ రోజు పండగే.

"వర్షం లేకపోతే మన దేశంలో ఇప్పటికి చేసే ఆచారాలు అనుకరణంలోనికి వస్తాయి. కొందరు ఒక కప్పను పట్టుకొని దానిమీద నీళ్లు పోసుకుంటూ తిరుగుతారు. కొందరు గ్రామస్తులందరూ కలసి ఒక్కసారి కేకలు వేస్తారు. ఉరుములా వుండేటట్లు."

(దేవాలయాల మీద బూతు బొమ్మలెందుకు - 45 పు.)

వర్షాల కోసం కప్పలకు చేసే పెళ్ళిళ్లు కొన్నిచోట్ల చాలా ఆర్భాటంగా వుంటాయి.

"వరుణ దేవుడిని ప్రసన్నం చేసుకునేందుకు అసన్‌సోల్ జిల్లాలోని గ్రామస్తులు కొత్త పద్ధతుల్ని అవలంబిస్తున్నారు. రాష్ట్రంలో వర్షాలు పడక, తీవ్ర దుర్భిక్ష పరిస్థితు లేర్పడ్డాయి. వర్షాల కోసం పరితపించిన గ్రామీణ ప్రజలు ఆడ - మగ కప్పను తీసుకు వచ్చి ఆర్భాటాలతో వాటికి పెళ్లిళ్లు జరిపిస్తున్నారు.

నంది, పున్నేక, జమురియా తాలూకాల సమీపంలోని 'ఓరి' గ్రామంలో ఈ కప్పల పెళ్లిళ్లు జరిగాయి. ఇటువంటి ఓ పెళ్ళికి సుమారు 600 మంది పైగా గ్రామస్తులు హాజరయ్యారు పెళ్ళి తరువాత పెద్ద ఎత్తున విందు కూడా జరుపుకున్నారు."

(ఈనాడు 27-7-82)

జీవశాస్త్రంలో నిష్ణాతులైన పట్టభద్రులు సైతం మగ - ఆడ కప్పను చూడగానే చెప్పలేరు ధ్వని చేస్తే తప్ప మరి గ్రామీణులు వీటిని ఎలా తెలుసుకుంటున్నారో. ఎలా పెళ్ళిళ్ళు చేస్తున్నారో ! ఆశ్చర్యం కదూ !

శకునాల ద్వారా వర్షాలు కురుస్తాయనే నమ్మకం వుంది.

"మిన్నుగని కుక్కలేడ్చిన
పన్నుగ వర్షంబు గురియు"

"మిద్దెల వాములం గూర్చొని
రద్దిగ నేడ్చినను వానరయమున వచ్చున్
వద్దనుచు మొత్తుకున్నను
సిద్ధము వర్షంబు గురియు శిఖ నరసింహా".

"ఎద్దడిన కుక్కలరుచుచు
పెద్దగ గుంకులిడె తలలు విదిలించినచో
పద్దుగ వానలు గురియును
సిద్దము పదిరెండు దినము శిఖ నరసింహా"

"కాకి తన తలను దన్నిన
ప్రాకటముగఁగార్యహాని భయ మశుభంబున్
కాకులు గూళ్ళను గట్టిన
చేకొని వఱ పౌను నిజము శిఖ నరసింహా"

(శిఖ నరసింహ శతకము 200, 202, 203, 247)

విక్రమార్కుడు ఉజ్జయినీ నగరాన్ని పరిపాలించే కాలంలో జ్యోతిశ్శాస్త్రవేత్త ఒకడు వర్ష వివరాలు తెలుపుతూ గ్రహ చక్రగతుల మార్పిడివల్ల వర్షం కురియదని చెప్తాడు

"అక్రమ మాచరించి విను మర్కతనూజుడు తొల్లి యున్నయా
శుక్రునిరాశి దావిడుచుచు న్నకటాకృతినున్న రోహిణీ
చక్రముఁదూఱి మంగళుని సద్మము చేరఁగడంగె యేటిలో
వక్రగలం జరింపఁగ నవర్షణమై చనుఁగొన్ని వర్షముల్".
"పఱి పఱి నిల పఱియలుగా
నెఱసిన వనపంక్తులెండ నిరుపమ మగునా
వఱపునఁ బంద్రెండేఁడులు
కఱవిక నతిదుస్తరంబు గాఁగల దధిపా!"[1]

నీటి చుక్క కోసం నరబలి చెయ్యటం, మానవ రక్తం చిందించటం ద్వారా దుర్భిక్ష ప్రాంతాల్లో వర్షాలు కురుస్తాయని నమ్మే ఆచారాలు నేటికి వున్నాయంటే మనం ఆశ్చర్య పడక తప్పదు.

"అనాగరికతకు మూఢనమ్మకాలకు అలవాలమైన కొన్ని అటవీ ప్రాంతాలలో నేటికి జంతుబలులే కాకుండా నరబలులు కూడా సాధారణమయ్యాయి. బస్తర్ జిల్లాలోని కొండకోనల్లో, దట్టమైన అరణ్య ప్రాంతంలో పోడు వ్యవసాయం సాగిస్తున్న గిరిజనులు తమ ఇష్టదేవతకు నరబలుల ద్వారా సంతృప్తి పరిస్తే సకాలంలో వర్షాలు కురుస్తాయన్న మూఢనమ్మకంతో నరరక్తంతో దేవతలకు పూజలు సాగిస్తున్నట్లు తెలిసింది. ఇటువంటి పైశాచిక ఘటన పామేరుకు సమీపంలో గత నెల 28వ తేదీన జరిగినట్లు పోలీసు వర్గాలద్వారా తెలిసింది. పోలీసుల కథనం ప్రకారం చర్ల సమీపంలోని గొంపల్లెకు చెందిన కొర్రా రాములు, అతని బంధువు కర్నాటి మల్లూరయ్య అనే వ్యక్తులు గత నెల 28వ తేదీ ఉదయం చర్ల నుంచి మధ్యప్రదేశ్‌లోని బస్తరి జిల్లా పామేరుకు ప్రయాణం సాగించారు. అరణ్య ప్రాంతంలో నడచి వెళుతున్న ఆ ఇద్దరిలో కొర్రా రాములు వెనుకబడ్డారు. పామేరుకు మూడు కి.మీ. దూరంలో ఇద్దరు గిరిజనులు రాముల్ని కత్తితో బెదిరించి అతని తలను కోడి మెడ కోసినట్లుగా కోసి మొండెంను మాత్రమే అక్కడ వదిలి తలను తీసుకొని పోయి

1. సింహాసన ద్వాత్రింశిక—10-18, 19

నట్లు పోలీసులు వివరించారు. ముందు నడచి వెళుతున్న మల్లారయ్య ఈ దృశ్యాన్ని చూసి ఏమి చేయలేని నిస్సహాయస్థితిలో భయకంపితుడై సమీపంలో ఉన్న పామేరు ఆర్ట్స్ అప్‌టౌన్ పోస్టు పోలీస్‌స్టేషన్‌కు వెళ్ళి ఫిర్యాదు చేశాడు. నిందితుల కోసం పోలీసులు గాలింపు చర్యలు ప్రారంభించారు. ఈ వార్త తెలిసిన ఈ ప్రాంత ప్రజలు భయాందోళనలు చెందుతున్నారు. ఇటువంటి సంఘటనలు భవిష్యత్తులో పునరావృత్తం కాకుండా ఉండేందుకు ప్రభుత్వం కట్టుదిట్టమయిన చర్యలు తీసుకోవాలని ప్రజలు కోరుతున్నారు [1]

వాన చినుకు కోసం అల్లాడుతూ దుర్భిక్షంతో సతమతమవుతున్న ధర్మవరం రైతులు మూఢాచారాలను తిరగదోడి అనుసరిస్తున్నారు. తాలూకాలోని అన్ని గ్రామాల్లో "కరువులమ్మ"లను ఊరి పొలిమేర్లలో వదిలేసి వస్తున్నారు. పగిలిపోయిన విసురురాళ్ళు, (తిరగళ్ళు) రంధ్రం పడిపోయిన రోళ్ళు, పాతచేటలు, పొరకలు, గ్రామంలో ఉంటే కరువు వస్తుందని ప్రజల నమ్మకం. ఈ వస్తువులన్నింటినీ కరువులమ్మ లంటారు. ఈ వస్తువులను గ్రామం నుంచి తొలగిస్తే కరువుపోయి వానలొస్తాయన్నది ఒక నమ్మకం. అందువల్ల రైతులు బండ్లలో ఈ వస్తువుల్ని వేసుకుని ఊరేగింపుగా పోయి ఊరవతల పారేసి వస్తున్నారు. ధర్మవరం పట్టణంలో ఈ నెల 2న మొత్తం 20 ఎద్దుబండ్లలో ఇలా పగిలిపోయిన తిరుగళ్ళను, పాత్రాలను ఇతర వస్తువులను తీసుకుపోయి ఊరిబయట పారేసి వచ్చారు. ఇక తాలూకాలోని ప్రతి పల్లెలో రోజూ భారతంలోని విరాట పర్వ పారాయణం చేస్తున్నారు. విరాట పర్వంలో అర్జునుడి వీరత్వం వివరించారని, అర్జునుడి గొప్పతనం గురించి వినటం ఇంద్రుడికి ఇష్టమని, ఈ కథ విని దేవేంద్రుడు వర్షం కురిపిస్తాడని మరో నమ్మకం.

కాగా తాలూకాలోని గ్రామ గ్రామాలలోనూ గొల్లవాళ్ళకు ప్రతి ఆదివారం 101 కడవల చొప్పున నీటిని పెళ్ళి కాని పిల్లలచేత పోయిస్తున్నారు. ఇలా మూడు ఆదివారాలు నీరు పోస్తే తప్పకుండా వర్షం వస్తుందని ప్రజలు నమ్ముతున్నారు. కొన్ని పల్లెల్లో వాగువంకల వెంట అయిదారేళ్ళ వయసున్న ఆడపిల్లల్ని గుడ్డలు లేకుండా పిరుగులు పెట్టిస్తున్నారు. గ్రామాల్లోని దేవతలకు పూజలుజేసి వరంగా

1. ఈనాడు 3-6-85

వాన కురిపించమని అడుగుతున్నారు మరికొన్ని గ్రామాల్లో శకునాలు అడుగుతున్నారు. కడవనిండా నీరుపోసి, నిమ్మకాయలు, పసుపు కుంకుమవేసి పూజ చేస్తుంటే ఏ కార్తెలో వాన కురిసేట్లయితే ఆ కార్తి పేరున పూజ చేస్తుండగా కడవలో నీరు కిందకు పొర్లుతుందని నమ్ముతున్నారు. అలాగే దేవతలను పూలతో పూజించి ప్రశ్న అడిగితే ఏ కార్తెలో వాన కురుస్తుందో ఆకార్తె గురించి ప్రశ్నించినప్పుడు దేవత కుడివైపు పువ్వురాలి కింద పడుతుందని నమ్మకం. తాలూకా రైతులు ఎన్ని పూజలు చేసినా ఎన్ని నోములు నోచినా ఆకాశం నుంచి మాత్రం నీటిచుక్క రాలటంలేదు.[1]

వర్షాలు ప్రకృతి వాతావరణ ప్రభావం వల్ల కురుస్తాయనే విషయం తెలుసుకోలేక పూజా పురస్కారాలు చెయ్యడం ద్వారానో, కప్పలకు పెళ్ళిళ్ళు చెయ్యడం ద్వారానో, అభిషేకాల ద్వారానో, మరే ఇతర పద్ధతుల ద్వారానో వర్షాలు కురుస్తాయని నాటి ప్రజలు మూఢంగా నమ్మారు. ఆ నాటి మానవుడు ఈ సత్యాన్ని తెలుసుకోలేక ఇటువంటి ప్రక్రియలు చేసి వుండవచ్చు. నేడు సైతం ఇలాంటి మూఢ నమ్మకాలు సభ్య సమాజంలో వ్యాపిస్తున్నాయంటే ఆశ్చర్యపడక తప్పదు. అభివృద్ధి చెందిన విజ్ఞానశాస్త్రం కృత్రిమ వర్షాలు కురిపిస్తుంటే మనం మూఢ నమ్మకాల వ్యవస్థలో కొట్టుకు పోతున్నామనే విషయం గ్రహించి జాలిపడటం కంటె చెయ్యగలిగిందేమీ లేదు.

1. ఈనాడు 29-9-84

# 2. ఆహారం - పానీయం - ఆచారం

విశ్వంలో ప్రతి జీవి కణ నిర్మితమే. ఏకకణజీవి మొదలు బహు కణజీవి వరకు ఆహార సేకరణ తప్పదు. ప్రతి జీవి తనకు కావలసిన ఆహార – పానీయ విషయాల్లో ఒక్కొక్క పద్ధతి అవలంబిస్తుంది. మానవుడు తనకు కావలసిన ఆహార–పానీయాల్ని తానే సమకూర్చుకునేవాడు. ఆర్యులు మన దేశానికి రాక పూర్వం ఇక్కడి వారికి మద్యం అలవాటు లేదనే చెప్పాలి. మధ్య ఆసియా నుంచి భారత దేశానికి వలస వచ్చిన ఆర్యులు అప్పటికే మద్యం – సుర – మధువు – పరిస్రుత వాడే వారని ఋగ్వేదం ఆధారంగా తెలుస్తుంది. భారతదేశంలో సోమవల్లి అనే

తీగ హిమాలయాల ప్రాంతంలో లభించేదని దాని నుంచి తీసిన మధువు బహు రుచికరంగా వుండేదని, సోమవల్లిని ఆర్యులు ఆరాధించేవారని మనకు వేదాల వల్ల తెలుస్తుంది. ఈ సోమవల్లిని ఆర్యులు ద్రావిడులనుంచి కొనుగోలు చేసి దాన్ని వాడుకునే వారని కూడా తెలుస్తుంది.

"సోమవల్లి ఋగ్వేదకాలంలోనే పుష్కలంగా గానీ సులభంగా గానీ లభించేది కాదేమో. అందువలననే దానికి ప్రత్యేకమైన విలువ వుండదేమో. అది పర్వత ప్రాంతాలలోనే (ముఖ్యంగా హిమాలయాల్లోనే) ఏపుగా పెరిగేదట. దానిని కిరాతుల నుంచి ఆర్యులు కొంటూ వుండేవారట. కిరాతులను హీనంగా చూచినా, వారిపట్ల హేయంగా ప్రవర్తించినా వారి నుంచి కొన్న సోమవల్లిని ఆర్యులు మహా పవిత్రమైన దానినిగా పరిగణించేవారు.

సోమం మద్యం కాదని కొందరి వాదం. వేదకాలంలో మద్యాన్ని 'సుర' అనేవారట. ఒక సుర మాత్రమేకాదు, దీనితోపాటు మధువు వుండేది. పానం వుండేది. పరిస్రుత వుండేది.

మాంసం లేనిదే మద్యం రుచి సగం చస్తుంది. ఏదో ఒక రూపంలో మద్య పానం విశేషంగా జరిగిన వేదకాలంలో మాంస భక్షణ కూడా విశేషంగా కొనసాగిందని ప్రత్యేకంగా చెప్పనక్కరలేదు. గో మాంస సమేతంగా అన్ని మాంసాలను అప్పటిలో ఆరగించేవారు. వారు తినేవారు. తాగేవారు. వారు మాంసం తినేవారు. గో మాంసాన్ని కూడా తినేవారు."[1]

ఆర్యులు కిరాతులను దస్యులు అని పిలిచేవారు. కిరాతుల్ని హీనంగా చూసినా వారు తెచ్చిన సోమవల్లిని మాత్రం గౌరవించి — యజ్ఞ యాగాలలో వాటిని వుంచి దాన్నుంచే తయారయ్యే సోమరసాన్ని (మత్తు పానీయం) స్వీకరించేవారు.

ఆహారం మానవుడికి శారీరక మానసిక శక్తిని సమకూరుస్తుంది. మాంసాహారం రజోగుణాన్ని కలిగిస్తుందనే మూఢ నమ్మకం మనలో వ్యాపించి వుంది.

---

1. సీత జోస్యం 89 — 90 పుటలు

"ఒక రోజు సాయంత్రం గుంటూరులో మేమందరం కూర్చుని వున్న సమయాన మాంసాహారం మంచిదా శాకాహారం మంచిదా అనే చర్చ వచ్చింది. శాఖాహారాన్ని తిని భారతీయులు బలహీనులై ఇతర రాజ్యాలకు బానిసలైనారు అన్నారు అందులో ఒకరు. భారతీయులు ఏనాడూ శాకాహారులు కాదు. వేదాల్ని రచించిన ఋషులు కూడా శాకాహారులు కారు. మాంసాహారులే. అహింసకు ప్రాధాన్యం ఇచ్చిన బౌద్ధులు కూడా శాఖాహారులు కారు. మాంసాహారులంతా తమోగుణ ప్రధానులని, శాఖాహారులంతా సత్వగుణ ప్రధానులని నమ్మడం కూడా వట్టి భ్రమ. మనం పరిశీలించి చూస్తే మాంసాహారుల్లోనూ సాత్వికులున్నారు. శాకాహారుల్లోనూ సాత్వికులున్నారు. అదే విధంగా మాంసాహారుల్లోనూ తామసులున్నారు. శాకాహారుల్లోనూ తామసులున్నారు. మాంసాహారంగానీ శాకాహారంగానీ ఎవర్నీ కూడా తామసులుగా కానీ తాపసులుగా గానీ చేయలేవు. తినే ఆహారం మీద మానవుని స్వభావం ఆధారపడి వుండదు."[1]

పుష్టికరమైన ఆహారపదార్థాలు మూఢ నమ్మకాల పేరుతో తినడానికి కూడా భయపడే సంఘటనలు మనసమాజంలో అనేకం వున్నాయి.

"ఉస్మానియా మెడికల్ కాలేజీలోని ప్రివెంటివ్ మెడిసన్‌కు చెందిన 60 మంది పోస్టు గ్రాడ్యుయేట్లు నగరంలోని (హైదరాబాదు) బాడీ బజారు ప్రాంతంలో తమ సర్వేని నిర్వహించారు. వారు ఈ ప్రాంతంలో 211 కుటుంబాలకు చెందిన 1257 మంది జనాభాను సర్వే చేసారు. ఇక్కడి ప్రజలు మామూలు పరిస్థితుల్లోనూ తీసుకునే ఆహారాన్ని గురించి ప్రశ్నించారు. చవకగా దొరకటమే కాకుండా మంచి పోషకాహారపు విలువలున్న దుంపలను, గడ్డలను కీళ్ళవాపులు వస్తాయనే భయంతో వీరు తినడం లేదని తేలింది. పళ్ళ నొప్పులు, దవడలు లాగడంవంటి బాధలు వస్తాయనే భయంతో వంకాయలు తినడం లేదట. చిన్న పిల్లల తల్లులు తమ పిల్లలకు కడుపు నొప్పి ఎక్కడ వస్తుందోనన్న అపోహతో 'సి' విటమిన్ పుష్కలంగా వున్న జామ పండును ముట్టడం లేదు.[2]

---

1. స్మృతి బింబాలు — 60 పు.

2. ఈనాడు 28—5—1984—పేజీ—8.

రజస్వల అయినవారు బాలింతరాళ్లు, చూలాళ్లు మూఢనమ్మకాల పేరుతో పుష్టికరమైన ఆహారాలు స్వీకరించక పోవడం మనం నిత్యం చూస్తూనే వుంటాం.

ఆర్యులు మన దేశానికి రాక పూర్వం ఈ దేశస్థులైన ద్రావిడుల ముఖ్య వృత్తి వేట. పశు పోషణ వీరికి లేదు. వీరిని జయించి ఆ ప్రాంతాల్ని ఆక్ర మించుకున్న ఆర్యులు కొన్ని కొన్ని పరిస్థితులలో వారితో సహజీవనం ప్రారం భించారు. ఆయా సందర్భాలలో ఆర్య – అనార్య వ్యవహారాలు సమ్మిళిత మయ్యాయి. ఆర్యేతరం – అనార్యేతరమైన ఆహార విషయంగానీ, పానీయం విషయంగానీ – ఆచారం విషయంగానీ ఒకరివి మరొకరు పుణికి పుచ్చుకొనక తప్ప లేదు.

"వేటను గురించిన చిత్రాలను తన గుహలో చిత్రిస్తే తనకు ఎక్కువ జంతువులు దొరకగలవని ఆదిమానవుడు విశ్వసించేవాడు. ఋగ్వేదకాలం నాటి ఆర్యులు అంతకంటె నాగరికతలో మెట్టు పైకి వెళ్ళినవారు. ఒక్కొక్క ప్రకృతి శక్తిని ఒక్కొక్క దేవతగా రూపకల్పన చేసుకొనటం. మంత్రశక్తితో కోరిన దేవతలను ఆవాహన చేయగలమని, మద్యమాంసాలనైవేద్యంతో, సంతృప్తిపరచి వారి చేత అభీష్ట కార్యాలన్నింటిని చేయించుకొనిగలమని సమ్మడం. ఆర్యుల మతవిశ్వా సాలకు పూర్తిగా భిన్నమైనట్టివి. వారు ఇక్కడికి చేరినప్పుడు అనార్య జాతుల్లో ప్రచారం వుండేది. ఉదాహరణకు కర్మ సిద్ధాంతం ఆర్యేతరం. జన్మ – పునర్జన్మల సిద్ధాంతం ఆర్యేతరం. తపస్సు ఆర్యేతరం. యోగశాస్త్రం ఆర్యేతరం. తాంత్రిక విద్యలు ఆర్యేతరం. ఫల పత్ర పుష్పతోయాదులతో పూజావిధి ఆర్యేతరం. దేవాల యాలు, విగ్రహారాధన ఆర్యేతరం. అవతార సిద్ధాంతం ఆర్యేతరం. ఒక్క మాటలో ఈనాడు హిందూ మతంలో ముఖ్యాంశాలుగా చెల్లుతున్న అనేక విశ్వాసాలేమి దానికి ప్రధానాంశాలుగా చెల్లుతున్న అనేక ఆచార వ్యవహారాలేమి అన్నీ ఆర్యేతరం. ఇక్కడికి వచ్చిన కొత్తలో ఆర్యేతరమైన ప్రతిదాన్ని ఆర్యులు నిరసించినా, నిందిం చినా, నిర్మూలించటానికి ప్రయత్నించినా నెమ్మది నెమ్మదిగా ఆర్యేతర విశ్వాసాలను, జీవిత విధానాల్ని పంచుకొనడం ప్రారంభించారు."[1]

1. సీత జోస్యం – 93 పు.

శుభకార్యాల సందర్భంలో తిథులు, వారాలు, వర్జాలు, మాసాలు, మూఢం – శుక్ర మూఢం, గురు మూఢం అంటూ కొన్ని నియమాలు పాటిస్తారు. అందరూ హిందువులే. కానీ వివిధ ప్రాంతాల వారు వివిధాచారాల్ని పాటించటం కద్దు. ఒకరికి మంచి రోజు మరొకరికి మంచి రోజు కాదు. వివాహాది శుభకార్యాల సందర్భంలో భిన్నమైన పద్ధతి అవలంబి స్తున్నారు.

“ఏ తిథులు, ఏ వారాలు, ఏ మాసాలు, ఏ గంటలు, ఏ విధంగా మనకు (హిందువులకు) శుభకార్యాలు (మేలు కలిగించు పనులు) చేయుటకు పనికిరావో అవే మన ప్రక్కనున్న తమిళ (అరవ) ప్రాంతపు హిందువులకు శుభప్రదమైనవిగా యెంచబడుతున్నాయి. ఉదాహరణకు నవమి, చతుర్దశి, అమావాస్యలను మనం అశుభములుగా యెంచుతాము. కానీ తమిళ ప్రాంతపు హిందువులు ఆ తిథులను ఎంతో శుభప్రదమైనవిగానూ, పవిత్రమైనవిగానూ యెంచి అ తిథులలోనే ఉద్యోగాలు, గృహ ప్రవేశాలు, విద్యాభ్యాసాలు, పెండ్లిండ్లు మొదలైన శుభకార్యాలను జరుపు కుంటున్నారు.”[1]

విశాఖపట్టణం ప్రాంతంలోని మన్యంలో నివసించే ఆటవికుల ఆచారాలు విచిత్రంగా వుంటాయి. భార్యాభర్తలకు మధ్య తగాదాలు వస్తే వాళ్ళ దేవత వారి తగాదాల్ని తీరుస్తుందని నమ్ముతారు.

“భార్యాభర్తల మధ్య తగువు వస్తే యిద్దరినీ ధారాళమ్మ గుడిలోకి నెట్టి తలుపులు మూస్తారు. ఒక రాత్రి, ఒక పగలు అలా వుంచుతారు. ధారాళమ్మ వారిని రాజీ పరుస్తుందట. ఇరవైనాలుగు గంటలు అమ్మవారి పాదాల దగ్గర పడి వుంటే ఆ భార్యాభర్తలు ఏకం అవుతారు.”[2]

ఏకం కాకపోతే కూటికి నీళ్ళకు కూడా మొహం వాచి చస్తారు. ఏం చేస్తారు ? తప్పదుగా.

నేటికీ గిరిజనుల్లో వుండే వివాహ సంబంధాలు వారు విడిపోయేటప్పుడు చేసే నిర్ణయాలు, విడాకుల విధానం గమ్మత్తుగా వుంటుంది. ఏజన్సీ ప్రాంతంలో వుండే

1. పెళ్ళెందుకు – 69 పుట.

2. మల్లమదేవి ఉసురు 176 పుట.

గిరిజనుల స్త్రీ పురుషమైన సంబంధాలు ఇతరులకు వింతగా కనిపించినా, వారి కట్టు, బొట్టు, ఆచారాల వ్యవహారాలు, వారి జీవన విధానంలో మార్పు వచ్చినా, అనాదిగా వున్న కొన్ని మూఢ నమ్మకాల్ని, అలవాట్లనునేటికి వదిలి పెట్టలేక పోతున్నారు,

"గిరిజనుల్లో ఆడ, మగ ఇష్టపడితే చాలు పెళ్ళవుతుంది. ఇద్దరూ విడి పోవాలనుకుంటే విడిపోయి ఇష్టమున్న మరొకర్ని పెళ్ళాడవచ్చు. ఇతరులలో ఆడపిల్లవారు మగ పెళ్ళి వారికి కట్నం ఇస్తే గిరిజనుల్లో మగ పెళ్ళివారు ఆడపిల్ల వారికి కట్నం చెల్లించుకోవాలి. వింతైన వీరి వివాహ సంగతులు వింటే ఎంతో ఆశ్చర్యం కలుగుతుంది.

"గిరిజనులు ఫాల్గుణ మాసంలో హోళీ పండుగ చేసుకుంటారు. ఆ రోజు వీరు రంగులు చల్లుకొని ఆడ మగ కలసి "హోళికి" నృత్యం చేస్తారు. ఈ నృత్యంలో ఆడ మగ ఇష్టపడితే ఇద్దరు కలిసి వెళ్ళిపోయి రెండు మూడు రోజులు కాపురం చేస్తారు. ఆ తరువాత వారిని గ్రామ పెద్దలు తీసుకు వచ్చి ముహూర్తం నిర్ణయించి పెళ్ళి చేస్తారు. ఈ పెళ్ళి జరగటానికి ముందు పెళ్ళి కొడుకు పెళ్ళి కూతురు తల్లి దండ్రులకు 'హోళి' పేరులో వంద నుండి రెండు వందల రూపాయలు, ఒక మేక పోతు లేక కోడిపెట్ట, 5 లేక 10 కుంచాల బియ్యం వారి వారి శక్త్యానుసారం కట్నంగా ఇస్తారు వీటితో వంట చేసి పెళ్లిరోజు అందరికి భోజనాలు పెడతారు. పెళ్ళయిన తరువాత మాత్రం కుమార్తెను అత్తవారింటికి పంపేటప్పుడు వారి స్తోమతను బట్టి 'సారి' పెడతారు. పెద్దల ఇష్ట ప్రకారం జరిగే పెళ్లి కూడా ఇలాగే జరుగుతుంది.

వివాహమయిన కొంతకాలానికి ఆలుమగల మధ్య బేదాభిప్రాయం వస్తే, వివాహిత అయిన స్త్రీ ఇష్టం లేని తన భర్తను వదిలేసి, ఇష్టమున్న మరొక వ్యక్తితో వెళ్లిపోతుంది. అప్పుడు ఆమె భర్త. తన భార్య ఎక్కడ వుందో తెలుసుకోవడానికి అన్వేషణ ప్రారంభిస్తాడు. ఆమె ఆచూకి తెలిసిన తరువాత ఆ విషయాన్ని గ్రామ పెద్దలకు విన్నవిస్తాడు. ఆ గ్రామ పెద్దలు సంప్రదించిన తరువాత తగువు పరి ష్కారానికి వేదికను ఏర్పాటు చేస్తారు. దీనిని 'మగనాలి' తగువు అంటారు. ఆ తగువు విషయాన్ని రెండు గ్రామాల ప్రజలకు, బంధువులకు, సన్నిహితులకు

తెలియజేస్తారు. ఆ తరువాత ఆ యువతి వదిలిన భర్త, ఆ గ్రామ పెద్దలు ఆ యువతి వున్న గ్రామానికి వెళ్ళి వూరి పొలిమేరలో విడిది చేస్తారు. వీరికి వారు ఒక సెలయేరు చూపించి, స్నానాదికాలు పూర్తి చేయటానికి వసతి కల్పిస్తారు. ఆ తరువాత ఒక కుంచం చోడిపిండి, తగినంత సారా, పది కుంచాల ఓయ్యం ఒకటో రెండో పశువులు తగువుకు వచ్చిన వారికి ఇస్తారు. దాంతో వారు వంట చేసుకొని తిని పూర్తిగా తాగి తగువు తీర్చటానికి పథకాలు రూపొందిస్తూ రాత్రంతా గడుపుతారు.

ఆ మర్నాడు మగనాలి తగువుకు రాజీ పెద్దలను ఎంపిక చేస్తారు. భార్యను పోగొట్టుకున్న వ్యక్తితో సహా పెద్దలు గ్రామంలో అడుగు పెడతారు. ఆ గ్రామ పెద్ద ఇంటివద్ద సమావేశమై ఫలానా పిల్ల తాలూకు పెద్దలు వచ్చారు తగువు పరిష్కారానికి రండని ఆ గ్రామ పెద్దలకు కబురంపుతారు. ఆ కబురు అందిన తరువాత పిల్లతో సహా కొందరు పెద్దలు ఆ తగువు పరిష్కారానికి వస్తారు. తగువు పరిష్కారానికి కొంత సొమ్ము ముట్టజెప్పమని ఆమె భర్త కోరతాడు ఇరుపక్షాలు రాజీకి వచ్చిన తరువాత, పెద్దల ఆదేశం మేరకు కొంత మొత్తాన్ని వారి స్థోమతను బట్టి ఆమెను తీసుకొని వెళ్ళిన వ్యక్తి ఆమె భర్తకు నష్టపరిహారం క్రింద చెల్లిస్తాడు. ఈ డబ్బు ముట్టజెప్పే ముందు ఇటుపైన మీరుగాని, మేముగాని కోపద్వేషాలు వుంచుకోకూడదు. సంతలో ఈ స్త్రీ కనబడినా గొడవ పెట్టుకోకూడదు. తీర్థంలో గాని, గ్రామ సంబరంలోగాని విరోధం వుంచుకోకూడదు అంటూ ప్రమాణాలు చేస్తారు. మగనాలి తగువు అంతటితో చెల్లు. ఒకవేళ పిల్లల తల్లి వెళ్ళిపోతే ఆ పిల్లలను ఆమె భర్తే పోషించాలి.

గిరిజనులు ఆడా మగా కలిసి తాగినా, తిరిగినా కట్టుబాట్లు తప్పరు. అబద్ధం ఆడరు. వీరు నీతి నిజాయితీలకు ప్రతి రూపాలు."[1]

మతం మానవ సమూజంలో ప్రధాన స్థానం ఆక్రమించింది. మతం కోసం రక్తం తర్పణం చేసిన సందర్భాలు కోకొల్లలు. ఈ దేశంలో శైవం, వైష్ణవం

---

1. ఆంధ్రప్రభ 15-6-84

పరస్పరం కత్తులు దూసుకున్న ఘటనలు అనేకం. ఈ మతాలు ముదిరి వీరశైవం, వీర వైష్ణవాలుగా వెలిసి మూకుమ్మడిగా నరుక్కు చచ్చిన సందర్భాలు లెక్కలేనన్ని.

పల్నాటి యుద్ధం విషయంలో ఈ శైవ వైష్ణవాలు ప్రధానం. నాగమ్మ శైవానికి ప్రతీక అయితే బ్రహ్మన్న వైష్ణవానికి ప్రతీక. వైష్ణవంద్వారా సమ సమాజ నిర్మాణం చెయ్యాలన్న బ్రహ్మన్న వాదం శైవులకు అగ్నిపై ఆజ్యం పోసినట్లయింది. తన చాపకూటి సిద్ధాంతం ద్వారా అన్ని మతాల్ని – కులాల్ని, జాతుల్ని ఎంగిలి మంగలం చేసాడని నాగమ్మ క్రౌర్యం. తరతమ బేదాలు లేకుండా వివాహాలు. పదవుల ద్వారా సమాజాన్ని నీరస స్థితిలోకి దిగజార్చాడని శైవులు నమ్మారు.

"శైవమూ, వైష్ణవమూ పల్నాటి సీమలో ఒక వరలో ఇమడలేని రెండు కత్తులు. కొత్త సమాజం కోసం, నవ సమాజం కోసం కలలు కనే బ్రహ్మనాయుడు మత సమ్మతమనీ, శైవమే దీనికి మూలమని నమ్మే నాగమాంబా ప్రచ్ఛన్నంగా శతృత్వం కోరుతున్నారు."[1]

హిందూ మతంలో గాయత్రీ మంత్రానికి విశేష ప్రాధాన్యం వుంది. సంధ్యా వందన సమయాల్లో దీని ప్రసక్తి తప్పకుండా వుంటుంది సంధ్యా వందన కార్యక్రమం ద్వారా ప్రత్యక్ష దైవమని భావించే సూర్యుడి ప్రమేయాన్ని వివరించడం జరుగుతుంది. సూర్యుడు తన సప్తాశ్వరథారూఢుడై వెళ్ళే సందర్భంలో మందేహులనే రాక్షసులు అడ్డు పడుతూంటే సంధ్యా వందనం కార్యక్రమం ద్వారా వెదజల్లే నీటి బిందువులు ఆ రాక్షసుల పీచమడచి చంపుతాయట.

"సూర్యుడు చేయవలసిన యాత్ర చాలా కష్టాలతో నిండి వుంది. అడుగడుక్కీ అడ్డంకులే పాపమూ సూర్యుడికి. మందేహులన్న రాక్షసులు సూర్య రథాన్ని అడ్డేస్తూ వుంటారు. ఏడు గుర్రాలున్నా కష్టాలలో ఈదవలసి వచ్చింది పాపం ఆ సూర్యుడికి. ఆ మందేహులను నరుక్కుంటూ చంపుకుంటూ యాత్ర సాగిస్తుంటాడు సూర్యుడు. ఈ పనిలో అలసిపోతూ వుంటాడు. అలాగే ఆ సూర్యుడిని విడిచి పెట్టేస్తే ఎప్పుడో ఒకనాడు సొమ్మసిల్లి పోవలసిందే కదా ! మరి ప్రపంచం

---

[1] (పల్నాటి వీరచరిత్ర – 21 పుట.)

గతి ఏమవుతుంది? మూడు లోకాల్లో జరిగే పుణ్య కార్యాలు ఏంగాను? అంచేత పాపం సూర్యుడికి మనం బలం ఇచ్చి బందోబస్తు చెయ్యాలి. సహాయం పంపాలి. కుమ్మక్కు ఇవ్వాలి అలా నిశ్చయించుకున్నారు బుద్ధిమంతులు. ఉదయం - మధ్యాహ్నం - సాయంకాలం మూడు సంధ్యలు పెట్టారు. ఈ సంధ్యలలో సంధ్యా వందనం చేసే నీళ్ళు అలా విసరమన్నారు. ఆ నీటిబిందువులు మహాతీక్ష్ణమైన బాణాలయి వెళ్ళి ఆ మందేహ రాక్షసులను చంపేస్తాయి. సూర్యుడు అడ్డు లేకుండా తన యాత్ర సాగిస్తాడు [1]

గాయత్రీ మంత్ర ప్రభావం అమోఘం. దానికి మించిన మంత్రం మరొకటి లేదని వీరి నమ్మకం.

"గాయత్రి వేయి మాఱులు
సాయక నిత్యము జపింప పాపములడఁగస్
గాయత్రీ మంత్రమునకు
నే యెడకెక్కుడగ మంత్రమిలపైఁగలదే"[2]

"దీపధర్మ మహాచ్ఛ విప్రహస్త విముక్త
శర నికరములు తీక్ష్ణత వహించి
ప్రౌఢి మందేహ నిర్మథనంబు సేయఁబ్రా
గ్భాగ మందున నుండె ప్రస్ఫురన్మ
హా నలజాతుండు హర్యనీకాధినా[3]"

హిందూ మతంలో చనిపోయిన వారికి శ్రాద్ధం చేయటం ముఖ్యమైన ఆచారం. చనిపోయిన రోజు నుంచి 11-15 రోజుల తరువాత సూత కర్మలు చేయటం పిండ ప్రధానం మొదలైన కార్యక్రమాలుంటాయి. కానీ వీర శైవం సూతకం అంటదని శివభక్తుని కి శ్రాద్ధ కర్మలు అవసరం లేదని సూచిస్తుంది.

---

1. దేవాలయాల మీద బూతు బొమ్మలెందుకు - 42 పుట.
2. ధర్మఖండము - 6-20.
3. లంకా విజయము - 2 - 164.

"ఎందును శివార్థముగ మృతిఁ
బొందిన పుణ్యాత్ము బంధు పుత్రాదులకున్
బొందదు సూతకమతనికి
వందురు పరలోక విధులు వలదు మహీశా ;

వెండియు శివార్థ మృతునికి
నొండొక పరలోక విధులు నొడబడిరేవా
రొండుడిగె యథాశక్తిఁ
బండుగ సేయుదురు రుద్రభక్తులకు శివా [1];

పెద్దల్ని, రాజుల్ని దర్శించే సందర్భంలో వట్టి చేతులతో వెళ్ళరాదనే ఆచారం వుంది.

రాముడు వనవాసం చేసే సందర్భంలో ఇద్దరు ఋషులు రాముని దర్శించడానికి పళ్ళబుట్టలతో వస్తారు. అందులో చిన్న ఋషి సీతకు పళ్ళబుట్ట అందివ్వబోగా ఆమె తిరస్కరిస్తుంది. అప్పుడు పెద్ద ఋషి.

"ఇక్కడ మీకివి తక్కువనికాదు. మా రామచంద్ర ప్రభువుల పట్ల మా భక్తి గౌరవ ప్రపత్తులకు సూచకంగా తెచ్చాము. అంతే ! రాజ దర్శనానికి రిక్త హస్తాలతో వెళ్ళరాదని వృద్ధాను శాసనం.[2]"

సామాన్యంగా వివాహసమయంలో యువతులకు మెట్లు (వీటినిపిల్లెళ్ల పిల్లాండ్రు అని కూడా పిలుస్తారు). కాళ్ళ వేళ్ళకు ధరించే వెండి ఆభరణాలు ఇవ్వటం అక్కడ నుంచి ఆమె ధరించడం జరుగుతుంది. ఈ ఆభరణము ధరించిన స్త్రీ వివాహితురాలు అని అర్థం.

కానీ ఈ ఆభరణాలు వివాహం కాని కన్యలు కూడా ధరించినట్లు తెలుస్తుంది.

---

1. శివ తత్త్వసారము 1-282, 283.

1. సీత జోస్యం - 135 పుట.

జాంబవతి జాంబవంతుని కుమార్తె శ్రీకృష్ణుడు శమంతకమణి కోసం జాంబవంతుని గుహలో ప్రవేశిస్తాడు. అప్పుడు జాంబవతి మెట్లు ధరించి శ్రీకృష్ణునికి కనిపిస్తుంది.

"అతివ ప్రేళుల పిల్లాండ్ల నందమంది
పల్ల వచ్ఛాయముల మీద మల్ల చఱచు
గేలిన పమాన వస్తు జగీషనేస్తఁ
జేరి పెనగంగనవి జగజట్లుగావె.[1]"

ప్రద్యుమ్నుడు శ్రీకృష్ణుని కుమారుడు. ప్రభావతి ప్రద్యుమ్నుని వలచి వలపించుకున్న వనిత. ప్రభావతి ప్రియాగమన వేళ చేసిన అలంకారం.

"వెలఁది మట్టెలు పిల్లాండ్లు పీర మద్ది
యలును నందెలు మొలనూళ్ల నంగుళీయ
కంకణాంగద హారతాటంక ముఖ స
మస్త భూషణములు దాప్పె మార్చి మార్చి.[2]"

ఈ మట్టెలు మగవారుకూడా ధరించినట్లు మనకు తెలుస్తుంది. పాండవ పట్ట మహిషి అజ్ఞాతవాస సందర్భంలో విరాటరాజు కొలువులో సైరంధ్రి రూపంలో తలదాచుకొని ఉండగా కీచకుడు ఆమెను వరిస్తాడు. ఆ సందర్భంలో కీచకుడు తన కాలి వేళ్ళకు మట్టెలు ధరించినట్లు వివరించబడింది.

"మట్టెయ రొండొండ ఓట్టు తాకగనేల
నందంద మునిగాళ్ళ నప్పళించు [3]"

ఒక్కొక్క ప్రాంతంలో వస్త్రధారణ ఒక్కొక్క రకంగా వుంటుంది. పంజాబీ ప్రాంతంలో స్త్రీలు కుర్తా – పైజమా వాడితే – ఆంధ్ర తదితర ప్రాంతాలలో

---

1. సాంబోపాఖ్యానము – 3 – 90.
2. ప్రభావతీ ప్రద్యుమ్నము – 4 – 138.
3. శ్రీ మదాంధ్ర మహాభారతము విరాట పర్వము 2–250.

చీరె – రవిక ధరించడం ఆచారం ఉత్తర ప్రాంతంలో స్త్రీలు లంగా ధరించడం ఆచారం కొన్ని ప్రాంతాలలో (ఫాంట్) పొడవు లాగూలు ధరించడం ఆచారం. పాశ్చాత్యులు, గౌను ధరించడం. కొందరు జీన్సు ధరించడం – కొందరు ఎక్కువ వస్త్రం వుపయోగిస్తే – మరి కొందరు తక్కువ వస్త్రం వుపయోగించడం జరుగుతుంది.

తమకున్న వాతావరణ పరిస్థితుల్ని ఆధారంగా చేసుకొని వస్త్ర ధారణ జరుగుతుంది. అతి శీతలవాసులు ఉన్ని వస్త్రాల్ని వేడిని కలిగించే వస్త్రాల్ని ఎక్కువ వస్త్రాల్ని ధరిస్తే, ఉష్ణ దేశస్తులు చల్లదనాన్ని కలిగించే వస్త్రాల్ని ధరిస్తారు.

ద్రావిడ దేశ స్త్రీలు పయ్యెద (పమిటి – పైట) ధరించే ఆచారంలేదు. మొదటి నుంచి వారి ఆచార వ్యవహారాలు అలా చూపుతున్నాయి. వివాహం కాని తమిళ, మళయాళ దేశ బాలికలు పయ్యెద ధరించరు పయ్యెద ధరించని వారికి వివాహం కాలేదని గుర్తు.

రాముడు ఇంటలేని సమయంలో రావణుడు సీతను అపహరించుకొని తీసుకు వెళ్తాడు. ఆ సమయంలో సీతకు పయ్యెద తొలగింది. ద్రవిడ దేశ స్త్రీలు పయ్యెద తొలగిన సీతను చూచిన పరిహసించగా కుపితురాలైన సీత ద్రావిడ దేశ స్త్రీలను ఈ విధంగా శపించింది.

> "పయ్యెద తొలగిన నను మీ
> రి య్యెద హసియింపఁబాడియే నేడు మొద
> ల్పయ్యెదలు లేక యుండుఁడు
> ద య్యంబుల భంగి ద్రవిడ తామర సాక్షుల్.[1]"

సీత శపించడానికి తమిళ దేశ స్త్రీలు పైటలు ధరించకుండా వుండటానికి సంబంధం ఈ విధంగా వివరించబడింది.

---

1. ధర్మఖండము – 9 – 14,

కర్ణాటక రాష్ట్రంలోని శివమొగ్గ జిల్లా చంద్రగుత్తి గ్రామంలో జరిగే 'ఎల్లమ్మతల్లి ఉత్సవం' నేటికి అనాగరికదశనే చూపిస్తుందంటే మనం ఏ దిశలో ప్రయాణిస్తున్నామో అర్థం అవుతుంది.

ఎల్లమ్మ నిమ్న వర్గీయుల దేవత. పూర్వం జమదగ్ని అనే ఒక ముని తన భార్య రేణుకాదేవి శీలంమీద అనుమానం వచ్చి (బిందెతో నీళ్లు తీసుకువస్తూ ఓ నాగరీకుణ్ణి చూసిందట. రోజూ చూసే బవిరిగడ్డాలు చీంబోతు వేషం కాకుండా మామూలు మనిషిలా వున్నాడు కావాల్ను) కొడుకును పిలిచి తల్లి తల నరికివేయ మన్నాట్ట. రామచంద్రుళ్ళాంటి ఆ కొడుకు తల్లి తల నరికివేసినందుకు ఫలితంగా వరం కోరమన్నాట్ట జమదగ్ని. తన తల్లిని బతికించమన్నాడు ఆ తనయుడు. నరికివేసిన ఆ తలేమో అంటరానివాళ్ళ వీధిలో పడిందట. అపవిత్రమైందని (అంటరానివాళ్ళ గాలి సోకిందని) ఆ తల అలాగే వదిలేసారట. ఆ శిరస్సే ప్రస్తుతం ఎల్లమ్మతల్లిగా చంద్రగుత్తిలో నగ్న పూజలు జరుపుకుంటోంది.

ఎల్లమ్మతల్లి గుడికి సుమారు 2 కి.మీటర్ల దూరంలో వరదానది అనే చెరువుంది. ఎల్లమ్మతల్లికి మొక్కుకున్న భక్తులుగానీ, భక్తురాలుగానీ ఆ చెరువులో స్నానం చేసి ఎల్లమ్మగుడికి చేరుకుంటారు. స్త్రీలు మాత్రం వివస్త్రలుగానే స్నాన కార్యక్రమం ముగించి వంటిమీద నూలుపోగైనా లేకుండా రెండు కిలోమీటర్లు నడిచి గుడికి వెళ్ళి మొక్కు తీర్చుకుంటారు.

అమానుషమైన ఈ నగ్నోత్సవం ప్రతి ఏటా మార్చి 8 వ తేదీనుండి 18 వ తేదీవరకూ ప్రతి సంవత్సరం అనాదిగా జరుగుతూనే ఉంది. ఎల్లమ్మ తల్లికి మొక్కుకుంటే- మొక్కుతీరిస్తే పేదరికం తీరిపోతుందని తమ కోరికలన్నీ నెరవేరు తాయని నమ్ముతారు. ఈ వ్యవస్థను అసహ్యించుకున్న వారిపట్ల ఎల్లమ్మతల్లి పగబట్టి వారి అంతం చూస్తుందనే నమ్మకం కూడా వుంది. మగబిడ్డలు పుట్టకపోతే ఆడపిల్లను ఎల్లమ్మతల్లికి ఇస్తే ఆమె కనికరించి మగ సంతానం కటాక్షిస్తుందనే నమ్మకం ఆ ప్రాంతంలో వున్న అస్పృశ్యుల్లో బాగా వ్యాపించివుంది. ఈ విధం గానే గాక కుటుంబకక్షల ఆధారంగా ఎల్లమ్మతల్లి పూనకంలో ప్రత్యక్షమై ఆ పిల్ల కావాలోయ్, ఈ పిల్ల కావాలోయ్ అని అడిగి మరీ దగ్గరికి రప్పించుకుంటుందట. కాదన్నవారి కళ్ళు పోతాయిగా మరి! ఈ విధంగా అమాయక ఆడపడుచులు

ఈ యజ్ఞానికి సమిధలౌతున్నారు. వారి సందర్శ్న గుడికి వదిలిపెడితే భక్తి కావాలిగా. వారి వారి అందచందాల్నిబట్టి ధనవంతులు తమ భోగలాలసకు వుపయోగించుకోవటం- అంతా షరా మామూలే. ఈ విధంగా అక్కడ వేశ్యా వ్యాపారం బహిరంగంగా జరుగుతుంది తప్పు లేదు. పాపం కాదు. అదేమంటే ఎల్లమ్మతల్లి కరుణ అనే మాట సర్వే సర్వత్రా వినిపిస్తుంది. ప్రతి సంవత్సరం ఎల్లమ్మతల్లి కుమార్తెలు సుమారు 2000 మంది జాతీయ అంతర్జాతీయ స్థాయిలో వివిధ ప్రదేశాలకు తరలించబడుతున్నారు.

ప్రభుత్వంవారు నగ్నప్రదర్శనల్ని తిలకించే భక్తులకు కావాల్సిన సౌకర్యా లన్నీ సమకూరుస్తున్నారు. 'ఓం' గుర్తులు ధరించిన ప్రభుత్వ వాహనాలు, ప్రయా ణీకులకు వసతి సౌకర్యాలకు కొదువ లేదు.

"అవినీతికరమైన, అమానుషమైన, అసహ్యాకరమైన, హేయమైన నగ్న పూజ, నడివీధి యాత్రాలు, భక్తివిశ్వాసాల మత్తులో సాగిపోతూంటే సిగ్గుతో, అవమానభారంతో చావాల్సింది పోయి హిందూధర్మ సౌకర్యాలు హిందూ మత సంస్కృతీ పరిరక్షకులైనటువంటి విశ్వహిందూ పరిషత్‌వారు నగ్నత్వాన్ని చూచి ఆనందించేవారికి కాబోలు పాపం పులిహోర, పెరుగన్నం అంగళ్ళు తెరిచి కూర్చు న్నారు. లక్షలాది పురుష పుంగవుల అసహ్యాకరమైన చూపులకు తమ నగ్నత్వాన్ని బలిచేస్తూ సాగిపోతున్న వేలాది ఆడపడచుల్ని చూస్తూ వీరు అంగళ్ళు తెరుచుకొని కూర్చున్నారంటే వీరు ఎటువంటి మతసంస్కృతిని పరిరక్షించటానికి కంకణం కట్టుకున్నారో అర్థం అవుతుంది. దిగంబర వేషధారిణులైన స్త్రీలు కామపూరిత జుగుప్సాకర నగ్ననడకలు, నగ్నపూజలు మహోన్నత హిందూ మత సంస్కృతికి నిదర్శనాలు? వేదభూమి, పుణ్యభూమి, కర్మభూమిగా కీర్తించబడుతున్న మన భూమిలో ఆలి అంగాంగాలను వర్ణిస్తూ అంగట్లో అమ్మిన సంస్కృతి, నగ్నంగా స్త్రీలతో అరకలు దున్నించిన సంస్కృతి. నగ్నచిత్రాల చిత్రణతో దేవాలయాలు నిర్మించిన సంస్కృతి, స్త్రీ భగానికి ఈనాటికీ పూజలు చేయిస్తున్న సంస్కృతిని కాపాడటానికికేనా మన సంస్కృతి మన సంస్కృతి అంటూ గుండెలు బాదు కుంటున్న మత సంస్కృతీ పరిరక్షకులూ విశ్వహిందూ పరిషత్‌ను నిర్వహిస్తున్నది?

స్త్రీల నగ్నత్వాన్ని ప్రదర్శింపజేస్తున్న ఈ సంస్కృతిని దగ్ధం చేయాలని వీరికి అనిపించటంలేదా ? స్త్రీని అవమానపరుస్తున్న ఈ ఆచార సాంప్రదాయాలను సమూలంగా నేలమట్టం చేయాల్సిన అవసరం లేదా !" [1]

ఈ విధంగా అనాగరిక సంస్కృతిని పెంచే మూఢనమ్మకాల్ని మొద లంటా పెకలించగలిగినప్పుడే జాతి చైతన్యవంతమైనట్లు గుర్తు. స్త్రీని అవమానం పాల్జేసే సంస్కృతిని సమూలంగా నాశనం చేయాలి.

మన సమాజంలో ఆహార పానీయ ఆచారాల విషయాల్లో భిన్న భిన్నమైన నమ్మకాలు చోటు చేసుకున్నాయి. నిజానికి ఇవన్నీ గుర్తింపు కోసమో, జీవన విధానంలో పరిణామం కోసమో, మత సంస్కృతికి ప్రేరణ కోసమో ఏర్పడినవే. క్రమంగా సామాజిక జీవనంలో మూఢనమ్మకాలుగా పరిణామం చెందాయి.

---

1. హేతువాదం 1984 జూన్ పు 11-13.

# 3. విషజీవులు

పాము, బల్లి, తేలు మొదలైన జీవులు మన సమాజంలో విషజీవులుగా గుర్తించబడ్డాయి. పాముకు కోరల్లోనూ, తేలుకు తోకలోనూ, బల్లి, సాలెపురుగులు నోటినుంచి వుత్పత్తి చేసే కొన్ని పదార్థాలలోనూ విషం వుంటుందని మనవారు నమ్ముతున్నారు. ఈ జీవులన్నింటిలో పాము ప్రమాదకరమైందని అందుచేత పాముల్ని పూజించటం, వాటికి నైవేద్యాలు సమర్పించడంతో తమకు ఎలాంటి అపకారం చేయక ఉపకారం చేస్తాయనే అభిప్రాయం తరతరాల నుంచి ఉన్న నమ్మకం.

"పాములు పంటలను అభివృద్ధిపరచుననియు, పుత్రసంతానము ప్రసాదించుననియు అతి ప్రాచీనకాలమునుండియు ప్రజలు విశ్వసించుచున్నట్లు మానవ జాతుల ప్రాచీన చరిత్రములు తరచినచో తెలియగలదు. పాములు భూమిలో బొరియ

లలో నుండుటవలన వీటికి పంటలతో సంబంధము కల్పించుటలో ఆశ్చర్యము లేదు. నీరు భూమిలో నుండును. నీటిని ప్రసాదించునవి పాములు, అవి ఆగ్రహించిన నీటిని పైకుబుకకుండ అడ్డగించగలవను మూఢవిశ్వాసము ప్రాచీన కాలములో నుండెడిది. కనుక సర్పమును పంటలకు అధిష్ఠానదేవతగా ప్రాచీన కాలమున నమ్ముచుండిరి అట్లే క్రమముగా సర్పము భూమిలోని నిధికి కాపలాదారను భావము కలిగెను. బురదలోను, చిత్తడినేలలలోను అవి కనిపించుట వలనను వాని గతి నీటిపాయదలవలె వంకర టింకరగా నుండుటవలనను వానికి జల సంబంధము పూర్తిగా స్థాపితమయ్యెను. పంటలను అభివృద్ధిపరచు దేవతసంతానము కలిగించకుండునా కనుక కాలక్రమమున నాగదేవత సంతానదాయినిగను ఆరాధింపబొచ్చెను ఈ ప్రభావములు ప్రబలిన కాలమున మహామాయామతానుయాయులందరును అన్ని దేశములలోనూ దేవీపూజలతోపాటు నాగపూజను కూడా చేయవొడగిరి. [1]

పాములు భూమి లోపల వుంటాయని మనందరికి తెలుసు. అయితే పాములు పుట్టలు పెట్టుకుంటాయా ! ఈ విషయంలో భిన్నాభిప్రాయాలున్నాయి. పాములు పుట్టలు పెట్టలేవని సుమతీ శతకకారుడు వర్ణించాడు.

"చీమలు పెట్టిన పుట్టలు
పాముల కిరవైన యట్లు"

కాని పాములు పుట్టలు పెడతాయనే నమ్మకం కూడా వుంది. అవి తమ గూళ్ళను కట్టుకుంటాయని సంఘజీవితం గడుపుతాయని బయట ప్రపంచంతో సంబంధం లేకుండా ప్రశాంతంగా జీవిస్తాయని నమ్మారు.

హిందువులు పాములను పవిత్రంగా, ప్రత్యక్షదైవంగా భావిస్తారు. పాములు తమను రక్షిస్తాయని, సంతానాన్ని ఇస్తాయని, తమకు సుఖసంతోషాల్ని కలిగిస్తాయని నమ్ముతారు. అందుచేత పాముల్ని నాగదేవతలు అని పిలుస్తారు. నాగ దేవతలకు ప్రత్యేకంగా ఒక రోజున సర్పబలి సమర్పిస్తారు. నాగులచవితినాడు కొందరు నాగపంచమినాడు కొందరు జరుపుకుంటారు.

---

1. హిందువుల పండుగలు, పర్వములు 88, 89 పు.

"విధిప్రోక్తముగ లాజలతోను, పంచామృతముతోను గన్నేరు, సంపంగి, జాజి మున్నగు పూవులతోను ఈ నాగపంచకమును పూజించవలెను. పిదప ఘృత పాయస మోదకములతో బ్రాహ్మణులను సంతృప్తిపరచవలెను. పిదప అనంతాది నాగరాజులను ధ్యానించవలెను. నాగుల నెప్పుడూ భక్తితో పూజింపవలెను. పంచమి నాడు పాలు, పాయసముల నారగింపు పెట్టవలెను. ఆ దినము పగలు గాని రాత్రి గాని భూమిని త్రవ్వరాదు." [1]

పాములు శాకాహారులని పాలు, పాయసం, ఘృత మోదకాల్ని గ్రహిస్తాయని పూలను అలంకారంగా ధరిస్తాయని మనవారి నమ్మకం.

వైశాఖ శుద్ధ చవితినాడు నాగచతుర్థి ఈ రోజున సుబ్బారాయుని (మోపిదేవి అనే గ్రామంలో వున్న సర్పదేవుని పేరు) పూజ చేసినవారికి సర్పభయాలుండవని మనవారి నమ్మకం. ఆ రోజున పూజలతో సంతృప్తి చెందిన తరువాత ఒక కుండలో పేలపిండి వుంచి దాన్ని పుట్టలో వుంచి గరిటతో "సర్పదేవ జనేభ్య స్వాహా" అని హోమం చేసిన సకల దుష్కర్మలు తీరిపోతాయని నమ్ముతారు.

"పంచమి నాగులకు బలవర్ధకమైనది. చతుర్దశినాడు ఒక్క పొద్దుండి, పంచమినాడు నాగపూజ చేయవలెను. ఇట్లు సంవత్సరము చేసి శ్రావణ శుక్ల పంచమినాడు విశేషముగ పూజా పురస్కారము లొనర్చవలెను. ఆ పంచమి పుణ్యతమమైనది. సద్గతిదాయని. ఈనాడు నాగపూజ చేసినవారిని విషములు బాధించవట." [2]

పాములు తమ బిడ్డల్ని తింటాయనే మూఢనమ్మకం వుంది. ఈ వ్యాసకర్త మద్రాసులోని స్నేక్‌పార్కులో వున్న పాముల రక్షకుణ్ణి (శ్రీ ఫళని) ప్రశ్నిస్తే అతను అమాయకంగా నవ్వాడు. ఎన్నా సార్. పాము పిల్లల్ని తింటుందా! నేను చూడలేదు సార్. ఇక్కడ కొన్ని పాములు పిల్లల్ని పెట్టాయి గాని తిన్నట్లుగా నేను చూడలేదు. అయినా తల్లి పిల్లల్ని తింటుందా అంటూ ఆశ్చర్యార్థకం చూపించాడు. వందల సర్పాల మధ్య నిత్యం జీవించే శ్రీ ఆనందబల్‌గార్ని

---

1. హిందువుల పండుగలు, పర్వములు 78 పు.
2. హిందువుల పండుగలు, పర్వములు 79 పు.

ఈ ప్రశ్న వేస్తే ఆయన పాములు తన పిల్లల్ని తినవని అవి పెట్టిన గ్రుడ్లను గురించి అంతగా అవి ఆలోచించవని, పాము ఆహారాన్ని మింగడమే తప్ప కొరకదని, దాని నోటిలో వున్న కోరలు శత్రువును దెబ్బకొట్టడానికి పనికి వస్తాయి తప్ప ముక్కలు చెయ్యడానికి పనికిరాదని చెప్పారు. అవసరం అయితే పాము నోటిని వెడల్పుచేసి తన నోటికన్నా కొంచెం పెద్ద జీవినైనా సరే అవలీలగా మింగివేయగలదని చెప్పారు. పాము తన ఆహారాన్ని కాటువేసి చంపి ఆ తరువాత మింగుతుందని, పాలు, పండ్లు తినదని, పాము పూర్తి మాంసాహారని, శ్రీ ఆనంద బల్ చెప్పారు.

పాము కాటుకు చికిత్సగా నాటుమందులు మంత్ర తంత్రాలు పని చేస్తాయని పాము కరిచినప్పుడు మంత్రాలవల్ల బ్రతుకుతారనే మూఢనమ్మకాలు వ్యాపించి వున్నాయి. పాము విషానికి 'యాంటీ వీనమ్ సీరం' ఒక్కటే సరియైన మందని శ్రీ ఆనందబల్ నమ్మకం. కాని దీన్ని సవాల్‌చేస్తూ బాపట్ల (గుంటూరు జిల్లా)కు చెందిన నాటువైదులు డాక్టర్ ఎ. నాయక్‌గారు అంగీకరించక పాము కాటుకు తాను మందు వేయగలనని చెప్పారు.

"సత్యనిర్ధారణకు శ్రీ ఆనందబల్ జులై నెల (1982) 21 వ తేదీన తాను వుంటున్న పాముల గది దగ్గర ప్రదర్శన ఏర్పాటు చేసారు. ఆ ప్రదర్శనకు విజయవాడలో వుండే పత్రికా ప్రతినిధులని, ఇంకా అనేకమంది ప్రముఖులని ఆహ్వానించారు. నాస్తిక కేంద్రం నుండి డాక్టర్ సమరం, శ్రీమతి మైత్రి ఆహ్వానింపబడ్డారు. పశువుల వైద్యశాలనుండి కూడా ఒక డాక్టరుగారిని ఆహ్వానించారు. పశువుల డాక్టరుగారు మేకను క్షుణ్ణంగా పరిశీలించి మేకపిల్ల పూర్తి ఆరోగ్యకరంగా ఉందనీ, దాని గుండె శ్వాస ప్రక్రియ సక్రమంగా ఉన్నాయనీ సర్టిఫై చేశారు. తదనంతరం నాటువైద్యుడు డాక్టర్ నాయక్ తక్కినవారి సమక్షాన ఆనందబల్ తాను వుంటున్న పాముల గదిలోనుంచి ఒక త్రాచుపాముచేత మేకపిల్లని కాటు వేయించాడు. పాము కరచిన మూడు నిమిషాల లోపలే నాటువైద్యుడు మేకపిల్లకి విషానికి విరుగుడుగా మందు వేశారు. మళ్ళీ అయిదు నిమిషాలకు నోట్లోను, కళ్ళలోనూ మందు వేశారు. ఇక మేకపిల్ల తప్పక బ్రతుకుతుందని మందు బాగా పని చేస్తున్నదని అన్నారు. కానీ సమయం గడుస్తున్నకొద్దీ మేకపిల్ల పరిస్థితి క్షీణించింది. మళ్ళీ మళ్ళీ మందు వేశారు. అయినప్పటికీ 40 నిముషాల్లో మేక

పిల్ల చనిపోయింది. నాటువైద్యుడు తన ఓటమిని అంగీకరించక తప్పలేదు. అక్కడికి వచ్చిన ఆహ్వానితుల ముందు తన ఓటమిని అంగీకరిస్తూ తాను 30 సంవత్సరాల నుంచి పాముకాటుకు మందు వేస్తున్నానని ఇలా జరగడం ఇదే మొదటి సారి అని అన్నారు". [1]

అసలు పాము కాటుకు మంత్రులు పని చేస్తాయా ? మంత్ర ప్రభావంవల్ల, పాము కాటు వేసినవారు బ్రతుకుతారా ? కొంతమంది బ్రతకటం మరికొంతమంది మరణించడానికి గల కారణాల్ని డాక్టర్ సమరంగారు ఈ విధంగా చెప్పారు.

"విషపాము కరచినప్పుడు 'యాంటీ వీనం సీరం' ఇంజక్షన్ ఒక్కటే సమ్మతగిన చికిత్స అనీ, నాటువైద్యాలు – మంతతంత్రాలు అర్థం లేనివని అన్నారు. పాము మంత్రం పని చేసిందన్నా నాటువైద్యం గుణమిచ్చిందన్నా వాస్తవానికి విషసర్పం మనిషిని కాటు వేయడానికి కొద్ది గంటల ముందు కప్పనో ఎలుకనో తిని ఉండినట్లయితే దాని కోరల్లోని విషం బయటకు వచ్చేసి కోరల్లో విషంలేకుండా అయిపోయి ఉండి ఉంటుందనీ అన్నారు. కోరల్లో విషం లేకపోయినా ఒకవేళ విషం ఉన్నా అది తగినంతగా లేకపోతే అటువంటి పాము కరిచినా, వ్యక్తికి ఎటువంటి ప్రాణహాని కలుగదని చెప్పారు. అయితే మనలో పాము అంటే భయం ఉంది కనుక పాము కరవగానే భయపడిపోతామని ఒక్కొక్కసారి ఆ భయంతో స్పృహ తప్పుతామని, అటువంటి కేసుల్లో మంత్రం వేయించినప్పుడు, నాటుమందు వేసినప్పుడు వ్యక్తి లేచి కూర్చుంటే దాని ప్రభావం వల్లనేనని అనుకుంటారని, కాని నిజంగా శరీరంలోకి పాము విషం ప్రవేశిస్తే వ్యక్తి కోలుకోవడం జరగదని అన్నారు. మంత్రం వేసేవాళ్ళు, నాటుమందులు వేసేవాళ్లు ఇటువంటి కేసులనే చాలా గొప్పగా చెప్పుకుంటారని, విషసర్పం కరిచి చనిపోయినప్పుడు మాత్రం "నా మందు చాలా శక్తివంతమైనదే. నా నాటుమందు అమోఘమైనదే. కాని ఏం చేద్దాం. అతని కర్మ. అతని రాత అలా ఉంది" అంటారు. ఆ వ్యక్తి తాలూకు వాళ్ళకూడా అతనికి ఆయుష్షు తీరిపోయిందని సరిపెట్టుకుంటారని అన్నారు." [2]

---

1. నాస్తికమార్గం, ఆగస్టు 1982 పు 4.
2. నాస్తికమార్గం ఆగస్టు 1982, 5 పు.

అన్ని పాములు విషపూరితాలు కాదు. పాముల జాతి అనంతం. అయినప్పటికి కొన్నిటికి మాత్రమే విషకోరలు కలిగి వుంటాయి. పాము పగ పడుతుందని పాము పగ పన్నెండుసంవత్సరాలని అనుకోవడంకూడా మూఢనమ్మకమే. పాము ధ్వని మాత్రమే గ్రహించగలదు.

"మన దేశంలో దాదాపు 250 రకాల పాములు ఉన్నాయి. వాటిలో కేవలం త్రాచుపాము, కట్లపాము, రక్తపింజరి, మినినాగు మాత్రమే విషపాములు. తక్కిన 245 రకాల పాములూ విషపాములు కాదు. అవి కరిచినా ఎటువంటి హాని కలుగదు. మనకు ఈ విషయం తెలియక కరిచిన ప్రతి పాము విషపామే అనుకుని గాబరా పడిపోతాం. విషపాము కరిచినప్పుడు రెండు పంటిగాట్లు స్పష్టంగా పడతాయి. విషపాము కానప్పుడు ఆ రెండు గాట్లు కనపడవు. కేవలం 'U' ఆకారంలో పళ్ళ దొంతర అద్దు కొద్దిగా కనబడవచ్చు. అంతేగాని పాము కోరల గాట్లు కనబడవు.

పాము మంత్రం ఎంత అర్థం లేనిదో పాము పగపట్టడం విషయం కూడా అంతే. పాము పగపట్టడం, చివరికి ఆ వ్యక్తిమీద తన పగ తీర్చుకోవడం జరగనే జరగదు. పాము పగ అనేది కేవలం మూఢనమ్మకమే." [1]

బల్లులు విషజీవులని, బల్లి పడిన ఆహారం నిషిద్ధం అని మనవారు నమ్మతారు. అక్కడా, ఇక్కడా బల్లి పడిన ఆహారం తిని మరణించారనే వార్తలు కూడా మనం వింటుంటాం. అయితే జీవశాస్త్రవేత్తల నిర్ణయం ప్రకారం, డాక్టర్ల పరిశోధనా ఫలితాల ప్రకారం మన దేశంలోని బల్లులు విషపూరితాలు కావు. ఆఫ్రికా అడవుల్లోను, మధ్యధరాప్రాంతంలోనూ వున్న బల్లులు విషపూరితాలు అని ప్రపంచ జీవశాస్త్రవేత్తలు నమ్ముతున్నారు.

బల్లి తాకినా, బల్లిని మనం తాకినా స్నానం చెయ్యాలని, విషప్రయోగం జరిగినట్లుగా భావించాలనే నమ్మకం వుంది. బల్లి తాకితే పాపం అనే నమ్మకం వుంది. మద్రాసుకు దగ్గరగా వున్న కంచిలో బంగారుబల్లిని గాని, వెండిబల్లినిగాని తాకినట్లయితే బల్లిని తాకిన పాపం పోతుందని నమ్ముతారు. అధమం కంచిలో బల్లిని తాకినవారిని తాకినా బల్లి ముట్టిన పాపం పోతుందనే మూఢనమ్మకం మన

---

1. నాస్తికమార్గం ఆగస్టు 1982, 6 పు.

వీరిలో వ్యాపించి వుంది. బల్లిని తాకడం పాపం అని స్నానం చెయ్యాలని, బల్లి పాపపుజాతి పురుగు అనే నమ్మకం కూడా వుంది

రుక్మాంగదుడు అనే రాజు దేవవేశ్య మోహినితో కలిసి తన నగరానికి వచ్చే సందర్భంలో ఒక బల్లి కింద పడి కదలలేక అపస్మారదశలో నుండగా రుక్మాంగదుడు తాను స్వారీ చేసే గుర్రం దిగి ఆ బల్లిని సేద దీరుస్తుండగా- మోహిని

"దీని నీ క్రియ ముట్ట నేటికి దీని ముట్టిన మాత్రనే
స్నానమాడక కాదు పాపపుజాతి పుర్విది దేవనీ
జ్ఞానమెక్కడఁబోయె ధర్మవిశారదుండవు దీనినీ
కాననంబున వైచి యీ తురగంబు నెక్కు రయంబునన్." [1]

అని రుక్మాంగదుని సమాధానపరిచి నగరానికి తీసికొని వెళ్తుంది.

తేలు తోకలో విషం వుంటుంది. అది కుట్టినపుడు విషం మన శరీరంలో వ్యాపించి కొంత బాధ కలిగిస్తుంది అయితే కొన్ని తేళ్ళు ప్రమాదకరమైనవి. ఇవి కుట్టినపుడు ప్రాణాపాయం కూడా సంభవించే అవకాశం వుంది. తేలు మన శరీరం పై భాగంలో (నరాలపై కాదు) కుట్టినందువల్ల ప్రమాదం వుండదు. నరాలపై కుట్టడంవల్ల రక్తంలో కలిసి ప్రమాదం కలిగించవచ్చు. దీనికి 'యాంటీ వీనం సీరం' అవసరమైతే వుపయోగించవలసి వుంటుంది. మామూలుగా తేలు విషం కొద్దిసేపట్లో తగ్గిపోతుంది. అయితే తేలు కుట్టినపుడు మంత్రం వేస్తే పోతుంది అనే మూఢనమ్మకం వుంది.

తేలు తనకు ఏ మాత్రం వత్తిడి తగిలినా తన కొండెతో కుట్టడం దాని స్వభావం. అందుచేత వ్యక్తిని కుట్టడానికి ముందు అది ఒకటికి రెండుసార్లు మరే జీవినిగాని, వస్తువును గాని కుట్టినట్లయితే తేలు విషం నామమాత్రమే. మంత్రగాడు ఏవో కొన్ని మాటలను పలకడం, అది విన్న వ్యక్తికి మనశ్శాంతి కలగడం జరుగుతుండే తప్ప మంత్రం విషాన్ని తగ్గించలేదు. కొంచెంసేపట్లో విషప్రభావం

1. రుక్మాంగద చరిత్ర, 3-217.

తగడం, తేలు కుట్టిన వ్యక్తికి బాధ తొలగిపోవడం జరుగుతుందే తప్ప మంత్రాలకు చింతకాయలు రాలవు.

కేవలం మంత్రాలతో విషప్రభావం పోతుందనే నమ్మకంతో మన దేశంలో పాములు కాటేసినవాళ్ళు ఏ మంత్రాల పాముల నరసయ్యనో ఆశ్రయించడం, లేకపోతే టెలిఫోనుద్వారా సంప్రదించడంవంటి మూఢనమ్మకాల జాతరలో ఏటేటా ఎంతోమంది ప్రాణాలు కోల్పోతున్నారు. ప్రభుత్వం, డాక్టర్లు ఈ విషయంపై తగు జాగ్రత్తలు తీసుకొని 'యాంటీ వీనం సీరం' పాము కరచిన సందర్భంలో ఇంజక్షన్ చేసే విధంగా చూడాలి. సామాన్యులకు సైతం ఈ ఇంజక్షన్ అందుబాటులో వుండే విధంగా ప్రభుత్వ చికిత్సాకేంద్రాలకు తరలించాల్సిన అవసరం ఎంతైనా వుంది.

# 4. పండుగలు

మన భారతదేశంలో హిందువుల సంఖ్య ఎక్కువ. మహమ్మదీయులు, క్రైస్తవులు, బౌద్ధులు మొదలైన ఇతర మతాలవారు తక్కువ సంఖ్యలో వున్నారు. మన తెలుగు సాహిత్యంలో హిందువుల పండుగలగురించి మాత్రమే వివరించబడింది. పండుగ అనగా ఉత్సవం అని అర్థం. తాము మంచి రోజులుగా భావించుకున్న రోజున జరుపుకునే ఉత్సవాలే పండుగలు. తాము దేవతలుగా భావించే మూర్తులకు సేవ చేయటం, పూజించటంవల్ల తమ ఈతిబాధలు, కష్టాలుతీరిపోతాయని వారి నమ్మకం.

స్త్రీల సౌభాగ్యం కోసం, మాంగల్యబలం కోసం, మంచి భర్తల కోసం, పుత్ర పౌత్రులకోసం, కుటుంబ క్షేమంకోసం పూజలు చెయ్యడం మంచిది అని ధర్మశాస్త్రాల్లో చెప్పబడ్డాయి. చనిపోయిన పితరులకు పుణ్యం కలగడానికి చేసే పండుగలు కూడా వివరించబడ్డాయి. ఈ పండుగలన్నీ తమకు సుఖసంతోషాల్ని ఇస్తాయని తరతరాలనుండి హిందువులు భావించారు.

ఈ పండుగల్ని పరిశీలించినపుడు స్త్రీల పండుగలు, ఇతర పండుగలు అనే రెండు విభాగాలు మనకు గోచరిస్తాయి. స్త్రీల పండుగలన్నీ వారి భర్తల సౌభాగ్యాల కోసం, పసుపు కుంకుమల అభివృద్ధి కోసం ఉద్దేశించబడినవే.

"కంకాళిలమైన ఈ సంఘమునందు మాంగల్యమే స్త్రీకి నైతిక కవచముగను, పెట్టని కోటగను ఉండుటచేత దానిని నిరపాయముగ కాపాడుకొనుటకై వెయ్యి దేవుళ్ళకు మ్రొక్కుట యామెకు శరణ్యమయ్యెను." [1]

నోములు సహజంగా ఈ కోవలోకి వస్తాయి అట్లతద్దియ, కన్నెతులసి నోము, మూగనోము, నాగుల చవితి, బతకమ్మ పండుగ, వరలక్ష్మి వ్రతం మొదలైనవన్నీ నోములుగానే వివరించబడ్డాయి. స్త్రీకి అణకువ, భర్తలపై గౌరవం, అత్తమామల్ని పూజించటం, భర్త ఎటువంటివాడైనా తాను మాత్రం అతని క్షేమం కోసం, పవిత్రమైన భావంతో పూజించి తన మాంగల్యాన్ని, పసుపు కుంకుమల్ని కలకాలం నిలబెట్టుకోవాలి పసుపు కుంకుమలు (భర్త లేనివారికి ఈ అర్హత లేదు) పోయినట్లయిన ఆమె బ్రతుకునకు అర్థం లేదని ధర్మశాస్త్రాలు వివరించాయి. అందుచేత నోములు వారి సౌభాగ్య రక్షణకోసం ప్రాధాన్యం చెందాయి.

ఈ నోముల్ని గురించి కొందరు సమర్థిస్తూ పాశ్చాత్య నాగరికత, నాస్తికత పెచ్చుపెరిగిన వర్తమాన కాలంలో స్త్రీల నోములు అపహాస్య భాజనమై మాటు పడుట మహిళాలోకానికి, సంఘానికి నష్టహేతువులని కూడా విమర్శించారు. అర్థవంతమైన ఈ నోములు నోచటంద్వారా సంఘానికి తమకు క్షేమం కలుగుతుందని భావించారు.

**అట్లతదియ :** ఇది ఆశ్వయుజ కృష్ణపక్షంలో తదియనాడు చేసే పండుగ. కొందరు శ్రావణ భాద్రపద మాసాలలోను చేస్తారు.

"ఈ పండుగ ప్రధానముగ స్త్రీల సౌభాగ్యమునకు చేయు పండుగయని తోచుచున్నది. శ్రావణ, భాద్రపద మాసములలో అవిధవానవమి మున్నగు కొన్ని సౌభాగ్యకారకములగు వ్రతములు వ్రతగ్రంథములలో చెప్పబడినవి." [2]

---

1. ఆంధ్రుల చరిత్ర-సంస్కృతి పు 84.

1. హిందువుల పండుగలు, పర్వములు పు 66.

"ఆశ్వయుజ బహుళ తదియనాడు రోహిణీ నక్షత్రయుక్తుడైన చంద్రుని వనితలు పూజింతురు. నిశానాథుని వంటి యాహ్లాదకరుడైన పెనిమిటి లభించవలెనని ఈ నోము నోచబడ చున్నది. వృద్ధుడును, వికలాంగుడునైన భర్త రాకుండుట ఈ నోము కాంక్షితము." [1]

ఆ రోజు రాత్రి ఉపవాసం వుండి తెల్లవారే సమయంలో వంట చేసుకొని సూర్యోదయం కాక పూర్వమే వివాహితులు, అవివాహితులు అయిన స్త్రీలు భోజనం చెయ్యాలి. ఉదయం అట్లు తయారుచేసి ముత్తయిదువులకు వాయినాలు పెట్టి మంత్రపూర్వకంగా విష్ణాలయంలో పూజించి బ్రాహ్మణునికి క్రొత్త వస్త్రాలు పెట్టాలి. తరువాత ఉద్యాపనం ఆచరించాలి. ఉద్యాపనం అనగా నిర్ణీత వ్రతాంతంలో బ్రాహ్మణులకు దానధర్మాలు ఆచరించి వ్రతసమాప్తిం చెయ్యటం. ఉద్యాపనం పూర్తయితే తప్ప వ్రతం పూర్తికాదు.

ఈ వ్రతం ఆచరించటంవల్ల మంచి భర్త లభిస్తాడనే మూఢనమ్మకం వ్యాపించి ఉంది. సామాజిక జీవనంలో చేసే నోముకు లభించే భర్తకు సంబంధం లేదనే సత్యాన్ని ఇక్కడ విస్మరించడం జరిగింది.

కన్నెతులసి నోము : ఇది కన్యలు ఆచరించే వ్రతం. తులసి సామాన్యంగా ప్రతి ఇంటి పెరట్లో పెరిగే మొక్క. ఈ తులసి హిందువులకు పవిత్రమైన మొక్క. తులసిని పూజించటంవల్ల స్త్రీలకు సౌభాగ్యం కలిగి మంచి భర్త లభిస్తాడట.

"ఇది పెండ్లికాని లేబ్రాయపు బాలిక లాచరించు నోము. ఈ నోము శివ రాత్రికి ప్రారంభించి యొక వత్సరము చేయవలెను. కన్యకలు మాత్రమే ఉద్యాపన చేయుదురు. ఉద్యాపన మనగా నిర్ణీత వ్రతాంతమున దానధర్మము లాచరించి వ్రతసమాప్తి చేయుట. [2]

---

1. ఆంధ్రుల చరిత్ర – సంస్కృతి పు 93.

2. ఆంధ్రుల చరిత్ర – సంస్కృతి పు 91.

లేతవయసులో పసి బాలికలచే చిన్నతనంనుండి ఇటువంటి నోములు చేయించటంద్వారా వారి మానసిక ప్రవృత్తి దైవభావంలో, భర్తృ సేవాభావంలో మునిగిపోతుందనే వుద్దేశ్యంతో ఏర్పాటు చేయబడింది.

**నాగులచవితి :** ఇది కార్తీకమాస శుద్ధ చవితినాడు జరిపే పండుగ. ఈ పండుగ రోజున పాములను పూజించడం ఆచారం. పాలు, పండ్లు, వడపప్పు, చలిమిడి మొదలైన నైవేద్యాలతో పూలతో పూరి బయటవున్న పాము పుట్ట దగ్గరకు తీసుకువెళ్ళి నైవేద్యం సమర్పించి పూజిస్తారు.

"కార్తీక శుద్ధచవితికి స్త్రీలు నాగపూజ సేయదురు. "అత్తగారు కొల్చిన నాగేంద్రుడా ! అత్తగారి అత్తగారు కొల్చిన నాగేంద్రుడా ! నేను కొల్చిన నాగేంద్రుడా ! అని చెప్పుచూ పుట్టలో పాలు పోయుదురు. నాగుమయ్యకు దీపం పనికి రాదు. వేడి వస్తువులు వర్జ్యములు " [1]

అనాదినుండి పాము శాకాహారి అని నమ్మడం జరిగింది. పాములు పాలు తాగుతాయని ఆ పాలు పళ్ళు స్వీకరించి తమకు తమ కుటుంబానికి అపకారం చేయ వద్దని పాముల్ని పూజించటం జరిగింది. పాము మాంసాహారని పళ్ళు పాలూ మొదలైన పదార్థాలు (నేడు పూజ సమయంలో పెట్టే ఏ పదార్థం) తినవనే విషయం నాడు తెలియక తమకు అపకారం చెయ్యదనే భ్రమతో ఈ నాగపూజ చేయటానికి అలవాటు పడ్డారు.

**వరలక్ష్మి వ్రతం :** ఇది సామాన్యంగా శ్రావణ మాసంలో శుక్రవారం చేస్తారు. కాని ఈ వ్రతం శ్రావణ పూర్ణిమకు వెనుకటి శుక్రవారం ఆచరించాలని, వీలు కుదరనట్లయితే శ్రావణమాసంలో ఏ శుక్రవారం అయినా చెయ్యవచ్చునని స్త్రీల వ్రతకథలందు వివరించబడింది.

"ఈ వ్రతమును సత్సంతాన ప్రాప్తికొరకును దీర్ఘసౌమంగల్యము కొరకును జరుపవలెను." [1]

---

1. ఆంధ్రుల చరిత్ర – సంస్కృతి పు 95.

బతకమ్మ పండుగ : బతకమ్మను పూజించటంవల్ల కలరా, మశూచి మొదలైన వ్యాధులు రావనితెలంగాణా ప్రజల నమ్మకం. బతకమ్మ పండుగకు నోచే నోములో వేపమండలు ప్రధానంగా వుంటాయి. వేపపూత వచ్చే కాలంలో ఈ నోములు నోస్తారు.

"ఇది తెలంగాణా స్త్రీ లోకమునందు విశేష ప్రచారములోనున్న కళామయి పూజావిధానము. స్త్రీలకు మాంగల్యము నిచ్చి రక్షించు చల్లని తల్లి బతకమ్మయై యుండును. లేదా జరామరణ దూరమై శాశ్వత ప్రకాశము గల తల్లి బతకమ్మ అనియైన చెప్పవచ్చును. బతకమ్మ పేర మంగళ గౌరీదేవి పూజింపబడుచున్నది." [2]

మూగనోము : ఈ నోము వివాహం కాని బాలికలు చేస్తారు.

"దీపావళి మొదలు కార్తీక శుద్ధపూర్ణిమవరకును బాలికలు దీనిని నోముదురు. వాఙ్నియమమును వారి కలవరచుట దీని యుద్దేశ్యము. సమిష్టి కుటుంబములో మెలగవలసిన పడతికి మూగనోము మంచి శీలపోషకము. సాయంకాలము నాల్గు గడియలవేళ అన్నము తిని సింగారము చేసికొని గౌరీదేవిని పూజించి ఊరి పేరంటాండ్రకు వధువు బొట్టు పెట్టి రావలెను. తరువాత నక్షత్రములు లెక్క పెట్టవలెను. బొట్టు పెట్టుటకు బయలుదేరినప్పటినుండి తారకా సందర్శనము వరకు బాలిక మాటాడరాదు." [3]

స్త్రీ స్వాతంత్ర్యం హరించడానికి, వారిని బానిసలుగా చేయడానికి. మాంగల్య రక్షణ పేరుతో వారిని కూపస్థ మండూకాలుగా చేయడానికే ఏర్పాటు చేయబడ్డ ఈ నోములు, వ్రతాలు కేవలం స్త్రీలకే కేటాయించబడ్డాయి. ఏ నోము నోచినా ఏ వ్రతం ఆచరించినా పెనిమిటి ఆయురారోగ్యాల కోసం లేకపోతే మాంగల్యరక్షణ కోసం. వారికోసం మాత్రం కాదు. ఆచరించే వ్రతాల ఫలితంగా తమకు మంచి జరుగుతుందనే నమ్మకాలతో కార్యకారణ సంబంధాల్ని గమనించకుండా తమ ఈతి బాధలు తొలగిపోతాయనే మూఢనమ్మకాలతో ఇలాంటి నోములు, వ్రతాలు ఆచరించడం జరుగుతుంది.

---

1. హిందువుల పండుగలు – పర్వములు పు 345)
2. ఆంధ్రుల చరిత్ర – సంస్కృతి పు 97.
3. ఆంధ్రుల చరిత్ర – సంస్కృతి పు 94.

హైందవ సమాజంలో మిగిలిన పండుగలన్నీ దేవత ప్రధానమైనవి. లేక పితృదేవతల ప్రధానమైనవి. దేవతల ప్రధానమైన పండుగలలో ముఖ్యమైనదిగా భావించబడుతున్నది వినాయకచవితి.

**వినాయక చవితి :** ఇది భాద్రపద శుద్ధ చవితినాడు వచ్చును విఘ్నేశ్వరుడు అని గణపతి అని వినాయకుడు అని పిలవబడే దేవుని పేర జరిపే పండుగ. ఇది భారతదేశంలోని అన్ని ప్రాంతాలలోను జరుపుతారు. విఘ్నేశ్వరుని పూజించకున్న విఘ్నాలు కలుగుతాయని కనుక ప్రతికార్యారంభానికి వినాయకుని పూజించినట్లయితే తమ పని సానుకూల మవుతుందనే నమ్మకంతో వినాయకుని పూజిస్తారు.

"కొన్ని ప్రాంతాలలో ఈ విగ్రహములను (వినాయకుని) ధాన్యపు గాదెలలో నుంచుట, గోడలలోని గూళ్ళలో పెట్టి అద్దము వేసి మెత్తివేయుట ఆచారము. దీని వలన ధాన్యమక్షయముగా నుండుననియు అపుత్రులు పుత్రవంతులగుదురని ప్రజలలో విశ్వాసము గలదు.

విఘ్నేశ్వరుడు విఘ్నములు కల్పించుటకును నివారించుటకును సమర్థుడు. కనుక ప్రతి కార్యారంభమునకు వినాయకుని పూజించవలెను.

వినాయక చవితినాడు చంద్రుని చూచుట వలన లేని పోనియప వాదములు కలుగుచుండునని పురాణములు ఘోషించుచున్నవి[1]."

వినాయకుడు శివ పార్వతుల కుమారుడు. తిండిపోతైన వినాయకుని నిండైన పొట్టను చూచి చంద్రుడు నవ్వగా వినాయకుని పొట్ట పగిలిందని వినాయకుడు చంద్రుని చూచిన వారు అపవాదుల పాలవుతారని శపించాడట. అప్పటి నుండి చవితి నాడు చంద్రుని చూచిన వారు అపవాదుల పాలవుతారనేనమ్మకం ఏర్పడింది.

**దీపావళి :** ఇది ఆశ్వయుజ మాసంలో అమావాస్య రోజున జరుపుతారు.

"ఆశ్వయుజ బహుళ చతుర్దశి నాడు తెల్లవారు ఝాముననే నరక భయ నివారణార్థము నువ్వుల నూనెతో అభ్యంగన స్నానము చేయవలెను. పిదప కార్తీక

---

1. హిందువుల పండుగలు – పర్వములు పు 9

స్నానము. తర్వాత యమ తర్పణము పిమ్మట సాయంకాలమున ప్రదోష సమయమున దేవాలయములలోను, మఠములలోను, ప్రాకారముల యందును, ఉద్యాన వనముల యందును, ధాన్యశ్వ గజ శాలల యందును, మూడు దినముల యందు దీపమాలికలు పెట్టవలెను. సూర్యుడు తులా రాశిలో నున్నప్పుడు కృష్ణ పక్ష చతుర్దశి అమావాస్యల ప్రదోష సమయములందు కొరువులుచేత బట్టుకొని పితరులకు దారి చూపవలెను.[1]

పితృ దేవతలకు వెలుతురు వచ్చే వరకు అపర కర్మలు చేయరాదనే నియమం ఉంది. అంతకాలం కర్మలు చేయకుండా వుండటానికి వీలులేదు. అందుచేత.

"ఇట్లు పితృ దేవతలు ఆరు నెలలు నరక మందుందురు. కానీ వారికి నరక బాధ యుండనట్లుగా యముని పూజించుటయు దివిటీలతో నాచీకటిలో పితరులకు స్వర్గము జూపించుటయు నా పండుగ వలన గలుగునని మన పూర్వులూహించి యీ యుత్సవము నేర్పాటు జేసిరి."[2]

"పితృ గణమునకు దారి చూపుటకు కొరువులు త్రిప్పవలెను. ఈ ఆరు నెలలు రాత్రియందు పితరులు సద్గతి పొందుటకు దీపావళి నాడే కాక కార్తీక మాస మంతయు దీపములు పెట్టుట యాచారమైనది."[3]

**మహాశివరాత్రి :** ఇది మాఘ బహుళ చతుర్దశినాడు జరుపుదురు.

"శివరాత్రినాడు పూజలు, జాగరణాదులు జరుపు వారు సర్వ పాప విముక్తికై అంతమున శివసాయుజ్యమును పొందుదురనియు, ఈ వ్రతమాచరించని వారు జన్మ సహస్రములలో కొట్టుమిట్టాదురనియు పురాణములు చెప్పుచున్నవి.[4]

---

1. హిందువుల పండుగలు – పర్వములు పు 226
2. హిందువుల పండుగలు పు 26.
3. హిందువుల పండుగలు – పర్వములు పు 235.
4. హిందువుల – పండుగలు – పర్వములు పు 268.

**మహాలయపక్షం :** ఇది భాద్రపద మాసంలో చేయుదురు.

"ఈ పక్షమందు హిందువులు తమ తమ పితృ దేవతలకు తర్పణములు విడుతురు చచ్చినవారికి తప్పక ఈ దినములలో శ్రాద్ధ కర్మలు చేయవలెను. ఇది సర్వ ధర్మముల వారిచే చేయబడును. బ్రాహ్మణులగు వారు మంత్ర పూర్వకముగ తర్పణలు విడుతురు. బ్రాహ్మణేతరులలో విశేష సంఖ్యాకులు మంత్రములు లేకయే చేయుదురు. ఆనాడు కొందరు మాంసముతోనూ, కొందరు భక్ష్యములతోను పండుగ జేసికొందురు."[1]

**అక్షయతృతీయ :** వైశాఖ శుద్ధ తదియనాడు. ఈ పండుగ జరుగును.

"ఈ దినమున చేయు జపహోమ పితృ తర్పణ దానాదులు అక్షయమగునని స్మృతి గ్రంధకారులు తెలిపిరి. ఈనాడు యుగాది గనుక ఉదయముననే స్నానమాచరించి ఉదక ఘటమును గ్రీష్మ ఋతువున పండు పంటలను యవలు, గోధుమలు, సెనగలు మున్నగు వానిని దధ్యోధనమును దాన మొనర్పవలెను. ఇట్లు చేసిన నరుడు శాశ్వితముగ శివలోకమున విరాజిల్లును."[2]

పై పండుగలు చనిపోయిన పితృ దేవతల క్షేమం కోసం చేసే పండుగలు.

**ఏరువాకపున్నమి :** ఇది వ్యవసాయ ప్రధానమైన పండుగ. జ్యేష్ట మాసంలో పౌర్ణమినాడువచ్చును. తొలకరి వర్షాలు ప్రారంభం అయ్యే తరుణంలో ఈ పండుగ జరుపుతారు.

"ఈ పండుగనాడు ఎద్దులను కడిగి కొమ్ములకు రంగులు పూసి గజ్జెలు, గంటలు, అద్దము, కుచ్చులు, గట్టి యలంకరింతురు. ప్రొద్దుననే యింటిలో పొంగలి (పులగము) చేసి యెద్దులకు బెట్టుదురు. ఎద్దులను కట్టివేయు గాడికి ధూపదీప నైవేద్యము లిత్తురు. సాయంకాలమందు మంగళ వాద్యములతో ఊరి పసులనన్నింటిని ఊరి బయటకు తోలుకొని పోవుదురు. ఊరి వాకిటికొక పుంటినారతో జేసిన తోరణము గట్టుదురు. ఈ తోరణమును గ్రామ ప్రజలు చేటు కోలలతో గొట్టి

1. హిందువుల — పండుగలు పు 63.

2. హిందువుల — పండుగలు పర్వములు పు 69.

పీచు పీచు జేసి యెవ్వరికి దొరికిన పీచు వారు తీసికొని నోయి యింట బెట్టు కొందురు ఇది పశులకు మేలు గలిగించునని వారి విశ్వాసము."[1]

ఏకాదశీవ్రత ము : ఇవి ప్రతి నెలా ఏకాదశినాడు చేయుదురు.

"శిష్టులు ఏకాదశియందుపవాస వ్రతమును కఠినముగా నాచరించుచున్నారు. దశమి నాటి రాత్రి నిరాహారుడై ఏకాదశి యందు నీరు కూడా పుచ్చుకొనక ద్వాదశి నాడు ఉదయము పారణ యొనర్చి ద్వాదశినాడు రాత్రియును నిరాహారుడై యుండ వలెను. అప్పటికిగాని ఏకాదశి వ్రతము సంపూర్ణముగాదు. ఏకాదశీ వ్రత మొనర్చువాడు సూర్యచంద్ర గ్రహణములలో భూరిదానము లొనర్చిన పుణ్యమును, అశ్వ మేధ యజ్ఞ ఫలమును అరువది వేల సంవత్సరముల తపః ఫలమును పొందు నని స్మృతులు పురాణములు తెలుపుచున్నవి. ఏకాదశినాడు పవసించుట బ్రాహ్మ ణులకు భూమిని దానమిచ్చుట కంటెను. విద్యార్థులకు విద్యా దానము చేయుట కంటెను ఉత్తమ మైనది.[2]"

ఏకాదశి వ్రతం ఆచరించి ఉసిరిక చెట్టుకింద జాగరణం చేసిన పాప రహి తుడై కైవల్యం పొందును. బ్రాహ్మణునకు దానం చేసినట్లయిన.

"కార్తికమునందు నుసిరిక కాయ లొక్క
దోసెడించుక హేమంబుతోడ గూర్చి
ధరణి సురునకు నెవ్వడే దానమిచ్చు
నతడు శ్రీ విష్ణు లోకంబునందు నుండు."[3]

భీష్మఏకాదశి : భీష్ముడు కురు వంశ వృద్ధుడు. కురుక్షేత్రం యుద్ధ రంగంలో దక్షిణా యనంలో నేలకొరిగి పుణ్య ప్రాప్తికై ఉత్తరాయణంలో మాఘ శుద్ధ ఏకాదశినాడు మరణించెనట.

1. హిందువుల – పండుగలు పు 282.
2. హిందువుల – పండుగలు – పర్వములు పు 112.
3. రుక్మాంగద చరిత్ర – 262.

"అనఘ యిసుడింక యేబది యాఱు దివస
ములకు దానుత్తరాయణమున జరింప
దొడగు నీవప్డు దేహంబు విడిచియేగు
దపుసరావృత్తి పథమున కభిమతముగ." [1]

భీష్మునకు తర్పణ మాచరించి శ్రాద్ధ మొనర్చిన వారికి సంతానము గలుగు నని పద్మ పురాణములో నున్నది.

బ్రహ్మచారి అయిన భీష్ముని పూజించితే సంతానము కలుగుతుందనే నమ్మకం.

హోలీ : ఇది ఫాల్గుణ పౌర్ణమినాడువచ్చును. హోలిక అనే రాక్షసి మరణించిన రోజున ఈ పండుగ జరుపుకుంటారు. పిల్లలందరూ ఈ రాక్షసిని నిప్పులపైపెట్టి కాల్చారట. అందుచేత కొన్ని ప్రాంతాలలో ఇప్పటికీ పసిపిల్లలను ఎత్తుకొని మంటలపై అటు, ఇటు తిప్పి ఆడిస్తారు ఈ విధంగా చేసినట్లయిన పసిపిల్లలకు వున్న పీడ పరిహారమవుతుందనే నమ్మకం వుంది.

"రాక్షసి ప్రీత్యర్థము హోలికా పూజనము చేయుచున్నానని సంకల్పించు కొని కర్రలు, పిడకలు రాశి చేసి నిప్పు ముట్టించి 'మేము భయ సంత్రస్తులమై నిన్ను పూజించుచున్నాము. మాకు ఐశ్వర్యదాయినికమ్ము' అని ప్రార్థించవలెను. పిదప ఆ నిప్పు చుట్టును ముమ్మారు ప్రదక్షిణమాచరించి స్వేచ్ఛగా నోటికి వచ్చి నట్లు వాగవలెను. ఈ శుష్క కాష్ఠములకు అంటించు నిప్పును 'ఛండాల సూతికా గేహము నుంచి' పిల్లలు దొంగిలించుకొని రావలెనట. పిదప మరునాడు స్వపచుని తాకి స్నానము చేయవలెనట.[2]

ఇవి కాక అనేకమైన పండుగలు హైందవ సమాజంలో వ్యాపించి వున్నాయి. కోటానుకోట్ల హిందూ దేవతలకు, వారి ప్రాధాన్యం పొందిన పండుగలకు లెక్కలేదు.

1. ఆంధ్ర మహాభారతము శాంతి పర్వము – 2-115.
2. హిందువుల పండుగల పర్వములు – 289.

పుణ్యం పేరుతో పాపం అనే నరకము నుండి విముక్తి పొందడం కోసం ఇటువంటి పండుగలు ఏర్పాటు చేయటం. ధానధర్మాల పేరుతో పురోహిత వర్గం తమ పబ్బం గడుపుకోవడానికి పన్నిన పండుగలు తప్ప మరేంకాదు. అమాయకులైన ప్రజలు నిజాన్ని గ్రహించలేక మూఢ నమ్మకాల ఊబిలో కూరుకు పోయి పుణ్యం పేరుతో స్వర్గం పేరుతో, జన్మ రాహిత్యం పేరుతో వున్నది కాస్తా పోగొట్టుకోవడానికి ఈ పండుగలు వుద్దేశించబడినట్లుగా మనకు అర్థం అవుతుంది.

చచ్చిపోయిన పితరులకు దానధర్మాల సాకుతో పిండ ప్రధానం అనే మిషతో గోదాన హిరణ్య దానాదులనే పేరుతో పురోహిత వర్గం పొందే లాభం తప్ప సామాజికునికి కలిగే లాభం శూన్యం. అందుకే వేమనవంటి తాత్త్వికవేత్త,

పిండములను బెట్టి పితరులఁదలపోసి
కాకులకును బెట్టు గాడ్దెలార
పెంట తినెడి కాకి పితరుఁడెట్లాయెరా ? అన్నాడు.

ఈ నోములు ఆత్మ విశ్వాసాన్ని కలిగిస్తాయనటంలో సందేహం లేదు. విజ్ఞానం దేశ ప్రజలందరికీ కలిగిన నాడు ఇటువంటి మూఢ నమ్మకాలు అవసరం లేదు.

# 5. శకునాలు

శకునం అంటే సాహిత్య పరిభాషలో శుభసూచిక నిమిత్తం అని అర్థం. వ్యవహారికంలో శుభశకునం అని అశుభశకునం అని వ్యవహరించటం మనంవింటూనే వుంటాం. ప్రకృతిలో కొన్ని శుభమైనవని మరికొన్ని అశుభమైనవని మన వాళ్ళ నమ్మకం. తమకు మంచి చేసే జీవరాసులు సన్నిహితం కావడం కాని ఏదైనా ఒక పని చేయవలసి వచ్చినప్పుడు చేరువవటంగాని జరిగితే అవి శుభ శకునంగా భావించటం, తమకు చెడు చేసే జీవి సన్నిహితం అయినప్పుడు అది అశుభం అని భావించటం మన వారి నమ్మకం. అందుచేతనే శుభ శకునం, అశుభ శకునం అనే పేర్లు ఏర్పడ్డాయి. ఏ ఏ జీవరాశులు తమకు ఆరాధ్యంగా వుండి వుపయోగకరంగా వుంటాయో వాటిని బట్టి ఈ శకునాల రూపం ఏర్పడింది. దీనికి మతం

ప్రాధాన్యం వహిస్తుంది. ప్రాక్తన మానవుడు తనకు కనిపించే జీవ జంతు జాలాన్ని చూచి వాటి శక్తిని అంచనా వేసుకోవటం తెలియక గుడ్డిగా కొన్ని నమ్మకాలు ఏర్పాటు చేసుకున్నాడు. దాని ఫలితంగానే జంతు పూజా విధానం (Totemism) ఏర్పడింది.

సంఘంలో వుండే ఆచారాలకూ, నమ్మకాలకూ ఒక క్రమ రూపాన్ని కలగ జేసింది మతమే. మత ప్రాధాన్యం వల్ల, మత ప్రాచుర్యం వల్ల మానవ జాతి అయోమయ స్థితిలో కొన్నిటిని మూఢంగా అనుసరించవలసి వచ్చింది. అందుచేతనే ఒక్కొక్క జాతిలో వుండే ఆచార వ్యవహారాలు, సాంప్రదాయాలు, నమ్మకాలూ మొదలైన వాటి వివరాలు ఆయా మత నియమాల్లో మత గ్రంథాల్లో మనకు కని పిస్తాయి. ఆర్య నాగరికత నుంచి మనకు లభించిన ఆధారాలను బట్టి శుభా శుభ శకునాలు, వాటి విలువలు వాటివల్ల కలిగే కష్టనష్టాలు తెలుస్తాయి.

జంతు పూజా పద్ధతికి ఉత్తర అమెరికా జాతులకుచెందిన ఓజిబ్వా (Ojibwa) భాషలో (Totem) టోటమ్ అని పేరు. చనిపోయిన తమ తల్లిదండ్రుల ఆత్మలు జంతురూపం వహిస్తాయని నమ్మడం వాటిని పూజించి తమ వారిని పూజించినట్లుగా భావించటం జరిగింది. ఏ ఏ జంతువులు లేక పక్షులుగా వారు భావించారో వాటినే ఆరాధ్య దేవతలుగా విశ్వసించారు. వాటినే దైవంగా కూడా భావించారు.

"ఈ పద్ధతిని పరిశీలిస్తూ ఫ్రీజర్ (J. G. Frazer) పండితుడు తన తొలి వ్యాసాన్ని 1887 లో ప్రచురించినప్పుడు ఈ పదానికి (Totemism) మిక్కిలి వ్యాప్తి వచ్చింది. అతడు టోటమ్‌ను గురించి క్రోడీకరించిన అంశాలివి.

1. టోటమ్ భౌతికమైన వస్తువే (material object) అది సర్వ సాధారణంగా జంతు రూపంలో ఉంటుంది. అక్కడక్కడా ప్రాకృత వస్తు రూపంలో కూడా ఉండవచ్చును.

2. ఒక గుంపుకు చెందిన టోటమునకూ, ఆ గుంపులోని ప్రతి వ్యక్తికి మధ్య నెలకొని ఉండే సంబంధం చాలా పటిష్టమైనదీ, పవిత్రమైనదీ, అంతులేని

గౌరవాన్ని భయ సంభ్రమాలనూ తన టోటమ్ పట్ల ప్రతీ వ్యక్తి ప్రదర్శించవలసి ఉంటుంది.

3. టోటమ్ గుంపు కంతటికి సఖి పరిరక్షకుడు. సహాయకుడు, దైవం.

4. ఏ వ్యక్తి తన టోటమునకు చెందిన జంతువుకు హాని చేయకూడదు, చంపకూడదు. దాని పేరును ఉచ్చరించకూడదు. కాని దానికో విశిష్ట నామాన్ని ఏర్పరచి వాడవచ్చు.

5. టోటమ్ స్వరూపాన్ని రకరకాల రంగులతో శరీరమంతటా చిత్రించు కోవాలి.

6. టోటమ్ మాంసం ఆ గుంపు కంతటికీ అఖాద్యం. విధినుల్లఘించి టోటమును భక్షించిన వాడు రోగి కావడమో, నిస్సంతువు కావడమో తటస్థిస్తుంది."[1]

ఈ విధంగా తమ దేవతగా భావించిన టోటము తమకు శుభాన్ని అందిస్తుందని ఆ గుంపులోని జనం భావించారు. వివిధ జాతుల సాంస్కృతిక, సమ్మేళనంతో ఏర్పడిన మానవ సమాజం అంతర్దశల్లో మార్పులు చెంది ఆయా జీవ జంతువులు తమకు శుభాన్నిస్తాయని తమకు చెందని జీవులు అశుభాన్ని కలగజేస్తాయని భావించటం జరిగింది. ఆ విధంగా ఏర్పడిన నమ్మకాలే తరువాత దశలో శకునాలుగా ఏర్పడ్డాయి. ఈ శుభా శుభ శకునాల్ని గురించి వివిధమైన నమ్మకాలున్నాయి. కొంగ, నక్కలను చూడటం మంచిదని క్రీడాభి రామకర్త వివరిస్తే, ఇవి చెడ్డవని పల్నాటి వీరచరిత్ర, గుడ్లగూబ అరిస్తే మంచిదని క్రీడాభిరామం, దోషమని సింహాసన ద్వాత్రింశికలో వర్ణించటం జరిగింది.

ఏనుఁగు గుజ్జము(బీనుఁగు
మానుగ బసవేశ్వరుండు మఱి బాల్పెరుగున్
సేనయు మండెకు నగ్నియు
శ్రీనాథా ! శుభములగును శిఖి నరసింహా !

శుభ శకునాలని.

---

1. తెలుగు జానపద గేయాలు – సాంఘిక చరిత్ర పుట – 39,
2. శిఖినారసింహా శతకం – 6,

కుందేలు నంది తంబళ
యందిక జనుచుండు పాముననగొాజ మదియన్
పందులగుంపెదురైనను
చెందును బయనమున ముప్పు శిఖి నరసింహా. [1]

అశుభశకునాలని నమ్మడం.

నంద రాజకుమారుడైన విజయ భూపాలుడు అరణ్యానికి వేటకు బయలు దేరిన సమయంలో

పిల్లులు పోరాడె బల్లియూర కత్రుళ్ళె
దమ్మశి పొడసూపె దుమ్ము రెదర
దొ జగు వోయిన వేగ కొజలుచు నొకకుట్టి
పబతెంచె గంపపై నజచెగాకి
యులుమ డొక్కడు నూనె తలతోడనే తెంచె
మైల చీరలవాకి మ్రోల నెదిరె
గాకియును గొరవంకయును తెక్కలపోతు
నేటి రింతయు దాటె నెడమ దిశకు

బైట వెరవు దప్ప బాలగుమ్మయు బాటె
నొంటి పాట బైడి కండిపీచె
నెలుగు చేసి పెద్ద పులుగు పామటుతో చె
దబ్బి బొబ్బలి డియె నుబ్బులడర. [2]

మంచనశర్మ తన స్నేహితుడైన టిట్టిభశెట్టితో నగర సందర్శన సమయంలో,

మాగిలి మాగిలి వృక్షము
పూ గొమ్మన నుండి షడ్జము ప్రకాశింపక
వే గొదమ నెమలి పల్కెడు
గోగోయని వైశ్యమనకు గెలుపగుజుమ్మీ.

---

1. శిఖి నారసింహా శతకము – 10.
2. సింహాసన ద్వాత్రింశిక – 1–232.

కొస కొసం గోడి యేౖటంత కొంగ నక్క
నమిలి యూగి లునాటె దర్శనంబులె స్స
వీని వల తీరు బలుకు నుర్వీజనులకు
గొంగు బంగార మంౖడు శాకునిక వరులు.[1]

ౖపయాణమున దారిలో పాము కనబడి బెదిరి పారిపోక నిల్చినట్లయిన శుభం కలుగుతుంది.

తెరవున జెదరక నుండిన
స్థిర శుభమౌ దొలగెనేని జెడుసిరి కుడినుం
డురగము నశుమను గనుగొన
సిరి చెడి రోగముల బడును శిఖ నరసింహా. [2]

ఎదురు నిల్చిన పాము కాటు వేస్తే ?

శకున శాస్త్రకారులు వివిధమైన అభిౖపాయాలను రక రకాలుగా వివరించారు. మొట్టమొదట జీవ జంతువులకు వ్యాపించిన ఈ శకున వివరాలు తరువాతి దశలలో వివిధమైన మార్పులకు, శారీరక, బాధలకు ౖపకృతి వైపరీత్యాలకు కూడా సోకింది. నక్షౖతాలు రాలటం కూడా అపశకునంగా భావించారు. నక్షౖతాలు రాలవని రాలేవి ఉల్కలవంటి పదార్థాలని నాటి భౌగోళిక శాస్త్రవేత్తలు గమనించలేక పోయారు.

అలరాజు ౖబహ్మనాయుని పనుపున రాయబారిగా మాచర్ల వెళ్ళాడు. నాయకురాలు నాగమ్మ తన నేర్పుతో అలరాజుకు విషౖపయోగం చేయించింది. సంధి సఫలం కానందున అలరాజు వెనుతిరిగాడు ఆ సమయంలో.

తంౖడీ అని అలరాజు అర్చాడు. తూర్పు నక్షౖతం అస్తమించింది. అరివీర భయంకరుడు 'అలరాజు' అస్తమించాడు.[3]

1. ౖకీడాభిరామము – 1–51; 52.
2. శిఖి నారసింహా శతకము – 11.
3. పల్నాటి వీర చరిౖత – పుట. – 146.

పగటిపూట నక్షత్రాలు పొడవడం. చంద్రుని అమావాస్య రోజున చూడటం అశుభంగా భావించారు.

వీరప్పయ్య (వీర బ్రహ్మేంద్రస్వామి) బాల్యమునే సన్యసించి బనగాన పల్లెలో అన్నాజయ్య అనే బ్రాహ్మణ కుమారునకు కాలజ్ఞానం బోధిస్తాడు.

హిందూ మహమ్మదీయులు
కొందఱు మత మమత గొట్టుకొని చత్తురు రా
కేందు నమావాశ్య నిశిం
గందురు పగ లింటి దారకంబులు పొడుచున్.[1]

నక్కలు అరవటం, ఉల్కలు పడటం అశుభ శకునాలు.

ఒక వృద్ధ బ్రాహ్మణుడు తన బాలుని జన్మ మరణాన్ని రక్షించుమని అర్జునుని కోరగా అతడు ఆ బిడ్డను రక్షించటానికి యదు, వృష్ణి, అంధక, భోజ సైన్యాలతో యమునితో పోరాడటానికి బయలుదేర్తాడు. ఆ సమయంలో.

ఎలుసంజదాస సంబులు
తెలుగయ్యెను గూబలెల్ల దెసలు జెలంగెన్
వఱడు లఱచె నుల్కలు పడె
నెఱిచెడి సురగాలి విసరె నిలుపక పెలుచన్.[2]

కంసుడు శ్రీకృష్ణుని సంహరించటానికి తన నగరానికి తీసుకు రావలసినదిగా అక్రూరుని పంపగా.

"దేవతా ప్రతిమలు సలించుటలు, నుల్కా నిర్ఘాతంబులు పడుటయును, సూర్య చంద్ర మండలములు ప్రచండ కబంధ గ్రసనాది వైకృతంబులం బొందుట లును బాప గ్రహంబులు క్రూర రాసులు వక్రించుటలు."[3]

---

1. శ్రీ వీర బ్రహ్మేంద్రస్వామి చరిత్ర – 1–186.
2. ఉత్తర హరివంశము – 2–24.
3. హరి వంశము – పూ. భా. 8–93.

ఉల్కా పాతం అశుభ సూచకమని మన వారి నమ్మకం. యుద్ధసమయాలలో హయ, హస్తులు యజమానులను గౌరవించక పోవటం. యుద్ధానికి సిద్ధం కాక పోవటం అశుభ శకునాలు.

శ్రీకృష్ణుడు తనకు పారిజాత వృక్షం పంపనందువల్ల ఇంద్రునితో యుద్ధానికి సన్నద్ధుడయ్యాడు. అమరులు తమ సైన్యంతో శ్రీకృష్ణుని ఎదిరించటానికి సిద్ధం కాగా దేవతల గజాశ్వ యుద్ధ పరికరాలు సన్నద్ధం కాలేదు.

గలిత శృంఖలయ్యును కాల నిద్ర
గనుగవల గ్రాల దమయంత గదల వయ్యె
దారుణా ధోరణ ప్రయత్నమున గాని
నముచి మథనుని శుండాల ఘటలు

పొరి బొరి నెగయుచు గ్రుమ్మగుచు
ధరణీస్థలి బొరల బడుచు దలకొని కషం
బొరసిన వయ్యు హయంబులు
భరియింపవు కొంత తడవు పల్యాణంబుల్

గొనయంబు నెక్కద్రోచిన
గనయంబున కెక్కకున్న గ్రమ్మిన తమకం
బున విల్లు విడచి వేతొక
యనిమిష భటుడనికి వెడలె నడి దముగొనుచున్.[1]

బాణాసురుడు అనే రాక్షస రాజు శివుని పూజించి అనేక వరాలు పొంది తనకు ఎటువంటి అపకారం జరుగకూడదని శివుని వేడగా. శివుడు బాణాసురుని మయూర కేతనం క్రింద పడనంతవరకు మేలు జరుగునని వరమిస్తాడు. బాణాసురుని కుమార్తె ఉషాదేవి శ్రీకృష్ణుని మనుమడు అనిరుద్ధుని ప్రేమించి తన చెలికత్తె చేత అనిరుద్ధుని తన అంతఃపురానికి తెప్పించి గాంధర్వ వివాహం చేసుకుంటుంది. అనిరుద్ధుడు బాణాసురుని నగర ప్రవేశ సందర్భంలో ఈ విధంగా జరుగుతుంది.

---

1. పారిజాతాపహరణము – 4–68, 69, 72.

"హరు చెప్పిన పనిదప్పక నెమలి పడగ బల్లున విఱిగెన్"
"ధర వర్జిత పర్వ్యండై రాహు వడింబట్టె రవిన్."[1]

సూర్యబింబాన్ని రాహువు పట్టటం అంటే సూర్యగ్రహణం అని అర్థం. సూర్య గ్రహణం అశుభ సూచికంగా భావించారు

శరీరంలో కలిగే చర్యలు కూడా అశుభ సూచికాలే. స్త్రీలకు దక్షిణ భాగం అదరటం. కుడి కన్ను, కుడి భుజం, కుడి ప్రక్క అవయవాలు అదరటం అశుభంగా నమ్మటం జరిగింది. పురుషులకు దక్షిణ భాగం అదరటం శుభంగా భావించటం కూడా నమ్మకమే

కపిస్థలం కృష్ణమాచార్యులవారు ధూమకేతువులు (తోకచుక్క) అనే వ్యాసంలో సమాజంలో తోకచుక్కపై వున్న భయాందోళనలను ఎత్తి చూపారు.

గురజాడ అప్పారావుగారు ఈ మూఢ నమ్మకాల్ని తోసివేసారు

"దుర్భిణి సాయం లేకుండానే అందరితోపాటు తోకచుక్కను చూచిన గురజాడ అప్పారావు అందరిలాగా మాత్రం ఆలోచించలేదు. మహోత్పాత కారణ మని తోకచుక్కను జూచి భయపడే రోజుల్లో "చన్న కాలపు చిన్న బుద్ధులను కాదంటూ ఆకాశానికి మేలు నగగా అచ్చరచేతి కలువ పువ్వుగా సంబరపడ్డాడు.

తెగులు కిరవని కతలు పన్నుచు
దిగులు చెందుటదేమి కార్యము ?
తలతునేనిది సంఘ సంస్కర
ణ ప్రయాణ పతాకన్.[2]

(ఇది మహోదయం లోనిది)

లోక సామాన్యాభిప్రాయానికి భిన్నంగా ధూమకేతువు (తోక చుక్క)లో సంఘ సంస్కరణ పతాకాన్ని చూచాడు, మన గురజాడ అప్పారావుగారు.

---

1. ఉత్తర హరివంశము – పుట. ౬–౩౦, 33, 34.
2. మహోదయం – పుట. 167 – 168.

నారదుడు కలహ భోజనుడు. పారిజాత పుష్పాన్ని తెచ్చి రుక్మిణీదేవి వద్ద నున్న శ్రీకృష్ణునకిస్తాడు. శ్రీకృష్ణుడు ఆ పారిజాత పుష్పాన్ని రుక్మిణికి బహూకరిస్తాడు. ఆ సమయంలో అంతఃపురంలో వున్న సత్యభామకు దక్షిణ భాగం అదరడం ఒక అశుభానికి సూచన.

> "అకటయదేమిటో యెఱుగన య్యెడ దొయ్యలి దక్షిణాంసచూ
> చుక నయస ప్రకంప గుణ సూచన లేమియు వల్లగావు సా"[1]
>
> (ఇది పారిజాత పహరణం లోనిది)

దక్షిణ భుజం స్త్రీలకు అదరడం శుభ సూచికమట.

ఎడమ భుజం అదరడంవల్ల పుత్రులకు చేటుకలుగునట రెండు ప్రక్కల అదిరినట్లయిన అగ్ని భయం కలుగునట

> కుడి భుజమింతులకగు శుభ
> మెడమ భుజం బదరుకీడు నిలపుత్రులకే
> కుడి ప్రక్క నెడమ ప్రక్కన
> చెడు నగ్ని భయంబు లండ్రు శిఖి నరసింహా.[2]

కుడివైపు స్త్రీలకు అదరిన అశుభమని పారిజాతాపహరణము, శుభమని శిఖ నారసింహా శతకం పేర్కొన్నాయి.

నల్లని బట్టలు అశుభానికి చిహ్నం. దక్షిణ దిశగా ప్రయాణం చెయ్యటం, కూడా అశుభమే.

రావణుడు సీతను అపహరించి లంకలో దాచి త్రిజటను కాపుంచగా. త్రిజటకు స్వప్నంలో అశుభ సూచనలు కనిపిస్తాయి.

> "కూలిన రావణు (గ్రూరాసి నొకతె
> నీలాంబరము తోడ నెటి చేరగంటి
> గురుతరోష్ణము నెక్కి కుంభకర్ణుండు
> తిరమేది దక్షిణ దిశకేగ గంటి"[3]

---

1. పారిజాతాపహరణము – 1–73.
2. శిఖి నారసింహా శతకము – 261
3. రంగనాథ రామాయణము – పుట. 222.

ఈ విధమైన నమ్మకాలు మన సమాజంలో వ్యాపించాయి.

కొంతమంది శకునకారులు చెప్పిన శుభ శకునాలు అశుభాలని, అశుభాలు, శుభాలని మరికొందరు శాస్త్రవేత్తలు చెప్పటం జరిగింది. దీనిమీద సరియైన నిర్ధారణలేదు. ఎవరికి ఇష్టం వచ్చిన పద్ధతిలో వారు ఈ శకునాల్ని గురించి వివరించారు. అమాయకులైన వారు దీన్ని గమనించలేక శకునాలు చూసుకుని ప్రయాణాలు శుభ కార్యాలు ప్రారంభించాలనే భావించారు. కాగల కార్యం కాక మానదు. కార్య కారణ సంబంధం లేకుండా ఏ పని జరగదు కదా. హేతుబద్ధంగా ఆలోచించ లేనివారు కేవలం శకునాన్ని బట్టి తమకు శుభం జరుగుతుందని నమ్మేవారు ఈ సమాజంలో వున్నంత కాలం ఇలాంటి కాకమ్మ కథలు చెప్తునే వుంటారు. శకునాలు చెప్పే శాస్త్రకారులు దాన దక్షిణలు గ్రహించి పర భాగ్యోపజీవులై ఇతరులపై బలంగా ఈ శాస్త్రాన్ని రుద్దారు. స్వార్థం కోసమే ఈ శకున శాస్త్రాన్ని వారు సృష్టించారనేది నిర్వివాదాంశం.

# 6. గ్రహణాలు

"గ్రహణం" అంటే రాహువు సూర్య చంద్రులను పట్టడం అని అర్థం. రాహువు అనే గ్రహం ఆకాశంలో వున్న సూర్యుణ్ణి, చంద్రుణ్ణి మింగి వదలి వేయడాన్ని గ్రహణం అని పిలుస్తారు.

దీన్ని గురించిన కథ ఈ విధంగా వర్ణించబడింది.

"దేవతలు, రాక్షసులు కలసి పాల సముద్రాన్ని అమృతం కోసం మధిస్తున్నారు. మనం పెరుగును చల్ల చెయ్యడానికి చిలుకుతాం కదా! అట్లాగే అన్న మాట. అయితే కుండలో వున్న పెరుగును చిలకటానికి చిన్న కవ్వం సరిపోతుంది. అంత పెద్ద సముద్రాన్ని చిలకాలంటే ఎంత కవ్వం కావాలి? అందుకోసం మంథరం అనే పర్వతాన్ని తీసుకొచ్చి కవ్వంగా చేసారు. దానికి తాడు కావాలిగా మరి. వాసుకి అనే పామును తాడుగా చేసారు. అయితే కొండ సముద్రంలో కిందకు పోకుండా ఆధారం కావాలిగా మరి. విష్ణువు తాబేలుగా మారి అడుగున వుండి కొండను మోసాడు, ఇక సముద్రాన్ని చిలకగా చిలకగా

దాంట్లోంచి ఒకసారి మొదట విషం పుట్టింది. దాన్ని ఈశ్వరుడు మింగి గొంతులో వుంచుకున్నాడు. ఆ తరవాత లక్ష్మి - సూర్య - చంద్రులు - కల్ప వృక్షాలు యెన్నెన్నో పుట్టాయి. చివరకు అమృతం వచ్చింది. దేవతలు - రాక్షసులు కలసి కదా అమృతం కోసం చిలికింది. కాబట్టి అమృతాన్ని ఇద్దరూ సమంగా పంచుకోవాల్సిందే. అయితే అమృతాన్ని చూడగానే దేవతలకు కళ్ళు జిగేల్ మన్నాయి. ఎట్లాగైనా అమృతాన్ని రాక్షసులకు దక్కనీయరాదనుకున్నారు. విష్ణువు మోహిని అనే ఆడదాని వేషం వేసుకు వచ్చి అమృతం పోయడానికి తయారయ్యాడు. ముందు దేవతలంతా ఒక వరుసలో, తరువాత రాక్షసులంతా ఒక వరుసలో కూర్చున్నారు. ముందు దేవతలకు అమృతం పోస్తున్నాడు మోహినీ వేషంలో వున్న విష్ణువు. అంతా దేవతలకే పోసి చివరికి అయిపోయిందని చెబుదామను కున్నాడు విష్ణువు. రాక్షసులు అమాయకులు, వాళ్ళకి సంగతి తెలియదు. అయితే రాహువనే వాడే సంగతి కనిపెట్టి వాడు రాక్షసుల్లోంచి లేచిపోయి దేవతల వరుసలో కూర్చున్నాడు. మోహిని వరుసగా అమృతం పోసుకుంటూ వచ్చి రాహువు చేతుల్లో కూడా పోసింది. వీడు గబాలున తాగేశాడు. వెంటనే సూర్య చంద్రులు ఈ సంగతి విష్ణువుకు చెప్పేసారు. ఇంకా రాహువు తాగిన అమృతం గొంతులోంచి లోపలికి దిగక ముందే విష్ణువు వాడి కంఠాన్ని చక్రంతో నరికి వేశాడు. కంఠంలో అమృతం పడటం మూలాన కంఠం అట్లాగే చావకుండా వుండి అప్పుడప్పుడూ సూర్యుణ్ణి, చంద్రుణ్ణి పట్టి మింగి మళ్ళా విడిచి పెడుతూ వుంటాడు. మింగగానే కిందికి వస్తుందిగా. రాహువుకు కంఠం వరకు మాత్రమే వుందాయె మరి.[1]"

బహుశా ఈ కథ ప్రచారంలోకి రావడానికి కారణం సూర్య చంద్రులు గ్రహాలు కాదని వారు దేవతలని మన పూర్వులు భావించటం కావచ్చు. అప్పు డప్పుడు ఈ రెండు గ్రహాలూ కనిపించక పోయేటప్పటికి మన వాళ్ళకి అనుమానం వచ్చింది. ఎప్పుడు మనకు కనిపించే దేవుళ్లు ఏమయినట్లు ? కొంత కనిపించడం. మరికొంత కనిపించక పోవడం. ఆ గ్రహాలమీద పడే భూమి నీడగాని చంద్రుని నీడగాని నోటి ఆకారంగా కనిపించడం. వీటిని చూచి మన దేవుళ్ళను ఎవరో మన దగ్గరకు రానీయకుండా మింగి వేస్తున్నారని భ్రమించారు. ఆ భ్రమే ఒక పురాణ

---

1. మూఢ విశ్వాస వనకుఠారము — పుట. 63

కథగా మలచబడింది. సూర్యచంద్రుల్ని ఈ బాధనుంచి తప్పించడానికి మన వాళ్ళు పూజలు పునస్కారాలు, జపాలు, దానాలు చేస్తూ తృప్తిపడ్డారు.

అయితే ఈ సూర్య చంద్ర గ్రహణాలు ఎలా ఏర్పడుతున్నాయి ?

సూర్యుడు దేవుడు కాదని అది నిత్యం మండే అగ్ని గోళం వంటిదని మనకు తెలుసు. భూమి - చంద్రుడు గ్రహాలు ... ఇందులో సూర్యుడి చుట్టూ భూమి తిరుగుతుంది. భూమి చుట్టూ చంద్రుడు తిరుగుతున్నాడు. సూర్యుడికి భూమి గ్రహం అయితే భూమికి చంద్రుడు ఉపగ్రహం. చంద్రుడు తన చుట్టూ తాను తిరుగుతూ భూమి చుట్టూ తిరుగుతుండగా భూమి తన చుట్టూ తాను తిరుగుతూ సూర్యుని చుట్టూ తిరుగుతుంది. ఇట్లా ఇవి తిరిగేటప్పుడు ఒక్కొక్కప్పుడు చంద్రుడు తిరుగుతూ, తిరుగుతూ భూమికి సూర్యుడికి అడ్డం వచ్చేటప్పటికి సూర్యుడు భూమికి చాటై పోతాడు. అంటే భూమి మీద వుండే సూర్యుడు మనకు కనపడడు. ఈ రెండిటికి మధ్య చంద్రుడు అడ్డం వచ్చాడన్న మాట. ఈ విధంగా సూర్య గోళం మనకు కనబడకుండా పోవడమే సూర్యగ్రహణం.

ఇదే విధంగా చంద్ర గ్రహణం కూడా. చంద్రునికి స్వయం ప్రకాశకత లేదు. సూర్యకిరణాలు చంద్రగ్రహంపై పడటం చేత మాత్రమే చంద్రుడు ప్రకాశిస్తాడు. చంద్ర గ్రహణంలో భూమి చుట్టూ తిరిగే చంద్రుడు. భూమికి రెండో వైపుకు రాగానే భూమి సూర్యుని కాంతి చంద్రుని మీద పడకుండా అడ్డం వస్తుంది. అప్పుడు సూర్య కిరణాలు భూమి మీద పడతాయి చంద్రునిపై పడవు. భూమి నీడ పడటం చేత వెన్నెల కనిపించదు. దీన్ని చంద్ర గ్రహణం అని పిలుస్తున్నాం.

ఇవి చంద్ర భ్రమణ, భూ భ్రమణ కారణాలవల్ల ఎప్పుడూ వచ్చేవే. కాని మన వాళ్లు ఈ గ్రహణాల సందర్భంలో కొన్ని మూఢ నమ్మకాల్ని సమాజంలో ఏర్పాటు చేశారు.

"మరి గ్రహణం పట్టినప్పుడు గర్భిణితో వున్న ఆడవాళ్ళను బయటికి రానీయరు. కదలనీయరు. అట్లా కదిలితే వాళ్ళకు పుట్టే పిల్లలకు కాలు వంకరో,

చేయి వంకరో, మూతి వంకరో మొత్తం పిదప ఏదో ఒక అవయవం వంకర పోతుం దంటారు. అంతే కాకుండా స్నానాలు, జపాలు, ఏమేమో చేస్తుంటారు."[1]

సాక్షి మంచి వక్త. గ్రహణ సందర్భాల్లో గర్భవతులైన స్త్రీలు ఆచరించ వలసిన విధుల్ని ఈ విధంగా వుపన్యసిస్తాడు.

"రేపు చంద్రోపరాగమని చెప్పుకొనుచున్నారు. చంద్ర గ్రహణమును గాని, సూర్య గ్రహణమునుగాని గర్భవతులు చూడగూడదను పూజ్యమగు పురాత నాచారము మనకున్నది.

సోదరీమణులారా ! గర్భవతులు గ్రహణ దర్శన మొనరుపఁగూడ దను నాచారము నిరసింపఁదగినదికాదు. నిర్హేతుకమైనదికాదు. నిందింపఁదగినదికాదు హేతువు లేని యాచారమేల యుద్భవించును. కాలానుగుణము దాత్కాలికో పయోగముగఁ గొన్ని యాచారము లుద్భవించును.

సోదరీమణులారా ! గర్భవతి గ్రహణ దర్శన నిషేధాచారమట్లు నిరుపయోగ మయినదికాదు సరికదా ! అధికోపకారియగుటచే నాధునిక గర్భవతులచే నవశ్యమాచరింపఁదగినదియై యున్నది. ఎందుచేతనో చెప్పెదను. చూలు నిలిచిన తోడనే రజో దోషమాగిపోవుట అందఱును బాహాటముగ నెఱిగియున్న యంశమే. అయినను కొన్ని ప్రకృతులలో నట్టి రజస్స్తంభన జరుగదు. ఈవ్యతి రేక ప్రక్రియ సామాన్యాచారమునకు బలముగాని బలహీనతకాదు. పిండోత్పత్తికి మాస కర్మ విధాన మాగిపోవుటయే ప్రధానాభిజ్ఞానముగ పరిగణింపఁబడుచున్నది.

చంద్రుఁడిరువది ఎనిమిది దినములలో నొకసారి భూ ప్రదక్షిణము చేయును. చంద్రగతిననుసరించియే ఈ రజఃప్రక్రియ జరుగునని మన పెద్దల యభిప్రాయము. చంద్ర - సూర్యో పరాగములు వికృత దర్శనములు ఆ బింబములలోని మొట్టిని గర్భవతి గాంచిన ఎడల తప్పకుండా గర్భస్థ శిశువునకామొట్టి కలుగునని మన వారి యభిప్రాయము"[2]

గ్రహణ దర్శనం చేత గర్భస్థ శిశువుకు గ్రహణం పట్టడం అంటే వికృతా కాహారం రావడం జరుగుతుందనే నమ్మకం అనాదిగా వుంది.

---

1. మూఢవిశ్వాస వనకుఠారము - పుట. 59
2. సాక్షి - వ్యాసములు - పుట. 3-160

"గ్రహణాలు పట్టినప్పుడు గర్భిణీ స్త్రీలు తిరగరాదని, తిరిగితే వాళ్ళకు పుట్టే సంతానం యేదో ఒక అవయవ లోపంతో పుడుతుందని అంటారు గదా! దానికి దీనికి ఏం సంబంధం? బోడి తలకి మోకాలికి ముడి వెయ్యడమే అంతా పచ్చి అబద్ధం. గర్భంలో వున్న పిండానికి గ్రహణానికి ఏం సంబంధం? సరే. మనం ఇండ్లల్లో సుఖంగా వుంటున్నాం కాబట్టి మన ఇంట్లో వున్న స్త్రీలను బయటకు కదల నీయకుండా జాగ్రత్తగా వుంచగలుగుతున్నామని అనుకుందాం. కాని పాపం చెట్ల కింద నివసించే దిక్కులేని భిక్షగాండ్ల స్త్రీలు ఏ నియమాలు పాటిస్తున్నారు. కనీసం వాళ్ళకి గ్రహణమంటే ఏమిటో, అది ఎప్పుడు వస్తుందో కూడా తెలియదే! ఆ వూరూ ఈ వూరూ అనకుండా రాత్రింబవళ్లు చెట్లు నీడలే నివాసంగా సంచరించే, ఆ నిర్భాగ్యులకెవరు చెబుతారు వీటి సంగతి! మరి వాళ్ళ స్త్రీలు గర్భిణులు కారా! వాళ్ళకి పిల్లలు పుట్టడం లేదా? వాళ్ళకి పుట్టే పిల్లలకి అవయవాలు వంగర పోతు న్నాయా! ఇక మన ఇండ్లలో పుట్టే అవయవ లోపాలు గల పిల్లలందరూ గ్రహణ కాలంలో పుట్టిన వాళ్ళేనా? ఈ విశ్వాసం అన్ని మతాల వాళ్ళకీ వుందా? క్రైస్త వులకు, మహమ్మదీయులకు గూడా ఇట్లాంటి నమ్మకం గ్రహణాల విషయంలో వుందా? లేదు. అంటే ఇది నిజం కాదన్న మాట. దీనివల్ల ఏమైనా చర్య జరిగితే కుల మత భేదాలతో నిమిత్తం వుండదు కదా! నిప్పున్నదనుకోండి. అది ఎవ్వరు పట్టుకున్న కాలుతుందే కాని హిందువుల పట్టుకుంటే కాలకుండా వుంటుందా! సత్యమైన దానికి ఈ భేదాలేమీ వుండవు. మరి అలాంటప్పుడు కేవలం వొక మతానికో, వొక తెగకో సంబంధించిన ఆచారాలు పరంపరంగా వస్తున్న మూఢా చారాలే గానీ, సత్యాలు కావు. వాటిని తెలిసిన వాళ్ళెవరూ నమ్మరు.

అంతేకాదు, మనుష్యులతోనే ఆగకుండా ఆ ఆచారం పశువుల దాకా పోయింది. బర్రెలు, ఆవులు సూడిగా వుంటే వాటి కొమ్ములకు సున్నం రాసిగాని బయటికి విడవరు. ఇంట్లో వున్న పశువుకు, అందుబాటులో వున్న వాటికి రాస్తారు బాగానే వుంది. కానీ అడవుల్లో గుంపులు గుంపులుగా వుంటే జంతువులకు ఎవరు రాస్తున్నారు? అవి సూడిగా వుండనే వుండవా? అవి పిల్లల్ని కనవా?"[1]

సృష్టికర్త కుమార్తె అహల్య రూపవతి. ఆమె భర్త గౌతముడు. భర్త ఇంట లేని సమయంలో అహల్య సూర్యునితో రతికేళి తేలుచుండగా గౌతముడు

---

1. మూఢ విశ్వాసవనకుఠారము - పుటలు. 66 - 67

తిరిగి వచ్చి సూర్యుని శపించాడు. సూర్యుడు శాపనివారణకై గౌతముని వేడు కొన్నాడు.

"ఎప్పు డంటకుండ నేటేట గ్రహియించివిడుచు రాహు నిన్ను"[1]

ఈ గ్రహణాల విషయంలో మనవాళ్లు మరికొన్ని నమ్మకాలు పాటించారు.

ఉజ్జయినీ నగర మంత్రి కుమారుడు. సుకుమారుడు. ఒకరోజు రాత్రి చంద్రగ్రహణం సంభవించింది. దానిని దర్శించడానికి తోటకు వెళ్ళి సుకుమారుడు.

"అంతట నొక్కనాటి నిశియందు శశిగ్రహణంబు గాన దచ్చాంతికి స్నాన దానములు సల్పగ వేకువజాము వచ్చు పర్యంతము..."[2]

గ్రహణం ముగిసిన తరువాత తల మునిగేలా స్నానం చేసి అప్పుడే తెచ్చిన నీటితో వంటకాలు తయారుచేసుకొని భుజిస్తారు కొందరికి ఈ సమయంలో వస్త్ర దానం, ధన దానం, నవధాన్యాల దానం చెయ్యటం ఒక ఆచారంగా వుంది. సూర్య చంద్రులు ఆపదనుంచి బయటపడ్డారనే నమ్మకంతో తమ సంతోషంతో ఈ నమ్మకం వున్నవాళ్ళు తమ చేతికి వచ్చినదాన్ని ఇతరులకు దానం చెయ్యటం అల వాటయింది. అదే సంప్రదాయంగా మారిపోయింది.

గ్రహణం పట్టే సందర్భంలో ఇంటిలోని పాత్రలలో గరిక వేసే ఆచారం కూడా మనవారిలో వుంది.

"గ్రహణం పట్టబోయే ముందు ఇంట్లో వున్న అన్ని వస్తువులలో తెల్లగరికె వేస్తారు. కొన్ని ప్రాంతాలలో తెల్లగరికె దొరక్కపోతే పచ్చగరికెకూడా వేస్తారు. అంతే కాదు, గ్రహణం పట్టిన తరువాత ఇంట్లో వున్న ఏ వస్తువునూ ముట్టరు. నోట్లో పచ్చినీరు కూడా పోసుకోరు. ఏమైనా వండిన పదార్థాలు గ్రహణం పట్టక ముందే తినేస్తారు. గ్రహణం పట్టిన తరువాత వాటిని తినరు. అందుకని మిగిలిన ఆహార పదార్థాలేమైనా వుంటే బిచ్చగాళ్ళకు పెడతారు. బిచ్చగాళ్ళు దొరక్కపోతే పారవేస్తారు. అంతేకాని చచ్చినా తినరు."[3]

---

1. సమీరకుమార విజయము-1-211 పు.
2. హంసవింశతి-5-309 పు.
3. మూఢవిశ్వాస వనకుఠారము 68 పు.

గ్రహణ దర్శనంవల్ల శరీరం మైలపడిపోతుందని, ఆ దోషం నివారించ డానికి నదీస్నానం చెయ్యాలనే నమ్మకం వుంది. మొట్టమొదట గంగా స్నానం చెయ్యాలని భావించారు. అందరికి ఇది సాధ్యం కాదు కాబట్టి దగ్గరలో వున్ననదీ స్నానం చెయ్యాలని, అది కూడా సాధ్యం కాకపోతే నూతిస్నానం, నవీనకాలంలో పంపు స్నానం ఆచారంగా మారిపోయింది.

ప్రకృతిలో సూర్యచంద్ర గ్రహణాలు మామూలు విషయాలే. చంద్ర భ్రమణ, భూభ్రమణాలవల్ల ఈ గ్రహణాలు ఏర్పడడం యాధృచ్ఛికం కాదు. నిర్ణీత సమయాల్లో ఏ దేశంలోనైనా ఏ ప్రాంతంలోనైనా ఈ గ్రహణాలు తప్పవు. విదేశాలలో ఈ గ్రహణాలు ఏర్పడే విధానాన్ని గురించి పరిశోధనలు జరుగుతుంటే మనవారు ఇప్పటికీ సూర్యచంద్రులు సర్పదష్టులౌతున్నారని నమ్మటం ఆశ్చర్య కరంగా ఉంది విజ్ఞానపథంలో ప్రయాణించే మానవుడు చంద్రోపరితలంపై విహారం చేస్తున్న సమయంలోకూడా ఇటువంటి నమ్మకాల్లో ప్రజలు మునిగిపోవడం విచారించదగ్గ విషయం

# 7. యజ్ఞాలు - యాగాలు

యజ్ఞ యాగాలు రెండూ సమానార్థక పదాలే. వీటికి వేలిమి అనే అర్థం చెప్పబడింది. ఈ యజ్ఞాలు పంచమహాయజ్ఞాలుగా చెప్పబడ్డాయి.

పంచ మహాయజ్ఞములు :- బ్రహ్మ యజ్ఞము, పితృయజ్ఞము, దేవయజ్ఞము, భూతయజ్ఞము. మనుష్య యజ్ఞము. [1]

యజ్ఞ-యాగాలలో జీవహింస ఎక్కువగా జరుగుతుంది. ఈ యజ్ఞాలు చెయ్యటంద్వారా దేశం సుభిక్షంగా వుంటుందని స్వర్గలోకవాసం కలుగుతుందని, రంభాది దేవతల పొందు కలుగుతుందని, పునర్జన్మ వుండదని, దేవేంద్ర పదవి కూడా దొరుకుతుందనే నమ్మకం మనకు వ్యాపించి వుంది. అథర్వణ వేదంలో ఈ యజ్ఞ యాగాల ప్రసక్తి ఎక్కువగా చెప్పబడింది.

---

1. శబ్దరత్నాకరము - పు. 655

"ఋగ్వేదకాలం ప్రారంభదశలో యజ్ఞాలూ, యాగాలు పెద్దఎత్తున జరిగేవి కావు. జరిగినా ఎవరికి వారు స్వయంగా జరుపుకునేవారు. కాలక్రమాన మంత్ర ద్రష్టలమన్న ఘనతతో ఒక ఋషివర్గం ఏర్పడింది. వీరు యజ్ఞయాగాల సంఖ్యను పెంచారు వాటి కాలపరిమితిని పెంచారు ఆంధ్ర వాచస్పత్యము ప్రకారము పాకయజ్ఞాలు ఏడు. హవిర్యజ్ఞాలు ఏడు. సోమయజ్ఞాలు ఏడు. ఇవి కాక అశ్వమేధ యాగం, రాజసూయ యాగం, పౌండరీకం, బృహస్పతి సవం, శైనం మొదలైన యజ్ఞాలు అనేకం వుండేవి. "మొదలైన" అనే ముసుగు కింద ఆంధ్ర విజ్ఞానము మరుగుపరచిన యజ్ఞాలలో ఒకటి పురుషమేధం. బలిపశువుగా నరుని నరకడానికి ఇది ఘనంగా ధ్వనించే పేరు వేదకాల ప్రారంభ దశలలో (తక్కిన ప్రాచీన దేశాలవలె) ఇక్కడ కూడా పురుషమేధాలు జరుగుతూ వుండేవని వ్రాసింది ఒక మ్లేచ్ఛుడు కాదు ఒక హిందూ పండితుడే. ఆయన రాజేంద్రలాల్ మిత్ర" [1]

విజయవాటికను రాజధానిగా చేసికొని పరిపాలించిన చక్రవర్తి మూడవ మాధవవర్మ నరమేధం చేశాడు. ఆయన మంత్రి పినాక భట్టారకుడు. యజ్ఞం పూర్తయిన తరువాత మాధవవర్మ తాను చేసినది పాపమని తోచి తనకు గలిగిన ధర్మసందేహాన్ని తీర్చవలసిందిగా భట్టారకుని కోరతాడు.

"యజ్ఞమున జీవహింస జరుగుచున్నది. సంగ్రామముననూ జీవహింస జరుగుచున్నది. యజ్ఞమునందు హింసించబడిన జీవి స్వర్లోకవాసి యగుచున్నాడు. సమరమున నసువులు వీడిన వీరవరుడును స్వర్లోకమున కరుగుచున్నాడు. అది మన విశ్వాసము. క్రతువు లొనర్చువారు స్వర్లోకవాసము నభిలషించుచున్నారు. 'స్వర్లోకకామో యజేత' యజ్ఞాంగమైన పశువునకు త్రిదశాలయ ప్రాప్తి యొదవుచున్నది. ఆహవ మొనర్చు రాజునకు స్వర్గవాంఛగాక రాజ్యవిస్తరణ కాంక్ష, ఇహలోక వైభవ పిపాస ప్రధానము లగుచున్నవి."[2]

యజ్ఞములో నరకబడినవారు, యుద్ధములో మరణించినవారు స్వర్గలోకానికి పోతారనే నమ్మకం మనవారిలో వుంది. స్వర్గలోకం సుఖవంతమైంది అనే నమ్మకం వ్యాపించటమే ఈ యజ్ఞకర్మలకు పునాది. చంపినవారికి లేక చంపించినవారికి పాపం కలుగుతుందనే నమ్మకం కూడా వుంది.

1. సీత జోస్యం – 88 పు.
2. నరమేధము – 51 పు.

మహాభారత కురుక్షేత్ర యుద్ధంలో కౌరవవంశ నాశనం జరిగింది. యుద్ధ రంగంలో బంధువు లందర్నీ వధించి తాను పాపకూపంలో మునిగిపోయానని ధర్మ రాజు చింతిస్తాడు. అపుడు వేదవ్యాస మునీంద్రుడు పిత్రాది పవిత్రులను చంపిన పాపాల్ని పోగొట్టే పవిత్రమయ్యే మార్గం చెప్తాడు.

"భయపడకు రాజేంద్రా ! నీకే దోషము అంటదు. నీవు పవిత్రుడవయ్యే ఉపాయం నేను చెపుతాను. పాండుపుత్రా ! ఉత్తమ క్రతువు అశ్వమేధం ఆచ రించు. దానివల్ల నీవు కులవధ చేసిన పాపంనుంచి విముక్తుడవు కాగలవు. పూర్వం రాముడు కూడా మూడు అశ్వమేధాలు చేశాడు. నీవు కూడా అలాగున అశ్వమేధం చేసి రాజ్యం ఏలుకో." [1]

మాధవవర్మ నరమేధం చేసిన తరువాత తన కుమారుడైన గోవిందవర్మ అతివేగంగా రథం తోలి ఒక పసిబాలుని మరణానికి కారకుడౌతాడు. రాజు తన కుమారునికి మరణదండన విధిస్తాడు. మరణశిక్ష అమలు జరిపించిన తర్వాత మాధవవర్మ తన మంత్రి అయిన పినాక భట్టారకునితో తాను నరమేధం చేసిన పాపానికి శిక్ష అనుభవించుచున్నానని చెప్పగా, పినాకభట్టు

"మీరు నరమేధ మొనర్చినారు. నరమేధ మనగా నేమి ? యజ్ఞకర్త తన్ను తాను బలిపశువు నందారోపించుకొని యనగా సర్వవిషయముల నుండి విరామము పొంది ఇంద్రియపరత్వము గావించుకొని భగవదర్పితుడౌటయేకద. అప్పుడిక వ్యక్తి లోకవృత్తము ననుసరించుచున్నను అన్నిటినుండి దూరుడై ముక్తి చెందిన యను భవమును పొందియుండును. దానిమూలమున సంభవించు ఫలిత మిట్లుండగా నీ నరమేధము వలన దుష్ఫలితము లెట్లుండును ? ప్రాణమునకు ప్రాణమీవలసి వచ్చినది. కర్మ రీతు లిట్లే యుండును. ఆ వృద్ధ బ్రాహ్మణదంపతుల శాపము మీ కర్మ పరిపాకమై యువరాజు శిక్షింపబడినాడు. అతనియందలి అమితవేగాభిరతి యాతని నట్లు చేసినది. అందువలననే యిట్టి క్లిష్టములైన యజ్ఞకర్మలను సాధా రణముగ నేరును సంకల్పించరు." [2]

---

1. జైమినీ భారతం — 2
2. నరమేధము – పు 194.

నరమేధం పూర్వము ఎవ్వరూ చేసినట్లు కనిపించదు. మాధవవర్మ యజ్ఞం చేసి తాను ఫలితం అనుభవించానని పశ్చాత్తప్తుడౌతాడు.

నరమేధం తరువాత గణించవలసిన యజ్ఞాలలో పౌండరీకం ముఖ్యమైంది. దీన్ని పుండరీక యాగం అని కూడా పిలుస్తారు. ఈ యజ్ఞం విచిత్రంగా వుంటుంది.

"మనకు అనేక విధాల యజ్ఞాలు వున్నాయి. అవి వేదవిహితాలు. చాలా పవిత్రమైనవి. చాలా పురాతనమైనవి. యజ్ఞం చేసినవాళ్ళు అంతా మహాపావనులున్నూ. ధన్యాత్ములున్నూ, అన్నీ మంత్రాలతోను గొప్ప తంతులతోనూ జరగవలసినదే. దీక్షకి, నిష్టకి చెప్పవలసి ఉండదు. అందులో ఒక యజ్ఞం ఉంది. 'పౌండరీకం' అని. ఇది చేసినవాళ్లు కట్టెతో కైలాసానికి పోతారు పరలోకంలో రంభా సంభోగం కలుగుతుంది. ఈ యజ్ఞం జరిగే విధానం : ఒక పందిరి వేస్తారు. కిందను బ్రాహ్మణశ్రేష్ఠులు హోమం వేలుస్తుంటారు. మంత్రధ్వని దిక్కులు పిక్కటిల్లుతుంది. అగ్ని సహస్రార్చులతో ప్రజ్వలిస్తుంటుంది. హోమ ధూమం ఆ ప్రదేశమంతా పవిత్రం చేస్తూ వుంటుంది.

పౌండరీకం చేస్తున్న మహానుభావుడు, అతని భార్య ఇద్దరున్నూ మహా దీక్షతో, మహత్తరమైన నిష్ఠతో సక్రమంగా శాస్త్రోక్తంగా ఆ పందిరిమీదకు ఎక్కుతారు. ఆ పందిరి కొంచెం బలంగానే సూత్రాల ప్రకారం కడతారు. పైకప్పుమీద స్వేచ్ఛగా విహారం చేసినా ఫర్వాలేదన్నంత గట్టిగా ఉంటుంది. ఆ కప్పు మధ్య భాగంలో ఒక కన్నం ఉంటుంది. పుణ్యాత్ములు, అదృష్టవంతులు, పలుకుబడి కల వాళ్ళు అందరూ చుట్టూ ఉండి చూస్తూ ఉంటారు. ఆకతాయివాళ్లు చెట్లూ, ఇళ్ళూ ఎక్కి కనిపెడుతూ ఉంటారు గూడాను.

మంత్రాలు చెలరేగుతుంటాయి. వేదనాదం ఆకాశం ముట్టుకుంటూ ఉంటుంది. హోమం సాగుతుంటుంది. ఆ పౌండరీకం చేసే మహానుభావుడు భక్తిపూరితుడై పోతాడు. అతని భార్యకూడా అలా ఉత్సాహంతో నిండిపోతుంది. ఇద్దరూ పందిరి పై కప్పుమీద ముహూర్తం కోసం నిరీక్షిస్తుంటారు. ఇంతలో నిర్ణయించిన ముహూర్తం వస్తుంది. అప్పుడు వాళ్ళేం చేస్తారు? ఇందరు చూస్తున్నారే అని సంకోచిస్తారా ? అనాచారం కాదా అని భావిస్తారా ? ఎవ్వరేమనుకుంటారో అని చింతిస్తారా. లేదు. ముమ్మాటికీ లేదు. మహోత్సాహంతో పవిత్రకార్యం చేస్తున్నా

మన్న ఉబలాటంతో, భక్తితో, దీక్షతో, నిష్ఠతో మహాసంగమకార్యానికి పూను కుంటారు. సర్వప్రపంచం చూస్తూ ఉండగనే వాళ్ళిద్దరూ ఆలు-మగల ఆట ఆడతారు. ఇక్కడ సంభోగం చెయ్యకపోతే తరువాత రంభా సంబోగం దొరకదట సోమయాజిగారికి.

అలాగున బహిరంగంగా శాస్త్రోక్తంగా మంత్రాలతో వాళ్ళిద్దరూ సంగ మించాలి. ఆ రేతస్సు కిందనున్న హోమాగ్నిలో పడి ఆహుతి కావాలి. అప్పటికి గాని పౌండరీకం అన్న యజ్ఞం పూర్తి ఫలాన్ని ఇవ్వదు. ఇది ఒక విధమైన నర మేధం అనవచ్చు. నరబలి వంటిదే బీజరూపంలో." [1]

ఇటువంటి యజ్ఞాలు స్వర్గవాంఛ కోసమో, లేక ఇతర వాంఛలకో జరపటం, దాని ద్వారా పుణ్యఫలాలు పొందగలమని భావించే నమ్మకం వ్యాపించి వుంది.

పుత్రసంతానం లేనివారు పుత్రులు పొందటానికి నరకప్రాప్తినుండి తప్పించు కోవడానికి చేసే యజ్ఞాలు వున్నాయి.

యవనాశ్వునకు పుత్రసంతానం లేదు. యవనాశ్వుడు తన కులగురువయిన వశిష్టుడ్ని తనకు పుత్రసంతానం కలిగే మార్గం చూపించమని వేడుకుంటాడు. అప్పుడు వసిష్టుడు

"ఐంద్రయాగము సేయు మవనీశ భక్తి
సాంద్రంబుగాఁ బుత్రి సంతతి కలుగు" [2]

దశరథునకు పుత్త్రులు లేని సందర్భంలో వశిష్టుడు అశ్వమేధయాగం చేయవలసిందిగా చెప్తాడు.

"కొడుకులు లేకున్న కోరి పుణ్యములు
వడయ రుత్తమలోక పదవులెవ్వరును"
గాన పుత్రులు గానగా నాకు వలయు
గాన నేనింక లోకము లెల్ల మెచ్చ

---

1. దేవాలయాలమీద బూతుబొమ్మ లెందుకు ? 81-82.
2. రంగనాథ రామాయణము - పు. 60

దలకొని యశ్వమేధము సేసి పిదప
నెలమితో పుత్రకామేష్టి వ్రేల్చెదను
ఈ యాగములచేత హితము రంజిల్ల
పాయక పుత్రుల బడసెద నేను [1]

పుత్రులు కలగటానికి యజ్ఞయాగాలు ఆచరిస్తే కలుగుతారనే మూఢనమ్మకమే దీనికి ప్రధానాలంబనం. పుత్రకామేష్టి యజ్ఞం ఆచరించటంవల్ల పుత్రులు కలుగుతారని రాజసూయయాగం చేయటంద్వారా రాజ్యం సుభిక్షంగా వుంటుందని రాజుకు శుభం కలుగుతుందని నమ్మారు.

అశ్వమేధ యజ్ఞం చేసే విధానం అసహ్యాకరమైంది.

"ఈ యజ్ఞకర్మము లన్నింటికంటె అశ్వమేధమును జేయ సోమిదమ్మ యొక్క యశ్వసేవ మఱియు నసహ్యాకరమై యుండును. చూడుడు. పట్టపురాణి 'అంబే అంబాల్యంబికే' అను మంత్రమును జపించుచూ (వధింపబడిన) అశ్వముం డాసి 'గణానాంత్వాం' అను మంత్రముతో నా యశ్వము సభిమంత్రణము జేసి 'ఉత్సక్థ్యోర్గుదం దేహి' అనుచు మృతాశ్వము యొక్క గూఢావయవమును దన గూఢావయవమున నుంచుకొని శయనింపవలయును. అప్పు డధర్యుడు 'సుభగే కాంపిలవాసిని' యను మంత్రము జదువుచూ పట్టుబట్టతో రాణిని గుబ్బమును గప్పును. అగ్నీద్రుడు 'వృషాంగరేతో దధా' అను మంత్రమును జపించును. ఆ రాత్రి తక్కిన ఋత్విక్కులు మహారాజు నిద్రించకుండ జేయుదురు.

యజమానుడు (రాజు) తన భార్యల నల్వురను ఋత్విక్కులకు దాన మీయవలెను. ఆ యంశమిట్లు చెప్పబడినది. పట్టపురాణిని బ్రహ్మయను ఋత్విక్కునకు, ఉపేక్షింపబడిన రెండవ భార్యను హోతయను ఋత్విక్కునకు, రాజు యొక్క భోగకన్యను ఉద్గాత యను ఋత్విక్కునకును రాజునకు పాత్రాదుల నొసగు స్త్రీని అధ్వర్యుడు అను ఋత్విక్కునకు దానమీయవలెను. ఆ స్త్రీలను ఋత్విక్కులు భర్తలవలె హస్తములను గ్రహించిన పిమ్మటను రాజు తగిన ధన మిచ్చి ఆ ఋత్విక్కులనుండి ఆయా స్త్రీలను పుచ్చుకొనును." [2]

---

1. రంగనాథ రామాయణము పు 9.
2. (మహాభారత చరిత్రము శ్రీ పెండ్యాల) దేవాలయాల మీద బూతు బొమ్మలెందుకు పు. 89, 90

"యజమాన ప్రమదా వికస్వర భగన్యస్తాశ్వ దీర్ఘ స్మర
ధ్వజదండంబగు యశ్వమేధ మఘతంత్రంబు". [1]

జుగుప్సాకరమైన ఇటువంటి యజ్ఞాలు ఆచరించటంద్వారా తమకు స్వర్లోక వాసం లేక రంభా సంభోగం లభిస్తుందనే నమ్మకంతో వారి భార్యల సిగ్గు బిడియాలు కూడా గాలికి వదిలేశారు వారిని పశువుల్లా, జీవచ్ఛవాల్లా పచ్చి వ్యభిచారిణులుగా మార్చటానికి నాటి పురోహితవర్గం ప్రయత్నించింది.

మొట్టమొదట ఈ యజ్ఞాలు ఏ విధంగా ఉండేవో తెలియదు కాని తదనంతర కాలంలో ఈ విధంగా జుగుప్సాకరంగా తయారయ్యాయి అనేది చారిత్రక సత్యం.

యజ్ఞాలలో మేషయజ్ఞం కూడా చెప్పుకోదగినది. విధాత కుమార్తె అహల్య. అతిలోకసుందరి. ఆమె అందానికి ముగ్ధుడై ఇంద్రుడు వివాహమాడకోర్తాడు. కాని ఆమె బ్రహ్మదేవుని నిర్ణయం ప్రకారం గౌతమ మునిని వివాహం చేసుకుంటుంది. భర్త ఇంటలేని సమయంలో ఇంద్రుడు అహల్యతో క్రీడించుచుండగా గౌతముడు వచ్చి వారి విషయం తెలిసికొని ఇంద్రుని వృషణాలు వూడిపోవునట్లుగా శపిస్తాడు.

"సురరాజు తన పాటు సురలతోఁ దెల్పె
దరిమిడి పితృదేవతల వారు వేడి
వెరవరులై మేషవృషణముల్ దెచ్చి
సురలు సంధించిరి సురలోకపతికి
నీతుల పుణ్యాత్మకుల యాది గాక
క్రతువుల జంపుదురడ్కగి మేషముల" [2]

అప్పటినుండి యజ్ఞాలలో మేకలను వధించటం ప్రారంభమైంది మాంసాహారాన్ని తీసుకోవటం ఆ రోజుల్లో జుగుప్సగా భావించారు. మాంసాహారం

1. శృంగారనైషధము 7 - 133.
2. రంగనాథ రామాయణము — 44.

భుజించినవాడు అనాగరికుడు. నాటి పురోహిత బ్రాహ్మణులందరూ మాంసాహారులే. రామాయణంలో, భారతంలో, భాగవతంలోని పాత్రలన్నీ మాంసాహారులే. అయితే వీరు మాంసాన్ని నిత్య ఆహారంలో భాగంగా గ్రహించక అగ్నిలో పశువును వేల్చి నేతితో వేయించిన 'హవిస్సు'ను మాత్రమే భుజించేవారు. మంత్రతంత్రాల నైపుణ్యంతో, రుచికరమైన మాంసాన్ని హవిస్సనే పేరుతో దేవతలు గ్రహిస్తారని అమాయకుల్ని నమ్మించి వీరు మాత్రం పసందైన వంటకాల్ని, రుచికరమైన మైరేయాల్ని స్వీకరించేవారు.

యజ్ఞాల పేరుతో సంతానవతులు కాని రాకుమార్తెలను రాణులను కూడా ఈ పురోహితవర్గం సంభోగానికి ఉపయోగించుకునేవారు. అశ్వమేధ యజ్ఞం ఆచరించిన రాజు తన భార్యను, మిగిలిన ముగ్గురి స్త్రీలను బ్రహ్మ, హోత, ఉద్గాత, అధ్వర్యులకు దానమియ్యాలి వారు మూడు రాత్రులు ఆయా స్త్రీలతో కలసిన తరువాత రాజుకు తిరిగి ఇచ్చివేస్తారు. రాజుగారు కోరినంత ధనం దానధర్మాల పేరుతో ఇవ్వవలసి వుంటుంది. దీనివల్ల పురోహితవర్గాలకు పుణ్యం, పురుషార్థం అన్నట్లుగా పరస్త్రీ సంభోగం, కోరినంత ధనం లభించేవి.

నాటి పురోహితవర్గం తమ స్వార్థ ప్రయోజనాలు ఆశించి వందిమాగధుల్లా రాజులకు మార్గదర్శకులుగా తయారయి యజ్ఞయాగాల పేరుతో ఇటువంటి మూఢ నమ్మకాల్ని పెంచి పోషించారు. ప్రస్తుత నాగరికదశలో కూడా యజ్ఞాల పేరుతో, యాగాల పేరుతో ధాన్యాల్ని, నెయ్యివంటి ఆహార పదార్థాల్ని అగ్నికి అర్పించడం మనం గమనిస్తూనే వున్నాం. ప్రభుత్వాధికారులు, పరిపాలకులు దీన్ని సమర్థించడం కూడా శోచనీయం. ఇటువంటి మూఢనమ్మకాల్ని సభ్యసమాజం వ్యతిరేకించాల్సిన అవసరం ఎంతైనా వుంది.

# 8. వాస్తుశాస్త్రం

వాస్తు అనే పదానికి 'ఇండ్లు మొదలగునవి యేర్పరుపదగిన భూమి' అని, 'ఇల్లు' అని అర్థం గృహనిర్మాణ సందర్భంలో గాని భూమియొక్క మంచి చెడ్డల్ని పరిశీలించే సందర్భంలో వాడే శాస్త్రాన్ని వాస్తుశాస్త్రం అని అనవచ్చు. గృహస్థుడు గృహనిర్మాణం చెయ్యడానికి ముందుగా భూమిని సేకరించవలసి వుంటుంది. ఆ భూమి గృహనిర్మాణానికి అనువుగా వుందో లేదో పరిశీలించి, మిట్టపల్లాలు లేకుండా నేల సమతూకంలో వుండేటట్లుగా చేసుకున్న తరువాత గృహనిర్మాణం, నీటి సౌకర్యం, గాలి, వాతావరణ సౌకర్యం ఏర్పాటు చేసుకోవాలి. తన ఇంటిలో వాడిన నీరు బయటకు పోవడానికి, రహదారి సౌకర్యం మొదలైనవి జాగ్రత్తపడాలి. మరుగుదొడ్లు, స్నాన సౌకర్యానికి గదులు ఏర్పాటు చేసుకోవాలి. ఇవన్నీ అమర్చుకున్న తరువాతకాని గృహానికి ఒక రూపం రాదు.

గృహ నిర్మాణం ఏ దిశలో ఏర్పాటు చెయ్యాలి, ఆవరణలో ఎలాంటి వృక్షాలు పెంచాలి, బావి లేక నీటిపంపు వంటి సౌకర్యాలు ఏ విధంగా ఏర్పాటు చేసుకోవాలి అనేది ఆ భూమికి వున్న వసతులనుబట్టి గృహం నిర్మించే విధానాన్ని బట్టి వుంటుంది.

మన ఆర్ష ధర్మశాస్త్రాల్లో వాస్తు గురించి చర్చ జరిగింది. గృహనిర్మాణ క్రమం, దోషాదోష నిర్ణయం మొదలైన విషయాలన్నీ విశదీకరించారు. ఆ గ్రంథాలలో భూమి ఆకారం, దశాఫల నిర్ణయం, శల్యపరీక్ష, దిక్సాధన, సూర్యకిరణ ప్రవేశం, జలనిర్ణయం మొదలైన వివరాలన్నీ చర్చించబడ్డాయి.

గృహనిర్మాణానికి ముందు భూమిని గురించి తెలిసికొనవలసిన అంశాలు కొన్ని ఈ విధంగా వున్నాయి.

"నాల్గు కోణములు సమముగా వున్న భూమి మిక్కిలి శ్రేష్టమైనది. ఏనుగు ఆకారముగ నున్న భూమి ధనము నొసగును. సింహాకారముగ నున్న భూమి సుగుణవంతులగు పుత్రులుదయింప జేయును. వృషభాకారముగనున్న భూమి

యోగ్యమైన ధనమును కలుగజేయును. భద్రపీఠాకారముగనున్న భూమి ఐశ్వర్య మును ప్రసాదించును. త్రిశూలాకారముగనున్న భూమి వీరులైన పుత్రులను జనింపజేయును; ధనమును, సౌఖ్యమును గలుగజేయును. లింగాకారముగనున్న భూమి లింగధారులకును వీరశైవులకును ప్రశస్తమైనది. ప్రాసాదాకారము, ధ్వజా కారము, కుంభాకారము గల భూమి పదోన్నతిని, ధనవృద్ధిని కలుగజేయును.

గృహము నిర్మించనున్న భూమి ముక్కోణాకారముగనున్న యెడల సంతాన నాశమును, బండి ఆకారముగనున్నచో సౌఖ్య నాశమును, చేట ఆకారము నొందిన యెడల ధననాశమును, విసనకర్ర ఆకారముగనున్న యెడల ధర్మహానిని కలుగ జేయును. [1]

ఈ విధంగా శుభాశుభాలు నిర్ణయించబడ్డాయి. ఇటువంటి భూమిలో గృహ నిర్మాణం చేసే సమయంలో దశాఫల నిర్ణయం చెయ్యాలి.

గృహానికి సూర్యదశ వచ్చినట్లయిన గృహ యజమానికి చిత్తచాంచల్యం, చంద్రదశ వచ్చినపుడు సంపూర్ణ ధనప్రాప్తి, కుజదశ వచ్చినట్లయిన అగ్నిభయం, రాహుదశలో జ్వరాది పీడలు, గురుదశలో సౌఖ్యం, శనిదశలో రోగప్రాప్తి, బుధ దశలో సుఖాభివృద్ధి, కేతుదశలో దుఃఖము గలుగును." [2]

గృహనిర్మాణానికి దశలు, దశాధిపతులు వాని క్రమం, విధి గతులను, వాని ఫలం ముందుగా తెలుసుకోవాలి. గృహానికి శుభదశ వున్నప్పుడు ఆరోగ్యవంతులు, ధనసమృద్ధి కలిగినవారుగను; అశుభదశలో వున్నట్లయిన అనారోగ్యం, అగ్ని చోరాది భయాలతో చింతలపాలవుతారని తెలుస్తుంది.

గృహనిర్మాణం చెయ్యటానికి ముందుగా భూమిలోని శల్యాలను పరీక్షించి, ఎముకలు లేని ప్రదేశంలో గృహం నిర్మించాలి. శల్యాలు గల భూమిలో గృహ నిర్మాణం చెయ్యరాదు.

"గృహనిర్మాత గృహమును నిర్మించుటకు ప్రారంభమున శల్యములను పరిశీలింపవలయును. శల్యములున్న స్థలమందు గృహమును నిర్మించి నివాసము

---

1. గుప్తవాస్తు – పు. 42, 43
2. వాస్తుప్రదీపము – 2–12–8

చేసినచో దుస్స్వప్నములు, హాని, రోగము, ధననాశము గలుగును. శల్యములు లేని స్థలమందు గృహమును నిర్మించుకొని నివాసము చేసిన యెడల ఐశ్వర్యము, ఆరోగ్యము, సుఖము, వంశవృద్ధి మున్నగునవి గలుగును. [1]

శల్యపరీక్ష ముగిసిన తరువాత భూమిని సమంగా చేసి దిశలు గమనించి దిక్సాధన చేసి గృహనిర్మాణం చెయ్యాలి.

"సాధనిచేతను గాని, జలముచేతను గాని భూమిని సమానముగ చేసి దిక్సాధనమును చేసి గృహమును ప్రారంభింపవలెను. దిక్శుద్ధి లేని గృహముగాని, దేవాలయము గాని, జలాశయము గాని మృత్యువును గలుగజేయును. కావున దిక్సాధనము తప్పక చేసికొనవలెను.

రాజభవనములు, దేవాలయములు, గృహములు, అళిందములు, ద్వారములు, కుండములు మున్నగునవి నిర్మించునపుడు దిక్కులను సరిగ చూచుకొని నిర్మించ వలెను. అట్లు దిక్కులను చూడక ఇష్టానుసారముగ దిక్కులను సరితేకుండగ నుండునట్లు కట్టిన యెడల దిఙ్మోహమను దోషము సంభవించును. దిఙ్మూఢమనగా దిక్కు లేకపోవుట అని అర్థము. గృహము నిర్మించు భూమికి దిఙ్మూఢమను దోషము సంభవించిన యెడల వంశనాశమును గలుగజేయును. కనుక ముఖ్యముగ దిక్సాధన చేయవలెను.

వాస్తుశాస్త్ర విషయములందు ఎల్లప్పుడు సూర్యోదయ సూర్యాస్తమయకాలము లందు నీడను సూత్రము పట్టి తీయగా తూర్పు పడమరదిశలు యేర్పడును." [2]

నిర్మాణం చేసిన గృహానికి సూర్యకిరణాలు ప్రవేశించవలసిన పద్ధతి వివ రించడం జరిగింది.

---

1. వాస్తుశాస్త్రము పు. 85
2. గుప్తవాస్తు పు. 103

"దేవాలయం వా భవనం మరశ్చ
భానోః కరైర్వాయుభిరేవ భిన్నం
తన్మూల భూమౌ పరివర్జనీయం
ఛాయాగతాయస్య గృహస్య కూపే." [1]

దేవాలయం, భవనం మఠం మొదలైనవి సూర్యకిరణాలు గాని, గాలి గాని ప్రవేశించక భిన్నంగా వున్నట్లయితే శుభం కలుగదు. అనగా పై భవనాదులకు ఎండగాని గాలి గాని ప్రవేశం కాని సరిగా లేక చీకటి గుహలుగా వున్నట్లయితే అశుభం కలుగుతుంది అని వారి భావం.

గృహం వున్న భూమియొక్క ఆవరణలో బావి వుండి ఆ బావిమీద ఆ ఇంటి నీడ పడినట్లయితే అది శుభం కలిగించదు. దీనినిబట్టి తాను నిర్మించుకున్న గృహం యొక్క నీడగాని, ఇతరుల గృహంయొక్క నీడగాని తన గృహావరణంలో వున్న బావిపై పడకూడదు. అట్లు పడినట్లయితే ఆ భూమిని ఆ గృహాన్ని పరిత్య జించాలి.

గృహనిర్మాణంతోపాటు ఆ గృహావరణంలో ఏ వృక్షాలు శుభాన్ని కలిగిస్తాయి ఏ వృక్షాలు అశుభాన్ని కలిగిస్తాయో వివరించబడింది.

"గృహమును నిర్మించు స్థలములో తూర్పుభాగమునందు రావిచెట్టుయున్నను, దక్షిణభాగమందు జువ్విచెట్టు యున్నను, పశ్చిమభాగమున మఱ్ఱిచెట్టు యున్నను, ఉత్తరభాగమునందు అత్తిచెట్టు యున్నను నా స్థలము గృహనిర్మాణమునకు నింద్య మైనది. అనగా గృహావరణములో ప్రధాన గృహమునకు తూర్పు భాగమునందు రావిచెట్టు యున్న యెడల భయమును, దక్షిణ భాగమునందు జువ్విచెట్టు యున్న యెడల పరాభవమును, పశ్చిమభాగమున మఱ్ఱిచెట్టు యున్న యెడల రాజపీడయు, ఉత్తర భాగమునందు అత్తిచెట్టు యున్న యెడల నేత్రరోగమును గలుగును. గాన అట్టి స్థలమునందు గృహనిర్మాణము చేయకూడదు.

---

1. వాస్తురాజ వల్లభం — పు. 6 – 13.

గృహమును నిర్మించు స్థలములో తూర్పు దిశయందు మఱ్ఱిచెట్టు యున్నను, దక్షిణ దిశయందు అత్తిచెట్టు యున్నను, పశ్చిమదిశయందు రావిచెట్టు యున్నను, ఉత్తరదిశయందు జువ్విచెట్టు యున్నను, ఆ స్థలము గృహనిర్మాణమునకు శ్రేష్ట మైనది." [1]

నూతన గృహనిర్మాణానికి కావలసిన కలపను గురించి ఏ ఏ దారువులను వుపయోగించవలెనో వివరించబడింది.

"నవీన గృహములు కట్టునప్పుడు నూతన దారువులను, గృహములు మరమ్మత్తు చేయునపుడు పాతదారువులును శ్రేష్టమైనవి. పురాతన గృహమును కట్టునప్పుడు నవీనమైన దారువులను పెట్టి కట్టవచ్చును గాని నూతన గృహములను మాత్రము పురాతనమైన దారువులను పెట్టి కట్టుకొనకూడదు. అట్లు కట్టిన యెడల గృహ యజమానునకు కీడు సంభవించును. [2]

దారువుల్ని గురించిన వివరం ఈ విధంగా వుంది.

"గృహమును ఒకే జాతి కర్రతోగాని, రెండు జాతుల కర్రలతో గాని, మూడు జాతుల కర్రలతోగాని నిర్మించవచ్చును. ఒకే జాతి కర్రతో కట్టిన గృహము సమస్త శల్యాజనిత దోషములను నివృత్తి చేయుటకు సమర్ధమైనదిగా నుండును. రెండు జాతుల కర్రలతో కట్టిన గృహము మధ్యమముగా నుండును. అనగా దోషనివారణము చేయుటయందు సమర్ధమైనదిగ నుండదు గాన శుభఫలములను గలుగజేయునదగును. మూడు జాతుల కర్రలతో కట్టుట కనిష్ఠ పక్షము. అనగా శుభములను గాని, అశుభములను గాని గలుగజేయదు. సామాన్యముగా నుండును. [3]

నూతన గృహనిర్మాణం చేసే సందర్భంలో జలనిర్ణయం అనగా నీరు ఏఏ ప్రదేశాల్లో ఎలా వుండాలి అనే విషయం వివరించబడింది.

---

1. గుప్తవాస్తు పు. 108.
2. జ్యోతిర్నిబంధము — పుట 12.
3. విశ్వకర్మ ప్రకాశిక — పు. 107.

"గృహము నిర్మింపనున్న స్థలమునకు సమీపములో తూర్పు భాగమునందు తటాకము, కోనేరు నున్నగు జలాశయము వున్న ఎడల ఆ స్థలమున గృహ నిర్మాణము జేసినచో ఆ గృహ యజమానునకు గాని, ఆ గృహమున నివాసము చేయువారికి గాని పుత్రసంతానమునకు నష్టము గలుగును. అనగా గృహావరణము నకును జలాశయమునకును మధ్యన వీధిగాని, సందుగాని ఖాళీస్థలముగాని లేకుండగ గృహావరణమునకు ఆనుకొని తూర్పుదిక్కున జలాశయమున్నచో పుత్రసంతానము నకు నష్టము గలుగును. ఇట్లే గృహావరణమును ఆనుకొని ఆగ్నేయ దిశయందు జలాశయమున్న యెడల అగ్నిభయమును, దక్షిణ దిక్కునందున్న ఎడల శత్రు భయమును, నైఋతి దిక్కుననున్నచో స్త్రీ కలహమును, పశ్చిమదిక్కున నున్నచో స్త్రీ దుష్టత్వమును, వాయవ్య భాగమున నున్న ఎడల దారిద్ర్యమును, ఉత్తరదిక్కు నందున్న ఎడల ధనవృద్ధియు, ఈశాన్యదిక్కు నందున్న ఎడల పుత్రవృద్ధియు గలుగును." [1]

గృహానికి కావలసిన ద్వార సంఖ్య నిర్ణయించునప్పుడు పాటించవలసిన నియమాలు.

"గృహమునకు నలుదిశలలో నేదేని నొక దిశయందు ఏకద్వారము గాని, ద్వారద్వయము గాని, సమద్వారములుగానినున్న మిక్కిలి ప్రశస్తమగును. మూడు ద్వారములు గాని బేసి ద్వారములు గాని నుండరాదు. గృహమునకు ఏకద్వార ముండుట సౌకర్యము. తరువాత బేసిసంఖ్యలు గల ద్వారము లుండకూడదు. సమసంఖ్యాకములగు ద్వారము లుండుట మిక్కిలి నుత్తమములుగ నుండును. సమసంఖ్యయందు చివర సున్న లేకుండ నుండవలయును. ఈ సమసంఖ్యాక ద్వారములు గృహమంతటికి నొప్పును గాని గృహగర్భమునకు కానేరదు." [2]

కిటికీలకు ఇదే వర్తిస్తుంది.

గృహానికి 'పారు' పాటించడం వాస్తుశాస్త్రంలో ముఖ్యమైన అంశం. దీనినే శూల అని కూడా పిలుస్తారు.

---

1. గుప్తవాస్తు – పు. 116.
2. గుప్తవాస్తు పు. 31–31.

"గృహమునకు యితరుల స్థలములుగాని, వీధులుగాని అడ్డముగ నున్న యెడల వారలను పాటింపనక్కరలేదు వెన్నుపోటు దోషము మాత్రము పెద్ద పెద్ద వీధు లడ్డము వచ్చువరకు వ్యాప్తమైయుండును గాన వెన్నుపోటు దోషము లేకుండ యుండునట్లు గృహమును నిర్మించుకొనవలయును.

స్థలమునకుగాని, గృహమునకు గాని, అడ్డముగ నొక వీధి యుండి నిడుపుగా గూడ నొక వీధియున్న యెడల ఆ నిడుపుగానున్న వీధి అడ్డవీధి కన్నను పెద్దదిగా నున్నయెడల వీధి శూలదోషము సంభవించదు.

గృహమునకు వీధిశూల యున్నచో రాజభయము కలుగును. తన యింటి శూలదోషమున్న యెడల వంశహాని కలుగును. ఇది తప్పదు. గృహమునకు వెను వాసము చివరి పోటు గలిగిన సంతానమునకు నష్టము సంభవించును.

గృహమునకు వాసములు గూడ సమ సంఖ్యాకములుగ నుండవలయును. బేసి సంఖ్యాకములుగ నుండకూడదు. సమ సంఖ్యాకములైనను చివర సున్నలుగల సంఖ్యలు (10, 20, 30, 40 మొ॥) వాసము లుండరాదు.[1]

గృహాన్ని నిర్మించిన తరువాత దాన్ని పెంచదలిచినట్లయితే చేయవలసిన విధానం వివరించబడింది.

"గృహమును పెంచదలచిన యెడల నాలుగు దిశలయందును సమానముగ పెంచవలయును గాని ఒకవైపున మాత్రము పెంచుకొనకూడదు. తూర్పుదిశను పెంచినట్లయిన మిత్రవైరమును, దక్షిణ దిశయందు మృత్యుభయమును, పశ్చిమ దిశయందు ధననాశనమును, ఉత్తరమున పెంచినట్లయిన మనస్తాపమును కలుగును." [2]

వాస్తుశాస్త్రం చెప్పిన భూమి మంచి చెడ్డల్ని పరిశీలించినట్లయితే కొన్ని ఆకారాలు గృహనిర్మాణానికే అనువుగా వుండవు. త్రిశూలాకారం ధనాన్ని, సౌఖ్యాన్ని కలుగజేస్తుందట. ఇది గృహనిర్మాణానికి పనికిరాదు. నంది ఆకారం పశువృద్ధిని కలిగిస్తుంది. సింహాకారం సుపుత్రుల్ని ఇస్తుంది. భద్రాకారం

---

1. గుప్తవాస్తు పు. 3 – 21, 22.
2. వాస్తురాజ వల్లభం పు. 2–10.

ఐశ్వర్యం కలిగిస్తుంది. కుంభాకారం పదవుల్ని కలుగజేస్తుందట. కాని గృహ నిర్మాణానికి ఈ ఆకారాలు యోగ్యం కావు. నలుచదరం అయిన భూమిగాని, దీర్ఘ చతురస్రస ఆకారంలో వున్న భూమిగాని గృహనిర్మాణానికి అనువుగా వుండ వచ్చు. గృహస్తుడు తనకు వున్న భూమినిబట్టి గృహనిర్మాణం చేసుకుంటాడు. దానికి గాలి, వెలుతురు, నీటిసౌకర్యం తనకు వున్న పరిధినిబట్టి ఏర్పాటు చేసు కుంటాడే తప్ప ప్రత్యేకమైన దిశలోనే నిర్మించాలని నిబద్ధించటం సాధ్యం కాని పని. నిబద్ధించటం కాక మంచి జరుగుతుందని చెడు జరగదనే నమ్మకాల్ని కలిగించటం ఈ శాస్త్రం ఏర్పడ్డ నాటినుంచి జరిగింది.

గృహనిర్మాణం చేసేటప్పుడు సూర్యోదయ, సూర్యాస్తమయ సమయాల్లో నీడకు సూత్రం పట్టి తూర్పు పడమరలు నిర్ణయించి దిశలు ఏర్పాటు చేయాలని వాస్తుశాస్త్రం చెపుతుంది. సూర్యోదయ, సూర్యాస్తమయాలు తూర్పు పడమరలను సరిగా నిర్ణయిస్తాయా! ఉత్తరాయణ, దక్షిణాయన కాలాల్లో సూర్యకిరణాలు ఒకవైపు నుండి సూత్రమే ప్రసరిస్తాయని, భూమి 23½° వంగి వుండటంచేత కిరణాలు ఏటవాలుగా పడతాయనే నిత్యసత్యాన్ని ఈ వాస్తుకారులు తెలుసుకోలేక పోయారు. దిక్సూచి కనిపెట్టడం దీనికి ప్రతిచర్య.

గృహనిర్మాణానికి ముందు శల్యపరీక్ష చెయ్యాలి. ఈ శల్యాలలో మనుషు లవి, పశువులవి, పక్షులవి, లోహశకలాలు కూడా చేర్చారు. కోటానుకోట్ల సంవ త్సరాలనుంచి జీవ జంతుజాలాలు పుడుతూనే వున్నాయి. మరణిస్తూనే వున్నాయి. వాటి శల్యాలు ఈ భూమిలో నిండి వున్నాయనే సత్యాన్ని మనం మరచిపోకూడదు. ఎక్కడ ఏ ప్రాంతంలో తవ్వినా ఎంతో కొంత లోతున ఏదో ఒక శల్యం దొరక్క పోదు. కోట్ల సంవత్సరాల వరవడిలో ఇవన్నీ భూమిలో నిండి నిబిడీకృతం అయ్యాయంటే ఆశ్చర్యపడాల్సిన పనేం లేదు.

వృక్షాలు నీడ నిస్తాయని మనకు తెలుసు. కొన్ని అనారోగ్యాన్ని కలి గిస్తాయి. మరికొన్ని ఆవరణలో వుంటే ఆరోగ్యానికి హేతువౌతాయి. ఒకే వృక్షం ఇంటికి ఒకవైపున ఉంటే శుభాన్ని మరొకవైపున ఉంటే అశుభాన్ని కలగజేస్తాయనే నమ్మకం సహేతుకమైంది కాదు. తలుపులు, కిటికీల నిర్ణయం ఆయా గృహాల్ని బట్టి గాలి, వెలుతురు సౌకర్యాల్నిబట్టి ఏర్పాటు చెయ్యాలి తప్ప నిబద్ధించటం మూఢ నమ్మకం. ద్వారముల నిర్ణయం, ఒకే జాతితో తయారయినవి ఏర్పాటు చేయటం

సామాన్యులకు సాధ్యం కాని పని గృహస్థుడు తన తాహతుకు తగిన విధంగా దారువులు, వాసాలు, చక్రాలు వినియోగిస్తాడు తప్ప జాతుల సమ్మేళనాన్ని ఆప లేడు. ఒక జాతి శుభం అని, రెండు జాతులు మధ్యమం అని నిబద్ధించటం మూఢనమ్మకమే.

గృహనిర్మాణం జరిగిన తరువాత గృహస్థు కష్టనష్టాలకు గురవుతున్నట్లయితే యంత్ర, తంత్రాలతో దిగ్బంధన చెయ్యటం అనే నమ్మకం విచిత్రమయింది. శుభాశుభాలకు కార్యకారణ సంబంధాల్ని గమనించక కేవలం మంత్ర తంత్రాల ద్వారా అరిష్టాలు తొలగిపోతాయని నమ్మటం, నమ్మించటం అనాదిగా వస్తున్న మూఢనమ్మకం. గుడ్లగూబలు మొదలైన పక్షులు రాత్రివేళ సంచారం చేస్తాయని మనకు తెలుసు. వాటి ఆహారాన్వేషణలో వివిధ ప్రదేశాల్లో తిరగడంలో వున్న సత్యానికి దోషాదోషాల్ని అంటగట్టి తద్వారా నాటి పురోహితవర్గం పరాన్న భుక్కులై ఈ యంత్ర తంత్ర కార్యక్రమాల్ని దిగ్బంధనాది అశాస్త్రీయపద్ధతుల్ని ప్రవేశపెట్టి అమాయకులైన ప్రజల్ని నమ్మించారు. ఇంటిలో ఒక మూల గొయ్యి త్రవ్వి యంత్రం పెట్టి తగిన బలి సమర్పించినంత మాత్రానే అరిష్టాలు తొలగిపోతే వైద్యశాస్త్రం, సాంకేతిక శాస్త్రం, విజ్ఞానశాస్త్రాలతో అవసరం లేకుండానేపోతుంది. అనాగరకమైన దశలో మానవుడు వూహించుకున్న నమ్మకాలలో ఈ వాస్తుశాస్త్రం కూడా ఒకటి అని చెప్పక తప్పదు.

నేడు సామాన్యుల్లో కాక ఈ మూఢనమ్మకం గొప్ప గొప్ప ధనవంతుల్లోనూ విద్యాధికుల్లోనూ పాతుకుపోవటం విశేషంగా మనం గమనిస్తున్నాం. భవన శంకు స్థాపన జరిగిన నాటినుండి గృహప్రవేశం జరిగే నాటివరకూ వీరు ఆచరించే మూఢనమ్మకాల్ని చూస్తే మనం మన ప్రగతి విశదమవుతుందనటంలో సందేహం లేదు. ప్రభుత్వాలు, ప్రభుత్వాధికారులు ఈ కార్యక్రమాలకి విశేషమైన ప్రాధాన్యం ఇచ్చి ఇంకా ఇంకా ఈ నమ్మకాల్ని పెంచుతున్నారే తప్ప నిజానిజాల్ని గ్రహించి వీటిని ఖండించటం జరగడంలేదు. ఈ మూఢనమ్మకాల్ని సమూలంగా తొలగించి సభ్యసమాజంలో చైతన్యాన్ని కలిగించటానికి ప్రయత్నించాలి.

# 9. జ్యోతిష్యం

జ్యోతిష్యం అనే పదానికి భవిష్యత్తు వివరించేది అని సామాన్యుల అవగాహన. షడంగాలలో ఇది అయిదవదిగా పేర్కొనబడింది.

"జ్యోతి అంటే కాంతి లేక వెలుతురు. వెలుతురు నిచ్చే వాటిని గురించి చెప్పే శాస్త్రం కాబట్టి జ్యోతిష్యం అని అన్నారు." [1]

సూర్యుడు భూమి మొదలైన గ్రహాలు - నక్షత్రాలు కాంతి లేక వెలుతురు ఇస్తాయని, వీటి గురించి చెప్పబడే శాస్త్రం జ్యోతిశ్శాస్త్రమని వూహించవచ్చు. దీనిని బట్టి సూర్యకుటుంబం, నక్షత్ర కుటుంబాల్ని ఆధారంగా చేసుకొని రాయబడ్డ శాస్త్రం జ్యోతిష్యం అని తెలుస్తుంది. 'జోస్యం' అని దీని తత్భవ రూపం.

"ప్రముఖ అమెరికా ఖగోళ శాస్త్రజ్ఞుడు బార్ట్. జె బాస్ ఇలా అన్నారు. "జోస్యం పిచ్చిని ఖండ ఖండాలుగా ఖండించాలి. 50 సంవత్సరాలుగా నక్షత్రాలను గ్రహాలను పరీక్షిస్తున్నాను. మానవ సంతానానికి జన్మ నక్షత్రాలకు ఎలాంటి సంబంధంలేదు. మనిషి మీద వాటి ప్రభావం ఏమాత్రం వుండదని రుజువైంది. మానవుని విజ్ఞానం నిగూఢమైన నక్షత్రాలు గ్రహాలు వగైరా రహస్యాలను బద్దలు చేయక ముందు ఈ జోస్యాలు వెలిసాయి. ఇప్పుడు చంద్ర సూర్యుల జన్మలనే వివరించి చెప్పగల శాస్త్ర జ్ఞానం గల ప్రపంచంలో ఇంకా జోస్యాలపై ఆధార పడమని చెప్పడం దగా మాత్రమే." [2]

"ఆకాశం మీద గ్రహాలు తిరిగే దాన్ని బట్టి ఇక్కడ మన జీవితం నడుస్తుందని మన జ్యోతిష్కులు ఏవేవో లెక్కలు గడతారు. నిజంగా ఆలోచిస్తే మన వాళ్ల నవగ్రహాలు అనుకునే వాటిల్లో ఎన్నో నిలవవు. రాహువు, కేతువు ఛాయా గ్రహాలు కదా! ఆ రెంటిని ఈ తొమ్మిదింటిలో నుంచి తీసి వేయాలి. ఏడు గ్రహాలు. ఆ ఏడింటిలో గూడా చంద్రుడు నిజంగా గ్రహంకాదు. అది అటు గ్రహమూ - నక్షత్రమూ కాక భూమిని ఆశ్రయించుకుని తిరిగే ఉపగ్రహం. కాబట్టి చంద్రుడు

---

1. మూఢ విశ్వాసవవ కుఠారం - పు. 2 - 133

2. పెళ్ళెందుకు - పు. 6

కూడా దీని నుంచి పోవాలి. ఇప్పుడు ఆరు మాత్రమే తేలాయి. సూర్యుడ్ని గనక గ్రహాల లెక్కలోకి తీసుకోండి. సూర్యుడు గ్రహమే కాదుగా. సూర్యుడు వో పెద్ద నక్షత్రం. ఇక రాగా పోగా పంచ పాండవులంటే నాకెందుకు తెలీదు మంచం కోళ్ళలాగా ముగ్గురు కదా. అనే లెక్క ప్రకారం నవగ్రహాలుపోయి ఇక ఐదు గ్రహాలే అని తేలుతుంది. అయితే మన జ్యోతిష్కులు మాత్రం లెక్కలు నవగ్రహాలనే చెప్పి జనాన్ని మోసగిస్తారు. ఈ ఐదు గ్రహాలు గూడా నిజంగా సూర్య కేంద్రానికి సంబంధించినవో, కావో చెప్పడానికి అనుమానమే అని శాస్త్రవేత్తలు అంటున్నారు. ఈ విధంగా చూస్తే గ్రహాల విషయమే అనుమానమని తెలుస్తుంటే ఇంకా గ్రహాల ప్రభావం మానవుల మీద వుంటుందని తలచటం మాత్రం అవివేకం కాదా! రాహువూ, కేతువూ, చంద్రుడు గ్రహాలు కాకుండా పోయిన తరువాత తొమ్మిది గ్రహాలతో కట్టే లెక్కలన్నీ తప్పులు తడికలగానే తయారవుతాయి గదా! అప్పుడు జ్యోతిష్యం ఏమనుకోవాలి." [1]

జ్యోతిశ్శాస్త్రం గ్రహాలు – నక్షత్రాల గతార్థంతో ఏర్పడిందనే చెప్పాలి. ముహూర్తానికి జ్యోతిషం లెక్క గట్టేటపుడు నక్షత్రాలు ప్రముఖమైన స్థానం నిర్వహించబడతాయి.

"నక్షత్రాలు కదిలేవి కావు: అవి ఒకచోట స్థిరంగా వుంటాయి. ఈ నక్షత్రాలలో కొన్ని మనకు కోటానుకోట్ల మైళ్ళ దూరంలో వున్నాయి. అమెరికా 1972 వ సం॥ ఆగస్టు 20 వ తేదీన వాయేజర్–2 ను కొన్ని గ్రహాల పరిస్థితిని తెలుసుకోవడానికి వుపయోగించారు. ఈ రోదసీ నౌకలు మనకు సమీపంలో వున్న నక్షత్రాన్ని చేరుకోవడానికి 4 సంవత్సరాలు పడుతుందట. ఇక ఆ నక్షత్రం మనకు ఎంత దూరాన వుందో ఆలోచించండి. కొన్ని నక్షత్రాల సూర్యునికి 70 కోట్ల మైళ్ళ దూరంలో వున్నాయట. ఇంత దూరంలో వున్న నక్షత్రాల కాంతి గంటకు సుమారు 72 వేల మైళ్ళ వేగంతో తిరిగి భూగోళం మీదను, దాని మీద వుంటున్న జీవుల మీదను ఎప్పుడు పడునో ఆ కాలాన్ని లగ్నము లేక ముహూర్తం అంటారు. ఇంత వేగంగా తిరిగే భూమి యొక్క ఒక్కొక్క భాగం ఒక్కొక్క రాశి ఎదుట తక్కువ కాలం ఒక్కొక్క భాగం ఒక్కొక్క రాశి

---

1. మూఢ విశ్వాసవన కుఠారం – పు. 2–138

ఎదుట ఎక్కువ కాలం వుంటుందట: ఆధునిక రోదసీ యుగంలో ఇంతవరకు కనిపెట్టబడిన ఏ యంత్రం కూడా ఆ కాలాన్ని కనుగొనలేక పోయింది."[1]

తెలుగు సాహిత్యంలో జనన సందర్భాలలో - వివాహ సందర్భాలలో ఉత్సవాది విశేషాలలో జోస్యం గురించిన వివరణలు అనేకం చెప్పబడ్డాయి.

పల్నాటి వీర చరిత్రలో బాలచంద్రుని అవక్ర పరాక్రమాల విశేషం అందరికి తెలిసిందే. బాలచంద్రుడు జన్మించిన సందర్భంలో జ్యోతిష్కుడు తండ్రి బ్రహ్మన్నతో బాలచంద్రుని భవిష్యజ్జీవితం ఈ విధంగా వివరిస్తాడు.

"ప్రభూ! యీ బాలుడు పల్నాడులో జన్మించిన వీర చంద్రుడే గాని, యితడు పల్నాడులో రక్తపు చేరులు పారిస్తాడు."[2]

ధర్మరాజు అశ్వమేధయాగంచేసిన సందర్భంలో యాగాశ్వం వెంటఅర్జునుడు కాపుగాబయలుదేరాడు.వారిఅశ్వం చంద్రహాసుని నగరం ప్రవేశించగా చంద్రహాసుని సైనికోద్యోగులు బంధించారు. అర్జునుడు చంద్రహాసునితో యుద్ధానికి సిద్ధం కాగా శ్రీకృష్ణుడు చంద్రహాసునితో యుద్ధానికి తలపడటం సాధ్యం కాని పని అని అతనితో సంధి చేసుకొమ్మని అర్జునునకు చెప్పే సందర్భంలో చంద్రహాసుని కథ ఈవిధంగా చెప్పాడు.

చంద్రహాసుడు జన్మించినది మూలతార నక్షత్రం అవడంచేత పెద్దలకు గండం కలుగుతుందట.

> "మూలతారయందు బొడముట గురులకు
> గండ మొదవుననెడి కతనెఱింగి
> యుండియును వచింపనోడిరి పెద్దలు
> పతిమనంబు కలఁత పడునొయనుచు"[3]

విదిశా పురంలో సోమశర్మ - రేవతి అనే బ్రాహ్మణ దంపతులకు లేక లేక ఒక బాలిక జన్మించింది. ఆమె జన్మించిన జన్మ నక్షత్రాన్ని పరిశీలించగా.

---

1. పెళ్ళెందుకు పు. - 59
2. పల్నాటి వీరచరిత్ర - పు. 166
3. చంద్రహాస చరిత్ర పు 1-49

అస విని యిది యేమియు లే
దనఘ గుణా ! మీఁద జారయగునిది యటుగా
పునఃజంతించెదనన.

ఆ పుట్టిన బాలిక జారవనిత పౌతుందట.

రథోత్స వాదులకు సైతం జ్యోతిష్య నియమ ప్రకారం జరిపే ఆచారం వుండేది.

"వినుము కన్యారాశి నినుడుండు మాసాన జిత్రతార ననుచితముగాను శాస్త్ర సమ్మతముగా శాస్త్రముగాన నారోహణాదులు చేసి రూఢి మెఅయ నుత్తరాషాఢ రథోత్సవం చొనరించి." 1

ఇటువంటి ఉదాహరణలు రజస్వల సందర్భాలలోను వివాహ సందర్భాల్లోను మరణ సమయాలలోనూ నిత్యజీవిత వ్యవహారంలోను అనేకం సాహిత్యంలో చోటు చేసుకున్నాయి.

ఈ విధంగా గ్రహాలు – నక్షత్రాలు తమ ప్రభావం మానవులమీద చూపిస్తా యనే నమ్మకాలు ఎంతవరకు నిజం ? వాటిని బట్టి మానవుని జీవిత సత్యాలు జరుగుతాయనే మూఢ నమ్మకాల్లో ఏమాత్రం నిజం వుందో పరిశీలించాల్సిన అవ సరం వుంది.

అనంతంగా వున్న నక్షత్రాల్ని గోళాల్ని (గ్రహాలు) చూస్తే వాటిలో మనం నివసించే భూమి చిన్న పరమాణువు మాత్రమే. ఇంత చిన్న గోళం మీద నివ సించే మన కోసం ఈ విశ్వమంతా సృష్టించబడిందని మన వాళ్ళు (జ్యోతిష్కులు) వూహించారు.

"మహోన్నతమైన ఈ విశ్వంలో వున్న గోళాలకు పరస్పరమైన సంబంధం లేదనడానికి వీలులేదు. కాని గోళానికి గోళానికి ఏమైనా సంబధం వుందని మనం కనక అనుకుంటే అది ఒక్క వెలుతురు ద్వారానే కానీ ఇంకో రకంగా మాత్రం

---

1. వేంకటాచల మాహాత్మ్యము – పు. 2 – 107

కాదు. అట్లాగే నక్షత్రాలు మన జీవితాల్ని ఏమైనా నడిపిస్తున్నాయన్నా లేక మనపై వాటి ప్రభావం వుందన్నా అది వాటినుంచి వచ్చే కాంతి మూలాన జరగ వలసిందే కాని ఇంకే రకంగా జరగడానికి వీలులేదు. ఇప్పుడు మనమీద సూర్యుడు వెలుగు పడుతుంది కదా! ఈ సూర్యకాంతి మూలాన అప్పుడప్పుడూ మనకు చిరాకు కలుగుతూ వుంటుంది తాపం కలుగుతుంది. ఇంకోసారి ఆనందం కలుగు తుంది. ప్రకృతిలో దీనిమూలాన రకరకాల మార్పులు వస్తున్నాయి. నక్షత్రం దగ్గర నుంచి బయలుదేరిన కాంతి కేవలం ఏ ఒక్క వ్యక్తిమీదనో పడదు కదా! అది విశాల స్వరూపంలో తన శక్తిని ప్రసరింపజేసి దానివలన కలిగే ఫలితాన్ని అంత టికీ ఇస్తుంది. కాబట్టి వొకవేళ నక్షత్రాలనుంచీ కాంతి బయలుదేరినా ఫలానా కాలంలో పుట్టినవాడికే ఇది సోకుతుంది; తరువాత పుట్టినవాళ్ళకు ఇది సోకదు అని చెప్పడానికి ఆధారమేమి లేదు. కాబట్టి వచ్చే లాభమో నష్టమో అంతా సమానంగా వుంటుందనే యెన్నుకోవాలి. ఇప్పుడు సూర్యుడు మనకు దగ్గరలో వున్నాడు కాబట్టి సూర్యుణ్ణి గురించి చెప్పాం. సూర్యుడు కాక ఇంకో మూడు నక్షత్రాల వెలుగు మనకు కనిపించాలంటే దాదాపుగా వంద సంవత్సరాలు పడుతుంది. అంటే అవి అంత దూరంలో వున్నాయన్నమాట. ఇంకా ఇంతకంటే దూరంలో వున్నవి కూడా కొన్ని కోట్లు వున్నాయి. ఆ మూడు నక్షత్రాల కాంతి రావడానికి వంద సంవత్సరాలు పడుతుందంటే మనిషి పూర్ణంగా బ్రతికిన ఆయుస్సు అని అర్థం చేసు కోవాలి. ఇన్ని సంవత్సరాలు వరుసగా ఎవ్వరూ బతకరు కదా! అందుకని భూమి మీద నివసించే మనకు దాదాపుగా ఏ నక్షత్ర ప్రభావం వుండదనే చెప్పాలి. ఒక్క సూర్యుడి ప్రభావం వుంటుంది. దాని మూలాన వచ్చే ప్రభావం మనం చూస్తూనే వున్నాం." 1

అందుచేత నక్షత్రాల ప్రభావం మనిషిమీద చూపదు. ఇక రాసుల సంగతి చర్చించ నవసరం లేదు.

మానసిక వ్యాధులకు గ్రహాల ప్రభావం అందులోనూ చంద్రగ్రహ ప్రభావంవల్ల చాలావరకూ కారణమనే అభిప్రాయం ప్రాచీనకాలంలో వుండేది. మనశ్చాంచల్యాన్ని తెలిపే 'లూనసీ' అనే పదం దీన్నిబట్టి ఏర్పడిందే. రోగి చేసు కున్న పూర్వజన్మ కర్మ ఫలితంవల్ల మానసిక రోగాలు కలుగుతాయనే నమ్మకం

1. గ్రుడ్డినమ్మకాల గుట్టుమట్టులు – పు. 142

వుంది. అందుచేత ఈ రోగుల కర్మ పరిపాకం పూర్తయ్యేవరకూ బాధ పడవల సిందేనని చికిత్స లేకుండా వదలిపెట్టేవారు. వారిని చాలా క్రూరంగా, నిర్దయగా చూచేవారు. భూతం సోకిందని, చేతబడివంటి క్షుద్రశక్తులు సోకాయని భావించి భూతవైద్యులచేత చికిత్సలు చేయించేవారు వారు ఈ రోగుల్ని హింసించే విధానం చూస్తే మనకు శరీరం జలదరించవలసిందే.

సిగ్మండ్ ఫ్రాయిడ్ చేసిన పరిశోధనల ఫలితంగా మానసిక వ్యాధులు వెలుగులోకి వచ్చి ఇవి గ్రహాల ఫలితం కాదని మానసిక బలహీనతలే కారణాలని తెలిసింది.

బిడ్డ పుట్టి పుట్టగానే మనవాళ్ళు నక్షత్రం, వారం, వర్జ్యం గురించి జాతక శాస్త్రంలో నిష్ణాతుడైన జ్యోతిష్కుని దగ్గరకు తీసుకువెళతారు ఆయన సంభావన అందుకుని పిల్లవాని భవిష్యత్తు గురించి ఆశావహంగానే రాస్తాడనటంలో సందేహం లేదు.

జాతకం రాయటంలో బిడ్డ మొదట భూమిమీద పడినప్పటినుంచి రాశిచక్రం-అంశచక్రం వేసి భవిష్యత్తు చెపుతాడు. అందుచేత బిడ్డకు అప్పటినుండి ప్రాణం మొదలయిందని భావిస్తాడు. కాని వాస్తవంగా ఆలోచిస్తే ఆ బిడ్డ తల్లి గర్భంలో జన్మించిన నాటికి ముందే నవమాసాలుగా ప్రాణి రూపం దాల్చాడనే సత్యం వీళ్లు మరచిపోయారు తల్లి తినే అన్నరససారాన్ని గ్రహించి తల్లిమీద ఆధారపడి జీవిస్తున్నాడు. తల్లి గర్భంలో బిడ్డగా రూపుదిద్దుకొనక ముందు తండ్రి తల్లి శుక్ర-శోణితాలకలయికచే అండం రూపంలో వుందా జీవి. కాబట్టి ఈ జీవపదార్థం అంతకు ముందునుంచే జీవించి వుంది కాని బిడ్డ పుట్టినప్పుడే అకస్మాత్తుగా ప్రాణం రాలేదు. అందుచేత జాతకం రాయడానికి వున్న మూలసూత్రం మాయగా మిగిలి పోతుంది తప్ప నిజానికి తావు లేదు.

మనం వారం వారం పత్రికల్లో వచ్చే వారఫలాల్ని గురించిన సమాచారం చదువుతూనే వుంటాం.

ఒకే వారంలో వెలువడ్డ వివిధ వారపత్రికల్లో మేషరాశి గురించి ఇచ్చిన భవిష్యత్తు ఈ విధంగా వుంది.

ఆంధ్రప్రభ (వారపత్రిక) 14-3-84 నుండి 20-3-84 వరకు.

"మేషం (రాశి) :- మీరు సృష్టి ప్రారంభ రాశిలోని వారు కావడం విశేషం. వర్తమానంలో శనిగ్రహ ప్రభావం అమితంగా మీపై వుంది అందువలన మీ కోరికలు విని, ఎట్లాంటివైనా సరే మీ కోరికలు తీర్చి మీరిచ్చే కొబ్బరికాయలకు, మొక్కుబడలకు అమ్ముడుపోయి మీ ప్రక్కన నిలిచి భగవచ్ఛక్తి మీ పనులు చేసిపెట్టాలంటారు భ్రమపడకండి భగవంతుని కొనలేరు భక్తితో ఆరాధించి మీ కష్టాలనుండి గట్టెక్కండి."

ఆంధ్రపత్రిక (వారపత్రిక) 16-3-84 నుండి 22-3-84 వరకు

"మేషం (రాశి) :- వ్యాపారం అనుకూలం. వ్యవహారం ఏదైనా వుంటే అనుకూలంగా పరిష్కరింపబడగలదు. దూరప్రాంతాలనుండి బంధువులు యింటికి రానున్నారు. వారికి ఉపచరించుటయే గాక అనుకొనని విధంగా ఖర్చు కావటం గమనిస్తారు స్త్రీలకు ఉద్యోగాలందు పెంపు కనిపిస్తుంది."

ఆంధ్రజ్యోతి (వారపత్రిక) 16-3-84 నుండి 22-3-84 వరకు.

"మేషం (రాశి) :- మనస్సుకు ఏ ఆలోచనా తోచక చాలా ముఖ్యమైన పనులను తెచ్చుకుంటారని తోస్తుంది. అందువల్ల ప్రశాంతత కూడదీసుకొనండి. డబ్బు ఖర్చు చాల ఎక్కువ. యీ వారం వృత్తి, ఉద్యోగాలు గౌరవంతో సాగుతవి. ఉత్తమమైన పుస్తకాలు చదివి విజ్ఞానం పెంచుకొంటారు. 19, 20 తేదీలలో దైవారాధన. కోర్టులో గెలుపు."

ఒకే వారం- ఒకే లగ్నం- నక్షత్రరాసులన్నీ తమ తమ గళ్ళలోనే వున్నాయి. అయినా వివిధ జ్యోతిశ్శాస్త్రవేత్తలు భిన్నాభిప్రాయాలు వెలిబుచ్చారు. ఎందుకు ఈ విధంగా జరుగుతుంది? అందరికీ ఒకే అభిప్రాయం రావాలి గదా! శాస్త్రం ఒకేవిధమైన సిద్ధాంతాన్ని ఇస్తుందే తప్ప వేర్వేరు సిద్ధాంత వివరణను ఇవ్వదుగదా!

వివాహాల సమయాల్లో పెట్టే లగ్నాల గురించి మనం వింటూనే వున్నాం. చూస్తూనే వున్నాం. ఒక పురోహితుడు పెట్టిన లగ్నం మరో పురోహితుడు ఖచ్చితంగా దుష్టలగ్నం అంటాడు. ఈ విధంగా ఎందుకుండాలి కాలనిర్ణయం ప్రకారం ఒకేరకంగా వుండాలి వివిధ శాస్త్రవేత్తలు వివిధాభిప్రాయాల్ని చూపిస్తారు.

ఈ దేశంలో పురోహిత వర్గం తమ వంతు కర్తవ్యం సామాన్యుడిమీద చూపించింది. అమాయకుడైన సగటు మనిషి ఈ జ్యోతిష్యం, కర్మ సిద్ధాంతం, గ్రహచారం నమ్మి ఈ వూబిలో కూరుకుపోయి నేడు లేవలేని దశలో వున్నాడు. అనంత దూరంలో వున్న నక్షత్రాలకు, గ్రహాలకు మనకు ఎలాంటి సంబంధం లేదని నేడు విజ్ఞానశాస్త్రం వివరించినా మనం మాత్రం గ్రహబలంపై ఆధారపడే అనాగరిక దశలోనే వున్నాం.

ఈ జ్యోతిష్యాన్ని ఓ శాస్త్రంగా నమ్మి మన తెలుగు విశ్వవిద్యాలయంవారు కళాశాల విద్యార్థులకు పాఠ్యాంశంగా నిర్ణయించటం శోచనీయం. ఇది తిరోగమన సిద్ధాంతమని, ఈ సిద్ధాంతాన్ని విద్యార్థులు వల్లించి వేదకాలంనాటి సమాజానికి చేరుకుంటారనేది నగ్నసత్యం. రోదసీ శాస్త్రం, రోదసీ ప్రయాణాలు, గ్రహాల పరిస్థితి ఈ మూఢనమ్మకాల వలయాన్ని ఛేదించి దేశసౌభాగ్యానికి, వ్యక్తి చైతన్యానికి మార్గం సుగమం చెయ్యాల్సిన అవసరం ఎంతైనా వుంది.

# 10. హస్త సాముద్రికం

సాముద్రికం అంటే "భాగ్య సూచిక దేహ లక్షణము" అని అర్థం. సాముద్రకం అంటే భాగ్య సూచిక దేహ లక్షణాలను తెల్పుతుంది అని అర్థం. సాముద్రికం సాముద్రకం – రెండూ ఏక పదాలే, రూపాంతరాలే, సమానార్థకాలే. భాగ్యం అంటే తనయొక్క అదృష్టాన్ని తెల్పే శాస్త్రం అని భావించవచ్చు. హస్త సాముద్రికం అంటే హస్తాన్నిబట్టి ఆయా వ్యక్తులు భవిష్యత్తుకు, అదృష్టాన్ని చెప్పే శాస్త్రం. చేతిలో వున్న రేఖలను, గీతలను ఆధారంగా చేసుకుని ఆయా గీతల ప్రభావం వల్ల కలిగే లాభనష్టాల్ని లెక్క కట్టే శాస్త్రం హస్తసాముద్రిక శాస్త్రం.

గత కాలంనుంచి ఇటువంటి నమ్మకాలు మన సమాజములో వ్యాపించి వున్నాయి. దీనికి ఉపపత్తిగా హస్తరేఖా శాస్త్రవేత్తలు సామాన్యులపై కొన్ని విచిత్రమయిన భావాలు నిర్దుష్టంగా అంటకట్టారు

"భూమియు, నవగ్రహములును, నక్షత్రములును తమ తమ శక్తులను ఒకదాని కొకటి ఇచ్చుచు పుచ్చుకొనుచూ ఒక విధమగు నియమమునకు లోబడి యున్నవి. అనంత రూపములతో కూడుకొనియున్న ఈ ప్రకృతి యంతయు సూక్ష్మమును అవాఙ్మానస గోచరమును నగుచిత్పదార్థము యొక్క రూపమేగాని వేఱుగాదు. అట్టి యీప్రకృతి యందు పరమాణువులన్నియు కొన్ని ఒకదాని కొకటి అనుకూలమున విడివడుచు ఒక విధమయిన క్రమమునకు లోబడి వర్తిల్లుచున్నవి. ఆ రీతిగా ఈ భూవలయమున గల ప్రాణుల శరీరము లన్నియు ఒక విధమయిన భూతతత్త్వము గలవియై తమ శరీర మందలి ప్రాణము, శక్తి, చలనము నవగ్రహముల నుండి పొందుచున్నవి. ఆ రీతిగా మానవ శరీరములకు నవగ్రహములనుండి వివిధ రూపముల నవశక్తులు కలుగుచున్నవని గ్రహింప వలయును. అందువలన మనుష్యుడు భూమిపై ఉద్భవించు కాలమున (భూపతనము) గ్రహములు, నక్షత్రములు ఏ ఏ స్థానములందుండునో ఆయా స్థాన విశేషములను బట్టి ఆయా గ్రహముల యొక్క శక్తి మానవ శరీరమందు ప్రవేశించి సమ్మేళన మగుచున్నది. ఇదియే శాస్త్రము యొక్క మూలము." 1

"అఱచేతి ద్వారా ప్రవహించు ఈశక్తి యొక్క ప్రసరణ జాడలే అఱచేతి యందలి రేఖలని విజ్ఞాన వేత్తల వచనములు. వివిధ రకములగు మానవ శరీరమందు ప్రవేశించుచున్న నవగ్రహముల శక్తి అఱచేతి ద్వారా ప్రవహించుచు గ్రహ ప్రదేశ ములను చేరుకొని అచట రసాయనిక మార్పులు బొంది చివరకు భావరూపమున క్రమముగా మెదడునకు చేరుచున్నది. అట్టి ప్రసరణము అఱచేతి యందలి మధ్య భాగములో నుండు గుంట ద్వారా విశేషముగా జరుగుచుండును. అందువలన అట్టి శక్తి ప్రసరణకు ఈ స్థానము కేంద్రముగ నున్నది. ఈ స్థానము లోతుగనుండిన ప్రసరణము స్వల్పముగ నుండును; ఎత్తుగ యుండిన అధికముగ యుండును.

1. హస్త రేఖాశాస్త్ర సంగ్రహము పు. 2

అందు వలననే ఈ స్థానము మృదువుగా యున్నచో యథార్థ హృదయుడగును. కఠినముగ యుండిన కఠిన స్వభావము గలవాడగును. హస్త సాముద్రికము యొక్క రహస్య మిదియే." [1]

ఈ విధంగా అరచేతిలో వున్న రేఖల నాధారంగా మానవ నైజం మానసిక ప్రవృత్తి కనిపెట్ట వచ్చును.

"గ్రహముల నుండి మన శరీర మందు ప్రవేశించుచుండు చైతన్యశక్తి, ప్రాణశక్తి మొదలైనవి పురుషులకు కుడి హస్తము నుండియు, స్త్రీలకు ఎడమ చేతి నుండియు విశేషముగ ప్రసరించు చుండును అందువలన పురుషులకు కుడిచేతిని, స్త్రీలకు ఎడమ చేతిని పరీక్షించి ఫలితములు చెప్పుచుండ వలెను. పురుషులకు ఎడమచేతి యందుండు రేఖలను వారివారి తల్లిదండ్రుల నుండి వారసత్వముగ గలుగు స్వభావములు, అనారోగ్యములు మొదలగు లక్షణములను తెలియజేయు చుండును." [2]

హస్త సాముద్రికం చెప్పే శాస్త్రకారులు ఏ సమయంలో హస్తాన్ని పరీక్షించాలో ఈ విధంగా వివరించారు.

"అరచేతి యందలి రేఖలు ఉదయమున స్పష్టముగ కనబడును. అందువలన ఉదయముననే హస్త పరీక్ష గావించుట ఉత్తమము. మధ్యాహ్న సమయమందు పరీక్షించుట మధ్యమము. సాయం సమయము అసుర సంధ్యవేళ హస్తమును పరీక్షించుట అధమము. రాత్రి పరీక్షించుట అధమాధమము." [3]

అరచేతిలో రేఖలు వుండవలసిన క్రమ పద్ధతి దాని వివరణ ఈ విధంగా వుంది.

అవి శిరోరేఖ, జీవితరేఖ, ధనరేఖ లేక అదృష్టరేఖ, హృదయరేఖ, వివాహరేఖ, ఆరోగ్యరేఖ, ప్రయాణరేఖ, అపాయ రేఖలు.

---

1. హస్త రేఖాశాస్త్రము (సాముద్రికము) పు. 7
2. హస్త రేఖాశాస్త్ర సంగ్రహము పు. 15
3. హస్త రేఖాఫలము పు. 14

ఈ రేఖలు వాటిస్థాన విశేషాల్ని పరిశీలిద్దాం.

"శిరోరేఖ అఱచేతిలో బొటనవ్రేలికి పైభాగమున ప్రారంభమై అఱచేతికి రెండవ వైపువరకు వ్యాపించుచుండును". ఇది శక్తి సామర్థ్యాల్ని తెలుపుతుంది.

ఈ రేఖ తరువాత ముఖ్యంగా గమనించవలసిన రేఖ జీవితరేఖ. ఈ రేఖకే శుక్రరేఖ లేక శుక్రస్థానము అనిపేరు. ఇది బొటనవ్రేలికి క్రింది భాగంలో వున్న ఎత్తయిన ప్రదేశం. ఈ ప్రదేశం అరచేతిలో ఉబ్బెత్తుగా నున్న స్థానము.

బొటన వ్రేలికి క్రింది భాగములో ఉన్నతముగ యుండు స్థానమును చుట్టి వ్యాపించి యుండు రేఖ జీవితరేఖ యనబడును. బొటన వ్రేలికి క్రింద భాగములో నుండు ఉన్నతముగ నుండు స్థానము హృదయ కోశముతోడను, ఉదర మందలి ముఖ్యమగు వాటితోడను, అండకోశము తోడను సంబంధము కలిగి యున్నది. ఇది అండకోశములతో సంబంధించిన స్థానమగుటచే ఈ స్థానమునకు శుక్రస్థానమని పేరు వచ్చినది.

ఈ స్థానము శరీర మందలి ముఖ్యమగు వానితో సంబంధము కలిగి యుండుట బట్టియే దీనిని చుట్టియుండు రేఖ వలన ఆయుర్దాయము తెలుసుకొనుటకు వీలగుచున్నది. అందువలననే యీ రేఖకు జీవిత రేఖయని పేరు వచ్చినది. యీ రేఖను బట్టియే ఆరోగ్యము, వ్యాధి మొదలగు విషయములను కూడా తెలుసుకొన వచ్చునని గ్రహింప వలెను." [1]

జీవితరేఖ తరువాత ముఖ్యమయిన రేఖలు హృదయరేఖలు.

"హృదయ రేఖను ఆత్మరేఖయని కూడ యనెదరు. ఈ రేఖ మొదటి వ్రేలు క్రింద యుండు గురు స్థానము మీద ప్రారంభమై అరచేతిలో అడ్డముగను తిన్నగను వ్యాపించి చిటికెన వ్రేలు అనబడు నాల్గవవ్రేలి క్రిందనుండు బుధ స్థానము చివరి వరకును వ్యాపించి యుండును.

హృదయ రేఖ పూర్తిగా ప్రేమకు సంబంధించిన విషయములను మాత్రమే సూచించును. ప్రేమ పూరిత భావములను సూచించునని భావము ఈ రేఖ శిరోరేఖకు

1. హస్త రేఖాశాస్త్రము (సాముద్రికము) పు. 38

పై భాగము నందుండును. శిరోరేఖ పైనుండు రేఖలన్నియు మనో విషయములకు సంబంధించిన రేఖలుగను క్రింద నుండు రేఖలు శరీర బలమునకును సంబంధించి నవిగను నుండును. అందుచేత యీ హృదయ రేఖ మనో భావములను తెలుపు రేఖగ పరిగణింప వలయును." [1]

మిగిలిన రేఖల ఫలితాల్ని కూడా పరిశీలిద్దాం.

**ధనరేఖ లేక అదృష్టరేఖ**

"అదృష్టరేఖ జీవితరేఖ నుండి ప్రారంభించ వచ్చును. కొందరి హస్తములలో ఇది జీవితరేఖతో సంబంధము లేక జీవితరేఖకు అవతలి భాగమునుండి ప్రారంభము కావచ్చును. కొందరి చేతులలో ఇది మణికట్టునకు పై భాగమునుండి ప్రారంభమగు చుండును. కొందరి హస్తములలో అరచేతి మధ్య భాగమునుండి ప్రారంభమగు చుండును ఇది అదృష్టము లేక ధనానికి గుర్తు" [2]

**వి వా హ రే ఖ లు**

"నాల్గవ వ్రేలు అనగా చిటికెన వ్రేలు క్రింద అరచేతికి ప్రక్క భాగములో బుధ స్థానము మీద అడ్డముగ వ్యాపించి యుండు చిన్నరేఖలు వివాహరేఖలన బడును.

ఇవి వివాహము, విడిపోవుట, అనేక వివాహములు మొదలైనవి తెలియ జేయును. [3]

**ఆ రో గ్య రే ఖ**

"ఆరోగ్యరేఖ బుధ స్థానము మీద ప్రారంభమై క్రిందకు అరచేతిలో అడ్డముగ వ్యాపించి జీవితరేఖను తాకుచుండును. ఈ రేఖ హస్తములో యుండుట మంచిదికాదు. ఇది యున్నచో ఆ వ్యక్తి అనారోగ్యంతో పీడింపబడువాడగును. ఈ రేఖ సాధారణముగ సూక్ష్మ పురుగుల వ్యాధిని కలుగజేయును. ఆరోగ్యరేఖ జీవిత రేఖను కలుసుకొను స్థానము ఎంత వయస్సగునో ఆ వయస్సు వచ్చుసరికి ఆ వ్యాధి పూర్తిగా వ్యాపించినదని తెలిసికొనవలెను." [4]

---

1. హస్త రేఖాశాస్త్ర సంగ్రహము పు. 80
2. హస్త రేఖాశాస్త్రము (సాముద్రికము) పు. ౮౫
3. హస్త రేఖాశాస్త్రము (సాముద్రికము) పు. 88
4. హస్త రేఖాశాస్త్రము (సాముద్రికము) పు. 91

ఇవి కాక అనేకమైన రేఖలు ప్రయాణ రేఖలు అపాయరేఖలు సంతానరేఖలు సంతానంలో స్త్రీ పురుష విభాగాలు మొదలైనవి ఈ హస్త రేఖాశాస్త్రములో చర్చించబడ్డాయి.

మానవుడు ప్రకృతిలో ఒక భాగం అనే అంశాన్ని మనం అంగీకరించ వలసిందే. ఒకప్పుడు భూకేంద్ర సిద్ధాంతం, ఈనాడు విజ్ఞానశాస్త్ర ఫలితంగా సూర్య కేంద్ర సిద్ధాంతంగా పరిణమించింది. సూర్య కుటుంబంలో సూర్యుని యొక్క ప్రభావం మిగిలిన గ్రహాలకు తాకే అవకాశం మాత్రమే వుంది. మిగిలిన గ్రహాల వాతావరణ పరిసరాల ప్రభావం వాటికి మాత్రమే పరిమితం. భూమికి మిగిలిన గ్రహాలకంటే ప్రత్యేకమైన ప్రతిపత్తి వుంది అదే భూమికి గల అయస్కాంత శక్తి ఆ విధంగా కాక మిగిలిన గ్రహాల ప్రభావము మానవుల మీద సోకుతుంది అని భావించడం ప్రాకృతికమైన మూఢ నమ్మకం.

అరచేతిలో వున్న రేఖలే జీవిత ప్రమాణాల్ని, జీవితాల్ని నడిపిస్తాయనే మూఢనమ్మకం అనాదిగా మానవునిలో ప్రవేశించిన ఆనాలోచన మాత్రమే. కేవలం మనిషికి మాత్రమేకాక అరచేయి కలిగిన జీవ జంతుజాలాలకు కూడా అరచేతిలో రేఖలున్నాయనే విషయము మరువరాని సత్యం. జంతు ప్రదర్శనశాలల్లో వున్న కోతులు, చింపాంజీలు, ఉరాంగ్, ఉతాంగ్ మొదలైన మానవ సంతతికి మూలపురుషుల అరచేతుల్లో కూడా రేఖలున్నాయి. (ఈ వ్యాసకర్త నెహ్రూ జూలాజికల్ పార్కులో వున్న కోతుల్ని, చింపాంజీ, నరకోతి అని పిలువబడే ఉరాంగ్ ఉరాంగ్ చేతుల్ని పరిశీ లించడం జరిగింది.) మరి ఆ జంతువుల హస్త సాముద్రిక ఫలితాలేమిటి ? ఇది పరిశీలించాల్సిన అవసరం వుంది.

తల్లి కడుపులో పిండం ఏర్పడిన తరువాత ఆరవ మాసము నుండి గుప్పిట పట్టడం నేర్చుకుంటాడు. గుప్పిట మూయ్యడం తెరవడం వంటి చర్యల వల్ల హస్త రేఖలు ఏర్పడతాయనే సత్యాన్ని జననం – పుట్టక **(Birth & Born)** శాస్త్రం వివరిస్తుంది. బిడ్డ జన్మించి పెరిగి పెద్దవాడయిన తరువాత తాను చేసే పనినిబట్టి చేతిలో రేఖలు మారుతాయనే విషయం మనం గమనించాలి. కలం పట్టుకునే వారి చేతికి, గొడ్డలి మొదలయిన వెడల్పాటి వస్తువు పట్టుకొనే కార్మికుని చేతికి రేఖల్లో తేడా కన్పిస్తుంది. అది అతడు పిడికిలి బిగించి తెరిచే

విధానం మీద ఆధారపడి వుంటుంది అందుచేతనే మన అరచేతిలో ఒకసారి వున్న రేఖలు మరొకసారి లేకపోవడానికి, కొన్ని కొన్ని సమయాల్లో కొత్త రేఖలు కనిపించడానికి ఇదే కారణం.

ఈ విషయాన్ని గ్రహించలేక అమాయకులైన వారు ఈ శాస్త్రాన్ని నమ్మడం జరిగింది చేతిలోని రేఖ జీవితాన్ని నడిపించ లేదన్న సత్యాన్ని గ్రహించినప్పుడు గాని ఈ శాస్త్రం కల్పించిన అసత్యాన్ని ఖండించడం జరగదు. విజ్ఞానవంతులని భావించబడుతున్న అనేకులైన విద్యాధికులు సైతం ఈ రేఖాశాస్త్ర మత్తులో మునిగి పరాన్న భుక్కులైన ఈ హస్త రేఖాశాస్త్ర పారంగతుల్ని ఆశ్ర యించడం, భంగ పడడం జరుగుతూనే వుంటుంది.

అమాయకులైన పల్లె పాటక జనం ఈ శాస్త్రాన్ని ఎక్కువగా నమ్మి వున్నది కాస్త పోగొట్టుకుటున్నారు. అనారోగ్యం పాలయిన కొంతమంది అమాయకులు ఈ హస్త రేఖాశాస్త్రాన్ని నమ్మి సామాన్య వైద్య సహాయం కూడా పొందక రోగం ముదరబెట్టి మరణించిన ఘటనలు అనేకం. చేతిలోవున్న ధనరేఖ ఆధారంగా ఆకస్మిక ధనలాభం కలుగుతుందనే మూఢనమ్మకంతో చెమటోడ్చి, కండల్ని పిండి సంపా దించిన ఒకటి రెండు రూపాయల్ని భాగ్యలక్ష్మి పేరుతో లాటరీకి డబ్బుకట్టి చేతులు దులుపుకునే అభాగ్యులకు ఈ దేశంలో లెక్క లేదు రెండో పెళ్ళియోగం వుందనే దురుద్దేశంతో తన భార్యకు నీళ్ళుతోడిన మహానుభావులు లేకపోలేదు. సంతానయోగం లేదని జ్యోతిష్కుడు లేక హస్తశాస్త్ర ప్రవీణుడు తన ఉవాచపలికితే నిజమని నమ్మి భార్యను అవమానించే అనుమాన పిశాచులకు లెక్కలేదు. చేతిలో వున్న శనిరేఖ అనో, అపాయరేఖ అనో, మృత్యురేఖ అనే భయంతో శాంతుల పేరుతోనో గుడిలో అభిషేకాల పేరుతోనో ధనం దుర్వినియోగం చేసే ఆశోపహతులకు ఈ హస్త రేఖాశాస్త్రం ఆలంబనం.

అశాస్త్రీయమైన ఇటువంటి మూఢనమ్మకాల్ని మేధావులు గ్రహించి అమా యకులకు వివరించి వీటి గుట్టుమట్టుల్ని బట్టబయలు చేసి ఈ శాస్త్రాన్ని ఆధారంగా చేసుకుని జీవించే పరాన్న భుక్కుల ఆటకట్టించ గలిగినప్పుడే జాతి జాగృతం కాగలదు.

# 11. ప్రమాణం చెయ్యటం

ప్రమాణం చెయ్యటాన్ని ఒట్టు వేసుకోవడం అనికూడా అంటారు. అభిప్రాయభేదాలు వచ్చినప్పుడు గాని, పందెం వేసుకునే సమయాల్లోగాని, నిజాయితీని నిరూపించుకునే సమయాల్లోగానీ, చేసే ప్రయత్నాన్ని ప్రమాణంగా నిర్ణయించవచ్చు.

"ఒట్టు వేసుకోవడం, ప్రమాణం చెయ్యడం చాలా పురాతనమైన ఆచారం. ఇది ప్రపంచంలోని అన్ని దేశాల్లోనూ వుంది. మనిషి తాను చెప్పిన మాటలు సత్యమని, తాను ఆ మాటకు విరుద్ధంగా ప్రవర్తించననీ రూఢి చెయ్యటానికి ఒట్టువేసుకుంటాడు ఈ ఒట్టు వేసుకునే పద్ధతి దేవుడిమీద, ప్రియమైన బంధువుల మీద, ప్రాణప్రదమైన వస్తువుల మీద పెట్టి ఒట్టు వేసుకుంటారు. దేవతా విగ్రహం ముట్టుకుంటూ తాను చెప్పేమాట చెపుతాడు. దైవస్వరూపమనుకుంటున్న బైబిల్ కురాన్ మొదలైన వాటిని తాకుతూ ఆ మాట చెపుతారు. కొందరు దేవతా ప్రసాదం చేతిలో పట్టుకొనిగాని తీర్థం సేవించిగాని ఆ మాట అంటారు.

అర్థం ఏమిటి ? ఆ మాటకు తప్పినట్లయితే నేను ఈ దేవతకు అపరాధం చేసినవాడి నవుతాను. ఈ దేవత ఆగ్రహానికి గురవుతాను. దానికి తగిన శిక్షకు పాత్రుడనవుతాను అని ప్రతిజ్ఞ చేస్తున్నాడన్నమాట. ప్రియమయిన బంధువులు, ప్రియతమమైన వస్తువులు అటువంటి వాటిమీద ఒట్టు పెట్టుకుంటే దాని అర్థం మాట తప్పినట్లయితే వాటికి దూరమవుతాను అన్నమాట." [1]

ప్రమాణాలు చేయటం నేరస్థుడు తన నిజాయితీని స్వయంగా నిరూపించుకోవడానికి చేసే ప్రయత్నం. ఆ విధంగా కాక అతనిచేత బలవంతంగా పెట్టే పరీక్షలు కూడా ఇందులో భాగంగానే పేర్కొనబడతాయి. శాతవాహనులు ఆంధ్రదేశాన్ని పరిపాలించే కాలంలో నేరం చేశారని అనుమానం కలిగినప్పుడు దోషాలు నిర్ణయించటానికి పెట్టే పరీక్షలు ఈ విధంగా వుండేవి.

1. తులాదివ్య : నేరస్థుడిని ముందు తూచాక న్యాయాధికారి కొన్ని మంత్రాలు చదువుతాడు. తరువాత మళ్ళీ తూస్తాడు. రెండోమారు ఎక్కువ తూకం వుంటే అతడు దోషి.

---

1. దేవాలయాల మీద బూతుబొమ్మ లెందుకు. పు. 106

2. అగ్నిదివ్య : దోషిని రావికర్రల నిప్పుమీద నడవమంటారు. అతని కాళ్ళు కాలకుంటే నిర్దోషి

3. జలదివ్య . ఒక సైనికుడు ప్రయోగించిన బాణాన్ని వెదికి తెచ్చే వ్యవధి వరకు నీళ్ళలో మునిగి వుండగలిగితే నిర్దోషి.

4. విషదివ్య : తాచుపాము వున్న కుండలోంచి కాటుబడకుండా వుంగరం తియ్యగలిగితే నిర్దోషి.

5. కోశదివ్య : దేవతా విగ్రహాలను కడిగిన నీరు తాగి 14 రోజులు బతికితే నిర్దోషి.

6. తండులదివ్య : మంత్రించిన బియ్యం నమిలి రావి ఆకుమీదపుమ్మెయ్యాలి. ఈ బియ్యానికి తడిలేక పోయినా రక్తం కనిపించినా అతడు దోషి.

7. తప్తమస్కదివ్య : మరుగుతున్న నూనెలోంచి నాణెం తియ్యాలి. చెయ్యి కాలకపోతే నిర్దోషి.

8. ఫలదివ్య : కాలుతున్న బల్లెపు అరును చేతబట్టుకొని కొన్ని అడుగులు వెయ్యాలి. తరువాత ఆ చేతితో ధాన్యంనలపాలి చేతులు కందకపోతే నిర్దోషి.

9. ధర్మాధర్మదివ్య : వెండితో చేసిన ధర్మమూర్తిని, సీసంతో చేసిన అధర్మమూర్తిని జాడీలో వేస్తారు. అతడు తీసే విగ్రహాన్నిబట్టి దోషాదోష నిర్ణయం చేస్తారు."[1]

పైన పేర్కొనబడ్డ ప్రమాణ పరీక్షలన్నీ హేతుబద్ధమయినవి కాదు. నేరస్తుడు నిజంగా నేరం చేశాడా, చెయ్యలేదా అన్న మీమాంస వదలి యాదృచ్ఛికంగా జరిపే ఈ నిలకడలేని పరీక్షల్ని నాటి ధర్మకర్తలు, పురోహితులు నిర్ణయించారు. మనిషిని తూచి మంత్రాలు చదివినంత మాత్రన బరువులో హెచ్చు తగ్గులు రావు. నిప్పులమీద నడిపించటం అంటే నిప్పు 700 డిగ్రీ సెంటిగ్రేడ్‌వద్ద మనిషి నడిచినా

---

1. ఆంధ్రుల సంస్కృతి-చరిత్ర 1-151, 152

కాలు కాలదు కాలిలోని చెమ్మ లేక తేమ ఒక పొరగా ఏర్పడి నిప్పుకు, పాదానికి మధ్యన వుండి పాదం కాలకుండా చేస్తుంది అందుకే గుండాలలో దూకినవారికి కాలు కాలదు. నీటిలో మునగటం, ఇది జలస్తంభన విద్య నేర్చినవారికి సుగమం. కుండలోని వుంగరాన్ని తాచుపాము వున్నా తియ్యటం నేర్పరితనం. దేవతావిగ్రహాలు కడిగిన నీరు తాగటం, 14 రోజులు జీవించటం మనిషి శారీరకశక్తిపై ఆధారపడి వుంటుంది. మంత్రించిన బియ్యం నమిలి వుమ్మేయటంవల్ల రక్తం రావటం అంటే దంత దోషానికి సంబంధించింది. మరుగుతున్న నూనెలోంచి నాణెం తియ్యటం అనేది క్లిష్టమైన పరీక్ష. అయితే అనేకమైన ఆకుపసర్లు, మూలికా ప్రయోగాల ద్వారా మరుగుతున్ననూనెలోనుంచి నాణెం తీయటానికి అవకాశంవుంది అదేవిధంగా ఫలదివ్య. ధర్మాధర్మ దివ్యలో వెండిమూర్తిని లేక సీసపు మూర్తిని బయటకు తియ్యటం అదృష్టానికి పరీక్ష.

ఈ ప్రమాణ విధానాలు నిజమైన నేరస్తుణ్ని నిర్ణయించేవి కావు. అనుకూల అననుకూల వాతావరణాన్ని సృష్టించటానికి వుపయోగపడే వ్యవస్థ మాత్రమే.

ఎరుకల, యానాది మొదలగు జాతులవారు ముందు వడ్లు నలిచి తరువాత మట్టు పడతారు. ముందు కొన్ని ఆకుపసర్లు విరుగుడుకై ప్రయోగించి తరువాత మట్టు పట్టిస్తారు.

నేరస్తుడు చేసిన నేరం తెలుసుకోవటానికి ఆంధ్రప్రదేశ్‌లోని కొండరెడ్లు చేసే ప్రమాణం :

"భూమి తల్లీ నేను తప్పు చేయలేదు. చేసినట్లయితే తల బద్దలయి చచ్చిపోతా !" అతడు నిజంగానే నేరం చేసి వుంటే మరునాటికల్లా తల బద్దలయి చచ్చిపోతాడని వారి నమ్మకం.

ఖోండులు అనే జాతివారు ఆస్తి తగవుల్లో మరుగుతున్న నీళ్ళలోను, కాగుతున్న నూనెలోను చెయ్యి పెట్టడం, ఎర్రగా కాలిన ఇనుమును ముట్టుకోవడం ద్వారా తప్పొప్పుల నిర్ణయం తరచు చేస్తారు. భూదేవతకు బలి ఇచ్చిన మేక రక్తంలో వుడికించిన అన్నం కలహిస్తున్నవారిచేత తినిపిస్తారు. తప్పెవరిదో వారు అది తిని చచ్చిపోతారని వారి ఆలోచన". 1

1. ఆంధ్రుల సంస్కృతి - చరిత్ర పు 1 - 64

మానసిక బలహీనతకు లోనైనవాడు నిజంగా మరణిస్తాడు బలవంతుడు తప్పు చేసినా అజేయుడే.

నాగరికత అభివృద్ధి చెందిందనుకున్న ఇరవయ్యో శతాబ్దం చివరి భాగంలో కూడా ఇటువంటి ఆటవిక పద్ధతులు అవలంబించటం గమనించాలి.

తెలుగు సాహిత్యంలో ఈ నమ్మకాన్ని పరిశీలిద్దాం.

శ్రీరంగపట్టణంలో విప్రనారాయణ అనే భక్తుడు భగవద్భక్తిలో మునిగి తన్ను దర్శించ వచ్చిన దేవదేవి మధురవాణి అనే వేశ్యలను గమనించలేదు కుపితురాలైన దేవదేవి విప్రనారాయణుని తన దాసునిగా చేసికుంటానని ప్రమాణం చేస్తుంది. మధురవాణి అది సాధ్యం కాదని ఆ విధంగా జరిగినట్లయితే దేవదేవికి నీళ్ళు, కట్టెలు మోస్తానని చెపుతుంది.

అప్పుడు దేవదేవి ఈ విధంగా ప్రమాణం చేస్తుంది.

"నీవీ వైష్ణవు విటునిం
గావించిన లంజెతనపు గడన విడిచెదన్
గావింపలేక యుండిన
నీవు న్విడిచెదవె యనిన నెలతుక యొప్పెన్" 1

తమ తమ కులవృత్తులను వదులుకొనే విధంగా ప్రమాణాలు చేయటం ఒక ఆచారం.

దేవవేశ్య వరూధిని కుమారుడు స్వరోచి. అతని వివాహ సమయంలో పట్టణంలో పూరేగిపోయాడు. పెండ్లికుమారుని చూడటానికి పురస్త్రీలు వచ్చారు అందులో ఒక స్త్రీ ఈ విధంగా ప్రమాణం చేస్తుంది.

"జలకములాడి యాడి యొకచాన కరస్థిత కేశయై నృపున్
వెలువడి చూచి లోబడితి నీకని బాసకు నిల్చెనోయనన్" 2

ప్రమాణాలు చేసేవారు తడివస్త్రం కట్టుకొని నీరుకారే వెంట్రుకలు చేతితో పట్టుకొని రాజుల ముందు ప్రమాణం చేయటం ఒక ఆచారం. భగవంతుని విశ్వ

---

1. వైజయంతీ విలాసము 2 – 30
2. మనుచరిత్ర 5 – 68,

సించేవారు తాము చెప్పింది నిజమని ఒప్పించటానికి తడిబట్టతో ప్రమాణం చెయ్యటం ఆనాటి ఆచారమే.

ఈ ప్రమాణాలు చెయ్యడంలో వివిధ పద్ధతులు అవలంబించబడ్డాయి.

"పూర్వపు ఆచారం ఏమిటంటే దేవతా విగ్రహం దగ్గరలో వుంటే ఆ విగ్రహాన్ని ముట్టుకుంటూ చెప్పడం. అలాగే దేవతా విగ్రహం దగ్గర లేకపోతేనో, దేవతా మహత్యం కలిగి అన్నివిధాల అర్చనలనూ, పూజలనూ పొందుతూ వుండే స్త్రీ-పురుష గోప్యాంగాలున్నాయి కదా! వాటిని ముట్టుకుంటూ ఈ మనుష్యులు ఈ ఒట్టులు పెట్టుకునేవారు. క్రీస్తుపూర్వము అన్ని దేశాలలో ఆ అలవాట్లు బాగా వుండేవి. కొన్ని ఆ కాలపు దేవతా చిత్రాలలో పురుషులు తమ గోప్యాంగం పట్టుకుంటూ ప్రమాణం చేసినట్లు ప్రత్యక్షంగా కనిపిస్తుంది. ఇలాంటి చిత్రాలు, శిల్పాలు కొన్ని అక్కడక్కడా, కొన్ని మ్యూజియములలోనూ, పురాతన పుస్తకాలలోను ఇప్పటికి చూడవచ్చును". [1]

ఒక పట్టణంలో చంద్రరేఖ అనే వేశ్య ఉంది. ఆ పట్టణంలో ఒక ధనవంతుడైన వైశ్యునకు ఈమెకు సమాగమం తటస్థించింది కొంతకాలం వారు కలసి జీవించారు. వైశ్యుడు తన భార్యవద్ద కొంతకాలం గడిపి వేశ్యవద్దకు తిరిగిరాగా, ఆమె ఒకరోజున కల గని ఆ ధనవంతుడ్ని ప్రమాణం చెయ్యమని కోరుతుంది.

"కనుగొనఁజాల వేఱొకతె కౌఁగిట నీవు సుఖింప నిప్పుడే
పునఁ జనుదెంచి గంగ గుడి ముందఱ బాస యొసంగు మిత్తఱిన్" [2]

గ్రామదేవతల ముందు, గ్రామం మధ్యలోవున్న రావిచెట్టు దగ్గర ప్రమాణాలు చెయ్యటం ఇప్పటికీ మనం పల్లెప్రాంతాల్లో గమనిస్తాం.

ప్రమాణాలు చెయ్యటం అనే ఆచారాలు, చేసిన ప్రమాణాలు జరుగుతాయనే నమ్మకాలు అనాదిగా వస్తున్నాయి. కాని ఇవి హేతుబద్ధమైనవి కావు. నేరం చేసినవాడు తాను నేరం చేయలేదని ప్రమాణం చెయ్యవచ్చు. మానసికబలహీనత గలవారు

---

1. దేవాలయాలమీద బూతుబొమ్మ లెందుకు ? పు. 107
2. శుకసప్తతి 2 – 74

భయపడటం, మిగిలినవారు ధైర్యంగా తాను చేసిన తప్పునుంచి బయటపడి సామాజిక జీవితాన్ని యధాతథంగా గడపటం జరుగుతుంది. ఇటువంటి ప్రమాణాలు చేయించటంద్వారా పాలకవర్గం లేదా దోపిడీవర్గం క్రింది వర్గాన్ని తమ గుప్పెట్లో పెట్టుకోవడానికి వివిధ శిక్షలు అమలు చేయటానికే వుపయోగిస్తాయి తప్ప వాస్తవాల్ని ప్రతిబింబించలేవు. సత్యాన్ని అసత్యంగాను, న్యాయాన్ని అన్యాయంగా తారుమారు చేసే స్వరూపమే ప్రమాణ రూపంలో ఇమిడివున్న నిజం. అమాయకులైన ప్రజలు దీనిలోని నిజానిజాల్ని గమనించలేరు. మోసగాడు తాను చేసే పని చేసి లేదని ప్రమాణం చేస్తే వాడి 'కర్మ' అని వదలిపెట్టడం జరుగుతుందే తప్ప నేరస్తుడిగా పరిగణించబడటంలేదు.

సత్యాన్ని న్యాయంగా, హేతుబద్ధంగా పరిశీలించాలే తప్ప ప్రమాణాలవంటి మూఢనమ్మకాల్లో శోధించటం సరియైన పద్ధతి కాదు. ఇలాంటి మూఢనమ్మకాలు శాస్త్రీయ దృక్పధంతో విశ్లేషించి పరిష్కారం కనుక్కోవాలి.

# 12. వ్యాధులు

మానవుడు శారీరకంగాగాని, మానసికంగాగాని, భౌతికంగాగాని అనారోగ్యం పాలయినప్పుడు అతనికి వ్యాధి అంకురించిందని భావించటం జరుగుతుంది. వ్యాధుల్ని రోగాలు అని వ్యవహరించటం కద్దు. ప్రకృతిలో ఏర్పడిన వైపరీత్యాల ఫలితంగా మానవుడు శారీరకంగానూ, మానసికంగానూ వ్యధ చెందుతాడు శరీరంలో కలిగే మార్పులు, జననాలు, మరణాలు, జీవన పరిణామక్రమంలో వచ్చే అనేక రకాలయిన వ్యాధులు మనిషికి కలగటం సహజం.

ఈ వ్యాధులు సోకినప్పుడు తగిన వైద్యం చేయించటం తగిన ప్రతిక్రియ. కానీ ఈ విషయంలో మన సమాజంలో తరతరాలనుండి వ్యాపించిన నమ్మకాలు విచిత్రంగా వున్నాయి. ఈ మూఢనమ్మకాలతో మన సమాజం వ్యాధుల్ని పెంచి పోషించింది. ఈ మూఢనమ్మకాల ఫలితంగానే వ్యాధులు ముదిరి మానవ సమాజంలో మరణాల సంఖ్య కూడా పెరగటానికి ముఖ్యకారణం అయింది.

రోగాలు దేవతలు మనకు ప్రసాదించిన దుష్టశక్తులు అని మనవారు నమ్ముతుంటారు.

వీరవర్మ అనే రాజు తన కుమార్తె యముని వరించగా యముడు అందుకు అంగీకరించి వివాహం నిశ్చయిస్తాడు. ఆ వివాహ సందర్భాన్ని పురస్కరించుకొని యముడు తన సైన్యాన్ని వీరవర్మ పురానికివెళ్ళి విందులు – వినోదాలలో పాల్గొనవలసిందిగా కోరతాడు. యముని సైన్యం అంతా రోగనాయకులు. ఆ రోగనాయకులలో ముఖ్యుడయిన క్షయరోగ నాయకుడు యమునితో ఈ విధంగా చెప్తాడు.

"ప్రభూ నేనా రాజ్యానికి రావటం ఎలా ? అందలి జను లందరూ విప్రప్రియులే. రాజు కూడా ద్విజసేనా పరాయణుడే. భయంకరమైన విప్రవేద పాఠ ధ్వని, వారి హోమ ధూమమూ నా కన్నులకూ, చెవులకూ బాధ కలిగిస్తాయి. ఇది నిస్సందేహం. రవినందనా ! నా దాసివిషూచిక ఉన్నది. దాని మహామహిమ ఎవరికి లభిస్తుంది ? క్షణంలో మనిషిని చంపుతుంది. అది అక్కడ ఎలా ఉండగలదు?" [1]

క్షయ ఒక దేవత (రోగనాయకుడు) అని విషూచి (సన్నిపాతం) ఒక దాసి అనే నమ్మకం మనవారికి వుంది. ఆ వ్యాధి నాయకులు విప్రులు సంచరించే తావుల్లోగాని విప్రులు పూజింపబడే చోటగాని వ్యాధుల్ని వ్యాపింప జేయరట.

క్షయవ్యాధిని ఒకప్పుడు భయంకరమైన వ్యాధిగా నమ్మటం జరిగింది. విజ్ఞాన శాస్త్ర పరిశోధనల పరంపరలో ఈ వ్యాధిని నయం చెయ్యవచ్చని నేడు మనం తెలుసుకున్న సత్యం. అయితే క్షయవ్యాధిగాని ఏ ఇతర వ్యాధులుగాని సోకినట్లయితే వాటి నివారణోపాయాన్ని యముడు ఈ విధంగా పరిష్కార మార్గం సూచిస్తాడు.

"క్షయరోగము వచ్చినవాడు పేదవాడైతే ఒకనెల ప్రతి సోమవారము స్నానార్థమై గౌతమీ సాగర సంగమాన్ని ఆశ్రయించాలి. క్షయా! గౌతమిలో స్నానము చేస్తే చాలు అతనిని నీవు పీడించకు పీడించావో నీకు పతనం తప్పదు."

---

1. జైమినీ భారతము పు. 303

"ఫలమెత్తు బంగారంతో అరటిపండు చేయించి బ్రాహ్మణునకు దానము చేసిన భగందర వ్యాధి విడిచిపోవుగాక.

గురుపత్నీ సమాగమం చేసినవాడు ఈ లోకంలో కండరాకుష్టు (దురద గల కుష్టు) రోగి అవుతాడు. శివసేవార్థం సువర్ణ ఘంటాదానం బ్రాహ్మణునకు దానంచేస్తే ఆ రోగం పోతుంది. యదృచ్ఛాలాభ సంతుష్టుడు, ఉదారుడు అయిన వానిని చూచి మూర్ఛిల్లే వానిని అపస్మార రోగం తిప్పుతూ ఉంటుంది. కపిల గోవునూ సువర్ణ కమలమునూ దానం చేస్తే ఆ రోగం పోతుంది.

దంభం (ఆడంబరం) కోసం ధర్మం ఆచరించే వారిని గజ చర్మ రోగము చేరుగాక. హంస తీర్థోదకంలో స్నానముచేస్తే వారిని ఆశ్రయించదు."[1]

రోగాలు కలిగిన వారికి తగిన వైద్యంకాక దానధర్మాది క్రియలు, శాంతి పూజాది కార్యక్రమాల్ని ఆచరించే వారిని నేటికి మనము చూస్తూనే వున్నాం.

"గోపురము పైన నేడ్చిన
బాపించును గ్రామమందు బహు రోగింబుల్
గోపృథివియందు నేడ్చిన
శ్రీపతి పశుహానియగును శిఖినరసింహా"[2]

కుక్కలు గోపురంపై ఏడ్చినట్లయిన గ్రామానికి అనేక రకాల వ్యాధులు సంక్రమిస్తాయని. ఆవు ఏడ్చిన పశు హాని జరుగుతుందనే నమ్మకం వుంది.

సూర్య చంద్రుల, చలనాన్ని అనుసరించి వ్యాధులు కలుగుతాయని నమ్మటం జరిగింది. వాటికి ప్రతిగా దానధర్మాది క్రియలు, నవగ్రహాల పూజలు చేయటం ద్వారా పోతాయనే మూఢ నమ్మకాలు మనవారిలో వ్యాపించాయి.

"పీడల (గ్రహముల) ప్రభావముచే అంగవైకల్యము చెందుటగాని, దీర్ఘ వ్యాధిగ్రస్తుడు అగుటగాని నపుంసక మాచకమ్మలుగా మారుట, మొదలగు దుస్సం ఘటనలు ఏర్పడగలవు; మరియు కీళ్ళవ్యాధులు, చర్మవ్యాధులు, ఉబ్బసము, క్షయ,

1. జైమినీ భారతం పు. 307-308
2. శిఖినరసింహ శతకము -- 201

కుష్టు, ఇతర రకములైన శ్వాసదోషములు, కళ్ళమంటలు శీతల ఉష్ణ ప్రకోపములును కలుగును. రాహువువల్ల ఉష్ణవ్యాధులు, కేతువువల్ల శీతలవ్యాధులు సంక్రమించ గలవు. కేతువు; రాహువువల్ల పైశాచిక దోషములు కూడా ఏర్పడుటకు అవకాశములు గలవు "[1]

గృహనిర్మాణ సందర్భంలో శల్యాలు (ఎముకలు) వున్న ప్రదేశంలో గృహం నిర్మించినట్లయితే వ్యాధులు అంకురిస్తాయనే నమ్మకం వుంది.

"గృహనిర్మాత గృహమును నిర్మించుటకు ప్రారంభమున శల్యములను పరిశీలింపవలయును. శల్యములున్న స్థలమందు గృహమును నిర్మించి నివాసము చేసినచో దుస్స్వప్నములు, హాని, రోగములు కలుగును.[2]

వ్యాధులు సంక్రమించినపుడు తగిన వైద్యంకాక మంత్ర తంత్రాలతో పోతాయనే నమ్మకం వుంది.

ద్వారకా నగరం రోగమయం అయినపుడు శ్రీకృష్ణుడు

"అంతను పలక్షించి వయోవృద్ధులగు గోపాలుర మంత్రముల నౌషధముల నగ్ని కర్మాదులంద ప్రత్యతీకారంబుపక్రమించి" [3]

ఈ విధంగా వ్యాధుల్ని ఆ వ్యాధులు సోకే విధానం మొదలైన అంశాలపై మనవారికి అనేకమైన మూఢనమ్మకాలు వుండేవి. విజ్ఞానశాస్త్రం అభివృద్ధి చెందని దశలో వ్యాపించిన ఈ మూఢనమ్మకాలు నేటికి అనుసరించబడటం మౌఢ్యానికి చిహ్నం. వ్యాధి పాలయిన వ్యక్తికి సరియైన వైద్యం చేయించటానికి బదులుగా నేటికి అమ్మవారి జాతర్లనో, కొలుపులనో, శివాలయంలో ఘటాభిషేకమనో,

---

1. కర్మ విపాకము పు. 228
2. గుప్తవాస్తు పు. 85
3. హస్త రేఖాశాస్త్రము (సాముద్రికము) పు. 99

అష్టోత్తర శతోత్తర నామాల పూజలనే విషతో రోగగ్రస్తుల మరణాలకు కారణం అవుతున్నారు. పెరిగిన విజ్ఞానశాస్త్ర విలువల్ని అర్థం చేసుకుని రోగానికి తగిన మందు ఇప్పించటం నాగరికుని కర్తవ్యం. ఆ విధంగా కాక మూఢనమ్మకాలలో మునిగిపోయి మతమౌఢ్యానికో పూర్వీకులు ప్రహించిన భావనలకో దాసులుకాక సత్యాన్ని తెలుసుకోవాల్సిన అవసరం ఎంతయినా వుంది.

# 13. రసవాదం

రసవాదం అనే పదానికి "పాదరసమును కట్టి బంగారు చేసెడు విద్య."[1] అని వివరించబడింది. దీనినే పరుసవేది అని స్పర్శవేధి అనిపిలుస్తారు. స్పర్శవేధి అనే పదానికి "తాకించుటచేత లోహమును బంగారుగా మార్చునట్టి మూలికా (రస) విశేషము [2]

స్పర్శవేధియను ద్రవ్యముతోడి కూడిక చేత (ఆ ద్రవ్యము తనకు తగులుట చేత) ఇనుము బంగారమగును."[3]

అని వివరించబడింది.

రసవాద గ్రంథాలలో ఈ విద్య రసాయన విద్య, రసవాదం అనే పేర్లతో పేర్కొనబడింది.

మొత్తంమీద నీచ లోహాలను పాదరసం చేతగాని మరే ఇతర మూలికారస ప్రయోగం చేతగాని బంగారంగా మార్చటానికి చేసే ప్రయత్నించే విద్య 'రసవాదం' అని తెలుస్తోంది.

"ఈ రసాయన మన్నమాట మొదట మనకు చరక శుశ్రుత గ్రంథములలో తారసిల్లును. అచ్చట రసాయన మనగా ముదిమిని అనారోగ్యతను పారదోలి ఆయువును వృద్ధిచేయు ఔషధ రాజమని అర్థము"[4]

1. శబ్దరత్నాకరము పు. 662
2. శబ్దార్థ దీపిక పు. 1399
3. శృంగార నైషధ సర్వంకష పు. 329
4. విజ్ఞాన సర్వస్వము పు. 2-120

దీనిని బట్టి రసాయనశాస్త్రం మొట్టమొదట వైద్యవిషయమని వ్యాధులను తగ్గించటానికి వుపయోగించేవారని అర్థం అవుతుంది. యూరప్ ఆసియా ఖండా లలో రసాయనం చికిత్సా శాస్త్రానికి అంగంగానే వుందని తెలుస్తోంది. ప్రాణాంతక మైన వ్యాధుల్ని నయం చెయ్యటానికి పాదరస కూడికతో మందులు తయారు చేసేవారు.

"నచరసశాస్త్రం ధాతువాదార్థ మేలేతి మంతవ్య ।
దేహద్వారా ముక్తేరేవ పరమ ప్రయోజనత్వాత్ ॥

"రసవాదశాస్త్రము కేవలము నీచలోహములను బంగారముగా మార్చుటకే అని తలంచరాదు. దేహమును అజరామరముగ చేసి ఆ దేహముద్వారా ముక్తిని సంపాదించుట రసవాదముయొక్క పరమ ప్రయోజనము" అని మాధవాచార్యులు తన సర్వదర్శన సంగ్రహములో మనకు ఈ విషయమును విశదముగ చెప్పెను. [1]

మొదట వైద్యవిషయమైన ఈ రసవాదము తరువాతి కాలంలో 'పరుసవేది లేక స్పర్శవేధిగా' మారిపోయింది. తాంత్రిక యుగంలో (13-14 శతాబ్దుల కాలం) ఈ రసవాదానికి ప్రత్యేక ప్రతిపత్తి లభించింది. నీచ లోహాలను బంగారంగా చెయ్యవచ్చనే నమ్మకం ప్రజల్లో విరివిగా వ్యాపించింది. ఈ వాదం సామాన్యుల నుంచి సామ్రాట్టుల వరకు సోకి వారి వారి సంపదను, ప్రతిష్టను పోగొట్టుకున్నారు. చక్రవర్తులు సైతం ధనకాంక్షతో రసవాదుల్ని పోషించేవారు. తాము బంగారం చేయగలమని ప్రలోభపెట్టి తమ పోషకుల్ని నమ్మించి, అనేక విధాలుగా వంచించి అవమానాల పాలై ఆత్మహత్యలు చేసుకున్నవారు లేకపోలేదు.

రసవాదంపై మన వారికున్న నమ్మకాల్ని స్థాలీపులాకన్యాయంగా పరిశీలిద్దాం.

మీటరక్కసందు బైటాగ్ని నడచుచు
మేటి రాగి దెచ్చి మెరయ గరగి
కూట మెరుగువాడు కోటికి బరుగెత్తు . విశ్వ॥[2]

1. విజ్ఞాన సర్వస్వము పు. 2-123.

2. వేమనయోగి పద్యరత్నములు పు. 26

ఇంగిలీక మహిమ హేమించనేరక
చిత్రపటము వ్రాసి చెఱచి వారు
బొంత చెముడు పాలు బొసగించనేరరా.   విశ్వ॥ [1]

రసప్రభావంచేత ఇంగిలీక మహిమచేత నీచ లోహాలను, రాగి మొదలైన లోహాలను బంగారంగా మార్చవచ్చుననే నమ్మకం వుండేది.

నలుడు దేవదూతగా దమయంతిని కలసి వారి కోర్కెలు వివరించి దేవతలలో ఒకరిని భర్తగా వరించమని కోరినప్పటికి దమయంతి అంగీకరించలేదు. ఆ సందర్భంలో నలుడు ఈ విధంగా అంటాడు.

"రసయోగమున సువర్ణత్వ మొందుట మేరా
యినుముదా దానయై యునికి మేరా" [2]

రసయోగ ప్రభావంతో ఇనుము బంగారంగా మారుతుందనే నమ్మకమే దీనికి కారణం.

"వెన్నెల నిలుచుండి వేపాకు బడివేసి
అడ్డసర పురసమునందు బోసి
కరుగ రాగి మఱియు కాంచనంబగునయా   విశ్వ॥

తల్లి చనుబాలు తాజింపు పాలును
చుద్ర వీర్యమునకు భద్రపఱచి
దాని భూతి జేసి తామ్రంబుపై జల్లు" విశ్వ [3]

ఆకు ప్రభావంచేత, పాల ప్రభావంచేత రాగి బంగారంగా మారుతుందనే నమ్మకం ఆనాడు వుంది.

పిశాచరూపుడైన ఘంటాకర్ణుడు శ్రీకృష్ణుని హస్తస్పర్శవల్ల అమరుడౌతాడు.

---

1. వేమన యోగి పద్యరత్నములు పు. 26-27.
2. శృంగార నైషధము 4 — 74 పు.
3. వేమన యోగి పద్యరత్నములు — పు. 27

"పరుసవేది సోకుటయును బరుషలోహ
మధిక శుద్ధ సువర్ణమయ్యెన పోల్కి" [1]

పరుసవేదితో పరుష లోహం సువర్ణంగా మారుతుందని భావించారు.

"పాము చేపలోన బరగ గప్పనునిచి
పరుస దీని యగ్ని వండి దించి
రాగి కరగివేయ రమణంబె యౌనుగా – విశ్వ॥

పేడు ముదురుకాయ పెనుబాము కుబుసంబు
జోడుగూడి రసము సోకెనేని
నొక్క యేడు జేయి నుర్వి హేమంబెగా" – విశ్వ॥ [1]

కూరగాయల ప్రభావంచేత గూడ బంగారం అవుతుందనే నమ్మకం వ్యాపించింది.

కొండవీడును పరిపాలించిన పెదకోమటి వేమారెడ్డి మొదట సామాన్యరైతట. ఒకరోజు సాయంసమయింలో వర్షాభావంచేత ఒక బేహారి కావడితో వేమారెడ్డి ఇంటికి వచ్చి ఆశ్రయం కోరాడట. రెడ్డి అందుకు అంగీకరించాడు. తెల్లవారుఝామున తన నాగలి తీసుకోవటానికి పాకలోకి వెళ్ళాడు. నాగలికర్ర మెరుస్తూ కనిపించింది. ఆశ్చర్యపోయిన వేమారెడ్డి కావడిలో వున్న కుండలోని రసం ఆ నాగలి కర్రపై పడిందని, అది పరుసవేది రసం అని దాని ప్రభావంతో ఇనుపకర్ర బంగారంగా మారిందని తెలుసుకున్నాడు. ఆ కావడి మొత్తం దొంగిలించి, ఆ కావడిని తగలబెట్టాడని అది చూచిన బేహారి (పెదకోమటి) గుండె ఆగి మరణించి భూతమై పీడించటమే కాక ఆతని మగబిడ్డల మరణానికి కారకుడయ్యాడని భీతి చెంది అప్పటినుండి వేమారెడ్డి తన పేరును పెదకోమటి వేమారెడ్డిగా మార్చుకున్నాడనే కట్టుకథ ప్రచారంలో వుంది.

ఐరోపా రసవాద చరిత్రలో వీటిని గురించిన ఒకటి రెండు అంశాలు గమనించదగినవి.

---

"రసవాద చరమావస్థలో జరిగిన రెండు చరిత్రోదంతములు గణనీయములు.

1. హరివంశము – ఉత్తర భాగము – 5–238 పు.

2. వేమన యోగి పద్యరత్నములు పు. 26,

ఇందొకటి విషాదాంతము. రెండవది హాస్యాంతము. ఇంగ్లండులో 17 వ శతాబ్దమున స్థాపింపబడిన రాయల్ సొసైటీ సభ్యుల సమ్ముఖమున పియర్స్ అను సభ్యుడొకడు ధాతుపరివర్తనను తన ఇంటివద్ద చేసి చూపెదనని ఖరారుచేసి ప్రదర్శనమునకు కాలనిర్ణయము చేసెను. ఆనాటికి సంఘ సభ్యులందరూ వానింటికి చేరగా వారి కగుపడిన దృశ్యము కుర్చీలో ఆత్మహత్యను గావించుకొనిన పియర్స్ మృత కళేబరము. ఇది విషాదాంతము. దీని అర్థము సుబోధమే.

రెండవ ఇతిహాసము. ఇటలీ దేశస్థుడైన డాక్టర్ సెమ్లర్ అనువాని గురించినది. రేయింబవళ్ళు రసవాద ప్రక్రియల యందే నిమగ్నుడై కొలిమి యందలి మూసవైపు ఆశతో ఎప్పుడుసూ చూచువాడు. ఈయన ఆశ్రితమును, ఆశను కనిపెట్టిన అనుచరు డొకడు జాలి చెంది ఒక చిన్నమెత్తు బంగారమును బజారులో కొని తన స్వామికి ఎరుక లేకుండ ప్రతి దినము మూసయందు పడవేయుచుండెను. ఆ బంగారమును మూస యడుగున చూచుకొని డాక్టర్ సెమ్లర్ తన కార్యము సిద్ధించుచున్నదని మురియుచుండెడివాడు. దైవవశమున నౌఖరొకనాడు రోగవశుడై తన భార్యను పనికి పంపెను. పంపించినపుడు ఆమెతో తన స్వామి మనస్సంతుష్టికై ప్రతి దినము తను చేయు విధానమును విశదీకరించినను, ఆమె బంగార మనుకొని బజారులో ఇత్తడిరేకును కొనితెచ్చి ఎప్పటివలె మూసలోనుంచెను. ఆనాడు సెమ్లర్ ఎంత వెదకినను బంగారము కానరానిచే ఖిన్నుడై క్రింద కూలబడెను. ఉపచారిక ఈ దృశ్యమును చూచి భయపడినదై తన పొరపాటును గ్రహించి స్వామికి తను చేసినదానిని నివేదించి క్షమింప వేడుకొనెను. ఈసంఘటన ఆయన బుద్ధికెక్కిన పిమ్మట పెద్దనవ్వు నవ్వి నాటితో రసవాద ప్రయోగములను మానివేసెను." [1]

రసవాదం భారతదేశంలో ఆర్యనాగార్జునునకు పూర్వం నుండి వున్నప్పటికి దానికి సరియైన రూపకల్పన జేసిన తాత్త్వికుడు నాగార్జునుడే. తాను పండ్రెండు సంవత్సరాలు కృషి చేసి ఈ రసవాదాన్ని పొందానని ఆయనే స్వయంగా చెప్పుకున్నాడు. రసాయనశాస్త్రం ప్రచారంలో వున్నంత కాలం, ఆకలి, రోగబాధ, దారిద్ర్యం మనుష్యుల్ని పీడించలేవని నాగార్జునుని ఉవాచ. అయితే ఈ రసవాదం లేక రసాయనశాస్త్రం వైద్యానికే పరిమితం. తాంత్రిక యుగంలో ఇది దిగజారి

1. విజ్ఞాన సర్వస్వము పు. 2–125.

ప్రక్రియలద్వారా ఇనుము మొదలైన లోహాల్ని బంగారంగా మార్చవచ్చుననే నమ్మకం ఏర్పడింది.

నేడు రసవాదం అసభ్యప్రాయమయింది. దాని ఫలం ఆస్థానపతితమయింది. నీచ స్థాయికి పడిపోయింది. రసవాదుల యొక్క ఆశయాలు ఒకనాడు వైద్యానికి, రోగ నివృత్తికి వుపయోగించబడగా, నేడు కేవలం ప్రయోగాల ద్వారా బంగారం తయారు చేయవచ్చుననే మూఢ నమ్మకం వ్యాపించింది. మూలికా ప్రయోగంతోనో, పాదరసంతో ఖాళనం చెయ్యటం ద్వారానో బంగారం చెయ్యవచ్చుననే ఆశతో అనేక కుటుంబాలు దరిద్రావస్థలో దిగజారటం మనం నిత్యం గమనిస్తూనే వున్నాం. ఆశ మనిషికి సహజమైన జీవన ప్రకృతి. దాని కోసం వున్నది కాస్తా ఇటువంటి మూఢ నమ్మకాలకు వ్యయపరచి నిలువ నీడ కూడా లేకుండా అలమటించేవారు ఈ నాటికీ ఎందరో వున్నారు. ఈ నమ్మకం అనేక జీవితాలకు గొడ్డలి పెట్టుగా మారింది. బంగారం లోహమని, ఎట్టి పరిస్థితుల్లోను ఒక లోహం మరొక లోహంగా మారదనే నమ్మకం ఈ అమాయకులు గమనించలేరు.

"నేటి వారలలో అనేకులు రసవాదము నీచ లోహములను బంగారము కావించుటయను కపట కళయని నమ్మువారు కలరు. జర్మన్ రసాయనికుడగు 'లీబిగ్' రసవాద మెప్పుడును రసాయనశాస్త్రముగ నుండెనని చెప్పెను. ఈ దృష్టిలో రసవాదమును మధ్యయుగపు రసాయనశాస్త్రముగ మనము భావించ వచ్చును. దీని విస్తీర్ణమగు నిజతత్త్వమును గుర్తించితిమేని, సృష్టి జీవ రహస్యము లను ఛేదించుటకు ప్రయత్నించిన మహాతత్త్వశాస్త్రము వలె గోచరించును. దాని ముఖ్య లక్ష్యము మానవుడను అణు జగత్తు (Microcosm) ను మహా విశ్వము (Macrocosm) తో సమన్వయించుట ఒక అచేతన ద్రవ్యమును. ఇంకొక అచేతన ద్రవ్యముగ మార్చుట అనునది రసవాదము యొక్క అప్రధానోద్దే శ్యము. అణ్వాత్మయగు మానవుని విశ్వాత్మగా పరిణమింపజేయుట దాని పరమ లక్ష్యము.[1]

అందుచేత రసవాదం సువర్ణం తయారు చేసే ప్రయోగ సిద్ధాంతం కాదని రుజువయింది. నేటికీ ఈ వాదాన్ని నమ్మి తమ సర్వస్వం దీనికై కైంకర్యం చేసే అమాయకులైన ఆశా జీవులకు కనువిప్పు గలిగి చైతన్యవంతులయినప్పుడు ఇటువంటి మూఢ నమ్మకాలు వాటంతట అవే తొలగిపోతాయి.

---

1. విజ్ఞాన సర్వస్వము పు. 2 – 124.

# మానసిక ప్రకరణం

ప్రకృతిలోని జీవరాశుల న్నింటిలోనూ మానవుణ్ణి ప్రత్యేకంగా వేరు చేసింది. అతనిలోని మానసికమైన ఆలోచనే. తన మానసిక చర్య ద్వారా ప్రకృతిని - ప్రకృతి శక్తిని గౌరవించాడు. ప్రకృతిలోని అద్భుత శక్తులకు తన మేథాశక్తిని అర్పించాడు. తన మానసిక ఆలోచనతో విజ్ఞానాన్ని పెంచుకున్నాడు. నాగరిక ప్రపంచాన్ని నిర్మించుకున్నాడు. మిగిలిన జీవరాసులన్నింటి కన్నా తాను మిన్న అని నిరూపించుకున్నాడు.

కాని మానవుడి ఆలోచనల్లో పిరికితనం కూడా చోటు చేసుకుంది. తాను ప్రకృతిలో ఒక భాగం అని, ప్రకృతి తన కన్న అతీతమైన శక్తి అని భావించాడు. ప్రకృతి చేసే భౌతిక విషయాల్ని చూసి భయపడ్డాడు. మానసిక బలహీనతలను ఆలంబనంగా చేసుకొని ప్రకృతికి మోకరిల్లాడు. వాతావరణ ప్రభావం వల్ల కలిగే వ్యాధులకు, మానసిక ఆలోచనవల్ల కలిగే భయాలకి ఒక రూపాన్ని ఏర్పరచుకున్నాడు. చనిపోయిన తన పూర్వుల జ్ఞాపకాల్ని మనసులో వూహించుకుని వాటిని అర్ధ చైతన్య దశలో జ్ఞప్తికి తెచ్చుకొని ఆ రూపాల్ని చూసి భీతి చెందాడు. వాటిని దయ్యాలుగా, భూతాలుగా భావించాడు. వాటికి పాదాభి వందనం చేసాడు. వాటిని క్షుద్ర శక్తులుగా అంచనా వేసుకున్నాడు. క్షుద్ర శక్తుల్ని పూజించటం ద్వారా వాటికి నీచ నైవేద్యాలు సమర్పించటం ద్వారా రక్షణ పొందవచ్చు అని తలపోసాడు.

మనిషిలోని మానసిక బలహీనతలకు ప్రతి రూపంగా ఏర్పడినవే. మానసిక మైన మూఢ నమ్మకాలు ఒకప్పుడు ప్రకృతి రహస్యాలు తెలియక మానవుడు ఆచ రించినా నేటి విజ్ఞాన ప్రపంచానికి మార్గదర్శకుడై కూడా నేటికి ఆ మూఢ నమ్మ కాల్ని ఆనవాయితీగా పాటించుతున్నాడు. నిరాశ, నిస్పృహకు లోనై, మానసిక

దౌర్బల్యం వల్ల ఏర్పడిన ఈ మూఢ నమ్మకాలు ఈనాటికి సమాజంలో ప్రముఖ స్థానాన్ని ఆక్రమించాయి.

ప్రస్తుతం మనం ఈ మానసిక ప్రకరణంలో దిష్టి, శాంతి చేయటం, నైవేద్యాలు – బలులు, జాతర్లు – తిరునాళ్ళ క్షుద్రశక్తులు, బాణామతి – భూతవైద్యం మొదలైన అంశాల్ని పరిశీలిద్దాం.

# 1. దృష్టి దోషం

దృష్టి అనే పదానికి రూపాంతరమే దిష్టి. సామాన్య జన వాడకంలో దిష్టి అని అంటారు. దీన్ని 'దిష్టి' దోషం, అని చూపుతగలటం' అని అంటారు. చిన్న చిన్న బిడ్డలకు సుందరమైన వస్తువులకి, పంట చేలకు, పశువులకు చూపు తగులు తుందనే నమ్మకం మన వారిలో వ్యాపించి వుంది. అంటే అందమైన వస్తువుల్ని చూడటం వల్ల వాటికి ఏదైనా నష్టం వాటిల్లినట్లయితే దానికి దిష్టి తగిలింది అని వ్యవహరిస్తారు 'నరుడికంట నల్లరాయైనా బద్దలౌతుందనే' సామెత కూడా దీన్నుండే వచ్చింది. పసిపిల్లలకు కలిగే వివిధమైన వ్యాధులకు కూడా దిష్టి తగిలిందనే నమ్మకం వుంది. పంట చేలకు కలిగే వినాశనానికి సైతం దిష్టి దోషం కలిగిందనే అనుకుంటారు. పుట్టిన బిడ్డలకు దిష్టి తగలకుండా చర్యలు తీసుకుంటారు. పెద్ద వారవుతున్న సందర్భాలలో కూడా తాయెత్తులు కట్టడం వంటి చర్యలు కూడా దిష్టి దోషానికి తీసుకునే చర్యలే.

సుకుమారుడు బ్రాహ్మణ కుమారుడు. ఇతడు జన్మించిన సందర్భంలో దిష్టి దోషం తొలగిపోవడానికి ఈ విధంగా చేసినట్లుగా తెలుపబడింది.

> "తలయంపి ధవళ నిద్రాకుంభమిడువారు
> 'రక్షా' భసిత రేఖ వ్రాయువారు." [1]

తలస్నానం చేసిన తరువాత రక్ష రేకులు కట్టడం, బలి విధానం ఆచరించడం, వుప్పు, నిమ్మకాయలు దిగతుడవడం, పేము మంచమును వుపయోగించడం,

1. శివరాత్రి మాహాత్మ్యము 2 – 80.

నిప్పులపై సాంబ్రాణివంటి పదార్థాలు చల్లడం ద్వారా కలిగిన ధూపాన్ని పాపడికి పట్టడం మొదలైన వన్నీ దృష్టిదోషం తొలగిపోవడానికే.

మధురానగరంలో మాణిక్యవల్లి అనే నారపనితకు ఇరువురు కుమార్తెలు కలిగాను వారిని పెంచే సమయాలలో దృష్టి దోషంకలగకుండా వుండటానికి ఆమె చేసేఏర్పాట్లు ఈ విధంగా ఉన్నాయి.

అలదు నలుంగు దేహమున వేణ్ణీరార్చు
దడియొత్తు మెత్తను ధవళవస్త్ర[1]

స్నానం చేసిన తరువాత స్నానం చేయించిన ముత్తయిదువ తన కాలికి వున్న మట్టినితీసి తన బొటనవేలితో బిడ్డ నుదుట బొట్టుపెట్టడం, ఉయ్యాలమంచంపై పసిబిడ్డను ఉంచి ఆ మంచానికి నాలుగువైపులా ముసిడికోలలు, వివిధ రకాలయిన బొమ్మలు, గిలక్కాయలు అమర్చడం, గింజలను సేకరించి తాటికి గుచ్చి పాదాలకు కట్టడం (గురివింద గింజలు, అడవి చిక్కుడుగింజలు, తులసిపేర్లు మొ॥నవి) నిప్పులపై ఉప్పు, వేపాకు చల్లి ఆ పొగను పిల్లలకు పట్టడం, ఆముదంలో గుడ్డ గాని, పిడక కచ్చికగాని తడిపి దాన్ని వెలిగించి పీటలో పెట్టడం మొదలైన పనులన్నీ దృష్టిదోషం తొలగిపోవడానికి చేసే ఆచారాలే.

రాజశేఖరుడు అనే రాజుకు కుమారుడు జన్మించిన తరువాత ఏ విధంగా.దృష్టి తీయబడిందో వివరించబడింది.

"క్రమమున దాదు లక్కడను ముప్పటిలిన
జలకంబు దేర్చి యాచెలువ సుతుని" [2]

పసిబిడ్డకు స్నానం చేయించిన తరువాత కంటికి కాటుక పెట్టడం, చుక్కబొట్టు (దీనినే దృష్టిబొట్టు అని కూడా అంటారు) పెట్టడం, గడపకు అవతలవైపు నిప్పులపై పత్తిగింజలు వుంచడం, వేపరెమ్మ లుంచడం మొదలయినవన్నీ దృష్టి దోషం తొలగడానికి చేసే ప్రతిక్రియలే.

---

1. శ్రీ కాళహస్తి మాహాత్మ్యము. 4-11
2. సింహాసన ద్వాత్రింశిక - 3-45

"మడది యంగుష్టంబు మన్నింత మెదిచి
కడవ నంటిన యట్టి పిడక విభూతి
యడర పుత్రుని నొసలారంగఁబూయు" [1]

పిడక విభూతిని, పొదానికి పున్న మట్టిని నొసలపై రాయడం. పసిపిల్లలకు దిష్టిదోషం తగలకుండా వుండటానికి పంచవన్నెల కూడును దిగదుడిచి నాలుగు వీధులు కలిసే ప్రదేశంలో ఉంచుతారు.

తిన్నడు జన్మించిన తరువాత అతనికి దిష్టిదోషం కలగకుండా వుండటానికి అనేక క్రియలు చేశారు.

"జలకం బార్చి విభూతిఁబెట్టి కటి గుంజాబీజ సంకీర్ణమే" [2]

కటి ప్రదేశంలో అడవిగింజలను గుచ్చి కట్టడం, తాయెత్తుబు కట్టడంవల్ల దిష్టిదోషం పోతుందనే ఆచారం.

"వక్షఃస్థలంబున రక్షపూసల పేరు
దండ తాయెత్తులు దగ ధరించి"[3]

స్త్రీ గర్భం ధరించిన తరువాత ప్రసవించే సమయం వరకు దోషం తగల కుండా

"మూడు నెలలు జెలులు ముద్దలు వెట్టిరి
యలరు కుడుము లైదు నెలలుఁ బెట్టి
రేఁడు నెలలకు మ్రొక్కి రెజ్జ పోలెమ్మకు
సతికి జూలు వెళ్ళ జరుపుకొనుచు" [4]

---

1. బసవ పురాణము
2. శ్రీ కాళహస్తి మాహాత్మ్యము–3–32
3. సింహాసన ద్వాత్రింశిక – 7–45
4. సింహాసన ద్వాత్రింశిక – 3–33

రాజశేఖరుడు అనే రాజు భార్య గర్భం ధరించిన సందర్భంలో పెరుగు అన్నం ముద్దలు ముద్దలుగా కలిపి దిగదుడిచి దూరంగా విసురవేసి పాతిపెట్టడం మొదలైన చర్యలన్నీ దిష్టిదోషం పోవడానికే.

"దిష్టి దోషం పోవడంకోసం స్త్రీ అవయవాన్ని గృహనిర్మాణంలో చూపించడం పాశ్చాత్యదేశాలలో మొన్న మొన్నటివరకు వుండేది. ముఖ్యంగా వాళ్ళ దేవాలయాలు, చర్చీలలో చర్చి ముఖద్వారాలమీద సరిగ మధ్య ఒక స్త్రీ విగ్రహం తన అవయవాన్ని విప్పారించి చూపుతూ ఉన్నట్లు నిర్మిస్తారు." [1]

దేవాలయాలమీద నగ్నంగా విగ్రహాలు చెక్కించటం, కొన్నిచోట్ల స్త్రీ పురుషుల కలయికతోనూ, వివిధ భంగిమలతోనూ చెక్కబడిన శిల్పాలు, కొన్ని దేవాలయాల్లో నిర్మాణంలోనే కొన్ని ప్రదేశాల్లో అసంపూర్తిగా నిర్మాణం చెయ్యడం మొదలైన క్రియలన్నీ దిష్టి దోషం పోవడానికి చేసే చర్యలే.

"అగరు ఘ్మానసహకాష్ఠ ఖండముల సర్వాంగంబు లంజేసిపై" [2]

పంట చేలకు దిష్టి తగలకుండా వుండటానికి వుసుమూరు గ్రామంలోని చెంచులు దిష్టిబొమ్మలు తయారుచేసి తమ తవిదచేలకు కాపుంచారు.

"ఏనుగుల తలలు కొమ్ముల"

"ఖండంబులు ప్రోసుద్రాళ్ళగట్టుదు రెటుకల్"[3]

పైరులకు దృష్టిదోషం తగలకుండా వుండటం కోసం ఏనుగుల తలలు, కొమ్ములతోసహా బొమ్మలు తయాదుచేసి పంటచేనులో పాతుతారు. ఈ విధంగా పండిన పంట చేనుకు దృష్టి తగలదని పంటను చూడక ఆ విచిత్రరూపాలను చూడటంచేత దోషం పోతుందనే నమ్మకం వుంది.

ఇప్పటికీ అధునాతన భవనాలుగాని కట్టడాలుగాని తయారుచేసే సమయంలో దిష్టిబొమ్మలు తయారుచేసి వాటిని ఏర్పాటు చేయటంద్వారా ఆయా కట్టడాలకు దిష్టి దోషం తగలక ఎటువంటి వినాశానికి దారి తీయదని మనవారి నమ్మకం.

---

1. దేవాలయాలమీద బూతుబొమ్మ లెందుకు పు. 104
2. శ్రీ కాళహస్తి మాహాత్మ్యము 3-7
3. శ్రీ కాళహస్తి మాహాత్మ్యము 3 - 8,9

సామాన్యంగా పసిపిల్లలకు అనారోగ్యం సంభవించినా, పాలు తాగక పోయినా, నిరంతరం ఏడుస్తున్నా వారికి దిష్టిదోషం తగిలిందని భావిస్తారు. ఆ సమయంలో వివిధ రకాలయిన వస్తువుల్ని దిగతుడిచి దృష్టిదోషం పోయిందనుకుంటారు. కొంతమంది ఉప్పు దిగతుడిచి నిప్పులమీద వేస్తారు. కొందరు మిరపకాయలు దిగతుడిచి నిప్పులమీద వేస్తారు. కొందరు పంచవన్నెల కూడుతోపాటుగా కొబ్బరికాయను గాని, కోడినిగాని, కోడిగ్రుడ్డునుగాని దిగతుడిచి చూరప్రదేశంలో పాతిపెడతారు. ఆ విధంగా చేసినట్లయితే వారికి కలిగిన అస్వస్థత తగ్గి స్వస్థత కలుగుతుందని వారి నమ్మకం. పసిబిడ్డలు ఎండిపోతున్నట్లయితే వారికి చూపుతగిలిందని పిట్టపొరాడిందనే నమ్మకం వుంది. నెలల బిడ్డలను ఆరుబయట తిప్పినట్లయితె పక్షుల నీడ తగిలి ఎండిపోతారని, దిష్టిదోషం తగిలి ఎండిపోతారని వారి నమ్మకం.

ఇటువంటి సందర్భాలలో తోలుతో ఒకరకమైన తిత్తిని తయారుచేయించి అందులో ఒక కీటకాన్ని అమర్చి (దీన్ని గూనిపాప అంటారట) మెడలోగాని, నడుంకుగాని కడతారు. ఆ తిత్తిలోని కీటకం ఎంత త్వరగా మరణిస్తే ఆ పిల్లలు అంత త్వరగా కోలుకుంటారనే సమ్మకం వుంది.

పిల్లలకు కలిగే వ్యాధుల్ని గురించి మనవారికి సరియైన అవగాహన పురాతన కాలంలో లేదు. వైద్యశాస్త్రం అభివృద్ధి చెందని రోజుల్లో వారికి కలిగిన ఇబ్బందుల్ని తొలగించుకోవడానికి చేసే ప్రయత్నాలలో దిష్టి తీయటం ఒకటి. వారికి కలిగే అస్వస్థతకు కారణం గమనించక ఇటువంటి మూఢనమ్మకాల్ని అనుసరించారు. పిల్లలకు దిష్టి తగలటం అనే అంశాన్ని పాశ్చాత్యులు అంగీకరించలేదు. పిల్లలలో వివిధ దశలలో కలిగే అనారోగ్య సంబంధమైన వ్యాధులు కనిపెట్టలేని దశ ఒకప్పుడు వుండేది విజ్ఞానశాస్త్రం, వైద్యశాస్త్రం అభివృద్ధి చెంది వారికి కలిగే అనేక రకాల వ్యాధులకు కారణాలు – నివారణోపాయాలు కనిపెట్టబడ్డాయి. అయినప్పటికి కార్యకారణ సంబంధాల్ని గమనించక పిల్లలు ఏ మాత్రం అస్వస్థతకు గురయినా దిష్టి మొదలైన మూఢనమ్మకాల్ని అనుసరిస్తున్నారే తప్ప ఆయా వ్యాధులకు సంబంధించిన వైద్యుల్ని కలవటం, నివారణోపాయానికి తగిన మందుల్ని వాడటం జరగడంలేదు. ఈ మూఢనమ్మకాల ప్రవాహంలో శిశుమరణాలు ఎక్కువగా జరుగుతున్నాయని పిల్లల వైద్యనిపుణుల అంచనా. పెరుగుతున్న ప్రపంచ సామాజిక వ్యవస్థతోపాటు మనం కూడా అభివృద్ధి పథంలో ముందుకు సాగాలంటే ఇటువంటి మూఢనమ్మకాల్ని తెలుసుకొని వదిలిపెట్టడానికి కంకణం కట్టుకోవాలి.

# 2. శాంతి చేయటం

సామాన్యంగా మానవులు తమకు కలిగే కష్ట-నష్టాలకు ప్రతిక్రియగా మంచి కోరి చేసే పనుల్ని శాంతులు అంటారు. శాంతి అనగా "కామ క్రోధాది అరిష డ్వర్గాలు లేకుండటం". కాని సామాజిక పరిభాషలో దోషాలు కలిగినప్పుడు దానికి వ్యతిరేకంగా చేసే మంత్రతంత్ర కార్యాన్ని శాంతి చేయటం అంటారు. కొత్తగా గృహాలు కట్టినప్పుడు గాని, శుభకార్యాది సందర్భాలలో శుభం కలగటం కోసం గాని, తాము కోరుకున్న కోరికలు నెరవేరటానికి గాని, బిడ్డలు పుట్టిన సమయాలలో గాని, మరణ సమయాలలోగాని చేసే శాస్త్రోక్తమైన విధులను శాంతులంటారు.

ఈ శాంతి చేసే పని ఎక్కువగా శైవ వైష్ణవాలయాలలోగాని, నవగ్రహాలు వున్న ప్రదేశాలలో గాని జరుగుతుంటుంది. దానధర్మాది క్రియలు ప్రధాన స్థానం ఆక్రమిస్తాయి. బ్రాహ్మణులకు నవధాన్యాలు ఇవ్వటం, తద్వారా తమకు కలిగిన ఆపదలు తొలగిపోతాయనే నమ్మకం వుంది. ఈ శాంతుల సమయాల్లో ముఖ్యంగా గ్రహశాంతి చేయటం జరుగుతుంది. గ్రహాలు నవగ్రహాలని చెప్పటం జరిగింది. సూర్యుడు మొదలు రాహుకేతువుల వరకు చెప్పబడిన ఈ గ్రహాలు తొమ్మిది. మనిషి పుట్టిన సమయంలో లేదా మరణించిన సమయంలో గాని గ్రహాల కలయిక లేదా నక్షత్ర సముదాయంలో విభేదాలు సూచించటం వల్ల ఈ శాంతి చేయాలనే నమ్మకం వుంది.

ప్రముఖ అమెరికా ఖగోళ శాస్త్రజ్ఞుడు బార్ట్. జె. బాక్‌ను ఇలా అన్నాడు. "50 సంవత్సరాలుగా నక్షత్రాలను గ్రహాలను పరీక్షిస్తున్నాను. మానవ సంతానంకు జన్మ నక్షత్రాలకు ఎలాంటి సంబంధంలేదు. మనిషి మీద వాటి ప్రభావం లేదు. ఏమాత్రం వుండదని రుజువైంది."[1]

మానవుని విజ్ఞానం నిగూఢమైన నక్షత్రాలు గ్రహాలు వగైరాల రహస్యాలను బద్దలు చేయక ముందు ఈ ఆలోచనలు కలిగాయి. ఇప్పుడు సూర్యచంద్రుల జన్మల్ని వివరించి చెప్పగలిగిన శాస్త్రజ్ఞానం గల జగత్తులో ఇలాంటి నమ్మకాలపై ఆధారపడటం ఆటవిక సమాజ వ్యవస్థా లక్షణం మాత్రమే.

---

1. పెళ్ళెందుకు పు. 6.

కొత్తగా గృహాలు నిర్మించినవారు ఆ గృహం శాంతికి చేసే కార్యక్రమాలు వింతగా వుంటాయి. కొంతమంది గుమ్మానికి నిమ్మకాయలు వ్రేలాడగడతారు. మరి కొందరు గుమ్మడికాయలు, కొబ్బరికాయలు వ్రేలాడగడతారు. కొంతమంది జీవహింస ప్రధానంగా భావిస్తారు. ఈ విధంగా చేయటం ద్వారా ఆయా గృహాలకు శుభం కలుగుతుందనే నమ్మకం ఉంది

రాముడు తన భార్య సీత, తమ్ముడు లక్ష్మణునితో అరణ్య వాసానికి బయలుదేరాడు. గోదావరీ నది ఒడ్డున లక్ష్మణుడు అన్నగారి ఆజ్ఞ మేరకు పర్ణశాల నిర్మిస్తాడు. కొత్తగా నిర్మించిన ఆ గృహానికి శాంతి కలగటం కోసం కృష్ణసార మృగాన్ని బలి చేస్తాడు లక్ష్మణుడు.

"కృష్ణ సారముఁజంపి గృహ శాంతి హోమ
మృష్టాంశకులుఁడు శాస్త్రోక్తి మైఁజేసి." 1

జంతు బలి చేయటం ద్వారా ఆ గృహానికి శాంతి కలుగుతుందని వారి నమ్మకం.

శుభ కార్యాలు జరిగే సందర్భంలో క్షుతము (తుమ్ము) మొదలైన అశుభ ధ్వనులు వినిపించకుండా వుండేటందుకు మంగళ వాద్యాలు వాయించటం జరుగుతుంది. ఈ విధమైన తుమ్ములు అశుభానికి చిహ్నమట.

"వేద నినాదము నాశీ
ర్వాద నినాదము ననేకవాద్యిత్ర మహా
నాదంబుఁజెలఁగె నన్యని
నాదంబు జనంబులకు వినంబడకుండన్." 2

వివాహాది శుభకార్యాలలో సైతం మంగళ వాద్యాలు ఎక్కువ స్థాయిలో మోగించటం జరుగుతుంది. దీనివల్ల అశుభాది ధ్వనులు లేకుండటం, వాటికి శాంతి పూర్వకంగా వేద నినాదాలు - ఆశీర్వాద నినాదాలు వుంటాయి.

---

1. రంగనాథ రామాయణము - 105 - పు.
2. మహా భారతము - సభా పర్వము -1-292.

వీర పూజ చేసే సందర్భాలలో కూడా శాంతి చేయటం జరుగుతుంది. వీరులకు చేసే పూజ వీర పూజ. గత యుద్ధాలలో ప్రాణాలు కోల్పోయిన వీరులకు చేసే మర్యాద. మృతవీరుల శిలా ప్రతిమలు తయారు చేసి వాటికి ధూప దీప నైవేద్యాదులు సమర్పించటం జరుగుతుంది. వారి ఆత్మశాంతికి శిలా ప్రతిమలను పూజించటం వల్ల చనిపోయిన వీరులకు స్వర్గలోక ప్రాప్తి కలుగుతుందనే నమ్మకం వుంది.

"నిరవధిక భక్తి రసాతిశయ ప్రాణోపహార సమర్పణ మహా వీర శిలా వర ప్రతిరూపంబుల వలనను." [1]

కాకుల మైధునం చూచినట్లయితే పది నెలలలో మరణిస్తారనే నమ్మకం వుంది ఆ దోష పరిహారార్థం శాంతి చేయాలట.

"వాయస మైధునము గనఁ
జేయున్ పది నెలలలోనే జేటును మరణం." [1]

బిడ్డ జన్మించినప్పుడు నక్షత్రాలను చూస్తారు. నక్షత్రాలు 27 గా మన వారు లెక్కించారు. అనంత కోటి నక్షత్రాలలో ఇరవైఏడు మాత్రమే గణించారు. ఇవి కదులుతుంటాయని వీటి నడకవల్ల రోజులలో మార్పులు వస్తాయని మన వారి నమ్మకం నిజానికి నక్షత్రాలు కదిలేవి కావు. అవి ఒకచోట స్థిరంగా వుంటాయి. అయినా కోటానుకోట్ల మైళ్ళ దూరంలో వున్న అనంత కోటి నక్షత్రాలలో లెక్కకు ఇరవైఏడు నక్షత్రాలను మాత్రమే తీసుకొని, వీటి వల్ల మానవుని జీవిత కాలచక్రం ఆధారపడి వుంటుందని భావించడం, జననానికి నక్షత్రాల వల్ల దోషం-గండం వుంటాయని వూహించటం అజ్ఞానికి నిదర్శనం. ఏఏ నక్షత్రకాలంలో జన్మించితే ఎటువంటి శాంతులు ఆచరించాలో వివరించబడింది.

"జననమునకు దోష నక్షత్రములు."

అశ్విని, రోహిణి – పుష్యమి, అశ్లేష, మఖ, ఉత్తర, చిత్త, జ్యేష్ఠ, మూల, పూర్వాషాఢ, రేవతి ఈ నక్షత్రముల యందు జన్మించిన వారికి శాంతులు జరిగించు కొనవలెను.

---

1. విక్రమార్క చరిత్ర – 2 – 51.
2. శివ నారసింహా శతకము – 246.

భరణి, కృత్తిక, ఆర్ద్ర, పుబ్బ, విశాఖ పూర్వాభాద్ర ఈ నక్షత్రముల యందు జన్మించిన వారికి స్వల్ప దోషములు." [1]

గ్రహ దోషమందు జన్మించిన వారికి గ్రహ శాంతి కలుగజేయటానికి దాన ధర్మాది క్రియలు ఆచరించాలట.

గ్రహాలు సూర్యకుటుంబానికి చెందినవి. సూర్యునకు భూమి ఉపగ్రహం భూమికి చంద్రుడు ఉపగ్రహం. సూర్యుని చుట్టూ భూమి తిరగటం, భూమి చుట్టూ చంద్రుడు తిరగటం మనకు తెలిసిన విషయమే గ్రహాలపరస్పర ఆకర్షణ, వికర్షణ శక్తి ప్రభావం చేత మాత్రమే సూర్యకుటుంబం నడుస్తుంది. ఆయా గ్రహాల ప్రభావం సూర్యునిపై చూపటం జరుగుతుంది గ్రహాలన్నీ సూర్యుని చుట్టూ నిర్ణీత పరిధిలో కొన్ని మూల సూత్రాల ఆధారంగా తిరుగు తున్నాయి. ఈ విషయాన్ని 1618లో 'కెప్లర్' ప్రతిపాదించాడు. మరొక 60 సంవత్సరాల తరువాత గురుత్వాకర్షణ శక్తివల్ల ఇవి తిరుగుతున్నాయని న్యూటన్ సిద్ధాంతీకరించాడు. ఈ సిద్ధాంతంలోని స్వల్ప లోపాల్ని సరిదిద్ది ఐన్‌స్టీన్ సాపేక్ష సిద్ధాంతాన్ని ప్రతిపాదించాడు.

ఈ సాపేక్ష సిద్ధాంతాన్ని పతిపాదించటం ద్వారా విశ్వం యొక్క రహస్యాలు మనం తెలుసుకోగలుగుతున్నాం. విశ్వం అనంతమైంది. ప్రచండమైన వేగంతో కూడుకొని వుంది. ఎల్లప్పుడు విప్లవాత్మకమైన మార్పులకు లోనవుతుంది. దీని ద్వారా ప్రకృతి రహస్యాలు తెలుసుకోవడానికి, సత్యాన్వేషణ సాగించటానికి సహాయకారి అయింది. గ్రహ గమనం విశ్వ తత్త్వం తెలుసుకోవటానికి అవకాశం కలిగింది. **ఈ విధంగా అనంత దూరంలో తిరిగే గ్రహాలకు మానవుని జీవన విధానానికి సంబంధంలేదు.**

సామాన్య ప్రజలలో ఇటువంటి నమ్మకాలు కలిగించటం అనాదిగా వస్తోంది. దీనివల్ల తమకు కలిగిన ఈతి బాధలు తీరతాయని అమాయక జనం ఆశతో అజ్ఞానంలో మునిగిపోతున్నారు. నేడు విద్యావంతులు సైతం గ్రహాల్ని నక్షత్రాల్ని వాటి చలన విషయాల్ని గ్రహించినవారైనప్పటికి ఈ మూఢ నమ్మకాల బురదలో మునిగిపోతున్నారు. తమకు కలిగిన కష్టనష్టాలకు, ఈతి బాధలకు కార్యకారణ

---

1. జాతక సరస్వతి పు. 63

సంబంధాన్ని గ్రహించలేక కర్మ సిద్ధాంతంలో పడిపోవడమే. దీని నివారణకు దాన ధర్మా లాచరించడం, తద్వారా సుఖ సంతోషాలు పొందవచ్చని నాటి పురోహితవర్గం శాసించారు.

ఈ విధంగా దాన ధర్మాది శాంతి క్రియల ద్వారా తమకు కలిగిన కర్మ విపాకం తొలగిపోతుందని ఈ శాస్త్ర గ్రంథాలలో వివరించటం జరిగింది. ఈతి బాధలు పోతాయో లేదోగాని పై దానాది సంభావనల వల్ల మనిషి అప్పుల పాలై నిజమైన బాధల్లో మునిగిపోయే ప్రమాదం వుంది హేతుబద్ధంగా ఆలోచించే శక్తిలేక పోవడంవల్ల అనాదిగా వస్తున్న ఆచార వ్యవహారాల్ని కాదనే ధైర్యం లేక పోవడం వల్ల, మూఢ నమ్మకాలు మనిషిని పట్టి పీడించటం వల్ల ఇలాంటి నమ్మకాలు వ్యాపించాయి. దానాలు గ్రహించే పురోహిత వర్గం పరాన్న భుక్కులై సామాన్యుల్ని దోచుకోవటానికి ఎన్నుకున్న ఈ కర్మ సిద్ధాంతాన్ని అమాయకులు గ్రహించలేక పోవటం తద్వారా దోపిడీకి గురికావడం జరుగుతోంది. ప్రతి వారు హేతుబద్ధమైన ఆలోచన ద్వారా నిజాన్ని గ్రహించె రోజున ఈ నమ్మకాలు వాటం తట అవే ఈ సమాజాన్నుంచి దూరంగా పారిపోతాయి.

# 3. నైవేద్యాలు - బలులు

మానవుడు ఆశాజీవి. తన మనసులోని ఆశలు తీర్చుకోవటానికి తన కోరికలు కార్యరూపం ధరింపజేసే ప్రయత్నంలో అనేక పద్ధతులు అవలంబించాడు. తాను నమ్మిన భగవంతునికి నైవేద్యం లేక బలులు సమర్పించటంద్వారా తన కోరికలు నెరవేరుతాయని, భగవంతుడు వాటిని తీరుస్తాడు అనే నమ్మకంచేత ఈ పనులు చేసాడు. మొదట ఈ పనులు తాను తినే ఆహారాలతో ప్రారంభమై ప్రాణిహింస వరకు పెరిగింది. ఫలాలతో చేసే పూజావిధానాన్ని నైవేద్యం అన్నారు. ప్రాణిహింస చిన్న జీవులనుండి పెద్ద జీవులవరకు పాకింది. పక్షులను, పశువులనే కాక తోటి మానవులను కూడా వధించటం జరిగేది. ఇదంతా

భగవంతునిపై గల నమ్మకంచేత, తీరని తన కోరికలు తీర్చుకోవడానికి చేసే ప్రయత్నంలో భాగం. ఈ విధంగా చేసే జీవహింస బలులుగా మారింది.

"గ్రామదేవతల పూజల్లో కేవలం పండ్లు, ఫలాలవంటి ఆహారాన్ని నివేదించటమే కాక బలి క్రియ ప్రధాన స్థానం ఆక్రమించటం కనిపిస్తుంది. దీనికి జానపద కథల్లో ముఖ్యమైన స్థానం నిర్దేశించబడ్డది తమకు ఆహారపుష్టిని సమకూర్చే దైవంమీద కృతజ్ఞత చూపిస్తూ తాము తినే ఆహారాన్ని కానుకగా అర్పించే పద్ధతి ఒకటి కాగా, భక్తుడు దైవంతో తన్ను అభేదంలో చెప్పుకుంటూ, ఏకత్వ స్థాపన కొరకై తన ఆత్మనే ఆకర్షించుకొనే పద్ధతి ఒకటి తనలోని ఆత్మకు బదులు ఆ స్థానంలో జంతువులను చేర్చటం క్రమంగా జరిగిన మార్పు. అదే బిల్వార్చనగా మారి మొదటి పద్ధతి అయిన నైవేద్యంతో కలిసిపోయి ఆహార సమర్పణలో ఒక అంగంగా భాసించింది. జానపద గాథల్లో తల్లి దేవత సర్వేసర్వత్రా రక్త ప్రీతికల దేవత. ఆవిడ బలి కోరుకుంటుంది.

శ్రీశైల భ్రమరాంబిక ఆలయంలోను, బెజవాడ కనకదుర్గ ఆలయంలోను ఒకప్పుడు నరబలులు సాగేవని చెప్పటానికి ఉపపత్తులున్నాయి. ఒకప్పుడు భారత దేశంలో బలివిధానం ముమ్మరంగా వుండేది. ముఖ్యంగా పంటలను కోసేటప్పుడు పరదేశి జనులను పట్టితెచ్చి, కాళ్ళు చేతులు నరికి, ఆ ముక్కల్ని నడిపంటలో వ్రేలాడదీసేవారు. చిన్నపిల్లలను చంపి, చర్మం ఒలిచి ఆ ముక్కలను గాదెల్లో దాస్తే ఆ పంట అక్షయం అవుతుందనే నమ్మకం చాలాచోట్ల వుండేది. అలాగే ద్రావిడజాతికి చెందిన గోండులు బ్రాహ్మణ బాలకుల్ని దొంగిలించి పొలం మధ్యలో చంపి ఆ రక్తం పొలి చల్లేవాళ్ళు. ఖోండ్‌లు కూడా 'తరిపెన్ను', 'బెరిపెన్ను' అని తాము పిలిచే పంట దేవతలకు నరబలులు ఇచ్చేవారు. మనుష్య రక్తం చిందనిదే పసుపు కొమ్ములకు చిక్కని రంగు రాదని వాళ్ళ నమ్మకం." [1]

ఈ విధంగా నైవేద్యాలు - బలులు మన సమాజంలో చోటు చేసుకున్నాయి. మనిషిలోని మానసిక దౌర్బల్యానికి ప్రతిరూపమే ఈ నైవేద్యాలు, బలులు. గ్రామ దేవతలకు చేసే జాతర్లు, కొలుపుల్లో ఇవి ఎక్కువగా సాగుతుంటాయి. ఈ నైవేద్యాలు లేక బలులు వ్యక్తిగతంగాను, కుటుంబగతంగాను, సమాజగతంగాను

1. తెలుగు జానపద గేయాలు - సాంఘిక చరిత్ర 32,33.

వుంటాయి. కోరికలు తీర్చుకోవటానికి చేసే ప్రయత్నాలలో ఇది మనిషి చివరి ప్రయత్నం.

"ఒక తెల్లని కోడిపుంజును తెస్తారు. అది సూర్యభగవానుడు. ఒక నల్లని పెట్టను తెస్తారు. అది భూదేవి. ఆ రెంటికి పసుపు, కుంకుమ, పువ్వులు అన్నీ పెట్టి అలంకరిస్తారు. ఆ రెండూ సంగమిస్తుంటే చూచి భక్తితో నమస్కారాలు చేస్తారు. తరువాత వాటిని చంపుతారు.

ఆ కోళ్ళ సంగమాన్నిబట్టి తమకి రాబోయే సంవత్సరం సుఖంగా వుంటుందో, కష్టాలతో నిండి వుంటుందో తెలుసుకుంటారు." [1]

కుంభకుడు అనే యాదవరాజు కుమార్తె నీల. ఆమె శ్రీకృష్ణునకు వరసకు మేనమరదలు. ఆమె శ్రీకృష్ణుని పతిగా కోరుతుంది. కుంభకుడు స్వయంవరం ప్రకటించి తన ఇంటిలో వున్న ఆబోతులను చంపినవానికి నీల నిత్తునని ప్రకటిస్తాడు. ఆమె తమ గ్రామదేవత గంగానమ్మను, విఘ్నేశ్వరుని ఈ విధంగా ప్రార్థిస్తుంది.

"పూని యాదల దల్రబాలు వోసి తాళి"
"వెనకయ్యరా నీకు బోతు వెరపు దలిర్పన్" [2]

తనకు శ్రీకృష్ణునకు వివాహం జరిగిన గంగానమ్మకు వెండిపూలతో పూజ, విఘ్నేశ్వరునకు (వెనకయ్య) పుంద్రాళ్ళతో పూజ చేయిస్తానని నీలాసుందరి కోరుతుంది.

ఈ వ్యాసకర్త రంగారెడ్డిజిల్లా తాండూరు గ్రామాన్ని దర్శించటం జరిగింది. అక్కడ మనుబోతుల మల్లేశం (62) అనే ఒక రైతుకూలి తనకు బాగా తెలసిన బలి వివరం ఈ విధంగా ఇచ్చాడు.

పంట బాగా పండిన తరువాత ముందు మునుం కోస్తారు. కుప్ప నూర్చి, తూర్పారపడతారు. పొలం నాలుగువైపుల ముద్రలు కొడ్తారు. (ముద్ర అంటే చిన్నగుంట అని చెప్పాడు) గొర్రెపోతును గాని, మేకపోతును గాని, శక్తి లేనివాళ్ళు

1. దేవాలయాలమీద బూతుబొమ్మ లెందుకు – పు. 101.
2. నీలాసుందరి పరిణయము 1 – 115, 116.

కోడిపుంజును గాని పొలంలో కోస్తారు. వాటి రక్తాన్ని పొలం అంతా చల్లుతారు. కోడి అయితే సగం మెడ కోసి పొలం మధ్యలో వదులుతారు. పై భాగం తీసి (తోలు - ఈకలు) పొలం మధ్యలో పాతిపెడతారు. మిగిలిన మాంసాన్ని వండి ఆ రోజున పని చేసినవాళ్ళంతా కలసి తింటారు. మిగిలిన మాంసం ముద్రలు కొట్టిన గోతుల్లో వేసి పూడుస్తారు. దాన్ని ఇతరులు వుపయోగించరు.

అడవిలో జీవించే ఆటవిక జాతులవారు వేటకు బయలుదేరినప్పుడు, వేట పూర్తి అయిన తరువాత కొండదేవత లేక కాటదేవతకు బలిపెట్టటం ఆచారం. ఆ విధంగా బలిపెట్టటంద్వారా తమ వేట సఫలం అవుతుందని, వేట పూర్తయిన తరువాత వేట అందించిన కాట్రేనికి కృతజ్ఞతాపూర్వకంగా బలి పెట్టటం వాళ్ళ నమ్మకం. బలి చెల్లించనిదే వేట దొరకదనే మూఢనమ్మకమే దీనికి కారణం.

తిన్నడు ఉడుమూరు గ్రామ నాయకుడు నాథనాధుని కుమారుడు. అతడు వేటకు వెళ్ళి అలసిపోయి నిద్రించిన సమయంలో కల గని పిదప శివదర్శనం చేసికొని శైవ పారవశ్యంలో మునిగిపోగా, మిత్రులు వచ్చి తిన్ననితో పలికిన సందర్భం

> వలలును దెరలు బోగులు జుట్టగ లేదు
> బలివెట్టి కాట్రేని గొలువలేదు [1]

గుంటూరుజిల్లా రేపల్లె తాలూకా రాజవోలు గ్రామంలో చైత్రమాసంలో వచ్చే పున్నమినాడు జరిగే 'సిడి మహోత్సవం' విచిత్రంగా వుంటుంది. ఆ రోజు ఒక మేకపోతును బండిపై పూరేగించి రాత్రి వుత్సవం జరిగిన తరువాత గ్రామంలో వదిలిపెడతారు.

సుమారు 25-30 సంవత్సరాలకు పూర్వం మేకపోతుకు వీపు పై భాగాన్ని కొంకిగాలంతో గుచ్చి పైకెత్తి ఆ గ్రామంలో వూరేగించి గ్రామస్థులు దాన్ని 'స్వాహా' చేసేవారట. (ఈ విషయం అక్కడ వయసు మళ్ళినవారు చెప్పారు) ఆ కార్యం అనాగరికంగా తోచిందో లేక జీవహింస నేరం అన్న ప్రభుత్వ శాసనానికి భయపడి

---

1. శ్రీ కాళహస్తి మాహాత్మ్యము 3-76

కాని ప్రస్తుతం ఆ సిడి మహోత్సవాన్ని ఈ రూపంలో నేటికి ప్రతి సంవత్సరం జరుపుతూనే వున్నారు.

లోకంలో నిధులు ఎత్తేవారు నిధి సాధకమయిన కాటుకను కన్నులకు బెట్టుకొని చూచి ఆ నిధులను కనిపెట్టి పిశాచాల, భూతాలవల్ల బాధ తొలగడానికి నెత్తుటి కూడును తూర్పుదిక్కున బలివైచి దానికి చెట్టునో పుట్టనో గుర్తుంచుకొని త్రవ్వుతారు.

మరున కొసంగు కాలము తమఃప్పటి గాటుకగా నవోదయ
స్ఫురదరుణ ప్రభాపధిక శోణిత సిక్తసితోదు భక్తమున్
హరిహయ దిఙ్నిధిస్థ్సలుమున్ బలిచల్లి పటాంకమున్ వసూ
త్కర భరితంబునై వెలుగగాంచె సుధానిధి నెత్తెసత్తరిన్ [2]

ధనపిశాచు లుంటాయని వాటికి భూతబలి అవసరం అని నమ్ముతుంటారు. లంకెబిందెలు జంటలుగా వుంటాయని. అవి దొరికినప్పుడు బలి ఇవ్వాలనే నమ్మకం వుంది. మనం అప్పుడప్పుడు దినపత్రికల్లో ఇలాంటి బలుల్ని గురించి, క్రొత్తగా ప్రారంభించిన సినిమా థియేటర్లకు, పెద్దపెద్ద కట్టడాలకు, దేవాలయాలకు జంతుబలులో, నరబలులో జరిగినట్లు చూస్తుంటాం. దేవతలకు నైవేద్యాలు సమర్పించడం ద్వారా ఆ దేవతలు తృప్తిపడి తమకు ఎలాంటి అపకారం చెయ్యవు అనే నమ్మకం ప్రజల్లో అనాదిగా వ్యాపించింది. కలరా, మశూచి వంటి అంటు వ్యాధులు సోకినప్పుడు గ్రామీణ వాతావరణంలో ఇలాంటివి నేటికి మనం చూస్తూనే వున్నాం. గ్రామ దేవతకు చద్ది నైవేద్యం సమర్పించడం ద్వారా ఆమె చల్లబడి అంటు వ్యాధుల్ని పారద్రోలుతుందనే నమ్మకం ఇప్పటికీ వుంది. వైద్యశాస్త్రం ఎంత అభివృద్ధి చెందినా, అంటు వ్యాధుల్ని అరికట్టడానికి ఎన్ని ఔషధాలు కనిపెట్టినా వాటి జోలికి పోకుండా ముడుపులు కట్టి నైవేద్యాలో బలులో, సమర్పించడం ద్వారా వ్యాధులు పోతాయనే గుడ్డి నమ్మకాలతో ఎంతోమంది బలైపోతున్నారు. కలరా, మశూచి, ఆటలమ్మ మొదలైన వ్యాధులు సోకినవారికి కోడిని దిగతుడిచి దేవతకు సమర్పించడం మొదలైన ఆటవిక కృత్యాలు ఇప్పటికి జరుగుతూనే వున్నాయి.

---

2. మనుచరిత్ర 3-21

పోలేరమ్మ అనే పేరుతో పిలువబడే 'మశూచి' అనబడే వ్యాధి మన దేశంలో ఇదివరకు ప్రబలంగా వుండేది. తీవ్రమైన జ్వరం మొహమంతా ఎర్రని పొక్కులు, బతికి బట్టకడితే మొహమంతా గుంటలు ప్రసాదించే వ్యాధి. ఎడ్వర్డ్ జెన్నర్ టీకాల మందు కనిపెట్టి ఈ వ్యాధిని దూరంగా పారదోలాడు.

గ్రామీణ ప్రాంతాల్లో ఇలాంటి వ్యాధులు సోకినప్పుడు వూరిలోని వారిలో ఒకరికో ఇద్దరికో పూనకం రావటం, తరువాత కొలుపులు – నైవేద్యాల కార్యక్రమం ప్రారంభమవుతుంది. గ్రామ దేవత ఆలయం దగ్గర గణాచారి వుంటాడు. కలశం ఎత్తిన దగ్గర్నుండి పొద్దున్నే నిద్ర లేచి వేపమండలు కట్టిన కుండ తీసుకొని ఇల్లిల్లూ తిరుగుతాడు. గ్రామ వాసులంతా ఆ కడవలో అన్నం పెరుగు వేస్తారు. అపరాహ్నం వేళకు పోలేరమ్మ గుడి దగ్గరకు చేరి కుండలోని అన్నానంతా కలిపి తన వెంట వచ్చిన పిల్లలందరికీ తలా కొంచెం ఫలహారం పెడ్తాడు. ఆనందంగా తింటారు ఆ పసికూనలు. ఈ విధంగా ఈ కార్యక్రమం కొలుపుల వరకు సాగుతుంది.

ఈ చద్దన్నం పోగు చేసే సమయంలో ఎవరి ఇంట్లోనయినా కలరా, మశూచి, ప్లేగు (దీన్ని దూము అని కూడా అంటారు) మొదలైన వ్యాధులు వుంటే ఆ వ్యాధి క్రిములు చద్దన్నం ద్వారా గ్రామం మొత్తం వ్యాపించే ప్రమాదం వుంది. ఇహ కొలుపుల్లో గ్రామంలోని జనమంతా ఒకచోట చేరి కోళ్ళనో, మేకల్నో అమ్మవారికి బలి ఇచ్చి వండి నైవేద్యం చెల్లించి వూరంతా తింటారు. దాని పర్యవసానం వ్యాధులు వూరంతా వ్యాపిస్తాయి. పోలేరమ్మ కొలుపుల స్థానంలో వ్యాధుల కొలుపు ప్రారంభమవుతుంది. సరైన వైద్య సదుపాయాల్ని గురించి ఆలోచించక నైవేద్యాల పేరుతో వ్యాధుల్ని పెంచి పోషించే అనాగరిక మూఢ నమ్మకాలే ఈ దేశానికి పట్టిన జాడ్యం.

పెరుగుతున్న ప్రపంచ ప్రగతి, వైద్యశాస్త్రంలో అభివృద్ధి, గ్రహాంతర యానం ఒకవైపు జరుగుతుంటే మనం మూఢ నమ్మకాల బురదలో కూరుకుపోయి దేవతల తృప్తికై బలులు, నైవేద్యాలు సమర్పిస్తున్నాం గ్రామాల్లో కలరా, మశూచి, ఆటలమ్మ, ప్లేగు మొదలైన వ్యాధులు వచ్చినప్పుడు వైద్యుణ్ణి సంప్రదించటం జరగక ముడుపులు కట్టి నైవేద్యాలో బలులో సమర్పించి దేవతల్ని తృప్తిపరచడం

రోగాలు తగ్గక పోగా, గ్రామాలప గ్రామాలే అంటువ్యాధులకు గురయి చాలామంది మృత్యు వాత పడటం మనం చూస్తూనే వున్నాం. అందుచేత ఈ బలులు, నైవేద్యాలు, పూజా పురస్కారాలు ప్రగతికి దోహదం చెయ్యక పోగా వినాశానికి దారితీస్తున్నాయి. కనుక ఇలాంటి మూఢ నమ్మకాల్ని వదలి హేతువాద దృక్పథాన్ని అలవర్చుకుని ముందుకు సాగినప్పుడే జాతి ప్రగతి సాధిస్తుంది.

# 4. జాతర్లు - తిరునాళ్ళు

జాతర - తిరునాళ్ళ అనే పదాలు సమానార్థకాలు. జాతర అనగా 'శక్తి ఉత్సవము' అని అర్థం. తిరునాళ్ళ అనగా 'దేవోత్సవము' అని అర్థం. కాని లౌకికార్థంలో పరిశీలించినపుడు జాతర గ్రామ దేవతలకు చేసే ఉత్సవాల పండుగ అని, తిరునాళ్ళ శైవ దేవాలయాలలో గాని, విష్ణు దేవాలయాలలో గాని జరిపే పండుగ, అని తెలుస్తుంది. గ్రామ దేవతలు నూటొక్క దేవతలని వాడుక. ఒక్కొక్క గ్రామానికి ఒక్కొక్క పేరు గల దేవత (గంగానమ్మ, నాంచారమ్మ, పోలేరమ్మ, అంకమ్మ, లంకమ్మ, పోలమ్మ, మైసమ్మ ఇత్యాదులు) రక్షగా వుంటుందని గ్రామ ప్రజల నమ్మకం. ఈ దేవతలు సర్వే సర్వత్రా రక్త ప్రీతి గలవారే. ఈ దేవతలకు బలి ప్రధానం. మొక్కే మొక్కులన్నీ బలులే. కోడినో, మేక పోతునో, గొర్రె పోతునో, దున్నపోతునో బలి ఇవ్వటం ఆచారం.

ఈ విధంగా బలి ఇచ్చినట్లయితే తమ కోరికలు తీరతాయనే నమ్మకమే దీనికి కారణం. మానసిక దౌర్బల్యానికి లోనయినవారు తమకు కలిగిన ఈతి బాధలు తొలగిపోయినట్లయితే ఆయా గ్రామ దేవతలకు బలులు సమర్పిస్తామని మొక్కుకుంటారు. ఆ మొక్కులు సంవత్సరానికి ఒకసారి మాత్రమే (జాతర సమయాల్లో) తీర్చుకుంటారు. ఈ జాతర్లు ఒక్కొక్క సమయంలో ఒక్కొక్క గ్రామంలో జరుగుతాయి.

తిరునాళ్ళలో బలి విధానం వుండదు. కొబ్బరికాయలు, పళ్ళు, పూలు, పానకం, వడపప్పు వంటి శాఖాహార పదార్థాలు ఇందులో ప్రాతినిధ్యం వహిస్తాయి. నిర్ణయించబడిన రోజున దైవ దర్శనం చేసుకొని నైవేద్యాలు సమర్పించి ఉత్సవంలో

పొగ్గొంటారు అనేకమంది ఈ ప్రత్సవాల్లో పొల్గొంటారు కాబట్టి చిన్న, పెద్ద వ్యాపారస్థులు తమ వ్యాపార సౌలభ్యం కోసం వివిధ వస్తువుల్ని, తినుబండారాల్ని తీసుకువచ్చి అమ్ముతారు. గతంలో పట్టణాలు చాలా తక్కువగా వుండేవి. ఈ తిరునాళ్ళ సమయాలలో పల్లెలలోని పాటక జనం తమకు కావలసిన వస్తువుల్ని తెచ్చుకోవటం కోసం తిరునాళ్ళకు వెళ్ళటం జరుగుతుండేది.

అయితే కొన్ని గ్రామీణ ప్రాంతాలలో ముఖ్యమైన కొన్ని పండుగల సందర్భాలలో కూడా జాతర్లు జరుపుకోవటం జరుగుతుంది. దసరా, సంక్రాంతి, ఏరువాక మొదలైన పండుగలలో చేసే జాతర్లలో జంతు బలి జరుగుతుంటుంది.

జాతర్లలో డప్పులు మోగుతుంటాయి. వేపమండలు, సాంబ్రాణి పొగ, కల్లు, సారాయి మొదలైన మాదక ద్రవ్యాలు ముఖ్యమైన సాధనాలు. దేవతకు కల్లు కుండలు (దిగుచు) దిగదుడిచి వాటిని ప్రసాదంగా స్వీకరిస్తారు. జంతువులనుగాని, పక్షులనుగాని బలి చేసేటప్పుడు దాని మెడలో వేప మండ కట్టి పసుపు పూసి నిప్పులపై సాంబ్రాణి పొగవేసి మూడుసార్లు దిగదుడిచి తల కోసి తల ఎడమవైపున మొండం కుడివైపున వుంచుతారు తల దేవత వద్ద వున్న గణాచారి తీసుకుంటాడు. ఈ గణాచారి గ్రామ దేవత ఆలయానికి పూజారి వంటివాడు. వేదమంత్రాలు తెలియక పోయినా జాతర్ల సమయాల్లో ఇతనికి దేవత పూనటం జరుగుతుంది. దీన్ని పూనకం అంటారు. దీన్నే పారవశ్యం అనుకోవచ్చు. ఆవేశంలో మనిషి వణకటం. నోటికి వచ్చిన మాటల్ని అతివేగంగా పలకటం జరుగుతుంది. అతి వేగంగా మ్రోగే డప్పుల శబ్దం మనిషిని ఆవేశానికి లోనుగా గావిస్తుంది. దాని పర్యవసానమే గణాచారి పూనకం.

"ఇటువంటి జాతరలు సాధారణంగా ఊరిలో గాయి, గత్తర' చెల రేగినప్పుడు తత్ప్ర శమనార్థం జరిపిస్తుంటారు. కొలుపులు సాగించటానికి ఊరంతా కలసి నిశ్చయించంగానే ఆ వార్త టముకు ద్వారా ప్రచారిం చేయబడుతుంది. గ్రామం మధ్యలో కలశ స్థాపన జరుగుతుంది. అట్లా కలశాన్ని స్థాపించటాన్ని 'పురం వెయ్యటం' అంటారు. అక్కడ అమ్మను ప్రతిష్ఠించంగానే కొలుపు లారంభమైనట్లే. ఊరి వారందరు తమ తమ మొక్కులననుసరించి దేవికి బోనాలు వెళ్లిస్తారు బయిబర్పిస్తారు. రంగులతో చిత్రించిన పూజ కుండల్లో ముందు రోజు

అన్నం వండి ఉంచుతారు. ఆ కుండను 'చద్ది కలశం' అంటారు. దాని మీద మరో చిన్న ముంతలో పానకం పోసి ఉంచుతారు. దీన్ని 'కడు ముంత' అంటారు. కడు ముంత మీద ఉంచిన మూకుడు వంటి దాన్ని 'కంచుడు' అంటారు. ఈ కంచుడులో నూనెపోసి జ్యోతి వెలిగిస్తారు ఆ దొంతిని తలపై కుదురుగా ఉంచుకొని అమ్మవారి దగ్గరకు తీసుకు పోవటమే బోనాలు తీసుకు పోవటం. ఒక ముంత కల్లుగాని, నీళ్ళుగాని అమ్మవారి ముందు వారబోసి, బోనాన్ని ఎవరికి వారే దేవికి నివేదిస్తారు. ఇలా వార బొయ్యటాన్ని 'సాక' అని కూడా అంటారు. అమ్మవారి కొలుపును, తెలంగాణాలో బోనాల పండుగ అని వ్యవహరించటం కూడా ఉంది. జాతర చివరి రోజున 'పోతు బోనం' చెల్లించటమనే తంతు సాగుతుంది. ఊరందరూ చేరి ఉమ్మడిగా కొన్న పోతును బలి యివ్వడం ఆ వేళ జరుగుతుంది. పోతు అంగ లోపం లేనిదై, కొమ్ములు వంకర లేకుండా తీరినవై ఉండాలి. దాన్ని దేవి ముందు బలి యిచ్చి అక్కడ పోసిన కుంభం మీద ఆ రక్తాన్ని చల్లుతారు. రక్తసిక్తమైన ఆ అన్నాన్ని ఊరి వీధుల్లో ఎగజిమ్ముతారు. ఆ మెతుకులు పడ్డచోట అంటు వ్యాధులు సోకవని జనుల విశ్వాసం. ఆ మెతుకుల్ని ఏరి గృహస్తులు ఇళ్ళల్లో దాచుకోవటం కూడా కొన్ని ప్రాంతాలలో కనిపిస్తుంది." [1]

తెలుగు నాట వున్న ప్రసిద్ధ శివక్షేత్రాలలో కోటప్ప కొండ ఒకటి. ఇది గుంటూరు జిల్లా నరసరావు పేటకు దక్షిణంగా 10 కిలోమీటర్ల దూరంలో వున్న శైవ క్షేత్రం. ఇది కొండ కావూరు, ఎల్లమంద అనే రెండు గ్రామాల మధ్య వున్న పర్వత క్షేత్రం. ఈ పర్వతం సుమారు రెండు మూడు కిలోమీటర్లు వ్యాపించి వుంది. ఎత్తు 1600 అడుగులు పై భాగంలో ఒక గుడి వుంది. దానిని పాత కోటప్ప గుడి అని పిలుస్తారు. 600 అడుగుల ఎత్తులో ఇప్పుడు ఉత్సవాలు జరిగే కొత్త కోటప్ప గుడి వుంది. ఇది శివలింగంతో కూడిన దేవాలయం. శైవ ప్రీతికరమైన పర్వ దినాలలో ఈ స్వామికి వుత్సవం జరుపుతారు. ముఖ్యంగా శివరాత్రి నాడు 'మహా ఉత్సవం' జరుపుతారు.

---

1. తెలుగు జానపద గేయాలు – సాంఘిక చరిత్ర – పు. 62

ఈ వుత్సవం రోజున దేశంలోని నూరు మూల ప్రాంతాల నుండి అనేక లక్షల సంఖ్యలో భక్తులు ప్రభలు కట్టుకొని ఇక్కడికి వస్తారు శక్తిలేని వారు వీపుకు ప్రభలు కట్టుకుంటారు. 'హరిహర మహదేవ' 'శంభోశంకర' 'చేదుకో కోటయ్య' అనే నినాదాలు ఇక్కడ ప్రధానం. కొండ ఎక్కి అక్కడ మొక్కుబడులు చెల్లిస్తారు. కొబ్బరికాయలు, బెల్లం, పూలు, విభూతి ప్రధానమైన నైవేద్యాలు. ఈ స్వామికి మొక్కుకుంటే ఏ కష్టం వచ్చినా, ఏ ఆపద వచ్చినా అవి తొలగి పోతాయని ఆ భక్తుల నమ్మకం.

ప్రభలు కట్టడం, ఆ ప్రభల ముందు వీరంగాలు వేయటం, కత్తులు తిప్పటం, కర్రసాము చెయ్యటం. సూదులవంటి ఇనుప సాధనాలు కంఠంలో, నాలుకకు నోటి కిరువైపులా పొడుచుకోవటం వంటివి కూడా వుంటాయి. ఇవి కూడా మొక్కుకున్న వాటిలో భాగం. రాత్రి జాగారం చెయ్యటం, ఉదయం శివారాధన. ఇక్కడే జరిగే శివరాత్రి పర్వదిన కృత్యం.

జాతర ఒక్కొక్క ప్రదేశాల్లో ఒక్కొక్క రకంగా వుంటుంది. గుంటూరు జిల్లా బాపట్ల తాలూకాలో కొండ పాటూరు జాతర విచిత్రంగా వుంటుంది. ఈ వుత్సవం సంవత్సరానికి ఒకసారి జరుగుతుంది. ఆ గ్రామ దేవత పోలేరమ్మ. ఈ పోలేరమ్మ జాతరకు దూర ప్రాంతం నుండి జనం లక్షల సంఖ్యలో వస్తారు. కోరిన కోరికలు తీరతాయని. పోలేరమ్మ తల్లి చల్లని తల్లి అని అక్కడి ప్రజల నమ్మకం. ఈ వ్యాసకర్త ఆ ప్రదేశాల్ని దర్శించటం జరిగింది. పంటలు బాగా పండిన వాళ్ళు, సంతాన వంతులయివారు, సంతానం కోరేవారు ఎక్కువగా వస్తారు. జాతర సాయంత్రం ఆరు గంటల నుంచి ప్రారంభమవుతుంది. జంతు బలి బాగా వుంటుంది. ముఖ్యంగా కోళ్ళ వధ ఎక్కువగా వుంటుంది. మొక్కులు తీర్చుకోవడానికి వచ్చిన వాళ్ళు కోళ్ళను బలి చేసి అక్కడే వండుకు తిని పోలేరమ్మ తల్లికి నైవేద్యం సమర్పించి తమ మొక్కులు తీరాయని భావిస్తారు. ఈ ఉత్స వంలో మాతంగులు ప్రధానమైన పూజారి వర్గం లాంటి వాళ్ళు. ఆడపడుచుల్ని మాతంగులుగా మార్చే ఆదిమ యుగం నాటి ఆచారం పాటించే కుటుంబాలు ఈ

ప్రాంతంలో వున్నాయి. ఆధునిక యుగంలో కూడా ఈ దురాచారాన్ని ఖండించే నాధుడు లేక మూఢ విశ్వాసాలకు ఈ బాలికలు బలి అవుతున్నారు.

"గ్రామ దేవతకు జరిపే కొలుపుల్లో మాతంగి చిందేసే ఆచారం అనాదిగా వస్తూంది. మాతంగి కల్లు పుక్కిట బట్టి చుట్టూ చేరిన వారిపై ఉమ్మి వేస్తే వారి పాపాలు పోతాయని కొలుపులు చేసే ప్రజలు మూఢంగా నమ్ముతారు. మూఢ విశ్వాసాలవల్లనూ, ఈ సందర్భంగా లభించే పారితోషికంవల్లనూ తమ బాలికలను మాతంగులుగా మార్చటానికి కొందరు తండ్రులు అంగీకరిస్తారు.

లోకజ్ఞానం లేని పదేళ్ళ వయసు బాలికను ఎంపిక చేసి మాతంగిగా మారుస్తారు. గుడివద్ద గుంట తీసి బాలికకు పసుపు కుంకుమ రాసి ఆ గుంటలో కూర్చోపెట్టి వేప మండలతో కప్పి వేస్తారు. ఆమెను మూడు రోజులపాటు అక్కడే వుంచుతారు. ఈ మూడు రోజులుపాటు పాలుతప్ప వేరే ఆహారం ఇవ్వరు. ఈ తంతుపూర్తి కాగానే ఆ బాలిక మాతంగిగా మారినట్లు భావిస్తారు. తాళి గట్టిన వాడు మరణించినా ఈమె సుమంగళిగానే వుంటుంది. కుల పెద్ద చేత ఆమె మెడలో తాళి కట్టిస్తారు. ఆమెకు చిందు నేర్పుతారు యుక్త వయసు రాగానే ఆమె తనకు ఇష్టమైన వారితో జత కట్టవచ్చు. ఎవరి కామవాంఛనైనా తీర్చవచ్చు. కొలుపుల్లో చిందేయటం, కల్లు పుక్కిలించి ప్రజలపై వుమ్మివేసి వారి పాపాలు తగ్గించటం ఆమె విధి. ఈ కారణంగా కల్లు, సారా తాగటం అలవరచుకుంటుంది. కొన్నాళ్ళకు తాగందే చిందేయలేని పరిస్థితికి దిగజారుతుంది. కొలుపుల్లో లభించే పారితోషికం జీవనోపాధికి చాలక పోవటంతో ఆమె వ్యభిచారాన్ని వృత్తిగా స్వీకరిస్తుంది. ఆమె దుర్భర జీవితం గడపవలసి వస్తుంది.[1]

వరంగల్లు జిల్లాలో మేడారం గ్రామంలో రెండేళ్ళ కొకసారి పెద్ద ఎత్తున సమ్మక్క, సరళక్క జాతర జరుగుతుంది. వీరిరువురు అక్కచెల్లెళ్ళట. గిరిజనుల దేవతలు. ఒకప్పుడు కేవలం గిరిజనులు మాత్రమే ఈ సమ్మక్క సరళక్కను కొలిచే వారు. కాని ఇప్పుడు అన్ని వర్గాల వారు ఈ దేవతలను పూజించేందుకు ఈ జాతరకు వస్తున్నారు.

---

1. ఈనాడు 25-6-83.

సుమారు ఏడు వందల ఏళ్ళ క్రిందట కాకతీయరాజు ప్రతాపరుద్రునితో తమ ప్రాంతీయ హక్కుల కోసం సమ్మక్క, సరళక్క వీరోచితంగా పోరాడి ప్రాణాలు అర్పించారని వారి జ్ఞాపకార్థం ఈ జాతర జరుగుతుందని ఇక్కడ వున్న కథనం. ఈ సందర్భంగా గిరిజన దేవతలైన సమ్మక్క, సరళక్కలు జాతరలో పాల్గొన్న వారిని దీవిస్తారని వారి నమ్మకం.

వారు వీరోచితంగా పోరాటం జరిపిన ప్రాంతంలోనే రెండు ఎత్తయిన ప్రదేశాల్ని భక్తులు పూజించటం కోసం ఏర్పాటు చేస్తారు. సమీపంలో వున్న కొండమీద సమ్మక్క, సరళక్కలకు కట్టిన దేవాలయం వుంది. ఆ దేవాలయంలో వీరి విగ్రహాలున్నాయి. మామూలు సమయాల్లో యాత్రికులు, మొక్కుబళ్ళ వాళ్ళు దర్శిస్తుంటారట. అక్కడ పెళ్ళిళ్ళు కూడా జరుగుతాయని స్థానికులు చెప్పారు. (ఈ వ్యాసకర్త 1983 ఫిబ్రవరి 16వ తేదీన ఈ జాతర చూడటం జరిగింది.)

జాతర సమయంలో కొండపై వున్న దేవతల ఉత్సవ విగ్రహాలను ఆ కుటుంబానికి చెందిన సభ్యులే తీసుకు వచ్చి ఆ ఎత్తయిన ప్రదేశంలో పెడతారు. దూరంగా పరిశీలిస్తే అవి లోహ విగ్రహాల్లా వున్నాయి కాని ఇవి వెదుళ్ళతో తయారుచేసిన విగ్రహాలు. డప్పులు మంద్ర స్థాయిలో ప్రారంభమై తీవ్ర స్వరానికి చేరుకునేటప్పటికి కొందరు భక్తులు చిందేయటం. పూనకం వచ్చిన వాళ్ళలా వూగటం జరుగుతుంది. ఎక్కువమంది ఏదో ఒక రకమైన మత్తు పదార్థానికి లోనైన వారేనని ఈ వ్యాసకర్త గమనించారు. మత్తులో, డప్పుల స్వరవేగంలో రాత్రంతా వుపవాసం వున్న భక్తుల్లో కొంతమందికి ఆవేశం రావటం సహజం.

పీఠం చుట్టూ వందలాది భక్తులు చేరి ఆటవిక నృత్యం చెయ్యటం ప్రదక్షిణాలు చెయ్యటం పూనకం వచ్చిన వాళ్ళలాగా ప్రవర్తించటం ఈ వుత్సవంలో మామూలు. వాళ్ళు తమ చిత్తం వచ్చిన రీతిలో భూతభవిష్యత్తుల గురించి మాట్లాడటం జరుగుతుంది.

ఈ దేవతలకు బలి ఇష్టం. బెల్లం కూడా ఇష్టమే. భక్తులు బెల్లాన్ని నైవేద్యంగా సమర్పిస్తారు. ఆ దేవతల పీఠం చుట్టూ బెల్లం కుప్పలు, కుప్పలుగా కనిపిస్తుంది. వీరికి కోళ్ళను బలి ఇవ్వటం ఆచారం. మొక్కుకున్న వారు కోడిని

బలి ఇచ్చి దాని మాంసం వండి అక్కడే తింటారు. ప్రభుత్వం బలుల్ని నిషేధించినా ఈ జాతరలో మాత్రం జీవహింస సాగిపోతూనే వుంది.

అయితే ఇక్కడ చూడముచ్చటైన వింత ఒకటి వుంది. కోళ్ళను బలివ్వటానికి ఆర్థిక స్తోమత లేనివారు, శాఖాహారులయినవారు కోడిని ఆ దేవత ముందు పైకి ఎగరవేసి పట్టుకుంటే ఆ జీవిని దేవతకు బలి ఇచ్చినట్లే భావిస్తారు. అలా కోళ్ళను ఎగురవేసి పట్టుకునేందుకు భక్తులు గిరిజనులకు కొంత డబ్బు చెల్లిస్తారు. ఇది అర్ధరూపాయి నుండి రెండు రూపాయల వరకు వుంది.

ఇటువంటి జాతర్లకు సరిజోడుగా జరిగే పేరంటాళ్ళ ఉత్సవాలు కూడా గమనింపదగినవే.

"భర్తతో సహగమనం చేసి గాని, ప్రజాహిత కార్యానికై ప్రాణాలిచ్చి గానీ, వీరాద్భుత చర్యల్ని నిర్వహించి మరణించి గాని ఒక స్త్రీ పేరంటాలుగా మారుతుంది. వీరి చిహ్నాలు 'సతీ కల్లులు' అనే పేరున ద్రావిడ దేశమంతా వెలసి ఉన్నవి. గ్రామ దేవతల్లో అధిక సంఖ్యాకులైన దేవతల మొదట పేరంటాళ్లుగా రూపుచెందినవాళ్ళే. పోనిలమ్మ, కనకమ్మ, ముండ్ల మూడెమ్మ, కళుగోళమ్మ, సరోజనమ్మ మొదలైన పేరంటాళ్ళ యొక్క మానవ స్త్రీ జన్మలూ, ఆ జన్మల్లో నడిచినవారి జీవిత చరిత్రలూ జానపద కథల్లో వినిపిస్తుంటవి. ఈ పేరంటాళ్ళ జాతర్లలో కూడా బోనపు కావళ్ళ చెల్లించటం, ఐరేణికుండల్ని నిలిపి పూజించటం, పండ్లు, పాయసాలు, చలిమిడి, వడపప్పు పానకం మొదలైన పంద్యారాలను చెల్లించటం కనిపిస్తుంది. సాధారణంగా పేరంటాళ్ళను సౌభాగ్యం కోసం సంతు కోసం జనం ప్రార్థిస్తారు.

'సతీకల్లుల' వంటివే 'వీరకల్లులు' కూడా. ఆంధ్రదేశమంతటా నెలకొని ఉన్నవి. అద్భుతావహ కృత్యాలు చేసినవాళ్ళూ యుద్ధంలో వీరమరణం చెందిన వాళ్ళూ, భగవంతుని ఆత్మ హింసాచర్య (self-immolation) ద్వారా ప్రాణాలర్పించిన వీరులు అందరూ 'వీరకల్లు' కై వెలిసి జనం పూజల నందుకోవడం కనిపిస్తుంది. [1]

---

1. తెలుగు జానపద గేయాలు, సాంఘిక చరిత్ర- పు. 64.

స్త్రీ ప్రధానమైన జాతర్లు ఆంధ్రదేశంలో అనేకచోట్ల నేటికి జరుగుతూనే వున్నాయి.

ఈ విధంగా పరిశీలిస్తుంటే జాతర్లు అనంతం, అసంఖ్యాకం. మొత్తం మీద జాతర్లన్నీ హింసాత్మకాలే. జీవకారుణ్య సంఘాలవారు కాని ప్రభుత్వం గాని వీటిని అరికట్టలేక పోతున్నారు. జీవహింస జరుగుతూనే వుంది. ఈ బలి విధానం ద్వారా తమ ఈతిబాధలు తీరతాయని తమ జీవితం సుఖ సంతోషాలతో గడుస్తుందని భావించి అమాయకులైన ప్రజలు ఈ మూఢనమ్మకాలలో మునిగిపోతూనే వున్నారు.

# 5. క్షుద్ర శక్తులు

క్షుద్రం అనగా నీచ, అధమం అనే అర్థం చెప్పబడింది. క్షుద్రం అయినటు వంటి శక్తుల్ని క్షుద్రశక్తులు అంటారు. వీటినే 'క్షుద్ర దేవతలు' అని పిలవడం కూడా కద్దు. దేవతలు మానవులకు మేలు చేస్తారనే నమ్మకం మనవారికి వుంది. దేవతల్ని ఆరాధించడం వల్ల, పూజించడం వల్ల తమ కష్టాలు తీరిపోతాయనే నమ్మకం అనాదిగా వ్యాపించి వుంది. ఫలం, పత్రం, పుష్పం, తోయం వీటితో దేవతల్ని తృప్తిపరచి ఆనందం పొందేవాళ్ళు కొందరు, నైవేద్యాలు సమర్పించి ఆనందం పొందేవాళ్ళు కొందరు వున్నారు. దేవతల్లో రెండు రకాల దేవత లున్నారనే నమ్మకం వుంది. అధిదేవతలు, క్షుద్ర దేవతలు క్షుద్రదేవతలకు బలులు- రక్త తర్పణం చెయ్యడం ద్వారా అవి మానవులకు మేలు చేస్తాయని ఆ శక్తులు మానవుని అధీనంలో వుండి చెప్పినట్లు వింటాయనే నమ్మకం వుంది.

ఈ శక్తుల్ని ఆవాహన చేసుకొని తమ చెప్పు చేతల్లో వుంచుకొని ప్రజల సౌభాగ్యం కోసం కాక వినాశానికి దారితీసే చర్యలు చేసే వారిని మంత్రగాళ్లు, మాంత్రికులు అని పిలుస్తూ వుంటారు. వీళ్లు క్షుద్రమైనవిగా పిలవబడే రకరకాల శక్తుల్ని తమ మంత్ర తంత్రాల ద్వారా నడిపిస్తారనే నమ్మకం అనాదిగా అన్ని దేశాల్లోనూ వ్యాపించి వుంది.

సమాధిలో నుంచి శవాలు లేస్తాయని వాటి విషయంలో భూత మాంత్రికుల హస్తం వుంటుందని నమ్ముతారు.

"మన పల్లెటూళ్ళలో భూత మాంత్రికుల గురించి వాళ్ళ కిష్టమైన అంద గత్తెల్ని, విరోధుల్ని వాళ్ళు చంపేసే పద్ధతుల గురించి మనలో చెప్పుకుంటున్నట్లే 'హయతి' ద్వీపంలో గల నీగ్రో తెగల్లోనూ ఇదేరకం భూత మాంత్రికులు, ఇదే విధంగా తమకు నచ్చిన ఆడవాళ్ళను, తమకు నచ్చని విరోధుల్ని చంపి ఆ తరువాత బ్రతికించడం గురించి చెప్పుకుంటుంటారు. ఇది ఎంతవరకు నిజమో చూద్దామంటూ ఇద్దరు శాస్త్రజ్ఞులు (వృక్ష శాస్త్రవేత్త ఇ. వాడేడేవిస్, మానసిక చికిత్సా కేంద్రం అధిపతి లమార్క్ డుయెన్) రంగంలోకి దిగి ఒక 'జోంబీ' భూత మాంత్రికుని పట్టుకొని ఏ విధంగా వాళ్ళ మనుషుల్ని చంపడం చేస్తారంటూ ప్రశ్నించారు. ఆతడి చ్చిన జవాబులో బయటపడిన దేమంటే "ఒక మందును చంపవలసిన వ్యక్తి తినే పదార్థంలో కలుపుతారు. ఆ మందులో 'బఫొమారినస్' అనే బోదురు కప్ప కాలే యాన్ని, నీళ్ళు ఎగజిమ్మే ఒక రకం చేపను ఉపయోగిస్తారు. ఆ కప్ప కాలేయంలో మనిషిని మొద్దుబారించే శక్తివంతమైన రసాయనాలు వుండి గుండెపైనా, నరాలపైనా అవి విపరీతంగా పనిచేస్తాయి. చేపలో నరాలకు సంబంధించిన ఘోరమైన విషం ఉంటుంది. దీనిని సైన్సు పరిభాషలో "టెట్రోడోక్సిన్" అని అంటారు.

ఆ విషాన్ని సేవించిన ప్రారంభంలో శ్వాస ఆడటం కష్టంగా వుంటుంది. గాజుకళ్ళతో చూస్తున్నట్లుగా వుంటాడా వ్యక్తి. ఆ తర్వాత పక్షవాతం మనిషిని పూర్తిగా కమ్ముకుపోతుంది. అయినా మెదడుకు సంబంధించి ఏ హానీ జరగదు. కాని ఆ విషయం కూడా ఆ విషాన్ని తీసుకున్న పరిమాణం బట్టి వుంటుంది. ఎక్కువ మందు సోకితే మనిషి వెంటనే చనిపోతాడు. అతడిని తిరిగి స్పృహలోనికి తీసుకురావడంలో విఫలం కావొచ్చు సరియైన పరిమాణంలో ఆ మందును ఇచ్చినా, తెలివితప్పిన ఎనిమిది గంటల్లోపులో అతడిని విరుగుడు మందులతో బ్రతికించాలి. లేని పక్షంలో తిరిగి అతడిని వెనుకకు నడిపించుకువచ్చి నాడి కొట్టుకునేట్టు చేయడం అసాధ్యం అవుతుంది.

జోంబీలో బానిసలుగా మార్చుకునేందుకు మగవాళ్ళను, తమ కామ కోర్కెల్ని తీర్చుకునేందుకు ఆడవాళ్ళను అచ్చటి భూత మాంత్రికులు ఆ విధంగా చేస్తూండేవాళ్ళనే కథలున్నాయి. కప్ప, చేపలవల్ల తయారుచేసే విషం మందును, శాస్త్రజ్ఞులు అమెరికాలోనూ, ఇంగ్లాండులోనూ ఎలుకలపై పరిశోధనలు చేసి పరిశోధ నాలయంలో ఆ విషాన్ని వేరుపరచి, దాని ప్రభావాన్ని కేటాయింపు చేసి, ఆ విధంగా

మనుషుల్ని తాత్కాలిక చావులకు గురి చెయ్యడంలో మంత్రాల ప్రభావం ఏమీ లేదని, అదంతా కేవలం జంతువుల విషం వల్ల మాత్రమేననీ తేలింది".[1]

భుక్తి కోసం కొంతమంది మంత్రం పేరుతో, తంత్రం పేరుతో, భూత వైద్యాల పేరుతో మూఢనమ్మకాల్ని పెంచి పోషిస్తున్నారు.

ప్రకృతి వైపరీత్యాలు, కొండ దేవత ఆగ్రహ ఫలితమని, చావులు మంత్రగాళ్ళ మంత్ర ప్రభావమని, జబ్బులు కుల దేవతల ఆకలి గుర్తులనే మూఢాచారం ఖమ్మం జిల్లాలోని ఆటవిక ప్రాంతాల్లోని గిరిజనుల్లో పాతుకుపోయింది. ఈ నమ్మకంతోనే గిరిజనులు సహజ సిద్ధమైన చావులకు సైతం కారణాలు వెదికి అనుమానం ఉన్న మంత్రగాళ్ళను హత్య చేస్తున్నారు. భద్రాచలం డివిజన్‌లోని కొన్ని రకాల గిరిజన జాతుల్లో ఈ మూఢాచారం ప్రబలి వుంది. దీని ఫలితంగానే పదినెలల వ్యవధిలో ముగ్గురు మంత్రగాళ్ళను హత్య చేశారు. ఇదికాకుండా అనర్థాలకు కారణమనే అపోహతో మంత్రగాళ్ళపై దౌర్జన్యాలు ప్రతి నిత్యం జరుగుతూనే ఉంటాయి.

గిరిజనుల్లో అజ్ఞానాన్ని, అమాయకత్వాన్ని కొంతమంది మంత్ర తంత్రాలని మభ్యపెట్టి సొమ్ము చేసుకొంటున్నా ఒక్కోసారి అదే అజ్ఞానం, ఆ మంత్రగాళ్ళ ప్రాణాలను సైతం బలిగొంటుంది. ఇది వీలుకాకపోతే గిరిజనులు ఆ మంత్రగాడికి తల గొరిగించి చెప్పులతో ముందు పళ్లు వూడిపోయేటట్లు కొడతారు. ఈ విధంగా చేస్తే అతనిలో మంత్రశక్తి నశిస్తుందని వారి నమ్మకం.

మంత్ర తంత్రాల పేరుతో అమాయకుల్ని దోచుకుందామనే ఇలాంటి మంత్రగాళ్ళకు ఈ విధమైన శాస్తి జరగవలసిందే. చేతబడి, కాష్మోరా, బాణామతి, క్షుద్ర ప్రయోగం మొదలైన క్షుద్రశక్తులున్నాయని నమ్మటం- నమ్మించటం ఇప్పటికి వెనకబడ్డ అనేక ప్రాంతాల్లో జరుగుతూనే వుంది. నీచశక్తుల పేరుతో, ఆరాధన పేరుతో అమాయకుల్ని దోచుకుంటున్నారు. ఇవి నిజం కాదని క్షుద్రమైన శక్తులు లేవని నేడు పెరిగిన విజ్ఞానశాస్త్రం వివరిస్తూనే వుంది. ఒకప్పుడు మశూచి

---

1. (My experience in Hayati Islands — P. 27)

క్షుద్రశక్తి అని భావించారు. ఎడ్వర్డ్ జెన్నర్ కనిపెట్టిన టీకాల మందుకు ఈ క్షుద్రశక్తి దూరంగా పారిపోయింది. సిగ్మండ్ ఫ్రాయిడ్ గ్రీన్, బ్రూచ్ వంటి మానసిక శాస్త్రవేత్తల కృషి ఫలితంగా హిస్టీరియా, సైకో-ఎనాలసిస్ వంటి వ్యాధులకు పరిష్కార మార్గం లభించింది.

మానసిక దౌర్బల్యాన్ని ఆధారంగా చేసుకుని కొంతమంది మంత్రగాళ్ళు తమ భుక్తి కోసం చేసే ఈ ప్రచారాలే మూఢ నమ్మకాలుగా ఏర్పడి సమాజంలో నిలబడిపోయాయి ఈ మూఢ నమ్మకాలు తొలగిపోవడానికి నేటి శాస్త్రజ్ఞుల కృషి ఎంతైనా అవసరం.

భూతవైద్యం :

భూత వైద్యాన్ని గ్రహ చికిత్స అని అంటారు. దయ్యం పడితే వదిలించడం అని కూడా అంటారు. సామాన్యంగా మానసిక రోగమని గ్రహించక గాలి సోకిందనో, భూతం ఆవేశించిందనో, పిశాచం ఆవహించిందనో భావించారు మానసిక వికారానికి లోనైన వ్యక్తులు వివిధ ప్రవృత్తులతో సంచరిస్తారు.

వెకిలి నవ్వులు నవ్వడం, వికారపు చూపులు చూడటం వికారపు, చేష్టలు చెయ్యడం, అన్నం తినకుండా వుండటం, తింటూ వున్న అన్నాన్ని వెదజల్లి లేచిపోవడం, కుటుంబం మొత్తానికి వండిన అన్నాని ఒకే వ్యక్తి తినడం, మంచం మీద పడుకున్న వ్యక్తి అమాంతం లేచిపోవడం, ఇంటిలో సామాను మాయం కావడం, నూతిలోనో గోతిలోనో కనిపించడం, పారవేసిన వస్తువులు తిరిగి తీసుకు రావడం ఇటువంటి ఎన్నో పనులు జరుగుతుంటాయి.

అంటే దయ్యాలూ, భూతాలూ, పిశాచాలూ ఇంద్రజాల విద్యను చేస్తాయని, మానవుల్ని పట్టి పీడించడం జరుగుతుంటాయని అంటారు. ఇవన్నీ మానసిక వికారానికి ప్రతిబింబాలు. ఇలాంటి వింత చేష్టలు చేసే వ్యక్తుల్ని బాణామతి - పిశాచం - భూతం - దెయ్యం ఆవహించిందని భావించి భూత వైద్యుల దగ్గరకు తీసుకుపోవడం జరుగుతుంది. భూత వైద్యులు దయ్యాన్నో, భూతాన్నో వదిలిస్తామని ఈ మానసిక రోగుల్ని చిత్రహింసల పాలు చేస్తారు.

దయ్యం పట్టిన వ్యక్తి జుట్టును చేత్తో పట్టుకొని, ఇంకో చేత్తో చెప్పుగాని, వేపమండలుగాని తీసుకొని భూతవైద్యుడు వాళ్ళను ఇష్టం వచ్చినట్లు బాదుతాడు. మిరపకాయల పొగపెట్టి ఊపిరాడకుండా చేస్తాడు. చిటికెన వ్రేలు పట్టుకొని గోడతో బలం కొద్దీ నొక్కుతాడు. క్రైస్తవుల్లో ఒక శాఖ వాళ్లు ఇట్లాంటి మానసిక రోగుల్ని బెత్తాలతో కొట్టి హింసిస్తారు. ఈ విధంగా ఎన్నో రకాల హింసా ప్రవృత్తి గల చికిత్సా విధానాలు మనం చూస్తున్నాం.

భూత వైద్యుడు ఇంకా కొన్ని తతంగాలు చేస్తాడు. వీరిలో ఎక్కువమంది ఆంజనేయోపాసకులు లేదా శక్తి - దుర్గ ఉపాసకులై వుంటారు. వీళ్లు దయ్యం పట్టిన వాళ్ళను అంటే మానసిక రోగుల్ని తమ పూజా పీఠం దగ్గర కూర్చో బెట్టుకొని దయ్యాన్ని పిలుస్తారు. అంటే దయ్యం - ఊరూ - పేరూ ఎందుకు వచ్చిందో మొదలయిన వివరాలన్నీ చెప్పించడం అన్నమాట. దీన్నే ముగ్గులోకి పిలవడం అని కూడా అంటారు. ఈ విధంగా చెప్పించిన తరువాత కొంత తతంగం చేసినట్లు చేసి ఆ దయ్యాన్ని ఒక సీసాలోకి దించి బిరడా మూత బిగించి పైన మేకు కొట్టి దాన్ని భూమిలో పాతేస్తారు. లేదా నీటిలో పారవేస్తాడు.

దీని తరువాత ఆ వ్యక్తికి దయ్యం వదిలిందని గ్యారంటీ ఇచ్చి ఒక రక్షరేకో, తాయెత్తు కడతారు. దీని ప్రభావం వల్ల ఇక ఎప్పుడూ ఏ రకమైన దయ్యమూ సోకదని నమ్మకంగా చెప్తాడు. అది మానసిక వ్యాధి కదా తిరిగి మామూలుగానే చర్యలు ప్రారంభమౌతాయి. ఈసారి గొప్ప భూత వైద్యుణ్ణి సంప్రదిద్దామనుకుంటారుఇంట్లోవాళ్లు ఇక చరిత్ర పునరావృతమే.

నాగరికత పెరిగిందనుకున్న ప్రాంతాల్లో కూడా ఈ వ్యాధి అధికంగానే వుందని చెప్పాలి. ఈ రకమైన చికిత్స - చర్యలు దేశంలో ముఖ్యంగా ఆంధ్ర ప్రాంతంలోని వెనుకబడ్డ ప్రాంతాల్లో ఇప్పటికి నిరాటంకంగా సాగుతూనే ఉన్నాయి. ఇది భూతం సోకటం కాదని హిస్టీరియా రోగం అని మానసిక రోగం అనీ మానసిక వైద్యుణ్ణి సంప్రదించాలనే జ్ఞానం లేకపోవడం శోచనీయం. ప్రభుత్వం మానసిక వైద్యుల్ని గ్రామ గ్రామాన పంపి ఈ చర్యలకు ప్రతి క్రియ చేసినప్పుడే ఇలాంటి క్షుద్రమైన శక్తులు నశిస్తాయి తప్ప మరో మార్గంలేదు. ఇలాంటి మూఢ నమ్మకాల్ని తొలిగించాల్సిన అవసరం సమాజానికి ఎంతైనా ఉంది.

# 6. బాణామతి

ప్రస్తుతం వార్తా పత్రికల్లో ప్రముఖ స్థానం ఆక్రమించిన విశేషాంశం బాణామతి. ఈ మధ్యకాలంలో ఈ వ్యాధికి సంబంధించిన ప్రాచుర్యం పత్రికల్లో బాగా చోటు చేసుకుంది. ఈ బాణామతి పేరు వింటేనే ప్రజలు భయకంపితులవు తున్నారు.

మన రాష్ట్రంలో ముఖ్యంగా తెలంగాణా జిల్లాలలోనూ వాటినానుకొని వున్న కర్నాటక రాష్ట్రంలోని గుల్బర్గా జిల్లాలోను అంటే పూర్వం నైజాంనవాబు పరిపాలనలో వున్న ప్రాంతం అన్నమాట ఈ బాణామతి ఎక్కువగా వుంది.

నైజాం పాలన కాలంలో ఆ ప్రాంతాల్లో ఇది విపరీతంగా వుండేదని, ఆనాటి పరిపాలకులు దీన్ని అదుపులో పెట్టడానికి అనేకమైన చర్యలు తీసుకునేవారని మనకు నమ్మకమైన ఆధారాలు వున్నాయి.

మన దేశానికి స్వాతంత్ర్యం వచ్చిన తరువాత, ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన తరువాత కూడా సుమారుగా 1981 వరకు ఈ ప్రాంతంలో ఈ బాణామతి అంతగా లేదనే చెప్పాలి. గత రెండు మూడు సంవత్సరాలలో ప్రజలు దీని ప్రభావానికి భీతావహులై వికలమవుతున్నట్లు, రంగారెడ్డి జిల్లా, మెదక్, మహబూబ్‌నగర్, ఆదిలాబాద్ జిల్లాలలోనూ వాటి పరిసర ప్రాంతాల్లోలోనూ యీ విద్యనుగురించిన వివరాలు తెలిసినవాళ్ళు, ఈ బాణామతిని ప్రయోగించగలరనే మంత్రగాళ్ళు అధికం అవుతున్నారని తెలుస్తుంది. దీనితో అమాయకులైన సామాన్య ప్రజలు అనేక అలజడులకు గందరగోళ పరిస్థితులకు లోనవుతున్నారు.

కోస్తా జిల్లాల్లో గూడా అక్కడక్కడా అప్పుడప్పుడూ 'చేతబడి' అనే పేరు మనం వింటుంటాం. కాని దీన్ని చూచిగాని, అనుభవించిగాని. భయపడే ప్రజల గురించిన వివరాలు మనకు అంతగా తెలియదనే చెప్పాలి. అయితే ఒరిస్సా రాష్ట్రానికి దగ్గరగా వున్న ఉత్తర కోస్తా జిల్లాలలోను – ఒరిస్సా ప్రాంతంలోనూ 'చిల్లంగి' అనే పేరులో ఆయా ప్రాంతాలలోని ప్రజల్లో అలజడి రేపుతున్నట్లు వింటున్నామేతప్ప వాస్తవ విషయం మాత్రం మనకు తెలియదు. ఈ మధ్య

కాలంలో తెలంగాణా ప్రాంతంలోని కొన్ని జిల్లాల్లో మరీ భీతావహమైన పరిస్థితి మనకు వార్తాపత్రికల ద్వారా వినిపిస్తుంది.

రిచర్డ్స్ సామ్యూల్ అనే శాస్త్రవేత్త "చేతబడి అనేది కేవలం బూటకం. స్వార్థపరులైన కొందరు అమాయకులైన ప్రజల్ని ఒక రకమైన భయభ్రాంతులకు లోను చేసి తమ అవసరం కోసం ప్రయత్నిస్తున్నారు. మొట్టమొదటగా ఇలాంటి వాళ్ళను కఠినంగా శిక్షించాలి" అన్నాడు.

ఉస్మానియా విశ్వవిద్యాలయం ప్రొఫెసర్ యాదగిరిరెడ్డి ఈ విషయం ప్రస్తావిస్తూ "చేతబడి, బాణామతి అనేవి లేనేలేవు. ధైర్యం లేనివాళ్ళకే ఇలాంటి భయాలుంటాయి" అన్నారు.

నైజాం కాలంలో ఏ కారణాలను మనం చెప్పుకున్నా అప్పటి నుండి ఇటీవల కాలం వరకు దాదాపుగా చచ్చిపోయిన యీ విద్య తిరిగి తల ఎత్తటం ఆ ప్రాంతంలో వున్న ప్రజల్ని గందరగోళ పరచటం గమనించదగిన విషయం. దీనికి ముఖ్యంగా ఇటీవల జరుగుతున్న రాజకీయ సంఘర్షణ, ఆర్థిక పరిణామ కారణాలే తప్ప మరేం కాదు. ఈ వ్యాసకర్త రంగారెడ్డిజిల్లా, మెదక్‌జిల్లా మహబూబ్‌నగర్ జిల్లాలను దర్శించడం, ఆ ప్రాంతంలో బాణామతి సోకిన అనేకమంది నిర్భాగ్యుల్ని కలవడం జరిగింది. ఈ పనికిమాలిన విద్య పట్టణాల కంటె పల్లె ప్రాంతాలలో అధికాధికంగా వ్యాపించడానికి కారణం నేడు గ్రామాల్లో తిష్ఠవేసిన రాజకీయ కక్షలు, విభేదాలే. ఇవి పరిశీలనలో తేలిన సారాంశం.

వెనకబడ్డ ప్రాంతంగా చెలామణి అవుతూ పేద ప్రజల్ని బానిసలుగా చూసే యీ ప్రాంతాలలోనే అల్ప శ్రమతో ఆ ప్రజల్ని ఆడించడానికి బాణామతి అనే క్షుద్రశక్తుల పేరుతో సాగించే ఈ అకృత్యాలు నేడు సర్వ సామాన్యంగా మనకు కన్పిస్తాయి.

అయితే ఈ బాణామతి ఎలా జరుగుతుంది ?

బాణామతి అనే ఈ క్షుద్రశక్తి రెండు దశలుగా జరుగుతుంది.

1. వ్యక్తిగత – భౌతిక ఆస్తుల నష్టం.
2. వ్యాధుల రూపంలో సామూహికంగా మనుష్యుల్ని పీడించడం.

ఇవి మొదటి దశకు చెందినవి మాత్రమే. గ్రామాల్లో ఇళ్ళమీద రాళ్ళు వెయ్యటం, ఇళ్ళను కాల్చటం, బట్టలు కాల్చటం వంటి అనేక భౌతిక అనర్థాలు జరుగుతున్నాయి. ఇవన్నీ వ్యక్తుల ప్రమేయంవల్ల జరుగుతున్నాయేగానీ మరేంకాదు. ఇటువంటి చర్యలు గ్రామ కక్షలతో – కార్పణ్యాలతో జరుగుతున్నాయి. ఎన్నికల్లో ఓడిపోయిన ధనమదాంధ ప్రబుద్ధుల ప్రేరణే దీనికి మూలం తమ వ్యతిరేకుల్ని ఏడిపించడానికి ఇలాంటి క్షుద్ర కార్యాలకు పూనుకుంటున్నారని పరిశోధనలో తేలింది.

ఇప్పుడు రెండు రకాల బాణామతి గురించి తెలుసుకోవాల్సి వుంది. ఇదే ప్రస్తుతం మన సమాజాన్ని పట్టి పీడిస్తున్న పెద్ద అంటు వ్యాధ్యం. ఈ రకమైన బాణామతి సోకిన వ్యక్తులు ఎంతో అసామాన్యంగా వుంటారు. మనం నిత్యం విచిత్ర ప్రవర్తన గలిగిన అనేకమందిని చూస్తుంటాం.

చినిగిన పాత చింకి పీలికలు ధరించి వొకడు ఏదో కాగితాల కట్టచేత్తో పట్టుకుని పోతూ వుంటాడు. అదేమిటి అని మనం అడిగితే. ఇవన్నీ నా ఆస్తికి సంబంధించిన కాగితాలు ఫలానావాళ్ళు నా ఆస్తి అంతా కాజేసి నన్ను మోసం చేశారు. వీటిని కోర్టుకు చూపించి వాళ్ళపై దావా వేస్తాను. అందుకే వెళుతున్నా నంటారు.

ఇంకొకడు బెదురు చూపులు చూస్తూ పోతుంటాడు ఎవరన్నా ఏమిటి అని అడిగితే నన్ను పటేల్ – పోలీసులు పట్టుకోవడానికి వస్తున్నారు అదుగో – అదుగో అంటూ పారిపోతాడు.

మరొకడు తనలో తాను ఏడుస్తూ అంతలోనే నవ్వుతూ అప్పుడప్పుడూ కిందపడి దొర్లుతూ వుంటాడు – ఎందుకలా వున్నావ్. అని అడిగితే 'మా ఆడది. అదిగో అదిగో దాన్ని బాంచెన్ దొర ఏందో చేస్తే అది బావిలో పడి చచ్చి పోయింది. నేనూ దాని దగ్గరకే పోతా' అంటూ ఏడుస్తాడు. 'అడుగో అడుగో వాడే వాడి పీక పిసుకతా' అంటూ పరిగెత్తుకెళతాడు.

ఒకడు ఏవో పాటలు – పద్యాలు పాడుకుంటూ వెళతాడు – ఇంకొకడు మనం పలకరించినా పలక్కుండా వెళ్ళిపోతాడు. ఒకామె నా బిడ్డను నాశనం

చేశారు బాబో అని, మా గుంట నాశనం అయ్యిందిరో అని ఏడుస్తుంది. మరొకామె 'నాకాడేముంది అంతా పోలీసు పటేల్ కాజేసుందు వాడి జిమ్మడా' అంటుంది.

ఇలా చెప్పుకుంటూ పోతే ఎన్నో రకాల వింత వ్యక్తులు మనకు ఆ ప్రాంతాల్లో కనిపిస్తారు. స్త్రీలల్లో - పురుషుల్లో. ఇది అక్కడ అనుభవంలో వున్న నగ్న సత్యం. కానీ అప్పుడప్పుడు ఇలాంటి వింత ప్రవర్తన అంతవరకు బాగానే వున్న వ్యక్తులకు వస్తుంది. వాళ్ళు విపరీతమైన ఇలాంటి ప్రవృత్తులకు లోనవడం జరుగుతుంది. దీన్నే అక్కడి వాళ్లు 'బాణామతి' అని పేరు పెట్టుకుని భయపడి బాధలు పడుతున్నారు. ఏదో మంత్రశక్తి గలవాళ్ళు తమ మంత్ర ప్రయోగంతో వ్యక్తుల్ని ఇట్లా వింతగా మార్చారని అనుకుంటారు. సామాన్యులైన ఏ వైద్యులు ఈ రకమైన వ్యక్తుల్ని బాగు చెయ్యలేరు. అందుచేతనే ఇదేదో అతీంద్రియ శక్తుల ప్రభావమనే మూఢ నమ్మకం మన వాళ్ళలో చోటు చేసుకుంది.

ఇటువంటి వింత ప్రవర్తన బాణామతి అనే నమ్మకం తప్ప ఇది ఒక రకమైన మానసిక దౌర్బల్యం అనే విషయం దాదాపు ఎవ్వరికీ తెలియదు. రోగం అంటే కేవలం శారీరకమైంది. అది డాక్టర్లు వాడే మందువల్ల తగ్గిపోతుంది. కానీ ఈ వ్యాధులు వైద్యులకే అంతుబట్టడంలేదు. మందులతో మాకులతో తగ్గదు. కేవలం కక్షతో - మంత్ర తంత్రాల శక్తితో చేసిన బాణామతి ప్రయోగం అనే నమ్మకం, ప్రచారం ప్రజల్లో విరివిగా నాటుకు పోయింది.

మానవ విజ్ఞానం రోజు రోజుకు శరవేగంతో ప్రయాణం చేస్తూ - అన్ని రంగాల్లో ఎన్నో వింత వింత విషయాల్ని బయటపెట్టి రోదసీ కుహరంలోకి చొచ్చుకుపోతుంటే మనం మాత్రం ఎంత వెనక్కు పరిగెత్తుతున్నామో తెలియని దశలో వున్నాం.

కానీ ఇప్పుడు మనం బాణామతి అనో, చేతబడి అనో, చిల్లంగి అనో, కాష్మోరా అనో ఇంకా, ఇంకా అనేక ముద్దు పేర్లతో పిలవబడే ఈ మానసిక రోగం గుట్టు బయటపడింది. ఇది అజ్ఞానంతో కన్నుగానక పయనించే అమాయకులైన, సాధారణ పేద మానవుల సమస్యా పరిష్కారానికై అన్వేషణ చేస్తున్న జ్యోతి.

18 – 19 శతాబ్దాల దాకా రోగాలన్నీ శారీరక సంబంధమైనవి అనే భావం వుండేది. ఇది దాదాపు ప్రపంచంలో వున్న అన్ని దేశాల్లో వున్న అభిప్రాయం. ఫ్రాయిడ్ వంటి అనేకమంది మనశ్శాస్త్రజ్ఞుల పరిశోధనల ప్రభావంవల్ల మనో వైద్యం కూడా వెలుగులోకి వచ్చింది. మనం నేడు బాణామతిగా పిలవబడే చేష్టలన్నీ మానసిక రోగాలనే నిర్ణయానికి రావడం జరిగింది. దీనికి కారణం వారి అసాధారణ ప్రవర్తన.

"ఎన్నో రకాల అసమాన్య వర్తనలకు వుద్వేగాలకు మధ్య ఏర్పడే సంఘర్షణలూ వుద్వేగ వైకల్యాలు ముఖ్య కారణం. అసాధారణ ప్రవర్తనకూ మనో వైకల్యాలకు అవ్యక్త చేతనలో వుండే అంశాలు కూడా ప్రధాన కారణాలే అందు చేత అవ్యక్త చేతన నిర్మాణం – అవ్యక్త చోదనలు – భావ గ్రంధులు, ఆ అవ్యక్త చేతనలోని అంశాలు పైకి అభివ్యక్తములయ్యే ప్రక్రియలని" ఫ్రాయిడ్ వివరించాడు.

మన రాష్ట్రంలోనే తెలంగాణా ప్రాంతంలో వుండే మానసిక వ్యాధులు అన్ని ప్రాంతాల్లో లేవు. అందులోనూ అవి తెలంగాణాలోకూడా అన్ని వర్గాలలో లేవు. దారిద్ర్యరేఖకు దిగువన వున్న వర్గాలలోనే విరివిగా చోటు చేసుకున్నాయి. సన్నిహితమైన సాంసారిక బంధాలు, ఆర్థిక సత్సంబంధాలు మనిషికి స్థిరత్వం కలిగిస్తాయి. అవి సక్రమంగా లేనినాడు అస్తిమితానికి లోనై అసమాన్య వర్తనానికి కారణభూతం అవుతుంది. దీన్నే ఫ్రాయిడ్ 'సైకో-ఎనాలసిస్' అని నిర్ణయించాడు. ఇది ఒక రకమైన మానసికవ్యాధి. హిస్టీరియా.

వ్యక్తి తనకు రుచింపని-వెల్లడింపలేని వాంఛలను, అవసరాల్ని, ఘర్షణల్ని మరిచిపోవడానికి, అణచివేయడానికి రకరకాల ప్రయత్నాలు చేస్తాడు. అవన్నీ భావగ్రంధులుగా ఏర్పడి వాటి ప్రతిక్రియాప్రయత్నాలు మనోరోగరూపంలో వెల్లడి అవుతాయని సైకో-ఎనాలసిస్‌ద్వారా ఫ్రాయిడ్ సిద్ధాంతీకరించాడు.

వ్యక్తి తాను చిక్కుకున్న పరిస్థితులతో సుసమన్వితుడగుటకు ప్రయత్నించి విఫలం చెందటంతో నాడీ మండలం వైఫల్యం చెంది ఈ రకమైన వైఫల్యాలు సంభవిస్తాయని వీటినే సైకో-న్యూరోసిస్, సైకోసిస్ అని అన్నాడు. దీన్నే ఉన్మాదం అని మనం పిలుస్తాం.

ఇవన్నీ బాణామతిలో మనకు కన్పిస్తున్నాయి. అంటే బాణామతిగా ప్రచారంలో వున్న ఈ వ్యాధులు మానసిక రుగ్మతలనీ, మానసిక వ్యాధులని నిర్ణయంలోకి రావడం జరిగింది. బాణామతి పేరుతో మానసికంగా బాధ పడుతున్న ప్రజల సాంఘిక ఆర్థిక పరిస్థితుల్ని గూడా గమనించడం అవసరం.

సాంఘికంగా. ఆర్థికంగా భద్రత లేని కుటుంబాల ప్రజలకే ఈ వ్యాధులు ఎక్కువగా రావడం జరుగుతున్నాయి. వేళకు సరైన తిండి లేక, విశ్రాంతి లేక, నిలువ నీడలేక, నికృష్టపు జీవితాలను గడిపే నిర్భాగ్యుల్లో ఈ వ్యాధులు ఎక్కువగా వుంటాయి. అయితే కలిగినవారికి ఇలాంటి వ్యాధులు రావా అనే అనుమానం మనకు రావడానికి అవకాశం వుంది. కానీ ఈ ప్రాంతాల్లో దాదాపు ఈ వ్యాధి సోకినవారిలో ఆర్థికంగా, సాంఘికంగా ఆధిక్యతలో వున్న వాళ్ళు 2% కంటే ఎక్కువ లేదు. వాళ్ళు మానసిక వైద్యుల సలహా పొందగలుగుతున్నారు.

ఇంతకూ బాణామతి అంటే ఏమిటి? ఎలా వుంటుంది?

నమ్మకం గలిగినవారి దృష్టిలో అది ఒక క్షుద్రవిద్య. తన శత్రువును సాధించడానికి వారిపై చేసే ప్రయోగం. ఇది చేతబడిలాంటిది. ఈ ప్రయోగానికి గురి అయినవారిలో 95 శాతం మంది 15 - 35 సంవత్సరాల వయస్సువాళ్ళే. ఇందులో ఎక్కువ శాతం స్త్రీలకే ఇది సోకుతుంది.

ఈ ప్రయోగానికి గురయినవారు విచిత్రంగా విచ్చలవిడిగా ప్రవర్తిస్తారు. మొదట ఈ వ్యాధి ఎక్కిళ్ళతో ప్రారంభం అవుతుంది. శరీరం వణకడంతోపాటు చెమటలు కూడా పడతాయి. కళ్ళు మూతలు పడుతుంటాయి మత్తుగా రెండు చేతులు పైకెత్తి కట్టెలా కింద విరుచుకు పడిపోతారు. తరువాత భూమిమీద దొర్లడం, కూనిరాగాలు తియ్యడం, ఏడవడం, పెద్దగా అరవటం, నెత్తిమీద బాదుకోవడం మొదలైన వింత చేష్టలు చేస్తారు. వాళ్ళేం మాట్లాడుతున్నారో వారికి తెలియదు. స్పృహలో వున్నట్లుగా వుండరు. శరీరంపై వస్త్రాలు వున్నదీ లేనిదీ కూడా గమనించరు. విచిత్రంగా చిందులు వేస్తారు. పరిగెత్తటంవంటి పనులు కూడా చేస్తారు.

ఈ వ్యాసకర్త మెదక్ – రంగారెడ్డి జిల్లాల్లో నిజనిర్ధారణకై పర్యటించిన సందర్భాలలో గమనించిన కొన్ని విషయాలు ఈ విధంగా వున్నాయి.

ఈ ప్రయోగంవల్ల ఇళ్ళల్లో రాళ్ళు పడతాయట. అమేధ్యం (పెంట) పడుతుందట. పసుపు కుంకుమలు రాలతాయట. ఉన్నట్టుండి వస్త్రాలు, ఇళ్ళు చూస్తుండగానే తగలబడతాయట. తినే అన్నం పురుగుల్లాగా, మేకుల్లాగా, అమేధ్యంలాగా కన్పిస్తాయట. ఈ విషయాలన్నీ ఆ ప్రాంతంలోని అనేకమందిని ప్రశ్నించగా నిజమేనన్నారు. మీరు చూశారా అని ప్రశ్నిస్తే అదిగో అక్కడ జరిగిందట– ఇక్కడ జరిగిందట – వారు చెప్పారట, వీరు చెప్పారట. అంతా 'అట' అనే మాటే. ప్రత్యక్షంగా చూసినవారు, అనుభవించినవారు మాత్రం ఒక్కరు కూడా కనిపించలేదు

బాణామతి ప్రయోగిస్తున్నారనే మిషతో కొంతమంది వ్యక్తుల్ని ఈ ప్రాంతాల్లో హింసించడం మామూలే. దీనికి కూడా కక్షలే కారణం అని తెలిసింది. తమకు కక్ష వున్న వ్యక్తిమీద ఆ గ్రామదొరలో, పోలీస్‌పటేలో, గ్రామ పట్వారీనో బాణామతి ప్రయోగం చేశారనే మిష కల్పించి బొడ్డురాయి దగ్గరో, అమ్మోరి గుడి దగ్గరో శిక్షించడం జరుగుతుంది కొంతమందికి ముందు పళ్ళు వూడగొట్టడం, కొంతమందిని చెప్పుతో కొట్టడం, మరి కొంతమందికి గుండు చేయించి బోడినెత్తికి నిమ్మకాయల రసం అంటటం, నాలుక కొయ్యటంవంటి శిక్షలు వెయ్యడం జరిగింది. ప్రయోగాలు చేస్తున్నారు అనే మిషతో కొంతమందిని చంపటం గూడా జరిగిందినే సత్యాన్ని పోలీసులు కూడా అంగీకరించారు. ప్రయోగం చేశారనే అనుమానంతో 1983వ సంవత్సరంలో ముగ్గురిని, 1981 వ సంవత్సరంలో నలుగురిని ప్రజలు హత్య చేశారని మెదక్ జిల్లా పోలీసు సూపరింటెండెంట్ శ్రీ అరవిందరావుగారు అంగీకరించారు. ఆంధోల్ తాలూకాలో ప్రజలు ముగ్గురిని బాణామతి చేస్తున్నారని మంటల్లో వేశారు. మంత్రగత్తెలన్న పేరుతో కొంతమంది స్త్రీలకు వస్త్రాలు తొలగించి పైజమా, కుర్తాలు తొడిగించి ప్రాణం వున్న తొండల్ని వదిలారు. వారిలో కొందరు మరణించడం జరిగిందని పోలీసులు అంగీకరించారు.

ఈ అవకాశాన్ని ఆధారంగా చేసుకొని కొంతమంది వ్యక్తులు ప్రజల్నుండి డబ్బులు చేసుకుంటున్నారు. ఈ క్షుద్రప్రయోగానికి విరుగుడు చెయ్యడానికి మనిషి స్థితిగతుల్ని బట్టి– అవకాశాన్ని బట్టి వసూలు చేస్తున్నారు. గ్రామానికి ఈ వ్యాధి రాకుండా, ఇంటిలో ఈ వ్యాధి సోకకుండా వుండేందుకు గ్రామ పొలిమేర్లలో యంత్రాలు పాతించడం, ఇండ్లకు రాగిరేకులు కొట్టించటం వంటి కార్యక్రమాలు ముమ్మరంగా జరిగాయి. ఇలాంటి వ్యవహారాల్లో గ్రామపెద్దలు సామాన్యుల దగ్గర్నుంచి డబ్బు వసూలు చేసి తమ చెయ్యి తడుపుకున్న సంఘటనలు కూడా వున్నాయి. ఈ విధంగా నిధులు వసూలు చెయ్యడంలో గ్రామ సర్పంచ్‌లు, పటేల్, పట్వారీలు, కొంతమంది ఉపాధ్యాయులు కూడా వున్నారు.

రాగిరేకులపై బీజాక్షరాలు రాయించి వాటిని అమ్మే గృహపరిశ్రమ ఈ జిల్లాలో ప్రారంభమయింది. ఈ రాగిరేకుల్ని ఇంటి తలుపుకో, దర్వాజాకో తాపటం చేస్తే ఈ శక్తి తమను రాకదనే నమ్మకం కలిగించారు. ఈ రాగిరేకుల పరిశ్రమ నిర్విఘ్నంగా, నిరాటంకంగా సాగుతుంటే ప్రభుత్వం వారిని గురించి పట్టించుకోలేదు. జిల్లాలోని కొంతమంది పోలీసు అధికార్లు చెప్పిన అంశాలు పరిశీలిస్తే కక్షతో ఒకరిపై ఒకరుచేసే విచక్షణారహితమైనకృత్యాలివి అని అర్థమౌతుంది.

తమ కామవాంఛలకు లొంగని స్త్రీలపైనో, లేక వారి భర్తలపైనో కక్ష సాధించుకోవడానికి ఈ బాణామతిని ఉపయోగించుకుంటున్నారు. ఈ ప్రాంతాల్లో వుండే డాక్టర్లు కూడా ఈ వ్యాధి అంతుబట్టక 'బాణామతి' అని రోగులకు చెప్పడం జరుగుతుంది. ఈ జిల్లాలో జిల్లా కేంద్రాలలో, కొన్ని ముఖ్య కేంద్రాలలోనో తప్ప పట్టభద్రులైన వైద్యులు లేకపోవడం గమనించాలి. వైద్యశాస్త్రం తెలియని వైద్యులు సరియైన వైద్యం చెయ్యకపోగా బాణామతి సోకింది నేనేం చెయ్యలేను. ఇది మందులకు తగ్గదు. మంత్రాలకు మాత్రమే తగ్గుతుందనే నమ్మకం కలిగించారు.

బాణామతి ఎవరికి సోకుతుంది ?

ఈ బాణామతి దారిద్ర్యరేఖకు దిగువన వున్న వారికి మాత్రమే వర్తిస్తుంది. ఇది నిజంగా క్షుద్రశక్తే అయితే వర్గ, వర్ణ దృక్పథం లేకుండా అందరికీ సోకాలి.

మధ్యతరగతివారిలో 2 శాతం వారికి మాత్రమే ఇది సోకుతుంది. ఉన్నతవర్గాల వారికి ఈ వ్యాధి అసలు రావడం లేదనే చెప్పాలి. ఈ ఆలోచన అక్కడివాళ్ళకు అసలు కలగటంలేదు.

దారిద్ర్యంవల్ల తినడానికి తిండిలేక, సరియైన పోషకాహారం లేక, బలహీనత వల్ల, ఆర్థిక ఇబ్బందులవల్ల మగవారు, రక్తహీనత, ఋతుసంబంధమైన వ్యాధులు, ఎక్కువమంది పిల్లల్ని కనడంచేత, వాళ్ళను పోషించలేక పిప్పిగా మారిన స్త్రీలు, కామం కోరల్లో చిక్కి అధికారులకో, గ్రామపెద్దలకో బలిపశువులయిన స్త్రీలు, గృహకలహాలవల్ల మానసిక ఇబ్బందులకు గురిఅయినవారు, సుఖవ్యాధులతో బాధ పడేవారు ఈ వ్యాధికి గురవుతున్నారు.

బాణామతి క్షుద్రశక్తి కాదని ఇది మానసిక రోగమని గమనించే దశ వారిలో లేదు. తరతరాలుగా మరింత జీర్ణించుకుపోయిన ఈ మూఢనమ్మకాల్ని తొలగించాల్సిన బాధ్యత ప్రభుత్వం నిర్వహించాలి. మానసిక వైద్యులు ఈ వ్యాధిని గురించిన వివరాలు సామాన్య ప్రజలకు అందజెయ్యాలి. అధికారుల, గ్రామపెద్దల దౌర్జన్యాలకు సమాధి కట్టాలి. వారి దారిద్ర్యాన్ని ఆధారంగా చేసుకుని తమ పబ్బం గడుపుకునే నికృష్టజీవుల ఆట కట్టించినప్పుడే ఈ బాణామతి అనే క్షుద్ర విద్య నశిస్తుంది. కానీ ఈ మూఢనమ్మకాన్ని సమూలంగా నాశనం చెయ్యాలన్న తపన ప్రభుత్వానికి కనిపించడంలేదు. వైద్యులు నిర్లిప్తంగా వున్నారు. చైతన్యవంతులైన విద్యాధికులే పూనుకొని ఈ మూఢనమ్మకాన్ని సమూలంగా నాశనం చెయ్యాలి.

# సామాజిక ప్రకరణం

మానవుడు సంఘజీవి. సృష్టిలోని మిగిలిన జీవరాశులకన్నా మానవునిలో జిజ్ఞాస అధికంగా వుంది. ఆ జిజ్ఞాసే మానవుని జంతుజాలం నుంచి విడగొట్టింది. ఆ జిజ్ఞాసే మనిషికీ మనిషికి అంతస్సోపానాల్ని పెంచి పెద్ద చేసింది. ఆ జిజ్ఞాసే మనిషిని వ్యక్తిత్వం లేని పశువుగా మార్చివేసింది. సంఘజీవిగా చలామణి అయ్యే మానవునిలో అంతరాంతరాలలో స్వార్ధం పెరిగి పెరిగి మహా వటవృక్షంగా మారి సమాజాన్ని ముక్కలు ముక్కలు చేసింది.

సృష్టిలోని జీవరాశుల్లో ప్రత్యేకత గలిగిన జీవి మానవుడు. అన్ని జీవులకు అవసరమై నిసర్గమైన ఆహారం మనిషిని మిగిలిన జీవుల నుండి వేరుచేసింది. విజ్ఞానం పొందిన మానవుడు జంతుజాలంవలే కాక ఆహారాన్ని పచనం చేసుకోవడం, రుచికరమైన పదార్ధాల్ని తీసుకోవడంతో ప్రారంభమైన అతని జీవితం నేడు సామాజికంగా అభివృద్ధి చెందింది తనకు కావలసిన కూడూ, గుడ్డా, నీడా మొదలైన నిత్య జీవనాధారాల కోసం, తన స్వార్ధం కోసం, సమాజాన్ని ముక్కలు చేసైనా తన సాంఘిక అవసరాల్ని తీర్చుకోవడానికి సంసిద్ధమయ్యాడు. ఆహార నిద్రా మైధునాలు మనిషికి సమానం. తనకు కావలసిన ఆహారం కోసం తన మనస్సుకు, శరీరానికి ఆహ్లాదం కలిగించే నిద్రా, మైధునాల కోసం మానవుడు పడే తాపత్రయమే మనిషి నుండి మనిషిని విడదీసింది. మనిషికి మనిషికి మధ్య అంతస్థుల్ని సృష్టించింది.

ఈ దశలోనే మానవుడు కొన్ని విషయాల్లో కొన్ని నియమాలు ఏర్పాటు చేసుకున్నాడు. వాటిని తన జీవితానికి అన్వయించుకున్నాడు. తద్వారా సంఘంలో తనకు గౌరవ ప్రపత్తులు కలుగుతాయని వూహించాడు. మానవుని పుట్టుకకు- మరణానికి సామాజికంగా అనేక కారణాలు యోచించుకొని వాటికి కొన్ని నియమాలు ఏర్పాటుచేసుకొన్నాడు. మొదట ఏర్పాటు చేసుకున్న ఈ నియమాలు తరువాత ఆచారాలుగాను, మూఢాచారాలుగాను, మూఢ నమ్మకాలుగాను వ్యాపించాయి.

మానవుడు తనకు కలిగిన సంతానాన్ని చూసి ఆప్యాయతతో ఆనందించాడు. ఆ బిడ్డ రక్షణకై ప్రకృతి నుండి రక్షణ పొందటానికి నాడు చేసిన ప్రయత్నాలన్నీ నేడు మూఢ నమ్మకాలుగా ఏర్పడ్డాయి. సంతానం కలగడానికి మూలకారణమైన మైథున క్రియకు (స్త్రీ పురుష సంగమం) కొన్ని నమ్మకాలు ఏర్పరచుకున్నాడు. దీనిలో భాగంగానే వివాహం - వివాహ నియమాలు మొదలైన సాంఘిక వ్యవస్థకు నియమ - నిబంధనలు ఏర్పాటుచేసుకున్నాడు. అత్యంత నాగరికమైన మానవుడు అనంత విజ్ఞానాన్ని ఆర్జించినప్పటికి సమాజంలో సగభాగమైన స్త్రీకి సమానత - విలువ లేకుండా చేసాడు. దానికై చేసిన నియమ నిబంధల్ని అనుసరించి 'నస్త్రీ స్వాతంత్ర్య మర్హసి' అనే నినాదాన్ని చేపట్టి ఆమెను జీవ దాస్యానికి గురి చేసాడు.

సామాజిక వ్యవస్థలో మతం - మతనీతి మనిషిని విడదీసింది. వర్ణవ్యవస్థ, విద్య, ఇతర విశేష వ్యాపకాలు మనిషికి మనిషికి మధ్య తేడా విశేషమైన అంతరాల్ని సృష్టించింది. పాపం - పుణ్యం - దానధర్మాల పేరుతో సాగే నమ్మకాల్ని మనిషిని అంధుణ్ణి చేశాయి స్వర్గ-నరకాలు అతన్ని పరో లోకానికి తీసుకువెళ్లాయి. స్వర్గలోక సుఖాలు అతని నోటని వూరించాయి. ఎవ్వరూ చూడని ఈ స్వర్గనరకాల మహత్తును, మతం అందించిన మత్తును స్వీకరించి వాటికై తాపత్రయపడ్డాడు. తత్ఫలితమే ఈనాడు సామాజిక పరంగా ఏర్పడిన అనంతకోటి మూఢ నమ్మకాలు.

ఈ ప్రకరణంలో సామాజికంగా ఏర్పడిన మూఢ నమ్మకాల్ని గురించి చర్చిద్దాం.

# 1. జననం

ప్రకృతిలో ప్రతి జీవరాశికి చావు-పుట్టుకలు సహజం. పుట్టిన ప్రతి జీవి గిట్టి తీరవలసిందే. ఏకకణ జీవి అయిన అమీబా మొదలు బహుకణ జీవులు, అతి పెద్దవైన సర్వ భూతాలు పుట్టి కొంతకాలం మనుగడ సాగించి చివరకు నశించవలసిందే. ఇన్ని జీవరాశుల్లో మానవుడు కూడా ఒక జీవి మాత్రమే.

అయితే మానవుడు పుట్టినప్పుడు సాగించే కర్మకాండలు, దానధర్మాలు, భూతబలులు, మొదలైన నమ్మకాలు కొన్ని విచిత్రంగాను, మరికొన్ని అసందర్భం గాను కనిపిస్తాయి. బిడ్డ పుట్టగనే చేసే ఈ మూఢాచారాలన్నీ శాస్త్రీయంగా పరిశీలిస్తే కార్యకారణ సంబంధాలు కనిపించవు. దాన ధర్మాది క్రియలు, పురోహితులకు చేసే పుణ్యదానాలు కేవలం పురోహితులకు మాత్రమే లాభించే విధంగా వున్నాయి. వేద సాహిత్యంలో జననాది కర్మలను గురించిన నమ్మకాలు లేవు. తరువాత కాలంలో వచ్చిన స్మృతులు, కల్పాలలో ఈ నమ్మకాలు కన్పిస్తాయి.

తెలుగు సాహిత్యంలో ఈ కర్మకాండలు అధికంగా చోటుచేసుకున్నాయి. స్థాలీపులాక న్యాయంగా కొన్ని పరిశీలిద్దాం.

రాజశేఖరుడనే రాజునకు కుమారుడు జన్మించగా

"నిసువు బొడ్డు మీద బసిడి టంకంబిడి" [1]

పుట్టిన బిడ్డ బొడ్డు మీద బంగారు నాణెముంచి ఆ నాభిని కత్తిరించటం, ముత్యాలు చేటలో పోసి అందు బిడ్డను పరుండబెట్టి ఆనందించటం నాటి ఆచారాలు. బంగారం, ముత్యాలు మొదలైనవన్నీ పురోహితులకో అంతేవాసులకో దానాల రూపంలో పోతాయి చివరికి.

బలరామునికి లేక లేక కలిగిన సంతు శశిరేఖ. శశిరేఖ జన్మించిన సందర్భంలో

"నెలఁతలు గోరువెచ్చ కలినీటను జిల్కుచు బొడ్డుఁగోసి చె
క్కులు సరిదిద్ది తలకున్ మెయికిన్ జమురంటి చేటలో
పల నవరత్న ధాన్యములపైఁ దెలి పొత్తుల మీద వజ్ర పు
త్తలి కనుబోలు రేవతి సుతం బవళింపగ జేసె కూరిమిన్" [2]

శశిరేఖకు గోరువెచ్చని కలినీరు చిల్కి బొడ్డుకోసి తలకు, శరీరానికి చమురు రాసి చేటలోని నవరత్న ధాన్యములుంచి పిదప శయ్యపై పరుండబెట్టారు.

---

1. సింహాసన ద్వాత్రింశిక – 3–42
2. తాలాంక నందినీ పరిణయము 1–97

ఇప్పటికి కొన్ని ప్రదేశాలలో చేట- లేక జల్లెడలో నవధాన్యముపై పుట్టిన బిడ్డలను పొర్లించటం ఆచారంగా కనిపిస్తుంది. ఆరోగ్య రీత్యా ఇవి ఎంతో ప్రమాద కరం. కాని మూఢ నమ్మకాల పరిధిలో నిజాన్ని అంగీకరించరు. ఆ విధంగా చేస్తే బిడ్డలు ఏ వ్యాధులు, బాధలు లేక సుఖంగా జీవిస్తారని వారి నమ్మకం.

మనవాళ్ళు పిల్లలకు ఉగ్గుపెట్టి బొజ్జ నిమిరి కాళ్ళు చేతులు కదిలించటం మనం చూస్తూనే వున్నాము. ఆ సందర్భంలో వాళ్లు

"జీర్ణం జీర్ణం వాతాపిజీర్ణం- ఏనుక్కు ఎలక్కాయి జీర్ణం

గుర్రానికి గుగ్గిళ్ళు జీర్ణం— అబ్బాయికి వుగ్గుబాయి జీర్ణం"

అనటం మనకు తెలుసు.

వాతాపి- ఇల్వలుడు అనే రాక్షస సోదరులున్నారు. వారిలో వాతాపి కామ రూపుడు. వాతాపి మేక రూపం ధరించగా ఆ మేకను కోసి అతిథులకు ఇల్వలుడు వడ్డించేవాడు. మేక మాంసం భుజించిన తరువాత వాతాపీ అని ఇల్వలుడు పిలవగానే భుజించిన వాని పొట్ట చీల్చుకొని వాతాపి వచ్చేవాడు. ఇల్వలుడు ఒక రోజున అగస్త్యుడు అనే మహామునిని భోజనానికి పిలిచి (వాతాపిని) మేక మాంసం వండి వడ్డిస్తాడు. పూర్తిగా భుజించిన తరువాత ఇల్వలుడు ఎప్పటివలె 'వాతాపీ' అని పిలువబోతాడు. కానీ అగస్త్యుడు తన పొట్ట నవరించుతూ 'జీర్ణం – జీర్ణం, వాతాపి జీర్ణం' అన్నాడు. ఆ విధంగా చేయటంతో వాతాపి అగస్త్యుని కడుపులో జీర్ణమై పోయాడట.

అందుచేత వాతాపిని జీర్ణం చేసుకున్నట్లు వుగ్గు-బాయి (పాలు) జీర్ణం కావాలని కోర్తారు.

ఆంధ్రదేశాన్ని రాజరాజ నరేంద్రుడు పరిపాలించాడు. ఆయన పెద్ద భార్య రత్నాంగి సారంగధరునకు జన్మ ఇచ్చిన సందర్భంలో

"మనుజేశుఁడపుడు సమ్మదమునఁదేలి" 1

నవరత్నాలు, బంగారము, ధనం బ్రాహ్మణులకు పంచటంతో పుత్రోత్సవం జరుపుకొన్నాడు.

---

1. నవనాథ చరిత్ర — 313.

కృష్ణుడు యదువంశరాజు. అతని అష్ట మహిషులలో జాంబవతి ఒక పత్ని. ఆమెకు పుత్రోదయం కలుగగా (సాంబుడు) కృష్ణుడు భూసురులకు దాన దక్షిణలు ఇచ్చాడు.

"సూనుఁడు పుట్టినం బ్రమద శోభన చంద్ర నవోదయంబున" [1]

గోదానం, సువర్ణదానం, భూదానం మొదలైన దానాలు భూసురులకు ఇవ్వటం వంటి నమ్మకాలు వున్నాయి.

విప్రనారాయణుడు శ్రీరంగేశుని భజించి మోక్షం సాధించిన పుణ్యపురుషుడు. విప్రనారాయణుడు జన్మించినపుడు అతని తండ్రి జన్మజాతకర్మ నామకరణాదులను చేయిస్తాడు.

"ఇట్లు జన్మించిన యక్కుమార రత్నమునకుఁ గ్రమంబున జాతకర్మ నామకరణాది సంస్కారంబు లొనఁగూర్చి విప్రనారాయణాభిదానుంజేసి యర్హ కాలంబున నుపవీతుం గావించిన యనంతరంబున" [2]

జాతకర్మ చేసినందువల్ల నక్షత్ర దోషం తొలగి శాంతి కలుగుతుందనే నమ్మకం వుంది.

ఈ విధంగా బిడ్డలు పుట్టినప్పుడు చేసే కర్మకాండల్ని శాస్త్రీయ దృక్పథంతో పరిశీలించాల్సిన అవసరం ఎంతైనా వుంది. పుట్టటం పెరగటం - జీవించటం - మరణించటం అన్నీ కూడా జీవనసోపానంలో మెట్లే. అయితే బిడ్డలకు కలిగే దోషాలు అనే పేరుతో శాంతి అనే సాకుతో చేసే క్రియలు మూఢ నమ్మకాలే.

బిడ్డలకు దృష్టి (దిష్టి) పేరుతో చేసే కర్మకాండలు- జాతకర్మ- నామకరణాది కర్మలు, రక్షపూసలు - తాయెత్తులు - బాలగ్రహ దోషవిధానాలు మొదలైన మూఢనమ్మకాలు మన సమాజంలో వ్యాపించి వున్నాయి. వ్యాధిగ్రస్తులయిన బిడ్డలకు వైద్యుని సలహా సంప్రదింపులు చేయవలసిందిపోయి గ్రహాల ఫలితాల్ని

1. సాంబోపాఖ్యానము 4-83.

2. వైజయంతి విలాసము - 1-73.

గమనాన్నిబట్టి దోషనివారణకు చేసే దిష్టి-శాంతి, దేవతయాల్లో అర్చనలు, భగవంతుని పేర మొక్కుకోవటం, బలులు చేయటం వంటి మూఢనమ్మకాలు సమాజంలో లోతుగా చోటు చేసుకున్నాయి. పిడ్డ పుట్టిన నక్షత్ర ఫలితాన్నిబట్టి జీవితం అంతా సాగుతుంది అనే మూఢనమ్మకం పుంది పరిణామ సిద్ధాంతాన్ని — కార్య కారణ సిద్ధాంతాన్ని అంగీకరించక సమాజం ఈ నమ్మకాల్లో మునిగిపోయింది. విజ్ఞానశాస్త్రం అభివృద్ధి చెంది నేటి మానవుడు గ్రహాంతర ప్రయాణం చేస్తున్న రోజుల్లో కూడా ఈ విధమైన మూఢనమ్మకాల్లో విశ్వాసముంచకుండా ప్రగతిపథం వైపు సాగిననాడే మానవజాతి మనుగడ సాధ్యమౌతుంది.

# 2. స్త్రీ పురుష సంగమం

సంగమం అంటే కలయిక. స్త్రీ—పురుషుల కలయిక ప్రాకృతికమైంది. ఆహార నిద్ర భయ మైథునాలు మానవుని సహజ గుణాలు ప్రకృతిలో ప్రతి జీవి ఉత్పత్తి కార్యక్రమాన్ని కొనసాగించవలసి వుంది మొదట వుత్పత్తి కోసం మాత్రం ఈ మైథునం నిర్దేశించబడలేదు. అనాగరికమైన మానవుడు పశుపక్ష్యాదుల వలెనే ప్రకృతిలో మైథున కార్యక్రమం కొనసాగించాడు. ఆనాటి అనాగరికుడు వావివరసల్ని విడిచి మైథునం సాగించినట్లు మనకు పురాతన సంస్కృతినుంచి లభ్యమైన సమాచారం. నాగరికత అభివృద్ధి చెందినకొద్దీ కట్టుబాట్లు, ఆచారాలు ఏర్పడ్డాయి.

స్త్రీ పురుషుల కలయికతో సంతాన వుత్పత్తి కార్యక్రమం ప్రారంభం అవుతుంది. సంగమ కార్యక్రమంలో పురుషాంగం నుంచి స్రవించేది శుక్రమని, స్త్రీ అంగంనుండి స్రవించేది శోణితం అని పిలుస్తారు. ఈ శుక్రశోణితాల కలయికచే పిండం ఏర్పడుతుంది. ఈ ఏర్పడిన పిండం స్త్రీ గర్భంలో తొమ్మిది నెలలపాటు అభివృద్ధి చెందిన తరువాత బిడ్డను ప్రసవిస్తుంది. ఇది వుత్పత్తి కార్యక్రమంలోని క్రమపరిణామం. దీనిని గురించి స్మృతికారులు వివిధమైన అభిప్రాయాలు వ్యక్తం చేశారు.

శునక మహర్షి శునకానికి పుట్టాడని, మాండవ్య మహర్షి కప్పకు పుట్టాడని, శుకమహర్షి శుకానికి పుట్టాడని, ఋష్యశృంగుడు జింకకు పుట్టాడని, అశ్వత్థామ గుర్రానికి పుట్టాడని, యజ్ఞగుండం నుంచి ద్రౌపది పుట్టిందని, రాముడు పుత్రకామేష్టి ఫలితమని వర్ణించారు. బ్రహ్మదేవుని ముఖంనుంచి బ్రాహ్మణులు, బాహువులనుంచి క్షత్రియులు, ఊరువులనుంచి వైశ్యులు, పాదాలనుంచి శూద్రులు పుట్టారని పూర్వులు భావించారు.

పై వివరణలను బట్టి పిల్లలు పుట్టడానికి స్త్రీ పురుష సంయోగానికి ఏమాత్రం సంబంధం లేదు. యజ్ఞయాగాలు ఆచరించడంద్వారా దేవతలను పూజించడంద్వారా కుండలనుంచి, ఆకుదొన్నెలనుంచి మనుష్యులు జన్మించినట్లు భావించబడింది.

మలయ పర్వతంనుంచి వీచే మలయమారుతం స్త్రీల యోనిలో ప్రవేశించడం ద్వారా సంతానం కలుగుతుందని కూడా వూహించారు. కొన్నిచోట్ల ఏడు ఘడియల కాలంలో సంతానం కలిగినట్లు వర్ణించబడింది. భారతంలో కౌరవులు నేతికుండల నుంచి పుట్టి పెరిగినట్లు చెప్పబడింది. రామాయణంలో నాగటిచాలునుంచి సీత జన్మించినట్లు వర్ణించబడింది.

పై విషయాల్ని పరిశీలిస్తే ఆనాడు సంతానం ఎలా కలుగుతుందో వారికి తెలియదనే చెప్పాలి. స్త్రీ పురుష సంయోగ ఫలితంగా పిండోత్పత్తి జరిగి పరిణామ క్రమంలో బిడ్డలు కలుగుతున్నారనే అంశం తరువాత తెలిసింది.

మొట్టమొదట గణసమాజంలో మాతృస్వామిక యుగంలో స్త్రీ పురుషులు వావి వరుసలు లేకుండా సంతానం కనడం జరిగింది. నాగరికత పెరిగిన తరువాత పితృస్వామిక యుగంలో పురుషాధిక్యత అధికం కావడంతో సంతానానికి ఒక రూపం కలిగింది. అంతకు ముందు మాతృస్వామిక యుగంలో స్త్రీ ఎందరి పురుషులతోనైనా సంగమించడం తప్పుగా భావించబడలేదు.

"తనతో మాత్రమే కలిసి జీవించడానికి సిద్ధపడగల స్త్రీ కొరకు పురుషుడు శతధా ప్రయత్నించాడు. తన స్వాధీనంలో వున్న పశువులను, వేటలో తనకున్న సామర్థ్యాన్ని చూపించాడు. ఆమె కోరినవన్నీ సమకూరుస్తానని బాస చేసాడు. ఇందుకు ప్రతిఫలంగా మరేమి కోరనన్నాడు. తన సంపదకు వారసులు కాగల పిల్లలు తనకే పుట్టారని నమ్మకం కలిగితే చాలు పువ్వుల్లో బెట్టి పూజిస్తానన్నాడు.

ముసలీ ముతకా అనే భేదం లేకుండా పలుప్రదు పురుషులతో శయనించడ మంచే రోత పుట్టిన స్త్రీ అన్నివిధాల సమర్థుడైన పురుషునితో కలిసి జీవించడానికి ఉబలాటపడింది. అలా జీవిస్తే తనకు మంచి బిడ్డలు పుడతారనుకుంది. తన భర్త వద్ద గల సంపదకు తన బిడ్డలు వారసులవుతారు. గాబట్టి హాయిగా బ్రతకవచ్చని భావించింది.

తాను వలచిన పురుషునితో కలిసి జీవించే హక్కును స్త్రీ పొందగలిగింది. కాని స్త్రీల పెత్తనం హరించడానికి కది దారి తీసింది. తాను కోరిన పురుషునితో స్త్రీ సంసారం చెయ్యడంవల్ల వారికి పుట్టిన బిడ్డలు తమ తల్లితోపాటు తండ్రిని కూడా గుర్తించడానికి వీలైంది." [1]

దీనిపై గల సమ్మకాల్ని పరిశీలిద్దాం.

కాశ్మీరదేశంలో సరస్వతిని నిత్యం పూజించే ఒక పూజారి కుమార్తె సుగాత్రి. ఆమె భర్త శాలీనుడు. సుగాత్రి మిక్కిలి సౌందర్యవతి నాయకుడైన శాలీనుడు ఇల్లరికపు టల్లుడు లేతవయసువాడు. అత్తగారి పెత్తనం. పైగా గడసుది. ఆమెయందు ఇతనికి భయసంకోచం అమితం. విభూషితురాలైన తన భార్యయందు శాలీనునికి అనురాగం కలగలేదు. శాలీనునకు సహజమైన చక్కదనం అంటే ఎంతో అభిమానం. వివిధ భూషణాలతో అలంకరించుకున్న తన భార్యను కన్నెత్తి చూడటానికి ఇష్టపడడు. రాత్రి అలంకరించుకున్న తన భార్యను దరి చేరనీయడు. పగలు మాత్రం తోటలో తన భార్యను కలుస్తాడు. శాలీనుని మనోవృత్తి గమనించిన సుగాత్రి పగటిపూట తోటలో అతనితో రతికేళి తేలుతుంది. ఈ సంగతి సుగాత్రి తల్లికి తెలిసింది. ఆమె తన అభిప్రాయాన్ని కుమార్తెకు ఈ విధంగా చెప్పింది.

"ఓ తల్లి ! కొదవ యొక్కటి
నా తలపునఁ దోఁచినది వినన్ వలయు గుణా
న్వితుండు గాని సుతుఁడు ప్ర
సూతుండగునట యకాల సురత క్రియలన్" [2]

---

1. శతాపతారాలు పు 27, 28
2. కళాపూర్ణోదయము 4-136

పగ పూట స్త్రీ పురుషులు కలిస్తే గుణవంతుడు కాని కుమారుడు కలుగుతాడని చెప్పింది.

వరూధిని దేవవేశ్య. హిమవత్పర్వత సానువులపై దారి తప్పి తన వూరి మార్గం తెలియని ఏకపత్నీవ్రతుడైన ప్రవరుణ్ణి చూచి మోహించింది. ఆమె ప్రవరుణ్ణి సమీపించి తన కోర్కెను వెల్లడించింది. ప్రవరుడు అంగీకరించక ఓరమోమిడి తొలగిపోతాడు. ఆ దేవవేశ్య యందే మనసు లగ్నమయి విఫల మనోరథుడైన గంధర్వు డొకడు ఆమె సమాగమానికి ఎదురు చూస్తుంటాడు. అతడు ప్రవరుని వేషం ధరించి మాయా ప్రవరుడై వరూధినిని సమీపిస్తాడు. మనసు మార్చుకొని వచ్చిన యతి ప్రవరుడని భావించిన వరూధిని అతనిని కవయ కోరుతుంది.

"సంభోగ సమయమున నిమీలితాక్షివై నన్నుం జూడక యుండవలయు నట్లైన నీకును - నాకును సమాగమంబగునట్లు గాకున్నగా దనిన వరూధిని దాని కొడంబడియెనంత. [1]

భూమిలో కన్నులుమూసి సంగమించవలెనని నియమించి, అట్లు చేయనట్లయిన పాపం కలుగుతుందనే మిష కల్పించి ఆ మాయా ప్రవరుడు తన చిరకాల వాంఛితాన్ని నెరవేర్చుకున్నాడు.

శుక్ర శోణితాల సంయోగంతో ఏర్పడేదే గర్భం. స్త్రీ అండాశయంలో ఋతుక్రమం అయిన తరువాత అండం (Ovum) తయారవుతుంది ఈ అండం నెలకు ఒక్కసారి, ఒక్కటే తయారవుతుంది. ఈ అండం అండాశయ నాళం ద్వారా ప్రయాణించి 14, 15, 16వ రోజుల్లో పురుషుని వీర్య ప్రసరణ వల్ల పిండం ఏర్పడుతుంది. ఈ పిండం జీవరూపమైంది. ఇది అణు ప్రమాణమైంది.

"మానవ అండం (Ovum) క్షయకరణ విభజన ద్వారా (reiosis) తన క్రోమోజోముల సంఖ్యను సగానికి తగ్గించుకుంటుంది. అదే విధంగా శుక్రకణాలు (Spermotozoa) కూడా తమ క్రోమోజోముల సంఖ్యను తగ్గించుకొని శుక్ర కణాలుగా అభివృద్ధి చెందుతాయి. అండ వాహికలో ఫలదీకరణను జరుగుతుంది.

---

1. మార్కండేయ పురాణము 5-17.

లైంగిక కలయిక వలన ఫలదీకరణం (Fertilization) జరిగి సంయుక్త బీజకణము (Zygote) పిండంగా ఉత్పత్తి ప్రారంభిస్తుంది.

ఫలదీకరణం జరిగిన వారంరోజుల తరువాత సంయుక్తబీజకణం గర్భాశయ నాళంలో (Chorionic Villi) గర్భాశయ (Uters) గోడలకు అంటుకుంటుంది. గర్భాశయ గోడలకు విల్లీ (Villi) అంటుకున్న స్థానంలో మాయ (Placenta) తయారవుతుంది. పిండానికి కావలసిన ఆహార పదార్థాలను మాయ అందిస్తుంది. సంయుక్త బీజకణం మార్యులా (Morula) బ్లాస్టులా (Blastula)దశలలో అభి వృద్ధి చెంది పిండంగా మారుతుంది. పిండంలో వివిధ భాగాలు ప్రథమ వాహిక (Prinitive streak) ప్రథమ నాడీ మండలం (Noto cord) గా విభజన జరుగు తుంది. ఈ అభివృద్ధిలో సరీసృపాలు, పక్షులు, క్షీరదాల లక్షణాలను పోలిన పిండ దశలు స్పష్టంగా తెలుస్తాయి. ఒకానొక దశలో మొప్పలు (Gills) (చేపలకు వుండేవి) తెలుస్తాయి. పిండాన్ని వివిధ దశల్లో పరిశీలించడం ద్వారా మానవుని ఉత్పత్తిని డార్విన్ పరిణామ సిద్ధాంతం ద్వారానే జరిగిందని, భగవంతుని సృష్టి కాదని తేలుతుంది.

పిండోత్పత్తిలో మాయ మూడవ వారం నుండి పని చేయటం ప్రారం భిస్తుంది.

రెండు నెలల తరువాత హృదయం (Heart) తయారవుతుంది. అప్పటి నుండి గుండె కొట్టుకోవడం ప్రారంభిస్తుంది

మూడవ నెలకు అన్ని అవయవాలను సంతరించుకుంటుంది. మెదడు, చర్మము, గ్రంథులు మొదలయినవి బాహ్య పొర (Ectoderm) పూర్తవుతుంది. అస్థి పంజరం, కండరాలు, ఉదరావయవాలు మొదలైనవి అంతర పొర (Endo-derm) నుండి తయారవుతాయి. మూడవ నెల నుండి పిండం బరువు పెరుగు తుంది.

38 వారాలకు బరువు 3 నుండి 4 కిలోగ్రాముల వరకు పెరుగుతుంది. గర్భాశయంలో పిండం 266 రోజులకు పూర్తిగా అభివృద్ధి చెందుతుంది. తరువాత ప్రసవం (delivery) జరుగుతుంది అభివృద్ధి చెందిన పిండం బయటకు వచ్చిన

తరువాత వాతావరణంలోని ఆక్సిజన్ తీసుకోవడంతో శ్వాసక్రియ ప్రారంభం అవుతుంది."

పిండోత్పత్తి ఈ విధంగా వుండగా ఆరు, ఏడు నెలల వరకు అన్ని అవయవాలు పూర్తి కావనే ఆలోచన మూఢ నమ్మకం కాక మరేమౌతుంది. ఏడవ నెల ప్రాణం ఏర్పడుతుందని భావించడం పిండోత్పత్తి క్రమాన్ని గమనించలేకపోవడమే. శుక్ర శోణితాల మిశ్రమం ఏర్పడిన నాటి నుండి జీవం వుంటుంది. అందుచేతనే ఇది జీవ కణం.

మన పురాతన వేదాలు, ఉపనిషత్తులు మొదలయినవి ఫలధీకరణం, అండోత్పత్తిపై కాల ప్రభావాన్ని గురించి బాగా ప్రచారం చేసాయి. బహిష్టకాలంలో వేరు వేరు సమయాల్లో జరిగే కలయికవల్ల పుట్టబోయే బిడ్డ, మగ లేక ఆడ అనేది నిర్ణయించవచ్చని చెప్పారు. అది వట్టి బూటకం, శాస్త్ర సమ్మతంకాదు.

శుక్రం అనగా పురుషుని వీర్య కణంలో రెండు విభాగాలుంటాయి. అవి x-y అనే పేర్లతో పిలువబడతాయి. స్త్రీ శోణితంలో అనగా అండంలో రెండు విభాగాలుంటాయి. ఇవి x – x అనే పేర్లతో పిలవబడతాయి. (x–y; x–x) వీటిని జీవకణాలు 'జీన్స్' అని పిలుస్తారు. స్త్రీ పురుష సంయోగ సమయంలో స్త్రీ విడుదల చేసిన అండంలోని x–x జీవకణములతో పురుషుని వీర్యంలో x–y కణాలు సంయోగించినప్పుడు.

x – x × x – y

స్త్రీ జీవాణువులైన x–xలు పురుషాణువులలో ఒక భాగమైన 'Y' అనే జీవాణువుతో సంయోగం చెందినప్పుడు బాలుడు x – x + y (MALE) ఏర్పడతాడు. అనగా స్త్రీ భాగంలో ఒక x అని జీవాణువు నశిస్తుంది.

ఆ విధంగాకాక

x – x × x – y

స్త్రీ జీవాణులైన x–x లు పురుష జీవాణువులలో ఒక భాగమైన 'X' అనే జీవాణువుతో సంయోగం చెందటం చేత ఫలదీకరణం చెంది పురుష జీవాణువులలో మరిమొక భాగమైన 'Y' అనే జీవాణువు నశించి x + x – x లు కలయికచే బాలిక (FEMALE) ఏర్పడుతుంది.

---

(Clinical abstracties P. 32, 33)

ఇక ప్రకృతిలో మూడవ భాగం అని చెప్పబడ తున్న నపుంసకత్వం వారి వారి శరీర ఆరోగ్యానికి, తల్లి తీసుకున్న ఆహార పానీయాలకి బిడ్డ శరీరంలో ఉత్పత్తి కావలసిన స్త్రీ - పురుష జీవరసాలు ఉత్పత్తికాక వాతావరణ పరిస్థితులకు ప్రభావితులు అనే అంశాన్ని వైద్యశాస్త్రం రుజువు చేసింది.

అంతేకాని

పురుషుని యొక్క శుక్రాతిశయంతో కుమారుడు స్త్రీ రజోతిశయంతో కుమార్తె - సమం అయినట్లయితే షండుడు (నపుంసకుడు) పుడతారనే భావం మూఢ నమ్మకం మాత్రమే.

స్త్రీ ఋతు మతి అయిన తరువాత విడుదల చేసిన అండం 'ఓవమ్' - (Ovum) అండాశయం 'ఓవరీ' (Ovurey) నుండి బయలుదేరి గర్భాశయనాళం (Fallopious Tube) ద్వారా ప్రయాణించి గర్భాశయము (Uters) చేరడానికి 14 రోజులు పడుతుంది. ఆ విధంగా చేరిన అండం 24 గంటల నుంచి 48 గంటల కాలం వరకు గర్భాశయంలో వుంటుంది. ఈ సమయంలో పురుష వీర్య కణంలోని జీవాణువులు అండంతో కలియటంచేత గర్భంఏర్పడుతుంది. ఆ విధంగా కానట్లయితే గర్భాశయంలోని కొన్ని ద్రవ పదార్థాలు ఈ అండాన్ని తమలో కలుపు కుని 28 రోజులు పూర్తయిన తరువాత 'రజస్సు' రూపంలో బయటకు నెట్టి వేస్తాయి.

ఈ సత్యాన్ని గమనించక బహిష్టు అయిన నాల్గో నాటి నుంచే సంతానం కలుగుతుందని భావించటం మూఢ నమ్మకం.

అకాల సురత క్రియలవల్ల గుణవంతుడు కాని కుమారుడు కలగటం, చీకటిలో మైథున క్రియ చెయ్యటం వల్ల గుడ్డివాళ్లు పుడతారనే నమ్మకం, సంయోగం చేసిన మగవాడుకాక మనసులో వూహించుకున్న మగవాడి రూపం పిండంగా ఏర్పడుతుందని భావించడం మూఢ నమ్మకాలే.

# 3. వివాహం

వివాహం అనే పదానికి పెళ్ళి లేక పరిణయం అని అర్థం. యుక్తవయసులో వున్న యువతీ యువకులు కలిసి మెలిసి జీవించటానికి ఏర్పాటు చేయబడే నియమమే వివాహం పెద్దల ఎదుట లేక భగవంతుని ఎదుట చేసుకునే ఒప్పందం పెళ్ళి అనుకోవచ్చు ఈ పెళ్ళి ఒక్కొక్క సంప్రదాయంలో ఒక్కో రకంగా ఉంటుంది. ఒక్కొక్క మతంలో ఒక్కొక్క విధంగా రూపొందింది. తెలుగు సాహిత్యంలో ఈ వివాహ వ్యవస్థకు ప్రత్యేకమైన స్థానం వుంది.

ఈ వివాహాలు ఎనిమిది రకాలుగా వర్ణించారు.

1. బ్రహ్మము : బ్రహ్మ సంబంధమైనది. విద్యయు, నాచారముగల వరుని తానే పిలిచి వధూ సహితముగి తానే వస్త్రాదులచే నలంకరించి పూజించి కన్యనిచ్చి చేయు వివాహము.

2. దైవము : జ్యోతిష్టోమాది యజ్ఞము ప్రారంభింపబడినప్పుడు యధా విధిగా తత్కర్మము నడిపిన ఋత్విజునలకరించి కన్యనిచ్చి చేయు వివాహము.

3. అర్ధము : కన్య తండ్రికి ధనము ఇచ్చి (హోలీ) చేసుకునే వివాహం.

4. ప్రాజాపత్యము : మీరిరువురు గూడి ధర్మము చేయుడని వరునితో పరి భాషించి కన్నెనిచ్చి చేయు వివాహము.

5. ఆసురము : ధనమిచ్చి కన్యకను కొని పెండ్లాండు పెండ్లి.

6. గాంధర్వము : కన్యావరులు పరస్పరేచ్ఛ చేత చేసికొను వివాహము.

7. రాక్షసము : బలాత్కారమున కన్య నపహరించుకొని వచ్చి చేసికొనెడి వివాహము.

8. పైశాచము : నిద్రించియు తాగిమైమఱచియు శీలము సంరక్షింప బరాకు వడియున్నదానిని సంభోగేచ్ఛచే రహస్యముగా చేసుకొనే వివాహం."

ఈ వివాహ సంప్రదాయాలు మనకు ఆర్య జాతి నుంచి సంక్రమించినవే. వేద మంత్రాలు. వేదోక్తమయిన విధానం మంగళసూత్రం మినహా మిగిలిన పెళ్ళి తంతులు ఆర్య సంప్రదాయాలే ఈ వివాహ వ్యవస్థను గురించిఎక్కువగా చెప్పిన వారు అశ్వలాయనుడు – అపస్తంభుడు అనే ఆర్ష ఋషులు. అందులో ఎక్కువగా ఆపస్తంబుని మతాన్నే అనుసరించటం జరిగింది.

"ఆపస్తంభుని మతము ననుసరించి వివాహము మాఘ ఫాల్గుణ మాసము లలో ప్రశస్తముకాదు మరియొక సాంప్రదాయము ననుసరించి ఆషాఢము పుష్యమి వర్జింపదగినవి. చైత్ర వైశాఖములు ఉత్తమము. శుభమైన నక్షత్రములలో వివాహము చేయవలెను."[1]

కొన్ని మాసాలలోనే వివాహం చేయవలెనని నిర్ణయించటం జరిగింది. కొన్ని మాసాలు వర్జింపతగినవి. వివాహం జరగటానికిముందు వధువువైపు బంధువులు వరునివైపు బంధువులు పురోహితుని సమక్షంలో లగ్నం (పెళ్ళి నిర్ణయ సమయం) పెట్టించుకోవాలి. ఫలానా తిథియందు – ఫలానా మాసం – ఫలానా నక్షత్రంలో వివాహం జరుగుతుంది అనే విషయాన్ని లగ్నపత్రికపై వ్రాయిస్తారు.

నిర్ణయించుకున్నరోజు ముందుగా చేసే వివాహ విధులు.

"వధూవరులు ముందుగా మంగళస్నానము చేయుట, అలంకరణము జరుగును. తరువాత విఘ్నేశ్వర పూజ, ఆ సమయమున వరుడు విఘ్నేశ్వరపూజ చేయుటయు, వధువు గౌరీపూజగాని, లక్ష్మీపూజగాని చేయుటయు దేశాచారమై యున్నది. ఈ పూజవలన వధువునకు మాంగల్య వృద్ధి కలుగును.[2]

ఒక్కొక్క వర్ణంలో ఒక్కొక్క విధంగా, ఒక్కొక్క జాతుల్లో ఒక్కొక్క విధంగా వివాహాలు జరుగుతాయి. శ్రీకాకుళం ప్రాంతంలోని మన్యం అడవుల్లో నివసించే ఆటవికుల వివాహ వ్యవస్థ గమనించతగ్గది.

---

1. కళ్యాణ సంస్కృతి పు. 4.
2. కళ్యాణ సంస్కృతి పు. 11.

"ఆడపిల్లని పెళ్ళిచేసుకోవాలంటే చాలా తతంగం ఉంటుంది. మగపిల్లవాడు ఇప్పసారాతోపాటు కొన్ని కానుకలు తీసుకువెళ్ళి ఆ ఆడపిల్ల తండ్రికి ఇవ్వాలి. అవి వాళ్ళు తీసుకుంటే పెళ్ళికి ఒప్పుకున్నట్లు. తీసుకోకపోతే మగపిల్లవాడు తన ప్రయత్నం విరమించుకోనక్కరలేదు. ఫలానారోజు ఇన్ని గంటలకు నీ కూతురిని ఎత్తుకుపోయి పెళ్ళాడతాను అని ప్రకటించవచ్చు.

చేతనైతే ఆ పిల్లవాడు పిల్లని ఎత్తుకుపోకుండా తండ్రికాని, అన్నదమ్ములు కాని రక్షించుకోవాలి. లేకపోతే పిల్ల తన్ను తాను రక్షించుకోవాలి. ఆ ప్రయత్నం ఫలించకపోతే చచ్చినట్లు అతని భార్య అయితీరవలసిందే. పుస్తెకట్టే ఆచారం వీరికి లేదు." 1

కొన్ని ప్రాంతాలలో వివాహ వ్యవస్థ స్వయంవరం రూపంలో ఉంటుంది. మనకు ఇతిహాసాలలో ఈ స్వయంవరాలు ఎక్కువగా కన్పిస్తాయి.

ధర్ముడు అనే రాజు మిధిలా నగరాన్ని పాలించే రాజు. అతనికి సామంతుడు కుంభకుడు అనే యాదవరాజు. ఈతని కుమార్తె నీల. నీలాసుందరి కృష్ణుణ్ణి వలచింది. కాని కుంభకుడు తన కుమార్తె వివాహానికి స్వయంవరం ప్రకటించాడు. కుంభకుని ఇంట కాలనేమి అనే రాక్షసుని యొక్క కుమారులు ఏడుగురు ఆబోతులై పుట్టి అతని సంస్థానాన్ని, గోవుల్ని, ఆస్తుల్ని ధ్వంసంచేయటం ప్రారంభించారు. ఆ సమయంలో ఆ ఆబోతుల గర్వాన్ని, మదాన్ని అణచేవారులేరు. అందుచేత కుంభకుడు వాటికి భయపడి వాటిని చంపినవారికి తన కుమార్తెనిచ్చి వివాహం చేస్తానని ప్రకటిస్తాడు.

"అని యెందు నెరవు దోపక" 2

ఈ స్వయంవరాలు అనేక రకాలుగా ఉన్నాయి. బలప్రదర్శన, అస్త్రవిద్యా ప్రదర్శన, గుర్రపు స్వారీ, క్రూరమృగాల వేట, అందచందాలు, ధనం, హోదా కూడా ప్రధానంగా ఉంటాయి.

వివాహ విధానంలో వేదమంత్రాలు చోటుచేసుకున్నాయి. ఈ మంత్రాలు సంస్కృతంలో ఉండటంచేత పురోహితులకు మాత్రమే పరిమితం.

---

1. మల్లమదేవి ఉరుసు. పు. 177.
2. నీలా సుందరి పరిణయము 2-70

"వివాహ శుభముహూర్తమున టీలకర్ర, బెల్లము ఒకరినెత్తిన ఒకరు ఉంచవలెను. వరుడు ఈ క్రింది విధముగా పలుకును. వరుణా, సవితయొక్క లక్ష్మి ఈమెను సోదరులకు వృద్ధికలిగించునట్లు చేయుగాక. బృహస్పతీ : భర్తృ వృద్ధి కలదానినిగా ఈమెను చేయుదువుగాక. ఇంద్రా : ఈమెను పుత్రసంతానముకల దానినిగా చేయుదువుగాక." [1]

ఈ వివాహంలో చేతికి కంకణం కట్టడం, వధువు మెడలో మంగళసూత్రం కట్టటం ప్రధానమైన అంశం.

మంగళసూత్రం ధరించటం వివాహాచారాల్లో ప్రధానమైంది. స్త్రీ మెడలో వున్న పసుపుతాడే వివాహానికి గుర్తు.

"మొదలి మంగళసూత్రము దాల్చినట్లు
వొదలు మంగళసూత్రములు ధరించి." [2]

"గళమునఁగట్టెను హరి మంగళసూత్రము" [3]

గోదాదేవిని శ్రీరంగేశుని వివాహ సందర్భంలో వివాహం జరిగిన తరువాత కంకణములు ధరించినట్లు తెలియుచున్నది.

వివాహం అగ్నిసాక్షిగా జరగటం ఆచారాలలో ముఖ్యమైంది. వేదిక ఎదుట హోమం రగిల్చి, వేదమంత్రాలతో వివాహం జరుగుతుంది. ఈ సందర్భంలో వరుడు వధువు తండ్రినుండి ప్రతిజ్ఞ గైకొని అగ్నిసాక్షిగా వధువును గ్రహిస్తాడు.

"జననాథ సహధర్మచారిణి గాఁగ
జనకునిచే నగ్నిసాక్షి గైకొంటి" [4]

---

1. కల్యాణ సంస్కృతి – 54.
2. పండితారాధ్య చరిత్ర. పు 162
3. ఆముక్తమాల్యద 7–70.
4. రంగనాథ రామాయణము పు. 91.

వనవాస సందర్భంలో రాముడు సీతను తన వెంట అరణ్యావాసానికి తీసుకు వెళ్ళటానికి మొదట అంగీకరించడు. అపుడు సీత తాను సహధర్మచారిణి అని తన తండ్రి అయిన జనకునిచే అగ్నిసాక్షిగా గైకొంటివని పలుకుతుంది.

వివాహ విధిలో ప్రధాన హోమం ముఖ్యమైంది. ఆ సందర్భంలో వరుడు వధువుతో ఈ విధంగా అంటాడు.

"సోమః ప్రథమో వివిదే – నిన్ను మొదట సోముడు పొందెను
గంధర్వో వివిదే ఉత్తరః – అటుపైన గంధర్వుడు పొందెను
తృతీయో అగ్నిష్టే – మూడవవాడుగా అగ్ని ఇష్టపడెను
పతిస్తురీయస్తు మనుష్యజాః – మనుష్యుడనైన నేను నాల్గవవాడిని" [1]

వధువును మొదట సోముడు పొందగా తరువాత గంధర్వుడు ఇష్టపడ్డాడు. మూడవవాని వంతుగా అగ్ని, చివరివాడుగా మనుష్యుడైన వరుడట.

సంస్కృతంలో వున్న ఈ శ్లోకాలకు పూర్తి అర్థం తెలిసిన తరువాత ఏ వరుడు ఈ వేదోక్తమైన వివాహానికి అంగీకరిస్తాడు. ఇది మానసిక వ్యభిచారం కాదా అని నేటి వరుడు ప్రశ్నిస్తాడు.

భార్య మరణించినట్లయిన భర్త మరియొక వివాహం చేసికొనవచ్చు. సంతానం భార్యకు కలుగకున్న ఆ పురుషుడు మరియొక వివాహం చేసికొనవచ్చు. భర్త మరణించిన స్త్రీ పునర్వివాహానికి అర్హత స్మృతులందు చెప్పబడలేదు. సంతానం కలగటానికి క్షేత్ర విలువను మాత్రమే నాటివారు గుర్తించారు. బీజసారాన్ని గణనలోకి తీసుకోలేదు. అందుచేత సంతానం కలగటం–కలగకపోవటం స్త్రీదే దోషమని శాస్త్రాలు – స్మృతులు భావించాయి.

భర్త వేరొక పెండ్లి చేసికొన్న తరువాత భార్య కోపంతో నున్న దానిని కోపం తొలగువరకు తాడుతో కట్టివేయవలెను. లేదేని తల్లిదండ్రుల వద్ద వదలి వేయవలెను. [2]

---

1. కళ్యాణ సంస్కృతి – పుట 65.
2. మనుస్మృతి 9–3.

భర్త మరణించిన స్త్రీ సంతాన హీనురాలయిన ఆమెకు పుణ్యగతులు కలగటం కోసం నియోగాన్ని అంగీకరించారు. నియోగం అనగా భర్త సోదరులు గాని సోదరుని వరస అయినవారు గాని కావచ్చు.

"బిడ్డలు లేకుండా భర్త మరణించిన స్త్రీ తనకు తన భర్తకు ఉత్తమ గతులు పొందటం కోసం భర్త సోదరుల ద్వారా సంతతిని పొందవచ్చును." [1]

పై వివాహ విధానం ద్వారా పురుషాధిక్యత స్పష్టమౌతుంది. వివాహం శారీరక మానసిక ఆనందాన్ని ఇచ్చే కార్యమనే విషయం విస్మరించి దాన్ని ఆడంబరంగా, ఆచారంగా, నమ్మకంగా, మూఢ నమ్మకంగా భావించారు. భార్య మరణించినా, సంతానం కలగకపోయినా, భర్తకు అనుకూలవతి కాకపోయినా పురుషుడు మరొక వివాహం చేసుకోవచ్చు. స్త్రీ మాత్రం అందుకు అర్హురాలు కాదు అనే నమ్మకం హిందూ సమాజం - సంస్కృతిలో గూడు కట్టుకుంది ఇలాంటి నమ్మకాల వల్ల స్త్రీలకు బాగా నష్టం జరిగింది పితృస్వామ్యం వివాహం పేరుతో పురుషుడికి ఒక నమ్మకమైన బానిసను (స్త్రీ, భార్య) ఇవ్వటం జరిగితే, స్త్రీకి భర్త పేరుతో దుర్మార్గుడైన గృహ యజమానిని ప్రసాదించింది.

నేటి సామాజిక దశలో కూడా ఈ వివాహబంధం విడదీయరానిదని, జన్మల అనుబంధమని, స్త్రీ పునర్వివాహానికి అర్హురాలు కాదనే నమ్మకం వ వుంది. మనసులు చేరువకాని స్త్రీ-పురుషుల మధ్య జరిగిన వివాహం అనే ఒప్ప స్వక్రమమైన విధానంలో లేనపుడు వివాహబంధం అనే ఈ మూఢ నమ అర్థం లేదు. ధనం ప్రధానంగా, ఆడంబరమే ఆలంబనగా జరిగే ఇటువంటి వి: మూఢ నమ్మకాలకు ప్రతీకలు మాత్రంగానే మిగిలిపోతాయి.

**బాల్య వివాహాలు :**

వివాహం అనేది స్త్రీ పురుషులకు జీవిత భాగస్వామ్యాన్ని చేకూర్చే ఒప్పందం. మాతృస్వామ్యంలో వివాహాలలో స్త్రీలకే ఎక్కువ ప్రాధాన్యం వ పితృస్వామ్యంలో పురుషుని ఆధిక్యత స్పష్టమయింది. ఈ పితృస్వామ వివాహం ద్వారా పురుషుడికి భార్య పేరుతో ఒక బానిస లభించగా స్త్రీకి పేరుతో ఒక అధికారి లభించాడు.

---

1. గౌతమ ధర్మ సూత్రములు 2-9-4.

వివాహం అనేది శారీరక, మానసిక, నైతిక, సాంఘికావసరాలకు స్త్రీ-పురుష లిద్దరికి వుపయోగపడే నియమం వివాహం వీరిరువురికి జీవితం ఆనందమయం కావాలి. నవ్యజీవితానికి బాటలు వేయాలి. వారి తరువాత మరో తరాన్ని ఉత్పత్తి చేయాలి. ఇది వివాహ వ్యవస్థలోని అంతరార్థం. ఇలాంటి వివాహాలు యుక్త వయసులో వున్న యువతీ యువకుల మధ్య మాత్రమే జరగవలసి వుంది. అటు వంటివారు శారీరకంగా, మానసికంగా అభివృద్ధి చెంది వుండటంచేత వారి వివాహ బంధం సార్థకమవుతుంది. ఆ విధంగా కాక బాల్యావస్థలో వున్నవారిని, ఏమీ తెలియని వయసులో భార్యాభర్తల పేరుతో ఏర్పాటు చేసే తంతునే బాల్యవివాహాలు అంటారు. ఈ వివాహాలు ఆనందమయమైన జీవితానికి బాటలు వేయాల్సినదానికి బదులుగా బాధాకరమవటానికి అవకాశముంది. మనసు మమతలు తెలియని వయసులో వివాహాలు చేస్తే ఆ బాలబాలికల జీవితాలు విషాదం కావడానికి అవకాశ ముంది.

భారతీయ సాంప్రదాయంలో బాల్యవివాహాలు చేయటంద్వారా స్త్రీలకే ఎక్కువ నష్టం జరిగింది. తక్కువ వయసులో అనగా ఎనిమిది సంవత్సరాలు (కన్య) నిండని బాలికను ఎంత వయసులో వున్న మగవానికైనా ఇచ్చి వివాహం చేసేవారు. దీనివల్ల ఆ బాలిక యుక్తవయసు వచ్చే వేళకు ఈ ముసలి పెళ్ళికొడుకు మర ణించిన సంఘటనలు, వ్యాధిగ్రస్తులయిన సంఘటనలు అనేకమున్నాయని మనకు చరిత్ర సాక్ష్యమిస్తుంది. అటువంటి బాలికలను బాలవితంతువులని ఈ సమాజం వ్యవహరించింది.

క్రీస్తు శకంలో ఈ బాల్యవివాహాలు ఎక్కువగా వ్యాప్తి చెందాయి. ఈ బాల్య వివాహాలవల్ల స్త్రీలు తక్కువ వయసులోనే, అమాయకత్వం వీడని దశలోనే తల్లులు కావటం, అనేకమంది బిడ్డలను లేతవయసులో పొందటం ద్వారా వారు అనారోగ్యానికి గురికావలసి వచ్చింది. భర్త మరణిస్తే అతనితోపాటు సహగమనం చేయటమో ఆజన్మ వైధవ్యం అనుభవించటమో జరిగేది. తద్వారా అవమానాలతో అస్తవ్యస్త జీవితాన్ని గడపాల్సిన పరిస్థితి ఏర్పడుతూండేది.

వేదకాలంలో బాల్యవివాహాలు అంతగా లేవనే చెప్పాలి. ఋగ్వేదంలో బాల్య వివాహాలు స్పష్టంగా వివరించబడలేదు. ఒకటి రెండు ప్రస్తావనలందు తప్ప బాల్య వివాహాలు లేవనే చెప్పాలి.

అయితే ఋగ్వేదంలోని వివాహ వర్ణనల్నిబట్టి వధూవరులకు వివాహమైన నాల్గో రోజునే శోభనం జరుపుతారనే విషయం స్పష్టమౌతుంది. దీనినిబట్టి యుక్త వయసులో వున్న స్త్రీ పురుషులకు మాత్రమే వివాహాదులు జరుగుతూ వుండేవని తెలుస్తూంది.

స్మృతులు మాత్రం బాల్యవివాహాలను సమర్ధిస్తున్నాయి. పారాశర స్మృతి, మనుస్మృతులు బాల్యవివాహాల్ని సమర్థిస్తున్నాయి. మనుస్మృతి క్రీస్తు తరవాత రచించబడి వుండవచ్చునని చరిత్రకారుల, భాషాశాస్త్రవేత్తల అభిప్రాయం. మను స్మృతి ఈ విధంగా చెపుతుంది.

"మూప్పది సంవత్సరముల వరుడు పండ్రెండు సంవత్సరముల కన్యను, ఇరువది నాలుగు సంవత్సరముల వరుడు ఎనిమిది సంవత్సరముల కన్యను పెండ్లాడ వలయును." [1]

ఆపస్తంభుడు ఎనిమిది సంవత్సరాలు దాటిన కన్య వివాహానికి అర్హురాలు కాదని తన ధర్మశాస్త్రంలో వివరించాడు.

"రజస్వల కాకముందే వివాహం చేయని ఎడల బంధుజన దోషం చేసిన వారగుదు"రని పారాశర స్మృతిలో

"రజస్వల కాకముందు వివాహం చేయనట్లయిన పితృదేవతలు ప్రతి మాసము ఆమె ఋతుకాలంలో విడిచిన రజస్సు తాగుదురని ఆ కన్య వివాహం కాకుండగనే రజస్వల అయినట్లయిన ఆమె తల్లి-తండ్రి-అన్న ముగ్గురు రౌరవాది నరకాల పాలగుదు"[2]రని చెప్పబడింది.

ఈ విధంగా స్మృతులు ప్రజలకు నరకభయాన్ని పెట్టి బాల్యవివాహాలను బలవంతంగా సమాజంపై రుద్దాయి. "రజస్వల అయిన కన్య మూడు సంవత్సరాల వరకూ ఆగి ఆపైన స్వతంత్రించి వివాహమాడవచ్చు"నని మనుస్మృతి (9-90), "మూడు ఋతువుల కాలం వరకూ ఆగి ఆపైన స్వతంత్రించవచ్చు"నని గౌతముడు (2-9-90) చెప్పారు.

---

1. మనుస్మృతి - 9-94.
2. గౌతమ ధర్మసూత్రములు - 2-9-21, 22.

రజస్వల అయిన కన్య మూడు సంవత్సరాల వరకు అవివాహితగా ఉంటే అట్టి కన్యను పొందినట్లయిన దోషం లేదని కౌటిల్యుడు తన అర్థశాస్త్రంలో వివరించాడు.

అయితే స్మృతులకు పూర్వం ఈ నిర్ణయాలు అమలు జరపబడలేదు. హిందూ మతం తప్పనిసరిగా బాల్యవివాహాలు జరిపించటానికే ఎక్కువ ప్రాతినిధ్యం ఇచ్చింది. ఆ విధంగా బాల్యవివాహం జరిపించకపోతే కుటుంబం మొత్తానికి అవమానంగా వుండేది.

"ఈ పిల్ల పెళ్ళిళ్ళ ఆచారం ఎంతవరకూ వెళ్ళిందంటే పెళ్ళి కాని పిల్ల ఇంట్లో వుందంటే ఇంటి కంతటికీ అవమానం కిందికి వచ్చింది. ఆ ఇంటివారు చేతకానివారని, పెళ్ళి చేసే యోగ్యత లేనివారని అనుకోవడం కూడా వుండేది. అటువంటివారి ఇళ్ళకు పెద్దలు వెళ్ళేవారు కాదు. వెళ్ళినా వాళ్ళ ఇంట మంచినీళ్ళయినా నోటిలో పోసుకోరు. అంత నీచంగా చూచేవారు". [1]

కన్య అనే పదానికి నిర్వచనంగా మనువు ఎనిమిది సంవత్సరాలు చెప్పగా, ఆపస్తంభుడు పది సంవత్సరాలు దాటని బాలిక కన్య అని వివరించాడు.

కన్యావరణం సందర్భంలో "పది సంవత్సరములు నిండనిదానిని కన్యను వివాహమాడవలెను. [2]

తెలుగు ప్రాంతంలో బాల్యవివాహాలు శైవవంశాల్లో ఎక్కువగా వుండేవి.

"స్వతహాగా నాగమ్మ వంశం శైవవంశం. ఈశ్వరారాధకులైన నాగమ్మ వంశంలో రజస్వలాత్పూర్వమే కళ్యాణం చేయటం ఆచారం. నాగమ్మనాటికి బాల్య వివాహాలే శాస్త్రసమ్మతాలై వుండి వుండవచ్చును". [3]

వివాహాలు బాల్యంలోనే జరగాలి అని ఆ విధంగా జరగకుండా మరణించిన వారికి ముఖ్యంగా బాలబాలికలకు కూడా వివాహాలు చేయబడే ఆచారాలు తెలుగు ప్రాంతంలో కన్పిస్తాయి.

---

1. పెళ్ళి పు. 103
2. కళ్యాణ సంస్కృతి పు. 21.
3. పల్నాటి వీరచరిత్ర పు. 19

"కొంతకాలం పెందటివరకు మన దేశంలో కొన్ని ప్రాంతాలలో అన్ని కులాల హిందువులలోను పిల్లలు పెండ్లి కాకుండా చనిపోతే ఆ చనిపోయిన బాల బాలికలకు వరస వాయిలు చూచి స్మశానంలో (వల్లకాటిలో) పెళ్ళిళ్ళు వారి వారి తల్లిదండ్రులు చేసేవారు. ఇప్పటికి మన ఆంధ్ర ప్రాంతంలో యాదవులు (గొల్లలు), నగరాలు, కొన్ని తెలగ తెగలవారు యీ శవ పెండ్లిళ్లు జరుపుకొనుచున్నారు. ఈ పెళ్ళిళ్ళ యందు బ్రతికి వున్నవారి పెళ్ళిళ్ళకు వలె పెళ్ళి తతంగం అంతా వుంటుంది.

పూర్వకాలంలో లగ్నపత్రిక, శుభలేఖలు, కట్నం పత్రాలు వగైరాలన్నీ తయారుచేసి పరాన్నభుక్కులైన పురోహితులు నిప్పులో వాటిని పడవేసేవారు. ఈ పత్రాలన్నింటిని అగ్నిదేవుడు (నిప్పు) ఆ చనిపోయిన పిల్లలవద్దకు చేరుస్తాడని అక్కడ ఫలానా ఆడశవం తన పెండ్లామని చనిపోయిన మగపిల్లవాడు, ఫలానా మగశవం తన మొగుడని చనిపోయిన ఆ ఆడపిల్ల తెలుసుకుంటారట. [1]

బాల్యవివాహాలు జరగటానికి మనవారు ఒక కారణం చెపుతారు.

"కన్యాదానంవల్ల పుణ్యం కలుగుతుందని, కన్య అంటే ఎనిమిదివేళ్ళ పిల్ల కాబట్టి ఆ వయసులోనే పెళ్ళి చేయాలని చెపుతారు. కన్య అంటే పదివేళ్ళ పిల్లని చెప్పిన శాస్త్రకారులు కూడా ఈ బాల్యవివాహాల్ని అంగీకరించారు.

పిల్ల రజస్వల అయినప్పటికే ఒక భర్త తయారుగా వుంటే దాని యవ్వనం ఒక్క రోజయినా అడవి కాచిన వెన్నెల కాదని బాల్యవివాహాలు చేసేవారంటారు. కొందరు మహమ్మదీయ ప్రభువులు అందమైన పిల్లల్ని చూస్తే వాళ్ళను పెళ్ళి చేసు కోటానికి కోరవచ్చు. అపుడు ఆ పిల్లకు పెళ్ళయిపోయిందని చెపితే వారా ప్రయత్నం మానుకుంటారని ఆలోచన అంటారు మరికొందరు. ఇవన్నీ కుంటి సమాధానాలు అని వేరుగా చెప్పనక్కరలేదు. పెళ్ళయిన పిల్లయితే నవాబుగారికి పనికిరాదా ! ఏమిటి ? [2]

1. పెళ్ళెందుకు పు. 46-47.

2. పెళ్ళి పు. 104

బాల్యవివాహాల గురించి మనవాళ్ళు చెప్పే కాకమ్మ కథలన్నీ కల్పితాలే. పురాణాలు, స్మృతులలో చెప్పిన నమ్మకాల్ని కాదనే ధైర్యం, సవ్యంగా ఆలోచించే శక్తి మనవారికి లోపించాయి. మతం మత్తులో, శాసనాల్లో మునిగిన హైందవజాతి ఈ బాల్యవివాహం వరవడిలో కొట్టుకుపోయింది. ఇది ఒక మూఢనమ్మకంగా ఏర్పడిపోయింది. ఆంగ్లేయులు మన దేశాన్ని పాలిస్తున్న సమయంలో కూడా ఈ బాల్యవివాహాల తంతు ఎక్కువగా జరుగుతుండేది. దేశీయులైన అనేకమంది సంఘ సంస్కర్తలు, బ్రహ్మ సమాజం వంటి సనాతన వ్యతిరేక సంఘాలు ఈ వ్యవస్థను వ్యతిరేకించాయి. కందుకూరి వీరేశలింగం పంతులుగారు, గురజాడ అప్పారావుగారి వంటి సంఘ సంస్కర్తలు ఈ ఉద్యమాల్ని తెలుగునాట బలవత్తరంగా నడిపారు. వీరి కాలంలో వెలసిన సాహిత్యం, గేయాలు, నాటకాలు, నవలలు దీని దుష్ప్రభావాన్ని బాహాటంగా ఖండించాయి. అంగ్లేయులు సైతం ఈ బాల్యవివాహం కార్యక్రమాన్ని అసహ్యించుకున్నారు. బాలికల వివాహ వయస్సు 12సం॥ పెంచటం ద్వారా చట్టాన్ని తీసుకువచ్చారు. శారదా బిల్లు చట్టంవల్ల తక్కువ వయసులో వున్న బాలికలకు వివాహం చెయ్యరాదనే శాసనం అమలులోకి వచ్చింది. దీని ఫలితంగా [illegible] అనేక బాల్యవివాహాలు జరిగాయి. నిద్రలో వున్న పిల్లలకు, తల్లి ఒడిలోని పిల్లలకు, పాలు తాగే పసిపిల్లలకు వివాహాలు చేశారు. గురజాడవారి కన్యాశుల్కం నాటక పీఠిక పరిశీలిస్తే తల్లి కడుపులోవున్న పిల్లలకుకూడా వివాహం చెయ్యడానికి సిద్ధపడే తల్లిదండ్రులు మనకు కనిపిస్తారు

మనకు స్వాతంత్ర్యం లభించి నాలుగు దశాబ్దాలు గడిచినా మన ప్రాంతం లోనే తూర్పుగోదావరిజిల్లా పిఠాపురం తాలూకా నాగులాపల్లి గ్రామంలో నాటినుంచి నేటివరకు కూడా బాల్యవివాహాలు జరుగుతూనే వున్నాయి. ఒకటి – రెండు సంవత్సరాల వయసులో వున్న బాలికలకు వివాహాలు జరిపించటం ఇక్కడి రివాజు ఆ గ్రామంలో జనాభా 9 వేలు అక్కడివారంతా పాకనాటివారి రెడ్లట. ఉన్నత పాఠశాల వున్నప్పటికీ బాలికలెవ్వరూ 8వ తరగతి మించి చదవరు. వారిలో దాదాపు [illegible]% మంది [illegible] మెడలో పచ్చని తాడుతో మంగళసూత్రాలతో మనకు ప్రత్యక్షమౌతారు ఇంత చిన్నవయసులో జరిగే పెళ్ళిళ్ళ పర్యవసానం ఎలా వుంటుందో మనం వూహించవచ్చు. నిరక్షరాస్యత, పేదరికం, మనసు లేని పెళ్ళిళ్ళు, మమకారాలు లేని ఆలుమగల అనుబంధాలు ఎలా వుంటాయో మన మనస్సుకు తోచకపోదు యుక్తవయస్సు వచ్చేవరకు వివాహం కాని పురుషుడు

గానీ, స్త్రీ గానీ ఆ గ్రామంలో లేరనే చెప్పాలి. పుట్టిన పిల్లలకు పెళ్ళి చేసే ఈ గ్రామవ్యవస్థ బాధాకరమైంది, మన గుండెల్ని పిండే సమస్య మరొకటి. పెళ్ళయిన బాలిక భర్త (చిన్నవయసులోనే) వ్యాధిచేత గానీ, మరే కారణంచేతగానీ మరణిస్తే ఆ బాలికకు పునర్వివాహ ప్రసక్తి లేదు. ఆజన్మాంతం వైధవ్యం అనుభవించవలసిందే.

ఈ గ్రామంలో వివాహాలు రెండు రకాలుగా జరుగుతాయి. బాల బాలికల తల్లిదండ్రులు ఇష్టపడితే వివాహం మామూలుగానే జరుగుతుంది. ఆ విధంగా కాక ఎవరో ఒకరు అంగీకరించకపోయినంత మాత్రాన ఆ వివాహం ఆగదు. ఆ బాలుడు గాని లేక బాలికగాని ఆడుకునేటప్పుడో, బడికి వెళ్ళేటప్పుడో పెద్దవాళ్లు పట్టుకు వెళ్ళి దొంగతనంగా పెళ్ళి చేసినా ఆ వివాహం గుర్తింపే. మా అమ్మాయికిగానీ, మా అబ్బాయికిగానీ ఈ పెళ్ళి ఎందుకు చేసారు అని అడగకూడదు. వివాహాన్ని కాదనరాదు. ఇదీ అక్కడి సభ్యత - సంస్కారం.

ఇక్కడి స్త్రీలలో ఎక్కువ భాగం వారి జీవితమంతా గృహ కారాగారంలో గడపాల్సిందే. బయటికి వస్తే వారి పరువు - మర్యాదలు మంట కలుస్తాయట. జీవితమంతా నిస్సారంగా, నిస్తేజంగా గడపాల్సిందే. (5-2-85 ఉదయం దినపత్రిక వ్యాసం నన్నీ పర్యటనకు పురికొల్పింది.)

కరీంనగర్ జిల్లా మెట్‌పల్లి సమితిలో చిన్నారిపాపలకు వివాహాలు ఇప్పటికీ జరుగుతున్నాయి. ఈ సమితిలో వున్న సుమారు వంద గ్రామాల్లో బాల్యవివాహాలు యథాతథంగా జరుగుతూనే వున్నాయి. అయితే ఇక్కడ విడాకులు, పునర్వివాహాలు, విధవా వివాహాలు, పసిపిల్లల తల్లులకు కూడా వివాహాలు జరిపే వ్యవస్థ మనకు కనిపిస్తుంది. ఇష్టం కాని భార్యాభర్తలు విడిపోవచ్చు. యుక్తవయసు వచ్చేవరకూ వివాహానికి మాత్రం ఆగరు. చట్టాలు ఎన్ని వున్నా ప్రభుత్వ యంత్రాంగం గానీ, ఏ రాజకీయ నాయకులుగానీ వీటిని పట్టించుకున్నవారు లేరు.

ఇక్కడి వాతావరణంలో బాల్యవివాహాలు జరగటానికి పేదరికం కారణంగా కనిపిస్తుంది వెనుకబడిన వర్గాలవారు, హరిజనులు అధికంగా నివసించే ఈ ప్రాంతంలో వున్న వ్యవసాయ కూలీల భావనలు గమనిస్తే వారి జీవనస్థాయి మనకు విదిత

మౌతుంది. చిన్న వయసులో తన కొడుక్కి పెళ్ళి చేస్తే వచ్చే కోడలు ఇంటి పనుల్లో, వ్యవసాయ పనుల్లో తోడుంటుందని రెండు చేతులూ సంపాదిస్తే తప్ప డొక్క ఆడదనీ వారి నమ్మకం." [1]

బాల్యవివాహాలు గతంలో అనేక అనర్థాలు కలిగించాయనేది నిత్యసత్యం. నేటి సమాజంలో ఈ బాల్యవివాహాలు పూర్తిగా నిషేధించబడ్డాయి. వివాహానికి స్త్రీ వయస్సు 18 సం॥, పురుషుని వయస్సు 21 సం॥గా నిర్ణయించడం ఆనంద దాయకమైన విషయం. కాని ఇప్పటికి కొంతమంది హిందూ మతోన్మాదులు, సనాతన సాంప్రదాయవాదులు చిన్న చిన్న పిల్లలకు వివాహాలు చేస్తున్నారు. సభ్య సమాజం దీన్ని గర్హించాల్సిన అవసరం ఎంతైనా వుంది.

# 4. సహగమనం

సహగమనం అంటే 'భార్య భర్తతోగూడ చితిజొచ్చుట' లేక 'చిచ్చురుకుట' అని అర్థం. సతి అంటే 'పతివ్రత'. దీనినిబట్టి సతీసహగమనం అనగా పతివ్రత అయిన భార్య తన భర్త మరణించిన తరువాత శవంతోపాటు మర ణించటం. సామాన్యంగా శవసంస్కారంలో హిందూ మతాచారం ప్రకారం చితి పేర్చి దహనం చేయటం ముఖ్యంగా కనిపిస్తుంది. అందుచేత మరణించిన భర్త శరీరంతోపాటు బ్రతికివున్న అతని భార్యను సజీవంగా కాల్చి చంపటం. హిందూ మతాచారం పేరుతో వేదమంత్రాల సాక్ష్యంతో జరిగే పవిత్రమైన హత్యాకాండ. దీనికి మారుపేరే సతీసహగమనం

భర్తతో పాటు మరణించిన స్త్రీకి పరలోకంలో అమర సుఖాలు లభిస్తాయని, ఈ లోకంలోనే కాక పరలోకంలో కూడా భార్య భర్తకు సేవలు చేయటమే పరమ ధర్మంగా గుర్తించబడింది హైందవ ధర్మశాస్త్రాల్లో చనిపోయిన భర్తతో పాటుగా మరణించిన భార్య 'పరమ పతివ్రత' అనే బిరుదుతో కీర్తించబడింది. భర్త ఎటువంటివాడైనా, నీచుడైనా, జూదరైనా, త్రాగుబోతైనా అతడినే దైవంగా భావించి

---

1. 29-5-86 ఈనాడు

పతివ్రత అయిన స్త్రీ పాదపూజ చేసి ఈ లోకంలో నికృష్ట జీవితం అనుభ వించటమే కాక మరణించిన తరువాత కూడా సహగమనం చేయించటంతో స్త్రీలు ఈ మతోద్యమ మహాయజ్ఞానికి బలిపశువులయ్యారు. బలిపశువులు యూపస్థంభాలకు కట్టబడతాయి. ఈ పశువుల్ని మరణించిన భర్తి శవ పాడెకు బిగించి, బంధించి, లేక పెద్ద గొయ్యి తవ్వి దాంట్లో చితి ఏర్పాటు చేయించి (భార్య ఆ గొయ్యి ఎక్క లేదు కనుక) పెద్ద పెద్ద కట్టెలు ఆమెపై లేవకుండా పెట్టడం ద్వారా ఇది బలవన్మర ణాన్ని సూచిస్తుంది.

ఏది ఏమైనా ఈ సహగమనం ఐచ్ఛికంగా మాత్రం జరిగేది కాదని మనకు చరిత్రకారుల సాక్ష్యాలవల్ల తెలుస్తుంది. జీవించటం, మరణించటం అనేది ఆ భార్యా-భర్తలు ఈ లోకంలో మసలిన వారి అనుబంధాన్ని బట్టి వుంటుంది. భర్త మీద మమకారం అతడు మరణించిన తరువాత జీవించలేనని భావించిన స్త్రీ మరణిస్తే అది ఐచ్ఛికం అవుతుంది. ఈ వ్యవస్థను పరిశీలిస్తే ఇలాంటి సంఘటనలు మనకు తక్కువగా కన్పిస్తాయి.

సహగమనం గురించి చార్మితికవేత్తలు చెప్పే విషయాన్ని మనం తప్పకుండా అంగీకరించాలి.

"సహగమనం ఇచ్ఛాపూర్వకంగా జరుగుతున్నదనేది సగం మాత్రమే నిజమనీ, బ్రాహ్మణులు దానికి ముందు వీరిచేత ఏదో త్రాగించి అర్ధ ఉన్మాదావస్థకు తెస్తున్నారని" భౌరే చెప్పాడు.

ఆ దురదృష్టవంతురాళ్లు తమ పట్టు విడవకపోవడమే బ్రాహ్మణులకు కావలసింది. కాళ్ళకు, చేతులకు ఆభరణా లుంటాయి. ముక్కులకు, చెవులకూ, ఉంహాడు. మెళ్ళో ఉంటాయి వెండివో, బంగారానివో. బూడిద తీసే మిషతో ఆ వెండి బంగారాలను ఈ బ్రాహ్మణులు ఏరుకుంటారు అన్నాడు ట్రావెర్నియర్.

"సహగమనం చేయవలసిన స్త్రీకి బంధువులు ఉమ్మెత్తకాయ రసం తాగిస్తా రని, దాని ఫలితంగా ఆమె తెరువు మరుపులలో పడి విమూఢావస్థలో మంటలలో దూకేస్తుందని" అంటాడు ప్రయర్. [1]

---

1. ఆంధ్రుల సంస్కృతి – చరిత్ర పుట 309.

పై విషయాలన్నీ పరిశీలిస్తే సహగమనం ఇచ్ఛాపూర్వకం కాదని స్పష్టమౌతుంది. నయానో, భయానో ఈ ఉద్యమం జరుగుతూండేది.

"క్రీస్తు పూర్వము నాల్గవ శతాబ్ది నుంచి సహగమనాచారాన్ని గురించిన సాక్ష్యాలు దొరుకుతున్నాయి. గ్రీకులు మనదేశంలో ప్రవేశించినప్పుడు పంజాబులో సతీ సహగమనాచారం వున్నట్లుగా కనబడుతుంది. తక్షశిలలోని ప్రజలలో కూడా యీ ఆచారం వ్యాపించి వుంది. రావీ నదీతీరాన నివసిస్తున్న తెగలలో కూడా భర్త మరణానంతరం భార్య చితినెక్కడం జరిగేది. క్రీ. పూ. 316 లో యామినస్ నాయకత్వంలో ఇరాన్‌పైకి దండెత్తి వెళ్ళిన భారతీయ సైనికాధికారి ఒకరు దురదృష్టవశాత్తు యుద్ధంలో మరణించటం జరిగింది. అతనితో వచ్చిని ఇద్దరు భార్యలు సహగమనం చేయటానికి పోటీపడ్డారు. అందులో పెద్ద భార్య బాలింతరాలగుట వలన చిన్న భార్య అతనితో సహగమనం చేసింది. అగ్నిజ్వాలలు ఆమెను చుట్టుముట్టుతున్నప్పటికి కించిత్తయినా రోదన ధ్వని ఆమె పెదవులు దాటి బయటకు రాలేదని అరిస్టోబులస్ పేర్కొన్నాడు" [1]

కొన్ని కొన్ని సందర్భాలలో ఐచ్ఛికంగా సహగమనం జరగవచ్చు. మతం మీద నమ్మకం కావచ్చు. భర్త మీద అభిమానం కావచ్చు. సామాజిక జీవనంలో వితంతువుగా నికృష్టమైన జీవితం గడిపే కంటే ముత్తయిదువుగా మరణించటం మేలనే నిర్ణయం కావచ్చు

ఒక వీరుడు యుద్ధంలో మరణించగా అతని భార్య సతీ సహగమనం చేయటానికి రాజును అభ్యర్థిస్తుంది. రాజు ఆమెను జీవించవలసిందిగా కోరతాడు.

"ఆకులపాటు తోడ నశుభాకృతియై యొకవేళనైనబో
కాకును లేక సొమ్ములకు నట్టులు సొపక పేరటంబులం
బోక తొలంగి పూతలును బువ్వులు దూరముగాఁగ ముండయై
యే కడఁజేరిన న్విధవ కెగులెకాక తరింపవచ్చునే" [2]

---

1. సామాజిక పరిణామంలో స్త్రీ – పు. 60.
2. సింహాసన ద్వాత్రింశిక – 11–147.

భర్త మరణించిన తరువాత వితంతువులు తెల్లబట్టలు కట్టి ఒకపూట (ఒంటి పొద్దు) భోజనంతో చాపపై నిద్రించాలి. భోజనంలో ఉప్పు, కారం తగ్గించాలి. రుచికరమైన వంటకాలు తినకూడదు. కేశఖండనం చేయించుకోవాలి. కేశాలంకరణ, తాంబూల సేవనం, సువాసనాది తైల సంస్కారం, పూలు, నగలు, రంగు రంగుల వస్త్రాలు, శరీరానికి మైపూత, కళ్ళకు కాటుక వదలివేయాలి. ఇంద్రియ నిగ్రహం కలిగి వుండాలి. భగవన్నామ సంకీర్తనలో గాని భర్త నామధేయాన్ని స్మరిస్తూ శేషజీవితం గడపాల్సిన అవసరం వుండేది. అందుచేత ఈ జీవితం కంటె మరణించడమే మేలనే నిర్ణయానికి రావచ్చు

"చచ్చియు చావక లసదా
హెచ్చుచు నియమముల నింక విధవాత్వము స
న్నిచ్చలు మానుటకంటెను
జిచ్చుచుకుట మేలు సతికి క్షితి మెచ్చంగన్" [1]

సహగమన కార్యక్రమానికి ముందు ఆ స్త్రీలకు ఉమ్మెత్తకాయ రసం, లేక గాఢమైన మత్తుపదార్థం యిస్తారు. దీన్ని సేవించటం చేత ఆమె ఉన్మాదావస్థకు లోనవటం జరుగుతుంది.

దీనిని గురించి శరత్‌చంద్ ఈ విధంగా చెప్తారు. "శ్మశానానికి పోయే ముందు ఆమె కొంచెము సేపు నవ్వుతుంది, ఏడుస్తుంది, ఒక్కొక్కప్పుడు దారిలో పడి పొర్లాడుతుంది. చితి మీద కూర్చోబెట్టిన తరువాత పెద్ద బరువైన పచ్చికొయ్యను ఆమె పైన వుంచుతారు. ఒకవేళ అగ్నిబాధను సహించలేక లేచి వస్తుందేమోనని బాగా ఊక, నెయ్యిపోసి పొగను కల్పించుతారు. ఏడ్చినా వినబడకుండా వుండ టానికి శంఖాలు, తప్పెటలు, వాద్యాలు ఆకాశం బద్దలయ్యేట్టుగా ప్రయోగించుతారు."

ఈ సహగమన కార్యక్రమం ఎలా అమలు జరుపుతారు?

"సహగమనం చేసే స్త్రీ స్నానం చేసి పెళ్ళికూతురులా అలంకరించు కుంటుంది. ఇంటిలో నుంచి వెళ్ళబోయే ముందు ఆమె అరచేతులకు నెయ్యి రాసు కొని ఇంటి ముందు ముద్రలు వేస్తుంది. ఈ ముద్రలు వాటంతటవే ప్రజ్వలిస్తాయని

1. సింహాసన ద్వాత్రింశిక 11-148.

నమ్ముతారు. శ్మశానానికి వెళ్ళి దైవనామం జపిస్తూ చితి చుట్టూ మూడుసార్లు ప్రదక్షిణం చేస్తుంది. తరువాత చితినెక్కి భర్త శిరస్సు తన ఒడిలో వుంచు కుంటుంది. చితికి నిప్పు ముట్టించిన తరువాత మౌనం వహిస్తుంది. అగ్నిజ్వాలలు ఆమెను చుట్టుముట్టిన సమయంలో దివ్యదృష్టి కలుగుతుందని వరాలను ప్రసాదించ గలదని భావించటం జరుగుతుంది.[1]

ఈ సహగమనం ఆచారం లేక నమ్మకంగా ఎలా ఏర్పడింది.

సతీ సహగమనాచారం వేదకాలంలో బీజరూపంగా కన్పిస్తుంది. "ఓ నారీ! చనిపోయిన నీ భర్త వద్ద పరుండి యున్నావు. ఇచట నుండి లెమ్ము. బ్రతికియున్న వారి కడకు రమ్ము. నీ పాణిని గ్రహించి నిన్ను వివాహం చేసుకొనగోరిన వానిలో నీవు భార్యాత్వమును పొందుము.[2]

భర్త మరణించినప్పుడు అతని శవం ప్రక్కన భార్యను పరుండబెట్టి పై మంత్రం చదివి తిరిగి లేపటం జరిగేది. కాని తరువాత కాలంలో తిరిగి లేపటానికి బదులు నిజంగానే భర్తతోపాటు కాల్చివేయటం ఆచారంగా స్థిరపడింది. ముఖ్యంగా అగ్రవర్ణాలలో ఈ ఆచారం ఎక్కువగా వ్యాప్తి చెందింది. దీనికి కారణం స్త్రీ ఆర్థిక విధానంలో పురుషుడికి లోబడి వుండటమే. కాయకష్టం చేసి జీవించే జాతుల్లో శ్రమశక్తి ఇరువురికి విభజించబడుతుంది. ఆదాయం ఇద్దరికి వుంటుంది. స్త్రీకి స్వతంత్రశక్తికి అవకాశం వుంది. అగ్రవర్ణాల్లో ఆదాయం పురుషులకే పరిమితం. అందుచేత తనపై ఆధారపడి జీవించే స్త్రీపై పురుషుడికి సర్వాధికారాలు దత్తమై నాయి. చనిపోయిన తరువాత తన భార్య స్వతంత్రించి తమ కులగోత్రాలకు వంశాలకు అపఖ్యాతి తెస్తుందనే భయంతో ఈ వ్యవస్థ వారు ప్రారంభించారు. భార్య అనబడే వస్తువు భర్త మరణించిన తరువాత నియమాలు విధించాలన్నా, అమలు జరపాలన్నా అసాధ్యం. దీనికి పరిపుష్టి ఇచ్చేది సహగమనం మాత్రమే.

---

1. సామాజిక పరిణామంలో స్త్రీ – పు. 65.
2. ఋగ్వేదం 10–18–8.

**చరిత్రలలో సహగమనం :**

హర్ష చరిత్రలో ప్రభాకర వర్ధనుని భార్య సహగమనం చేయటం జరిగింది. క్రీ. శ. 507 లో ధర్మదేవుని భార్య రాజ్యవతి సహగమనం చేసినట్లుగానే హెరా శాసనం తెలుపుతుంది. హర్షుడు తన సోదరి అయిన రాజ్యశ్రీ సహగమనం చేయ బోతుండగా రక్షించినట్లు చరిత్రకారులు భావించారు.

సతీసహగమనాన్ని నివారించటానికి జరిగిన ప్రయత్నాలు.

బౌద్ధమతం, జైనమతం సహగమనాన్ని వ్యతిరేకించాయి. సంస్కృత కవులైన బాణుడు, మేధాతిథి, దేవన్‌భట్టు సహగమనాన్ని వ్యతిరేకించారు. 15 వ శతాబ్దంలో కాశ్మీరును రాజ్యమేలిన సికిందర్ సహగమనాన్ని నిషేధించాడు. అల్లాఉద్దీన్ ఖిల్జీ, మహమ్మద్ బీన్ తుగ్లక్‌లు దీనిని చట్టబద్ధంగా వ్యతిరేకించారు. మొగలాయి చక్రవర్తులయిన అక్బర్, జహంగీర్ నిషేధించారు. ఔరంగజేబు సతీసహగమనం నేరంగా పరిగణించి ప్రోత్సహించినవారికి శిక్షలు విధించాడు. పీష్వా బాజీరావు, ఛత్రపతి శివాజీ సహగమనాన్ని రూపుమాపటానికి ప్రయత్నించారు

ఎవరు ఎన్ని రకాలుగా ప్రయత్నించినా సమగ్రంగా నాశనం చేయలేక పోయారు. ఆంగ్లేయులు ఈ దేశాన్ని పూర్తిగా హస్తగతం చేసుకున్న తరువాత మాత్రమే ఈ వ్యవస్థకు చివరి మజిలీ ఏర్పడింది. రాజారామమోహనరాయ్ నాయకత్వంలో ఉవ్వెత్తున లేచిన సతీసహగమన వ్యతిరేక ఉద్యమం లార్డ్ బెంటింగ్ సహాయ సహకారాలతో మాత్రమే సహగమన వ్యవస్థకు శాసనం ఏర్పడి గోరీకట్టటం జరిగింది.

అయితే కొందరు మతోన్మాదులు అక్కడక్కడా ఇంకా సహగమనాన్ని ప్రోత్సహిస్తున్నారని, సహగమనాలు జరుగుతున్నాయని మనం అప్పుడప్పుడు పత్రికాముఖంగా చూస్తూనే వున్నాం రాజస్థాన్‌లోని దేవరాల అనే గ్రామంలో రూప్‌కన్వార్ అనే యువతిని తన భర్త శవంతోపాటు బలవంతంగా సహగమనం చేయించారు. కేంద్ర, రాష్ట్రప్రభుత్వాలు ఈ విషయాన్ని ధృవీకరించగలిగారే గాని ఆయా వ్యక్తులపై గాని, సంస్థలపై గాని చర్య తీసుకున్న దాఖలాలు ఇంత వరకూ లేవు. రాజకీయపార్టీలు కూడా తమ ఓట్ల బ్యాంకులకు ఎక్కడ చిల్లులు పడతాయోనని కిమ్మనలేరు. ప్రభుత్వం ఇటువంటి పైశాచిక వ్యవస్థను సమూలంగా నాశనం చేసిననాడు ఈ మూఢనమ్మకం నామరూపాల్లేకుండా పోతుంది.

# 5. వ్యభిచారం

వ్యభిచారం అంటే తప్పి చరించటం లేక రంకు చేయటం. ఇది స్త్రీ-పురుష సంగమానికి సంబంధించిన విషయం చట్టబద్ధం కాకుండా అన్యాక్రాంతంగా స్త్రీ పురుషులు చేసే లైంగిక కార్యక్రమానికే వ్యభిచారం అని పేరు. ఈ వ్యభిచారం స్త్రీ పురుషులు ఇద్దరికీ సంబంధించిన వ్యవహారం. అయితే మనలో పాతుకు పోయిన సమ్మకాల్లో యీ పనిలో అపనింద అంతా ఆడవాళ్ళదే. మగవాళ్ళకేమీ ఇందులో నిందతో పని లేదు ఆడవాళ్ళమీద మగవాడికి గల హక్కు లేక అధికారం దీనికి కారణం దీన్ని సమాజం ప్రధాన విషయంగా అంగీకరించింది. ఇందులో అసహ్యించుకొనేది స్త్రీని మాత్రమే.

ఈ వ్యభిచారం అసలు ఎలా ఏర్పడింది ?

"నేడు దశావతారాల్లో పరిణామవాదాన్ని, అధర్వణ వేదంలో యంత్ర జ్ఞానాన్ని చూస్తున్న ఛాందసుల పూర్వీకులు తమ భార్యలకు వ్రతాలు, ఉపవాసాలు, యింటి చాకిరీ విధించటంతో వారిలో అందం ఆకర్షణ కొరవడగా ఈ కొరతను తీర్చుకోవడానికి, అన్నట్లు ప్రత్యేకంగా ఒక కులాన్ని ఏర్పరచి దానిలోని స్త్రీలను వివాహమాడరాదని వ్యభిచారమే ధర్మంగా భావించి జీవించాలని శాసించినట్లు కనబడుతుంది. స్వర్గలోక (ఊర్వశి, రంభ, మేనకాదులు) సౌఖ్యాల కోసం చేసే యాగాదుల్లో సహకరించటానికి భార్య, ఇహలోక సౌఖ్యా లనుభవించటానికి జరిపే మదన యజ్ఞమందు ఉపకరించటానికి వేశ్య అంటూ విభాగాలు చేసారు. [1]

సమాజంలో కొందరు స్త్రీలను ఒక వర్గంగా విభజించి వారికి వేశ్య, దేవదాసి, బసివి, భగవత్ సేవకి, పార్వతి అనే పేర్లతో పిలిచారు. వారిని తమ సంగమానికి వినియోగించుకున్నారు.

"దేవదాసీలు పెండ్లి చేసుకోకూడదు. ఆ విధంగా ఆనాటి సంఘం కట్టుబాట్లు చేసింది. కనుక ఈ దేవదాసీలతో జతకట్టటం రంకుగా ఎంచబడేది కాదు. ఎందు

---

1. సామాజిక పరిణామంలో స్త్రీ – పు 69.

కనగా కామేచ్ఛ గలవారితో జతకట్టి వారిని తృప్తిపరచటానికే ఈ దేవదాసి కులం పుట్టించబడిందని, కామేచ్ఛ గలవారితో జత కట్టడం వారి ముఖ్యకర్తవ్యమని శాస్త్రాలలో వ్రాయబడింది." [1]

కొంతకాలం గడిచేటప్పటికి వీరు ఒక వర్ణం లేక ఒక కులంగా ఏర్పడటం జరిగింది. వీరిలో కొందరికి గౌరవ ప్రపత్తులు కూడా వుండేవి.

"పెళ్ళి కూడా చేసుకోకుండా జీవితకాలమంతా దేవాలయంలోనే బూతు పనులతో దేవతారాధన చెయ్యాలని నిశ్చయించుకున్న స్త్రీలు కూడా వుండేవారు. వారి జీవితకాలాన్నంతా భగవత్ సేవకోసం సమర్పించిన ఈ ఆడవాళ్ళు ఆ రోజుల్లో గౌరవపాత్రులు. ఈ వృత్తిలో ఆర్జించిన తృణమో, పణమో వీరు దేవాలయాలకే దానం చేసేవారు. ఈ విధంగా దేవాలయాలకి తమ సర్వస్వం ధారపోసినవారు దేవదాసీ లయ్యారు. అలా గుడిలోనే సర్వకాలమూ ఉండి ఈ పనులు సాగిస్తూ ఉండే స్త్రీ గుడిచేటి అయింది." [2]

ఒక్కొక్క ప్రాంతంలో ఒక్కొక్క విధమైన మూఢనమ్మకాల ప్రభావంతో ఈ వ్యభిచార విధానం వేళ్ళు తొడిగింది. పుత్రసంతానం లేనివారి తమకున్న పుత్రికల్ని దేవాలయాలకు అంకితం చేస్తే పుత్రసంతానం కలుగుతుందనే నమ్మకం వ్యాపించింది.

"బళ్ళారి జిల్లాలోనూ దాని నానుకున్న ధార్వార్, మైసూర్ ప్రాంతాల్లోనూ బోయలూ, బేండర్లు యిత్యాది కులాల్లో ఎవరికైనా పుత్రసంతానం లేకపోతే కూతుళ్ళలో ఒకరిని పసివిగా అర్పించి దేవునికి అంకితం చేసేవారు. ఈ కన్యను ఆలయానికి తీసుకువెళ్ళి గుడిలో దేవుడికి పెళ్ళిచేసి ఆమె మెడలో తాళి కట్టి కాళ్ళకు మట్టెలు పెట్టేవారు దేవునికి పెళ్ళి చేయబడిన ఈమె నాటినుండి వూరి వారందరికీ సామూహికమైన వుంపుడుకత్తెగా మారేది." [3]

---

1. పెళ్ళెందుకు – పు. 39
2. దేవాలయాలమీద బూతుబొమ్మ లెందుకు – పు. 37.
3. ఆంధ్రలో సాంఘిక తిరుగుబాటు వుద్యమాలు – పు. 63

వ్యభిచారుల్లో పురుష వ్యభిచారులు కూడా వుంటారు. వీరు తమ పురుష శక్తిని భగవంతునికి అర్పణం చేయటం వంటివి చేస్తారు. తమ మర్మాంగాల్ని ఛేదించుకోవడం, తమ మర్మావయాల్ని పీడనద్వారా ఇంద్రియశక్తిని ధారపోయటం జరుగుతుంది. వీరు దేవాలయాల్ని అంటిపెట్టుకొని జీవిస్తుంటారు. వీరిని కొన్ని ప్రాంతాల్లో గణాచారులని, కొన్ని ప్రాంతాలలో పోతురాజులని పిలవడం కద్దు. వీరు జాతర్ల ఉత్సవాల సమయాల్లో ప్రత్యేకమైన కర్మకాండను నిర్వహిస్తారు.

"పురుషులు నిషావస్తువులు తిని పదేపదే స్త్రీ సంగమం చేసి చేసి నిర్వీర్యులై పోతారు. ఒక్కొక్క దినానికి అనేకసార్లు చొప్పున ఇలా చేయటంవల్ల కొన్ని రోజులలో ఈ మహాభక్తుడు పురుషత్వం లేనివాడైపోతాడు.

ఇంకొక రకం, స్త్రీ ఆవశ్యకత లేకుండానే అవయవ పీడనంవల్ల గూడ ఈ మహాఫలితాన్ని పొంది పురుషత్వం మహార్పణ చేస్తారు ఒక్కొ రోజుకు దాదాపు నలభైసార్లు అవయవ పీడనం చేసి సర్వశక్తులనీ సన్యసించిన భక్తులుండే వారు. అలా చేసినందువల్ల మరి ఎన్నడూ వారు పురుష వ్యాపారానికి పనికి రాకుండా పోయేవాళ్ళు". [1]

తెలంగాణాలో (ఖమ్మంజిల్లా, కొత్తగూడెం తాలూకాలోని కొన్ని గ్రామాల్లో) జంతువులచేత వ్యభిచార కార్యక్రమాలు చేయించుతారు ఉత్సవ సమయాల్లో గొర్రె-గొర్రెపోతులను సింగారించుతారు. ఆవు - ఎద్దులను అలంకరించుతారు. పెంపుడు పావురాలను అలంకరించి వాటిచేత సంగమ కార్యక్రమం చేయించుతారు. అయితే జంతువులు అన్ని సమయాలలో సంగమ కార్యక్రమం చెయిలేవు గదా! అందుచేత పరువానికి దగ్గరలో వున్న జంతువులను మాత్రమే ఈ సంగమ కార్యక్రమానికి ఉపయోగిస్తారు. ఆ విధంగా సంగమిస్తే ఆ గ్రామానికి శుభం కలుగుతుందనే నమ్మకం ఈ ప్రాంతంలో వుంది.

కొన్నిచోట్ల మనుష్యులు బూతుపని చెయ్యటానికి బదులు కోళ్ళచేత ఉత్సవంలో ఈ పనులు చేయించేవారు. ఆ బూతుపని చేసిన తరువాత ఆ కోళ్ళను బలి యిచ్చి చంపి తినేవాళ్ళు.

---

1. దేవాలయాలమీద బూతుబొమ్మ లెందుకు – పు. ౫౨.

"ఒక తెల్లని కోడిపుంజును తెస్తారు. అది సూర్యభగవానుడు. ఒక నల్లని పెట్టను తెస్తారు. అది భూదేవి. ఆ రెంటికి పసుపు, కుంకుమ, పువ్వులూ అన్నీ పెట్టి అలంకరిస్తారు. ఆ రెండూ సంగమిస్తుంటే చూసి భక్తితో నమస్కారాలు చేస్తారు. తరువాత వాటిని చంపుతారు. ఆ కోళ్ళ సంగమాన్నిబట్టి తమకు రాబోయే సంవత్సరం సుఖంగా వుంటుందో, కష్టాలతో నిండివుంటుందో తెలుసుకుంటారు. [1]

ఈ విషయంలో మనవారికి అనేకమైన నమ్మకాలు ఉన్నాయి. వ్యభిచరించిన స్త్రీకి ముక్కూ - చెవులు కత్తిరించవలెనట.

ఒక గ్రామంలో ఒక తంతు వాయుడున్నాడు. అతని భార్య వ్యభిచారిణి. తన భర్త ఇంటలేని సమయం చూసి ఉప భర్తతో రతిక్రీడ తేలుచుండేది. ఆమెకు ఒక దూతిక సహాయకారిణిగా ఉండేది. తంతువాయుడు ఆమె పర పురుషుని కలియటానికి సిద్ధం అయినదని తెలిసికొని కాలు చేతులు బంధించి ఒక చీకటి గదిలో ఉంచాడు. ఇంతలో దూతిక అచటికి వచ్చి ఆమె కట్లు విప్పి, తాను బందీయై తంతువాయుని భార్యవలె నటిస్తుంది. తంతువాయుడు వచ్చి దూతికను తన భార్య అని తలంచి వ్యభిచారం చేయనని ప్రమాణం చేయవలసిందిగా ప్రాధేయపడతాడు. పలికితే కంఠస్వరాన్ని గుర్తించి తన్ను గమనిస్తాడని భావించి దూతిక కిమ్మన లేదు.

"ఆ తంతువాయు డంత సముద్ధితుండై యిద్దురాత్మిక నాకుం బ్రమాణంబు సేయుమనిన బలుక కూరకున్నయది యిట్టి దౌర్త్యం బింకను జేయ తలంపు గావలెనని యగ్గలంపుఁ గోపంబున దిగ్గునలేచి తీక్ష్ణ శస్త్రికం గొని యా దూతిక నాసికా చ్ఛేదంబుజేసి క్రమ్మఱ శయ్యాతలంబునకుం జని నిద్రించు సమయంబునఁ దంతువాయు కాంతయు ఏకాంతునితో నలరువిల్తు కేళింగలసి వేగంబువాని వీడ్కొని యంతంత నాలకింపుచు జనుదెంచి దూతికం గదిసె" [2]

వ్యభిచరించిన స్త్రీ సిగ తరగాలనే నమ్మకం మన సమాజంలో వ్యాపించి వుంది. సిగ స్త్రీకి అందమైన అలంకరణ అవయవాల్లో భాగం. కురూపి అయిన స్త్రీ వైపు పురుషులు కన్నెత్తి చూడరు అనే నమ్మకమే దీనికి కారణం

---

1. దేవాలయాలమీద బూతుబొమ్మ లెందుకు - పు 101.
2. పంచతంత్రము 1-186.

పద్మావతీపురంలో సువేషుడు అనే వైశ్యునికి సుమతి అనే భార్య ఉండేది. ఆమె వ్యభిచారిణి. అవకాశం లభించినప్పుడు తమ ఇంటిలో పనిచేస్తున్న గణనాథుడు అనే జానిసతో కలిసి రతికేళి తేలుతుండేది. ఆమెకు మరొక ఉపపతి ధవళాఖ్యుడనే రాజకుమారుడు. ఒకరోజు సువేషుడు గ్రామాంతరానికి వెళ్ళగా సుమతి గణనాథునితో సురతి క్రీడలో మునిగి ఉంటుంది. ఆమెను కవయకోరి ధవళాఖ్యుడు వస్తాడు. రాజకుమారుడు వచ్చి చూడగా వారు తన్మయ పారవశ్యంలో ఉంటారు. అప్పుడు కోపించిన ధవళాఖ్యుడు ఆమె సిగ తరిగివేస్తాడు.

పెడిదపు టడిదము గొని
జడగోసి యతండు వేగ జనియె లతాంగే [1]

అసలు వ్యభిచారం అనేది స్త్రీ పురుషుల కోరికకు సంబంధించినది. కాని అనాదిగా దీనికి స్త్రీయే మూలం అనే నమ్మకం వ్యాపించి వుంది. కౌటిల్యుడు - మనువులాంటి ధర్మశాస్త్రవేత్తలు ఈ వ్యవస్థను స్త్రీలకే అంటగట్టి వేశ్యా వ్యభిచారాన్ని ప్రోత్సహించారు. పురుషుని కామానికి సమిధగా మారేది స్త్రీ మాత్రమే. కానీ స్త్రీకి గౌరవ ప్రపత్తులు లోపించాయి. పెట్టుబడిదారీ సమాజంలో ఆస్తిహక్కు-ధనం పురుషుడి చేతిలో కేంద్రీకరించబడటమే దీనికి కారణం. సమాజంలో స్త్రీకి గల స్థానం దిగజార్చబడింది. నేడు ఆకలే వ్యభిచారానికి మూలకారణం అనే అంశాన్ని శాస్త్రవేత్తలందరూ అంగీకరిస్తున్నారు. అన్నిచోట్ల స్త్రీల మానభంగాలు, అత్యాచారాలే. బలవంతంగా మానభంగానికి గురైన స్త్రీని కూడా సమతా దృష్టితో సమాజం అర్థం చేసుకునే దశ పెరగాలి. అవమానాలకు, అన్యాయాలకు గురవుతున్నది స్త్రీలే. ఈ వ్యవస్థ మానవతా దృక్పథంతో పరిశీలించి ప్రతి వ్యక్తి ఈ వ్యభిచారాన్ని రూపుమాపాల్సిన అవసరం ఎంతైనా వుంది.

ఆంధ్రప్రదేశ్ గవర్నర్ శ్రీమతి కుముద్‌బెన్‌జోషి గారు తెలుగునాట జోగినీ వ్యవస్థను చూసి మానసిక ఆవేదనకు గురై వారి సముద్ధరణకు చేపిన ప్రయత్నం హర్షించదగింది. ఆమె తమ ఆధిపత్యంలో ఇద్దరు జోగినులకు (ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం) తన గవర్నర్ బంగ్లాలో వివాహాలు జరిపించి వారికి మరో జన్మ ప్రసాదించారు.

---

1. శుకసప్తతి - 2-223.

ఏవో కొన్ని కులాలకో లేక వర్ణాలకో ఈ వ్యభిచారం పరిమితం అనే మూఢనమ్మకాన్ని విస్మరించాలి. అధోగతికి దిగజార్చి వేయబడుతున్న ఆ మహిళలకు చక్కని స్థాయి కల్పించాల్సిన అవసరం ఎంతైనా ఉంది. ప్రభుత్వం వీరికి తగిన వసతి సౌకర్యాలు కలిగించటమే కాక వారికి గౌరవప్రదమైన వృత్తుల్ని కల్పించి, సభ్య సమాజంలో వారిని నాగరికంగా జీవించే దశకు పెంచాలి.

# 6. వితంతువులపై దాడి

భర్త మరణించిన స్త్రీని విధవ అని, వితంతువు అని వ్యవహరిస్తారు. హైందవ ధర్మశాస్త్ర నిర్ణయం ప్రకారం కన్యలకు అనగా అతిచిన్న వయస్సులో వున్న పిల్లలకు వివాహాలు చేసేవారు. ఆమె భర్త మరణిస్తే విధవ అని వితంతువు అనే పేర్లలో పిలిచి, వారిని అనేక కష్టనష్టాలకు గురిచేసేవారు. వారికి పునర్వివాహం కాని సమాజంలో గౌరవ ప్రపత్తులు గాని వుండేవి కావు.

“ఒక పురుషుడు తన జీవితకాలములో నెంతమంది భార్యలనైననూ చేసుకొనవచ్చు. ఒక స్త్రీ పసితనములో భర్త పోయినను యావజ్జీవమును మరల వివాహము చేసికోకూడదు. కామముడిగి కాటికి కాళ్ళు చాచుకొని యున్న ముసలి వానికి సహితము భాగ్య హీనురాలయిన మూడేండ్ల పసికూనను వివాహమాడి యావజ్జీవముచు దాని కొంపదీసి హింసింప ననుజ్ఞ యిచ్చి మూడేండ్ల ముద్దరాలికి మగడు పోయినను బ్రతికి యున్నంత కాలమును వివాహము లేక రూపమును యౌవనము నడవి గాచిన వెన్నెలకాగా ప్రాణమున్నంతకాలము దుఃఖపడవలెనని నిర్బంధించుట యేమి న్యాయము.” [1]

బాల్య వివాహాలు చేయటం ద్వారా యుక్త వయసు వచ్చే సమయానికి వృద్ధుడైన ఆ పెండ్లికొడుకు మరణించడంతో ఆమె జీవితమంతా వైధవ్యంలోనే గడచిపోతుంది. వారెంత ధనవంతులైనప్పటికి మాంగల్య రహితులై నిరాసక్తమైన జీవితం గడపవలసి వుండేది.

---

1. స్త్రీ పునర్వివాహ విషయకోపన్యాసము – పు. 41.

"పతి హీనులైన భామిను
లతి ధనవంతులయ్యుఁ గులజలయ్యును సలం
కృతలయ్యెడు మాంగల్య ర
హితలయ్యెడుఁ గృపణవృత్తి నిడియు మొదలగున్" 1

"భర్త చనిపోయిన తరువాత పతివ్రతయైన స్త్రీ పరిశుద్ధ మైన మనసుతో కందమూల ఫలాలతో దేహాన్ని కృశింపజేయడమే గాక పర పురుషుని పేరుకు కూడా ఉచ్చరించరాదు." 2

భర్త మరణించిన స్త్రీలు అలంకారరహితులై నిరాడంబర జీవితాన్ని గడప వలసి వుంటుంది.

"భర్త మరణించిన తరువాత స్త్రీలు తెల్లబట్టలు కట్టి ఒకపూట భోజనంతో క్రింద పడుకోవాలి కేశాలంకరణ, తాంబూలం, సువాసన తైలములు, పూలు, నగలు, రంగుల దుస్తులు, కంచు పాత్రలో భుజించుట, రోజుకు రెండు పూటల భోజనం స్వీకరించుట, కళ్ళకు కాటుకను పీడ వదలివేయాలి. తెల్లబట్టలు కట్టుకొని ఇంద్రియ నిగ్రహం కలిగి యుండాలి. సోమరితనం పెంచుకొని పగటిపూట నిద్రించ రాదు. రాత్రి సమయంలో నేల మీద దర్భలతో తయారుచేసిన చాపపైన శయ నించాలి." 3

"విధవరాలి కన్న అశుభమైనది లేదని, ఆమె చూపుబడితే ఏ పని జరగదని స్కాంద పురాణము చెపుతున్నది. విధవరాలి దీవెనలు విషంతో సమానమని కాశీ ఖండం చెపుతుంది. అంతేగాక విధవరాలు మంచం మీద శయనిస్తే భర్త నరకంలో కూలతాడని బోధిస్తుంది." 4

---

1. ఆంధ్ర మహాభారతము – ఆదిపర్వము 4–230.
2. మనుస్మృతి – 5–157.
3. వృద్ధ హారీత స్మృతి 11–205 to 210.
4. సామాజిక పరిణామంలో స్త్రీ – పు. 59.

భర్త పోయిన తరువాత ఈ సమాజం ఆమెను రకరకాల మానసిక హింస లకు గురి చేసింది.

"పతి పోయిన యుత్తర క్షణము నుండి నొసటి కుంకుమబొట్టు పొయిలోని బూడిదగా మాఱుచున్నది. చేతుల బంగారు కంకణములు రాగి పట్టెలుగా మాఱు చున్నవి. మెడలోని ముత్యాల హారములు తులసి పూసల పేరులుగా మాఱుచున్నవి.

అమూల్యములయిన సరిగంచు పట్టు చీరలంచులేని పనికిమాలిన ముది గుడ్డలుగ మాఱుచున్నవి. పట్టె మంచముల మీద మెత్తని పఱుపులు కటిక నేలన తాటిచాపలుగా మాఱుచున్నవి. పిండివంటలలోడి షడ్రసోపేతము లుప్పిడి పిండిగా మాఱుచున్నవి మనుష్యులు నడుమ యలంకారములను మ్రాలమే కాక భగవంతుడు పుట్టుకలోనే దయచేసిన నల్లని నిడుద శిరోజములనెడి యమూల్యాలంకారములను గూడ దీసివేయించుట సుందరుల కెంత సంతాపకరముగా నుండును? చిన్నప్పటి నుండి చమురురాచి పెంచుకొని నిత్యము దువ్వుకొనుచు పువ్వులు ముడుచుకొనుచు ప్రాణముతో సమానముగా జూచుకొనుచున్న తలవెంట్రుకలను మంగలివానికఱకు కత్తుల కొప్పగించుటకంటె మాసవతుల కొక్కసారిగా తల కొట్టివేయుటయే యుత్త మముగా తోచదా! గత దినమువరకును మూడు పూటలును కడుపునిండ సుఖ భోజనము చేయుదానిని ప్రాణము శోషిల్లునట్లుగా మూసుర్భూముల కిన్ని మెతుకులు వేసి మాడ్చి జీవచ్ఛవముగా నుంచుట ఎంత దుఃఖకరముగా నుండును? పెండ్లి దినములలో తప్ప మంగళసూత్రం కట్టినవాని మొగ మెప్పుడును మరల జూడక పోయినను లోకులు భర్తయని పిలుచువాడు కాలధర్మము నొందినంత మాత్రముచేత తైలాభ్యంజనాది సమస్త భోగములను మానిపించి పసిబాలికను సహితము సమస్త సుఖములకును దూరముజేయుట ఎంత పరితాపకరము?[1]

వితంతువులు బ్రతికినంతకాలం ఆహార నిద్రాదులు త్యజించి జితేంద్రియలై వుండవలెనట.

---

1. స్త్రీ పునర్వివాహ విషయక ప్రథమ విజ్ఞాపనము పుట. 84

కురుక్షేత్ర యుద్ధానంతరం వ్యాసుడు యుధిష్ఠిరునకి వితంతు నియమాల్ని వివరిస్తాడు.

"రాజా ! వితంతువు ఉపవాసాది నియమాలతో తన శరీరం శుష్కింపజేసు కోవాలి. మనో నిగ్రహం నిస్సందేహంగా పాటించాలి". [1]

కపిల మహాముని స్మృతి ప్రకారం,

"భర్త కాలముచేసిన యెడల పెరుగు త్రాగకూడదు పాలు త్రాగకూడదు. సుగంధము దరికి చేరనీయకూడదు మంచిబట్ట కట్టుకోకూడదు. అలంకారము కూడదు. పాట వినకూడదు. తాంబూలము వేసికొన కూడదు. కాటుక పెట్టుకొన రాదు. పుష్పములను దగ్గరకు రానీయరాదు మంచము, పరుపు మొదలైనవాని మీద పరుండగూడదు శరీరమునకు నలుగుపెట్టుకోరాదు తల యంటుకోరాదు. వేడినీళ్ళు పోసుకోరాదు పల్లకి, బండి మొదలైనవి యెక్కకూడదు. ఇటువంటి ఇతరములైన సమస్త వస్తువులను కోరరాదు. ఒకరిమీద దయచూపరాదు. కోపపడకూడదు. పుణ్య కార్యములు చేయకూడదు. శుభకార్యములు చేయకూడదు. ఈ కార్యములలో నేవి చేసినను తల్లిదండ్రులచేతను, బంధువుల చేతను దెబ్బలు తినవలెను. ఉప్పు తిన కూడదు. పప్పులు తినకూడదు. ఒగరును, చేదును, కారమును మాత్రమే తినవలెను. అరువది సంవత్సరములు వచ్చువరకు నొక్కపూట సగము తిండి తినవలెను. ఇవిగాక "రండాపాకం సదా త్యాజ్యం ప్రవదంతి మనీషిణః" శ్రాద్ధముల యందును, శుభకార్యముల యందును విధవ చేసిన పాకము నెవ్వరు భుజింపరాదు. లోకములో నాడు పుట్టుక పుట్టి మగనిని బోగొట్టుకొని కలకాలము నిటువంటి బాధలు పడుచుండుటకంటె నొక్కసారిగా మరణము నొందుట యెంత హాయిగా నుండును".[2]

నిర్బంధంగా వైధవ్యం అనుభవించటంకంటె మరణించటం మేలనే అభి ప్రాయం నాటి విధవలకు ఉండేదట. జీవచ్ఛవంగా బ్రతకడంకంటె అగ్నిలోబడి మరణించినట్లయిన జీవిత సమస్యలు ఒక్కసారితో పోతాయని భావించటం న్యాయం కదా !

---

1. జైమిని భారతం పుట. 45
2. స్త్రీ పునర్వివాహ విషయకోపన్యాసము పుట 37

"నేటి కించుమించు తొంబది సంవత్సరములకు ముందు శ్రీ విక్టోరియా మహారాణివారి యేలుబడి కాలమున సతీ శాసనము నెలకొల్పబడినది. దాని నుద్ధరించిన ప్రయోజకులు శ్రీ రాజా రామమోహనరాయలు. అపుడు సహగమనాచారము నిలిచి పోయినది. అంతకు ముందులేని ఇక్కట్టు హిందూ బాలవితంతువులకు గలిగినది. నిర్బంధ వైధవ్య మనుభవించుటకంటె నగ్నిలోబడి మరణించుట మేలని భావించ బడెను". [1]

వితంతువులు అశుభానికి ప్రతీకలుగా గుర్తించబడ్డారు. తలచెడి యింటిలో వున్న వితంతువును దుశ్శకునంగా భావించడం, వారిని అగౌరవంగా చూడటం, వారిని దుఃఖాలపాలు చెయ్యటం నిత్య కృత్యం.

"ఇంట నెవ్వరికే విపత్తు సంభవించినను విధవలే దానికి కారణమగుదురు. వీధిలోనికి ప్రయాణమైనప్పుడు విధవ ముఖము కనబడినను, విధవ ఎదురుగా వచ్చినను దుశ్శకునమైనదని యెల్లవారును చెడదిట్టుదురు. ఎంతో ప్రేమతో చూచు చుండు సోదరులు సహితము నిద్రలేచిన తోడనే విధవ లోడబుట్టిన పడపు కనబడిన పక్షమునను ప్రొద్దుననే లేచి విధవముండ ముఖము చూచితిని నేడేమి కీడు మూడునో యని చిరాకు పడుచుందురు. వారిని చూచినవారందరును వారెంతో పాపముచేసిన వారినిగా భావింతురు. ఈ నిర్భాగ్యురాలు భార్యయయి మగనిని చంపినదని దూషింతురు. ఆహా ! ఈ లోకములో విధవలకు సుఖమన్న మాటయే యుండక వారి జీవనమే నిరర్థకమై వారు బ్రతికియుండియు చచ్చినవారితో సమానులుగానే యుందురు గదా !" [2]

ఇటువంటి మానసిక బాధలు పడలేక కోపోద్రేకాలలో ఏ నూతిలోనో, గోతిలోనోపడి ఆత్మహత్యలు చేసుకొనే వితంతువులు కొందరయితే, మానసిక భావోద్రేకానికి తట్టుకోలేక శారీరక, కామోద్రేకాన్ని అణచుకోలేక, విశృంఖలంగా ప్రవర్తించి, సమాజంలో చీడపురుగులుగా పరిగణించబడ్డ వితంతువులు మరి కొందరు.

---

1. శ్రీకృష్ణరాయాభ్యుదయ సంచిక పుట. 57
2. శ్రీ పునర్వివాహ విషయకోపన్యాసము పుట. 39

"కొందరు విధవ లింటగల నిర్బంధములకు కట్టుబడి యుండలేక, కామ పరాధీనలయి ప్రియ జనకుని ప్రియతరులయిన సోదరులను, ప్రియతమురాలయిన తల్లిని యెంతో కష్టముమీద విడిచి యే రాత్రివేళనో తమ చేతచిక్కినంత సొమ్ము తరలించి యే చాకలివానినో, యే మంగలివానినో, యే తురకవానినో, యే దూదేకుల వానినో తీసికొని లేచిపోయి యూరనెక్కడనో గుడిసె వేయుచున్నారు. వీరు తామే ఇతరులచేత మోసపోయి తమ ధనమును వారికి దోచిపెట్టి తాము చెడిపోయి, దేహము చెడగొట్టుకొని పూట కూటికిని గతిలేవారగుదురు''. [1]

వితంతువులు స్త్రీలే అని వారికి రాగద్వేషాలుంటాయని వారి కోరికలు తీర్చాలనే విషయం హిందూ సమాజంలో పూర్తిగా విస్మరించబడ్డాయి. వితంతువుతో సంగమించటం పాపంగా చెప్పబడింది. వితంతు వివాహం చేసుకున్నవానికి పుట్టగతులు లేవని విధవను కూడినవానికి ఆయువు, సిరి నశించిపోతాయని చెప్ప బడింది.

"విధవ యాయువు సిరియును వీటబుచ్చు" [2]

తన వయిస్సు వారందరూ శుభకార్యాలకు, పేరంటాలకు, వివాహాదులకు వెళ్ళడం చూచిన విధవలకుమాత్రం కోరికలుండవా ఏమి? తన ఈడువారు మగనితో సంసారంచేసి బిడ్డలుకనడం తలచుకొని దుఃఖించడం, తమ్ము కన్న తల్లిదండ్రులే కామోద్రేకానికి బానిసలై తమ కన్నులముందే సంగమిస్తుంటే వారికి కోరికలు ఎందుకు కలగవు?

"పెద్దలయిన తల్లిదండ్రులు గదిలో పరుండి సుఖమనుభవించుచున్నప్పుడే వల పంచనుజేరి యొక్కరాత్రి విధవులయిన జవ్వనులుపడు క్షోభ యింతింతని యెవ్వరికి చెప్ప శక్యమగును. మగడు పోయిన కూతురు తమ పడకగది గుమ్మము వెలుపల కటికనేలను చాపమీద నొంటిగకూలి తన దుర్గతి దలచుకొని విలపించు చుండగా దయావేశముగల జననీ జనకులకు రాత్రులు తాము లోపల పట్టెమంచము మీద శయనించి నిర్విచారముగ సుఖమనుభవించుటకంటె మరణమునొంది స్వర్గ సుఖము పొందుట యుక్తముగా తోచదా!" [3]

---

1. స్త్రీ పునర్వివాహము పుట 22.
2. ధర్మఖండము 4–217.
3. స్త్రీ పునర్వివాహము పుట 35.

ఈ విధంగా వితంతువులను అనేక బాధలుపెట్టడం హిందూ సమాజంలో జరిగింది. ప్రస్తుత పరిణామంలో వితంతు వివాహాలు సమర్థనీయం అయ్యాయి. కందుకూరి, గురజాడవంటి మహానుభావుల నిర్విరామ కృషి ఫలితంగా వితంతువుల దుఃఖమయ జీవితాలన్నీ సమాజంలో తొలగించబడ్డాయనే చెప్పవచ్చు. కాని ఇప్పటికి ఛాందసులయిన కొంతమంది సనాతనులకు విధవా వివాహాలు సమ్మతంగా లేవు. వారిని ఈతిబాధలకు గురిచెయ్యడం, సమాజంలో అగౌరవంగా పరిగణించడం జరుగుతూనేవుంది. భర్త మరణించిన అనాధలైన స్త్రీలు అనేక ఇబ్బందులకు గురి అవుతూనే వున్నారు ఇప్పటికీ శకునాలపేరుతో వారిని మానసిక హింసకు గురి చేస్తూనే వున్నారు. ఆర్థికత్వం పురుషుని చేతిలో కేంద్రీకరించిన కారణంచేత భర్త మరణించిన తరువాత కన్నబిడ్డలు సరిగా చూడక వితంతువులు అనాథ శరణాలయాలలో తలదాచుకోవడం, పొట్టకూటికై ఎవరికో ఒకరికి ఊడిగం చెయ్యడం జరుగుతుంది. అనాథ లయిన, బీదవారైన వితంతువులకు ప్రభుత్వమే తగు సౌకర్యాలు కలిగించాల్సిన అవసరం ఉంది. సమాజం విధవలను గౌరవించాల్సిన స్థితికి పెరగాలి. విధవా వివాహాలు ప్రోత్సహించడం, వారికి నైతిక బలాన్నివ్వడం, వారిని ఆర్థికంగా ఆదుకోవడం మన ప్రథమ కర్తవ్యం.

# 7. పుత్ర సంతానం

సంతానహీనత అంటే బిడ్డలు లేకపోవటం.సంతానంలేని స్త్రీని గొడ్రాలు అని పిలుస్తారు. సంతానంలో స్త్రీ సంతానం కంటె పురుష సంతానానికి అధిక ప్రాధాన్యం వుంది. బిడ్డలు లేనివారికి పుణ్యగతులు వుండవని ధర్మ శాస్త్రాలలో చెప్పబడింది. నరకాలలో 'పుత్' అనే నరకం వున్నదని పుత్రులు లేని వారు ఈ నరకంలో పడి అనేక బాధలు అనుభవించవలసివుంటుందని శ్రుతులు చెపుతున్నాయి. 'పున్నామ్నో నరకాత్త్రాయత ఇతి పుత్ర' పుత్రుడు పుట్టి పున్నామ నరకాన్నుంచి రక్షిస్తాడట.

స్త్రీ పురుష సంగమ కార్యం ద్వారా కలిగేదే సంతానం. క్షేత్ర – బీజాల ప్రభావం వల్ల స్త్రీ పురుష సంతానం కలుగుతాయని విజ్ఞాన వైద్య శాస్త్రాల్లో చెప్పబడింది. కాని మన ధర్మ శాస్త్రాలలో యజ్ఞ యాగాలు ఆచరించటం ద్వారా దాన ధర్మాలు చెయ్యటం వల్ల, మొక్కులు మొక్కటం వల్ల, తాయెత్తులు కట్టించు

కోవటంవల్ల పుత్ర సంతానం పొందవచ్చు అనే నమ్మకం మన వారిలో అనాదిగా వ్యాపించి వుంది. తల్లిదండ్రులకు తోడు, వృద్ధాప్యంలో వారి మంచి చెడులు చూడగలవారు కుమారులు మాత్రమేనని మన వారి నమ్మకం. ఆర్థిక వ్యవస్థ పురుషునిలో కేంద్రీకరించి వుండటంచేత పురుషావశ్యకతకు ప్రాధాన్యం కలిగింది. అందుచేత పురుష సంతానానికి ఈ సమాజంలో ఎక్కువ ప్రాధాన్యం ఇచ్చారు. అందుచేత ప్రతి వారు పురుష సంతానం పొందటం ద్వారా తమకు గల లౌకికా లౌకిక సమస్యలు తీరి పుణ్య లోకాలు పొందగలమని ఆశించారు అందుకై వారు మొక్కని మొక్కులేదు, చేయని ప్రయత్నంలేదు. నోములు నోచటంవల్ల, దేవతారాధనవల్ల సంతానం కలుగుతుందనే మూఢ నమ్మకాలు బాగా వ్యాపించాయి. ఆరోగ్యవంతురాలైన భార్య (యువతి) కు, ఆరోగ్యవంతుడైన భర్త (పురుషుని) కు సంతానం కలగటం సృష్టిలో ఒక భాగం. అనారోగ్యంతో పీడించబడే వారు, శుక్ర శోణితాలలో శక్తి లేని వారికి సంతానం కలగటం అసాధ్యం అనే విషయం మన వారికి తెలియదు సంతానం కలగక పోతే ఆ స్త్రీ త్యజించదగిందని ధర్మ శాస్త్రాలు వర్ణించాయి. సంతాన హీనతకు కారణం స్త్రీ అనే నమ్మకం హైందవ సంప్రదాయాలలో బాగా వ్యాపించి వుంది.

శ్రీరంగపురంలో నారాయణుడు అను పేరు గల సద్బ్రాహ్మణుడున్నాడు. అతనికి అనుకూలవతి అయిన భార్య లక్ష్మీదేవి. వారికి సంతానం లేదు. ఒక రోజున ఒక యతి వరుడు ఆమె ఇంటికి భిక్షాటనకై వచ్చాడు. సమయం మధ్యాహ్నం. లక్ష్మీదేవి భిక్ష తీసుకొని వచ్చి యతి వరునికి ఇవ్వబోగా

"వచ్చిన యతి ప్రవరునకు వైష్ణవ సతి
భిక్ష తెచ్చిన నతఁడా మృగాక్షిఁజూచి
యెందునన పత్య భిక్షనే నందనసుచు
నొల్లకచనంగ నతని కయ్యువిదయనియె"[1]

అనపత్యుల వద్ద నుంచి భిక్ష గ్రహించకూడదు అనే ఓ మూఢ నమ్మకం. గ్రహించిన వారు పాపులవుతారని యతి వివరిస్తాడు.

---

1 వైజయంతీ విలాసము – 1–61.

అందుచేత పుత్ర సంతానం కోసం నాటి రాజులు అనేక యజ్ఞ యాగాలు ఆచరించారు.

యవనాశ్వునకు పుత్ర సంతానం లేదు ఆయనను దర్శించడానికి వచ్చిన వశిష్ఠ మహా ముని యాగం ఆచరించటవల్ల పుత్ర సంతానం కలుగుతుందని వివరిస్తాడు.

"ఐంద్ర యాగము సేయు మవనీశ భక్తి
సాంద్రదంబుగా పుత్రసంతతి గలుగు."[1]

దశరథుడు అయోధ్యా నగరానికి ప్రభువు అతనికి ముగ్గురు భార్యలు. వారికి సంతానం లేదు. దశరథుని వద్దకు వశిష్ఠ మహాముని వచ్చి సంతానం లేనివారికి ఉత్తమ గతులుండవని పుణ్యములు కలుగదని చెప్తాడు.

"కొడుకులు లేకున్న కోరి పుణ్యములు
వడయవుత్తమలోక పదవు లెవ్వరును"[2]

పున్నామ రకం నుంచి రక్షించగలవాడే పుత్రుడు. దశరథుడు సంతానం లేనందువల్ల ఈ విధంగా చింతించసాగాడు.

"ధాత్రిన్ పున్నామ్నో నరక
త్రాత్రియత ఇతి యనంగ గలిగిన తా దృ
క్పుత్త్రుని గాంచుటయె కదా
గాత్రం బూనుటకు ఫలము గణుతింపంగన్"[3]

దీపం నుంచి మరియొక దీపం వెలిగినట్లుగా తండ్రి నుంచి కుమారుడు గలిగి శరీరానికి, మనస్సుకు ఆనందం కలిగించటం చేతతండ్రికి జన్మకు సార్థకత ఏర్పడుతుంది.

---

1. రంగనాథ రామాయణము – పు. 60
2. రంగనాథ రామాయణము – పు. 9
3. రామాభ్యుదయము – 2 – 65

రుద్రమ్మ కాకతీయ వంశానికి చెందిన కాకతి రాణి. ఓరుగల్లును రాజధానిగా చేసికొని ఆమె రాజ్యపాలన కావించింది. ఆమె కుమార్తె ముమ్మడమ్మ. ముమ్మడమ్మకు చాలాకాలం వరకు సంతానం కలుగలేదు.

"మ్రొక్కని చెట్టు లేదు మఱి పూజ యొనర్చని పుట్టలేదు తా
మెక్కని కొండలేదు తెగి యీయని యీవియు లేదు గానియే
యొక్కడు దేవుడున్ పలికి ఓయని కోరిక దీర్పనేరఁడే
యక్కట రేఖ పండకయె ఆరటముంబడియేమి లాభమో."[1]

సంతానం కలగనివారు చెట్లకు మ్రొక్కటం, పాములకు పూజలు చెయ్యటం, కొండ దేవతలకు మ్రొక్కటం వంటి ఆచార వ్యవహారాల వల్ల బిడ్డలు కలుగుతారనే నమ్మకం వుండేది.

"పిల్లలు కావాలె అంటే రావి చెట్టును కౌగలించుకోవటం ఎందుకు – ?"

సంతానం కావలసిన స్త్రీ రావిచెట్టు చుట్టూ మహా నిష్ఠతో తిరిగి చెట్టును ఆలింగనం చేసుకుంటుంది. ఆ చెట్టులో అశ్వత్థ నారాయణుడున్నాడు. ఆ ఆలింగనంవల్ల ఈ స్త్రీకి సంతాన ప్రాప్తి కలుగుతుంది. ఇందులో చెట్టు పురుష భాగం అయింది."[2]

పుత్రులు కలిగి వుండటమే పుణ్య స్త్రీ లక్షణంగా భావించడం జరిగింది.

శ్రీకృష్ణుని భార్య రుక్మిణీదేవి. తనకు పుత్ర సంతానం ప్రసాదించవలసిందిగా భర్తను ప్రార్థిస్తుంది. ఆ సందర్భంలో రుక్మిణి సంతానం యొక్క ప్రాశస్త్యాన్ని వివరించింది.

"పుత్రుల కలిమియెకుడ్డ క
ళత్రమునకు లక్షణంబు లక్షణవతులై
పుత్రవిహీనతఁబొర సినఁ
బాత్రములే సతులు పతులు పాటించుటకున్."[3]

1. కీర్తి తోరణము – పు. 73.
2. దేవాలయాల మీద బూతు బొమ్మలెందుకు – పు. 76
3. ఉత్తర హరివంశము – 2 – 81.

అటువంటి సంతానం పొందటానికి సంతాన కాంక్షతో చేసే ప్రయత్నాలు అనేకం.

కాకతీయరాణి రుద్రమదేవి కుమార్తె ముమ్మడమ్మకు సంతానం కలగడానికి నోచిన నోములు చేసిన ప్రయత్నాలు. ఈ విధంగా వున్నాయి.

"ఎవరు చెప్పిరో గాని యెద్దు నోములు నోమ
పురుష పుంగవుడంత పుట్టుననుచు.[1]"

ఎద్దులను (వృషభాలు) పూజించటంవల్ల, హలదానం. వృషభ దానాలవల్ల పుత్ర సంతానం కలుగుతుందని, హలంతో దున్నటంతో క్షేత్ర మందు సస్యరాసి పండినట్లుగా బిడ్డలు కలుగుతారనే నమ్మకం వుంది.

గోదావరీ తీరంలో ద్రాక్షారామం క్షేత్ర మాహాత్మ్యం కలిగిన పుణ్య ప్రదేశం. ఆ గ్రామంలో దేవశర్మ అనే బ్రాహ్మణుడు ఉన్నాడు. వానికి సంతానం లేదు. సంతానం లేనట్లయితే పితృదేవతలకు పుట్టగతులుండవు. గదా ! కుమారుడు పింఢ ప్రదానం చెయ్యనిదే పై వారికి పుణ్యం దక్కదు. అందుచేత దేవ శర్మ తన అనపత్యతకు చింతిస్తాడు.

"బుడుతఁడొకఁడైన లేకున్న బుట్టగతులు
వాయు నా పితరులకు నివాపజలము
చుళుకమేనియు నిచ్చెడి చొప్పులేదు
పుణ్యు మిటు పోకాలెననిలోఁ బొగులు చుండ."[2]

అయితే పుత్రసంతానం కోసం తమ పుత్రికలను దేవాలయాల్లో శివార్పణం చేయటంవంటి ఆచారాలు వున్నాయి.

---

1. కీర్తి తోరణము పు. 74.
1. సూత పురాణము 1 – 73.

"బళ్ళారి జిల్లాలోను, దాని నానుకున్న ధార్వార్, మైసూర్ ప్రాంతాల్లోనూ బోయలు, బేండర్లు యిత్యాది కులాల్లో ఎవరికైనా పుత్రసంతానం లేకపోతే కూతుళ్ళలో ఒకరిని 'బసివి'గా అర్పించి దేవుడికి అంకితం చేసేవారు." [1]

ఎన్ని పుణ్యాలైనా ఒక్క పుత్రునితో సమానం కావు.

"సుతజలపూరితంబులగు నూతులు నూఱిటి కంటె సూ
నృతవ్రత నొక బావి మేలు మఱి బావులు నూఱిటికంటె నొక్క స
త్క్రతువది మేలు తత్క్రతు శతకంబు కంటె నొక్క సుతుండు మేలు

కిరాతుడొకడు చోరవృత్తి కలిగి మునులను దోచుకోటానికి ప్రయత్నించగా వారు కిరాతునికి నీతిబోధ చేస్తారు. ఆ సందర్భంలో వారు కిరాతునికి పుత్ర సంతానంవల్ల కలిగే ప్రభావాన్ని, గొప్పతనాన్ని చెప్తారు.

"అంగశోషణంబులగు వ్రతములు క్షితి
దాన ముఖ్య నిఖిల దాన విధులు
యాగ యోగ తతుల నన్నియుఁ బుత్రసం
జనన పుణ్యమునకు సాటి యగునె." [3]

ఎన్ని యాగాల పుణ్యఫలం అయినా పుత్రసంతానానికి సాటి రావు.

పుత్రుడు పుట్టినట్లయితే పుణ్యలోకాలు కలుగుతాయనే నమ్మకంచేత పుత్రులు లేనివారు తమకు ఎక్కడ పుణ్యలోకాలు తప్పిపోతాయో అని పురుష సంతానానికై పడరాని పాట్లు పడేవారు.

"భార్య పుత్రసంతతిని ఇచ్చే ఒక సాధనం. భార్య ఆడపిల్లల్ని ప్రసవించినపుడు పండ్రెండు సంవత్సరముల వరకు నిరీక్షించి పుత్రార్థి యగువాడు ద్వితీయ వివాహం చేసికొనవచ్చును." [4]

---

1. ఆంధ్రలో సాంఘిక తిరుగుబాటు ఉద్యమాలు – పు. 63.
2. మహాభారతము ఆదిపర్వము 4–94
3. ధర్మఖండము 7–9
4. మనుస్మృతి 9–81

పుత్రసంతానం కోసం యజ్ఞయాగాలు చేసేవారు, తీర్థాలు సేవించేవారు పురాణాలలో కోకొల్లలుగా కనిపిస్తారు. పుత్రులు లేనివారికి పుణ్యగతులు లేవని, పునర్జన్మ తప్పదనే భావం పురాణాల్లో కనిపిస్తుంది.

పుత్రసంతానం కోసం చేసే ప్రయత్నాలన్నీ మూఢాచారాలే సంతానం కలగడం అనేది ప్రాకృతిక విషయం. సంతానం కలగలేదంటే ఏదో అనారోగ్యం కారణమే. దాన్ని తెలుసుకోలేక చెట్టుకో, పుట్టకో మొక్కడం, సంతానం కలుగుతుందని ఆశించటం పరిపాటయిపోయింది. బిడ్డలు పుట్టడానికి క్షేత్రప్రాధాన్యంతో పాటు బీజప్రాధాన్యం కూడా ప్రధానమే. కానీ ఈ విషయంలో నిందంతా స్త్రీకే పరిమితం చేయబడింది. పెరిగిన వైద్యశాస్త్రం అందుబాటులో వున్న వైద్యుల్ని వదలి ఇటువంటి మూఢనమ్మకాల్లో వుండటం శోచనీయం. నేడు ఒకవైపున టెస్ట్ ట్యూబ్‌లో బేబీలు పుడుతుంటే, దేవుడు పుట్టిస్తున్నాడని నమ్మే మనవారి అవివేకం ఎంత దిగజారుడు విధానమో గమనించాలి. పుత్రసంతానం కలగటంవల్ల పునర్జన్మ లేకుండాపోతుందని నమ్మడం పుణ్యసాధనకు, ముక్తికి మూలకారణం అని నమ్మటం మూఢనమ్మకమే.

# 8. రజస్వలాచారాలు

సామాన్యంగా బాలిక వ్యక్తురాలు కాగానే ఆమె రజస్వల అయిందని అంటారు. ఆబాలిక సమర్త ఆడిందని పిలుస్తారు. సమర్త అనగా ప్రథమఋతువు అని అర్థం. అప్పటివరకు బాలిక అయిన ఈమె ఋతుమతి అయి పురుష సాంగత్యానికి అనువుగా వుంటుంది. పుష్పవతి అయినట్లుగా మనవాళ్ళు పిలవటం కద్దు పుష్పవతి అనగా రజస్వల లేక ముట్టు అని అర్థం. ముట్టరానిది లేక తాకరానిది అని అర్థం. రజస్వల అనగా ముట్టుది అని అర్థం. ఈ పదాలన్ని తాకరాని స్త్రీ అనే భావాన్ని సూచిస్తాయి. ప్రథమంగా రజస్వల అయిన స్త్రీకి కొన్ని ప్రత్యేకమైన ఏర్పాట్లు చేస్తారు. దూరంగా వుంచటం, ఆకుల మీదనో, గడ్డి మీదనో, విడిగా ప్రత్యేకమైన గదిలోనో వుంచటం మొదలైన ఆచారాలు మన సమాజిక వ్యవస్థలో కనిపిస్తాయి.

రజస్వల లేక పుష్పవతిగా అవడం స్త్రీ ప్రాకృతికంగా సర్వసామాన్యం. ప్రపంచంలోని జీవరాసులన్నింటిలో పశుపక్ష్యాదుల్లో సైతం వ్యక్తత (**maturation**) పొందనిదే సంగమకార్యానికి పనికిరావు. అదేవిధంగా ఆడపిల్ల వ్యక్తురాలు అయింది అనగానే ఆమె పురుషునితో సంగమ కార్యానికి సిద్ధమయ్యే వయస్సు వచ్చిందని అర్థం. కాబట్టి ఆమెని అప్పటినుంచి యువతి అని, స్త్రీ అని పిలవటం జరుగుతుంది. అయితే రజస్వల అయిన స్త్రీపట్ల మనవారు చూపించిన నమ్మకాలు, ఆచారాలు కొన్ని ఆశ్చర్యకరంగా కన్పిస్తాయి. మొదట సంప్రదాయాలుగా వున్న ఈ నమ్మకాలు మూఢనమ్మకాలుగా మారిపోయాయి.

రజస్వల అయిందీ అంటే ఆమెను ఒక భూతంగా చూసేవారు, దగ్గరకు వెళ్ళడానికి భయపడేవారు, తాకితే దోషం వాటిల్లుతుంది అని దూరంగా వుండేవారు.

"ఆ రోజుల్లో ఆడది సమర్తాడిందంటే దానిని ఒక మహామారిలా చూసేవారు. ఆ ఆడదానిని ఆశ్రయించుకొని ఎన్నో భూతాలూ దయ్యాలు ఉంటాయని అనుకునేవారు. ఆ ఆడదానిని ముట్టుకుంటే ఆ భూతాలు పట్టుకుంటాయట. దాని కాలు భూమిమీద తగిలితే పచ్చిక మొలవదు. పంటలు పండవు. దాని గాలి సోకితే చెట్టు కాయదు. అందుచేత రజస్వల కాగానే ఆడదానిని ఆకులమీదనో - ఇప్పుడు చాపమీద అనుకోండి - విడిగా వుండే రాతిమీదగానీ కూర్చోబెట్టేవారు. ఈ పాడు భూతాలు ఆడదాని అవయవాలు పాడు చేయకుండా వుండటానికి ఏమేమో అగచాట్లు పడేవారు. ఇప్పుడు చిమ్మిలి పంచిపెట్టినట్లు ఆ భూతాలను మోసం చేసి ఎలాగయినా తప్పించుకోటానికి ఈ ఆడదానిచేత మారువేషాలు వేయించేవారు. ఇప్పటికీ ఈ ఆచారం అరవదేశంలో వుంది. ఈ పనంతా చాలా ముసలివారు చేయిస్తూ వుండేవారు. చచ్చినా ఫర్వాలేదన్న ముసలివారు, చిన్నవయసువారు దగ్గరకు పోయేవారు కాదు. ఆ రోజులలో అంత భయం." [1]

రజస్వల అయిన వెంటనే అయినవారికి కబురందించటం, వరసలు గలిగిన (వివాహ సంబంధాలు) ...కి తెలియజెయ్యటం, వారివద్ద నుంచి బహుమానాలు పొందటం, ఆ బాలిక రజస్వల అయినట్లు రూఢి చేసుకోవటం, చుట్టాలకు శుభ

1. పెళ్ళి-దాని పుట్టు పూర్వోత్తరాలు పు. 110

లేఖలు పంపటం, రజస్వల శుభ-అశుభ లగ్నాలలో అయిందో లేదో తెలిసికోవటం, ఆమెకు తినుబండారాలు తెప్పించటం ఆచారాలుగా ఉండేవి.

రాధ కుమార్తె ఇళాకుమారి. ఇళ పుష్పవతి కాగానే
"మన యశోదను జేరి 'మన యిళ పుష్పించె'
నని చెప్పి బహుమతు లందరమ్మ ! [1]

మందు లివ్వటం, సాంబ్రాణిధూపం వెయ్యటం, తీపిమధువు ఇవ్వటం, మంచి ఖర్జూరాలు తేవటం వంటి నమ్మకాలు ప్రథమ ఋతువు చెందిన బాలికలపై చూపించటం జరుగుతుంది.

ఈ సమయంలో ఆ బాలికను అంటుకోవటం కొంతమంది వరకే పరిమితం. ఆమెకు చేసే స్నానోపచారాలు ఆచారాలు ఒక్కో రకంగా వుంటాయి. కొన్నిచోట్ల రజస్వల అయిన నాల్గోరోజున స్నానం చేయించటం ఆచారం. మరి కొన్నిచోట్ల మూడు-ఐదు రోజుల్లో స్నానం చేయించటం, 9 వ రోజున వంట ఇంటిలోకి రానివ్వటం, 11 వ రోజున పంక్తి భోజనం ఏర్పాటు చేయించి గుంపులో కలపటం ఆచారాలు. రాధ తన కుమార్తె ఇళకు రజస్వల అయిన వెంటనే స్నానం చేయిస్తుంది. ఇప్పటికీ తంజావూరు ప్రాంతంలో వేడినీటితో స్నానం చేయిస్తారు.

కొన్నిచోట్ల రజస్వల అయిన బట్టలతోనే వుంచి నాల్గో రోజున స్నానం చేస్తారు. ఈ విధంగా మొదటి ముట్టుబట్టతో నాల్గవరోజు వరకు వుంచటం అనారోగ్యం అనే విషయాన్ని ఈ నమ్మకస్తులు అంగీకరించరు. తెలుసుకోలేరు.

చిమ్మిలి తొక్కటం పంచిపెట్టటం వంటి నమ్మకాలు ఈ సమాజంలో వ్యాపించి వున్నాయి.

"నువ్వులు లేనె కలిపి దంచి ఆ ముద్దలు గారెలుగానో, బూరెలుగానో చేసి వాటిని వూరిలో కొందరికి పంచిపెట్టేవారు. అలా గోష్మాంగాల ఆకారంలో గారెలు, బూరెలు చేసి పంచిపెడితే ఆ పిల్ల అంగాలకున్న దుష్టలక్షణాలు దోషాలు మాయమవుతాయని వారి విశ్వాసం" [2]

---

1. రాధికాసాంత్వనము – 1–28
2. పెళ్ళి – దాని పుట్టుపూర్వోత్తరాలు పు. 131

ఈ చిమ్మిలి తొక్కి ముత్తయిదువలకు పంచటంవల్ల దోషం పోతుందని, ఆమె మర్మావయవ ఆకారంలో చిమ్మిలి తయారుచేసి పంచడంవల్ల ఆమెను అంటిన భూతాలు తొలగిపోతాయని నమ్మటం జరిగింది.

"స్త్రీ అవయవాలలాగా, పురుష అవయవాలలాగా పిండి వంటలూ, మిఠాయిలూ తయారుచేసుకుంటారు. వాళ్ళల్లో వాళ్ళు పంచుకుంటారు. దేవతలకు సమర్పిస్తారు. తింటారు. అలా పంచినందువల్ల, దేవతలకు సమర్పించినందువల్ల ఆ స్త్రీల అవయవాలను అంటిపెట్టుకొని ఉండే దోషాలు తొలగిపోతాయని వారి నమ్మకం. ఈ అవయవాలను ఆశ్రయించి ఉన్న గాలి (దయ్యము) పారిపోతుందని వారి విశ్వాసం. ఇప్పటికీ మనలో ఆడపిల్లలు సమర్త అయినప్పుడు చిమ్మిలి దంచి స్త్రీ అవయవ రూపంగా చేసి "అవయవ దోష పరిహారార్థం" ఇతరులకు పంచిపెట్టటం ఆచారం." [1]

ఆయా అవయవాల ప్రతిరూపాల్ని తయారుచేసి దేవతలకు నైవేద్యాలు సమర్పించటం ద్వారా, వాటిని తృప్తిపరచటం ద్వారా తమకు మంచి జరుగుతుందనే విశ్వాసం బాగా వ్యాపించింది.

రజస్వల అయిన బాలికను తాటాకుల మీద గాని – మెత్తని గడ్డిపైగాని– అరుగుపై గాని కూర్చుండబెట్టి తరువాత

"భేరి మొదలగు వాద్యములో బోరు కొనఁగ
వరుసనెనయించి చెలి కొడిఁబ్రాలు గట్టి
కుంకుమరసంబు కస్తూరి కుసుమములును
బంధుమిత్రాప్తతతికిచ్చి పంచి రాధ" [2]

మంగళ వాద్యాలు మ్రోయించటం– ఆ బాలిక 'ఒడిబ్రాలు' (చెంగున కట్టు బియ్యం) కట్టటం కుంకుమ – పసుపు, కస్తూరి, పుష్పాల్ని బంధువులకు పంచటం ఆచారం. కొబ్బరి ముక్కలు, పళ్లు మొదలైనవి పంచటం కూడా జరుగు

1. దేవాలయాల మీద బూతుబొమ్మలెందుకు – పు. 70.
2. రాధికా సాంత్వనము 1 – 31.

తుంది. ఈ విధంగా పంచటం వల్ల రజస్వల అయిన బాలికకు దృష్టి దోషం తగలదనే నమ్మకం మనవారిలో వ్యాపించి వుంది.

యాదవ సామ్రాజ్య రాజ్యాధిపతి బలరాముడు. అతని భార్య రేవతి. వారిరు పురి ముద్దులపట్టి శశిరేఖ. శశిరేఖ రజస్వల అయిన సందర్భంలో ఆమెను సమర్త శయ్యపై కూర్చుండబెట్టి నీతులు చెప్తారు. యుక్తవయస్కురాలయిన ఆ బాలికకు కట్టుబాట్లు ఎక్కువగా వుంటాయి.

"పరులను జూడరాదు బహుభాష లతి ధ్వనిఁబల్కరాదు నం" [1]

సమర్త అయిన బాలిక ఇతరులను చూడటం, పెద్దగా మాట్లాడటం, నవ్వటం, ఒంటరిగా బయట విహరించటం, దాసిని విడచి ఒంటరిగా వుండటం కూడదనే ఆంక్షలు విధించటం, భయపెట్టటం మానసికంగా ఆ బాలికను క్రుంగదీయడమే.

వారికి మెత్తటి పాన్పు అమర్చి ప్రక్కలో కొన్ని వస్తువులు పెట్టడం ముసలి వారిని తోడుగా పరుండ చేయటం వేము బెత్తం, నిమ్మకాయలు, నిమ్మ ఆకులు తోడుంచటం మనవారి సాంప్రదాయాలు. ముత్తయిదువులను తోడువుంచటం, రాత్రి పూట జాగారం చేయటం. భూతప్రేత పిశాచాలు నిద్రించే సమయంలో ఆమెను ఆవహిస్తాయని మేలుకొని వున్నట్లయిన అవి సమర్త అయిన బాలికకు అపకారం చేయవనే నమ్మకమే దీనికి ఆలంబనం

ఈ భూతాలు ఆవహించకుండా వుండటానికి మంత్రగాళ్ళను పిలిపించి యంత్రాలు (బీజాక్షరాలు రాసిన రాగిరేకు లేక ఇత్తడి రేకు) ద్వారా చౌకట్లకు తాపించటం ఇంటి చుట్టూ విభూతి చల్లటం మొదలైన ఆచారాలు ఉన్నాయి.

"మాంత్రికుల బిల్చియిలు చుట్టు మంత్ర యంత్ర
తంత్రములఁ గూర్చి నల్దె సల్ తప్పతారి
భూతముల నెందుఁ జొరనీక భూతిఁజల్లి
కలికిఁగాపాడె కనురెప్ప గాచినటుల" [2]

---

1. తాలాంక నందినీ పరిణయము 2-140.
2. రాధికా సాంత్వనము 1-38.

రజస్వల కావటం అనేది ప్రకృతి సిద్ధం. ఒక్కొక్క వ్యక్తిలో ఒక్కొక్క రకమయిన వ్యక్తావ్యక్తాలు ఇమిడి వుంటాయి. వేడి వాతావరణంలో నివసించే ఆఫ్రికా జాతివారు అతితక్కువ వయసులో (8–9 సంవత్సరాలు) ను అతిశీతల ప్రాంత వాసులు (18–19 సంవత్సరాల) ఎక్కువ వయస్సులోను వ్యక్తురాంద్రు (**maturation**) కావటం జరుగుతుంది. కొంతమంది బాలికలు రజస్వల కానట్లయితే వారికి దేవుళ్ళకు మ్రొక్కటం వంటి కార్యాలు చేస్తారు.

"రజస్వల కానివాళ్లు తాడిచెట్లను కౌగిలించుకుంటే రజస్వల అవుతారు". [1]

రజస్వల అయిన తరువాత ఆ స్త్రీ సంగమం చేయటం మొట్టమొదట దోషంగా భావించారు. ఆ స్త్రీతో జత కలిస్తే ఆ పురుషునికి కీడు కలుగుతుందని. కొంతమంది స్త్రీలతో మొదటిసారి కలిస్తే సర్పదోషం (దీన్ని కవి చౌడప్ప తొడ పాము అన్నాడు) కలుగుతుందని; దానివల్ల విషప్రయోగం జరిగి మరణం సంభవించవచ్చని భావించారు.

"అందుచేత వీళ్ళతో సాంగత్యం చెయ్యటానికి మొదట ఒక ముసలివాడికి జత కలిపేవారు. ఆ ముసలివాడు చస్తాడు. చెట్టుతో శోభనం చేసి తెల్లవారిన తరువాత దాన్ని నరుకుతారు. తరువాత కాలంలో పురోహితునితో మొదటి రాత్రి జత కలిపేవారు. భూతాలు వీరినేమీ చేయవట. ఇలాగా భూతాల బారి నుండి సమర్తాడిన పిల్లని తప్పించే ఏర్పాటుకే కీడు తియ్యటం అంటారు". [1]

బాగా అందంగా వున్న స్త్రీలతో సంభోగించటానికి పురోహితవర్గం వేసిన పథకమిది. అమాయకులైన ఆనాటి మూగజీవులు అనాగరికులై, నిరక్షరాస్యులై వేదాలలో వున్న సంస్కృతాక్షరాల్ని గమనించలేక వారు చెప్పిన మాటలే వేదాలుగా భావించి తమ తమ బిడ్డల్ని వారి కామయజ్ఞానికి బలిపశువులుగా చేశారు.

గుణవల్లభుడు అనే విద్వాంసుడు సర్వవిద్యలందు నిష్ణాతుడు. ఆ బ్రాహ్మణుని వద్ద రాకుమార్తె లీలావతి శిష్యురాలై సంగీత సాహిత్య విద్యలలో ప్రవీణురాలయ్యింది. లీలావతి అతిలోక సుందరి. ఆమె రూపలావణ్యాలకు ముగ్ధుడైన గుణ

---

1. దేవాలయాల మీద బూతు బొమ్మలెందుకు – పు. 70.
2. పెళ్ళి– దాని పుట్టు పూర్వోత్తరాలు – పు. 111.

వల్లభుడు ఆమె పొందుకై వేచి ఉంటాడు. కాని లీలావతికి గుణవల్లభునిపై గురుభక్తి భావమే తప్ప శృంగారభావం లేదు. అందుచేత అతని కోర్కెకు అంగీకారం చూపదు. ఇంతలో రాకుమార్తె లీలావతి రజస్వల ఔతుంది. గుణవల్లభుడు రాకుమార్తె దుష్ట నక్షత్రాన రజస్వల అయిందని, తత్ఫలితంగా రాజ్యనాశం, దేశ నాశం జరుగుతుందని జోస్యం చెప్తాడు.

శాంతి జరుగడానికి రాకుమారిని ఒక మందసంలో ఉంచి నదిలో విడిచి పెట్టాలని దానికై తిథి నక్షత్రాలు లెక్కించి శుభఘడియ నిర్ణయిస్తాడు.

"బాల దుష్టవేళ ప్రథమ రజస్వల" [1]

ప్రథమ రజస్వల దుష్టవేళ జరుగుటంచే రాజ్య వినాశం జరుగుతుందని చెప్తాడు.

"యిల్లు చెఱపఁ బొడమి నేమియనుచు" [1]

లమెను నీటిలో మందసంతో పాటు వేద మంత్రయుక్తంగా వదలి వేయించాడు. నీటి వాలున కొంత దూరాన కాళికాలయం చెంత తన శిష్యులు కొందరిని నియమించి మందసాన్ని నీట నుంచి తెచ్చి గర్భగుడిలో నుంచవలసిందిగా ఆజ్ఞాపించాడు.

ఈ విధంగా వేసుకున్న గుణవల్లభుని పథకం తారుమారయింది. నీటిలో మందసం కొంచెం దూరం ప్రయాణించగానే వేటకై వచ్చిన రసిక శేఖరుడనే రాజకుమారుడు చూచి తీరానికి చేర్చి పెట్టె తెరచిచూడగా అందాలభరిణె అయిన లీలావతి కన్పించింది. రాకుమారుడు లీలావతి నుంచి నిజం తెలిసికొని వేట సందర్భంలో తాను గాయపరచి బంధించిన ఒక భల్లూకాన్ని పెట్టెలో పెట్టి మందసాన్ని యథాప్రకారం మూసివేసి నీటిలో వదుల్తాడు.

తరువాత కథ తెలిసిందే. ఒంటరిగా మందసాన్ని తెరచిన గుణవల్లభుడు భల్లూకానికి చిక్కి దుర్మరణం పాలౌతాడు.

---

1. శుకసప్తతి – పు. 1-457, 459.

ప్రకృతిలో సహజసిద్ధమైన ప్రథమ రుతు కార్యానికి అనేకమైన నిబంధనలు ఏర్పాటుచేసి వారిలో న్యూనతా భావాన్ని కలుగజేశారు. నిజానికి ఇది సృష్టిలోని ప్రతి జీవరాశికి ఉన్నదే. కాని మనవాళ్ళు మాత్రం పేరుకుపోయిన మూఢ నమ్మకాలతో దీన్ని క్లిష్టంగా తయారు చేశారు. గోప్యంగా వుంచవలసిన ఈ వ్యవస్థను బట్టబయలు చేశారు. స్త్రీ జాతికి సహజమైన ఈ వ్యక్తతను అనాగరిక రూపంలో తయారుచేసారు. ఇలాంటి నమ్మకాల్ని మనం పాటించకుండా వున్న రోజున అవి వాటంతటవే తొలగిపోతాయి.

# 9. స్త్రీ - స్వాతంత్ర్యం

స్త్రీ సమాజంలో సగభాగం. మాతృస్వామిక యుగంలో ఏ కొంచెమో మినహాయిస్తే తప్ప మిగిలిన సామాజిక జీవనంలో స్త్రీకి ఇవ్వబడ్డ గౌరవం చాలా తక్కువనే చెప్పాలి. స్త్రీ పురుషుల్లో స్త్రీ కంటె పురుషుడికే అధిక ప్రాధాన్యం ఇవ్వబడింది. భూస్వామ్య వ్యవస్థలో గాని, పెట్టుబడిదారీ వ్యవస్థలోగాని స్త్రీ పురుషుడికి బానిసగనే వ్యవహరించబడింది. దీనికి కారణం వారి మధ్య విభజించబడ్డ పని విలువ మాత్రమే పురుషుడు గృహేతర పరిశ్రమకు, స్త్రీ గృహాంతర్భాగ పరిశ్రమకు అలవాటు పడ్డారు. ఈ స్థితిలో స్త్రీ అటు వంట ఇంటికి, ఇటు పడకటింటికి పురుషునికి అంకితమైంది. ఈ విధంగా స్త్రీ పిల్లల్ని కనే యంత్రంగా పురుషుడికి అతని కుటుంబానికి ఉపయోగపడే సాధనంగా తయారయింది. దీనికి ముఖ్య కారణం సాంఘిక వ్యవస్థే. ఆర్థిక–సామాజిక శక్తులన్నీ పురుషుడి చేతిలో కేంద్రీకరించబడ్డాయి. పురుషుడికి కేటాయించబడ్డ పని మేధకు, సామాజికాభివృద్ధికి దోహదం చేసేది. కాగా, స్త్రీ మేధస్సుకు, వ్యక్తిత్వానికి సమాధి కట్టడం జరిగింది. మన సామాజిక చారిత్రికాంశాల్లో స్త్రీ నీచంగా, బానిసగా చూడబడింది. కొన్ని కొన్ని పరిస్థితుల్లో జీవచ్ఛవాల్లా స్త్రీలు బ్రతికారు. స్త్రీ బానిస అనే మూఢ నమ్మకం సమాజంలో బాగా వ్యాపించింది.

"జననీ జనకులు బాల్యం
మున, నాథుడు జవ్వనమున, బుత్రులు జర, నే

పునఁదను బ్రోవఁగ మనఁజనుఁ
దన యిచ్చనెమ్మలగ జనదు తరుణీ మణికిన్" [1]

ఈ విధంగా స్త్రీకి స్వాతంత్ర్యమనే పదానికి అర్ధమే తెలియకుండా చేశారు. జీవించి వున్నంతకాలం పురుషుని అండ అవసరమని, ఆమె స్వతంత్రంగా జీవించే హక్కు లేదని వివరించడం జరిగింది.

"ఈడేరినది మొదలెంచగాఁ బదియేండ్లు
దాక గర్భోత్పత్తి దాల్చకున్న" [2]

సంతానం కలిగినా కలగకపోయినా, కలిగిపోయినా ఎదురు మాట్లాడినా సమాజం స్త్రీకి వేసిన శిక్ష. వదలివేయడమే.

సంతానం కలగడానికి స్త్రీ పురుషుల కలయిక- వారి ఆరోగ్య పరిస్థితులు గాలికె వదలి సంతానం లేని స్త్రీని గొడ్రాలుగా అభివర్ణించి ఆమెను త్యజించాలని పురుషుడు మరో వివాహం చేసుకోవచ్చని శాసించడం జరిగింది.

ఎక్కడ ఏ దోషం జరిగినా అది భార్య (స్త్రీ) కే వర్తిస్తుంది అనే నమ్మకం సమాజంలో బాగా వ్యాపించింది. క్రకచుడు అనే మొసలి బలివర్ధనుడు అనే మర్కటంతో స్నేహం చేస్తాడు. బలివర్ధనుడిచ్చిన తీపి నేరేడుపండ్లు తిని మైత్రిని పెంచుకొని భార్యను బిడ్డల్ని మరచిపోతాడు. కొంతకాలానికి భార్యాబిడ్డలు గుర్తుకురాగా వెళ్ళి ఆమెను పరామర్శిస్తాడు. అతని భార్య కోతికి తన భర్తకు గల స్నేహాన్ని తెలుసుకొని తనకు వ్యాధి సోకిందని ఆ వ్యాధికి కోతి గుండెకాయే మందని వైద్యులు చెప్పారని భర్తను నమ్మించి బలివర్ధనుని గుండె తెమ్మని కోరుతుంది.

"మాయలకు నిక్క మందులకు మనికిపట్టు
సకల దోషంబులకు నెల్ల జన్మభూమి
మగువగావున నిప్పుడు మగుడఁజేసి
యేమి పన్నెనొ నా సతి యెఱుఁగరాదు" [3]

---

1. ధర్మఖండము 1-132.
2. మాధవస్వామి శతకము 1-63.
3. పంచతంత్రము 4-46.

స్త్రీయే అన్నిటికి మూల కారణమని భావించడం జరిగింది. భర్త ఎంత దుర్మార్గుడైనా, అతనికి సేవలుచేసి అతని మాట జవదాటక, పాదపూజచేసి తరించాలట.

మనోరమ అనే గంధర్వకన్యను ఒక బ్రహ్మ రాక్షసుడు తరుముతుండగా వేటకు వెళ్ళిన స్వరోచిని ఆమె కలసి తన వద్ద వున్న అస్త్ర హృదయం అనే విద్యను తీసికొని ఆ బ్రహ్మరాక్షసుని వధించమని కోరగా స్వరోచి సంకోచించి స్త్రీ వద్ద నుండి విద్య గ్రహించడం న్యాయిం కాదని భావిస్తాడు. స్త్రీలు నీచులనే భావన వెలువరిస్తాడు. అప్పుడు మనోరమ ఈ విధంగా హితోపదేశం చేస్తుంది.

"సకల రిపు నాశకము యశస్కరములైన
దీని వేవేగ నాచే ప్రతి గ్రహించి
యడ పుటాడైత్యు వీరువారనఁగ వలవ
దనఘ ! సద్విద్య యెందున్నఁ గొనఁగవలయు" [1]

భార్య భర్త అడుగుజాడల్లో జీవించాల్సిందే తప్ప ఆమె స్వతంత్రంగా జీవించడానికి ఏ మాత్రం అవకాశం లేదు. జనాభాలో సగభాగమైన స్త్రీలకు ఈ పరిస్థితి ఎందుకేర్పడింది? ధర్మశాస్త్రాలన్నీ స్త్రీని కించపరిచే విధంగానే వున్నాయి. అనాది నుండి స్త్రీ పురుషుడిలో భాగం. ఆమె వ్యక్తిత్వానికి- అస్తిత్వానికి గౌరవం లేకుండా పోయింది. ఆర్యులు మనదేశం వచ్చేనాటికి పితృస్వామ్య వ్యవస్థ ప్రారంభ మయింది. అంటే అప్పటికే స్త్రీకి స్వాతంత్రం లేకుండా పోయింది. పురుషుడిపై ఆధారపడింది. ఇంతేకాక ఆమెకు ఆస్తి విషయంలో ఏ మాత్రం హక్కులేదు. పతివ్రతా ధర్మాలు, సూత్రాలు వేదాలలో ఉపనిషత్తులలో విధించబడ్డాయి. తన పశువును అమ్మినట్లుగా, కొన్నట్లుగా స్త్రీని వాడుకోవటం జరిగింది ఈ విధంగా వ్యవస్థ మొత్తం పురుషుడు చేతిలోకి వెళ్ళడంతో స్త్రీ దిక్కుతోచని స్థితిలో పురుషుడికి బానిసగా మారిపోయింది. స్వతంత్రాలోచన, స్వతంత్రజీవనం నిషేధించ బడ్డాయి. వర్గ దృక్పథం ఏర్పడి ఈ సమాజం దోపిడీ వ్యవస్థకు గురి అవుతుంటే

---

1. మనుచరిత్ర 4 - 93.

స్త్రీ పురుషాహంకారానికి బానిస ప్రతీక అయింది. జీవకారుణ్య సిద్ధాంతాన్ని బోధించిన బుద్ధుడు సైతం మొదట స్త్రీలకు గౌరవం ఇవ్వలేదు. * వారిని తన సంఘంలో భిక్షువులుగా చేర్చుకోలేదు. నిన్న మొన్నటివరకు స్విట్జర్లాండు వంటి దేశంలో స్త్రీలకు ఓటు హక్కు లేదు. మనదేశంలో ప్రతి కర్మాగారంలోను పురుషునితో సమానమైన కూలి స్త్రీ కార్మికులకు లేదు ఎంతో నాగరికత సాధించాం అని అనుకుంటున్న మనం ఉద్యోగం చేసే స్త్రీలు కొన్ని కొన్ని ప్రాంతాల్లో ఎంత గౌరవం పొందుతున్నారో తెలుసుకుంటూనే వున్నాం. భార్యగా, తల్లిగా ఆమె ఎంత గౌరవాదరణాలు పొందగలుగుతుందో మనం గ్రహిస్తూనే వున్నాం. భర్తలేని స్త్రీ బయట ప్రపంచంలో ఎంత గౌరవ మర్యాదల్ని పొంద గలుగుతుందో మనకు తెలుసు. స్త్రీకి స్వతంత్రత లేకుండా పోయింది. స్త్రీకి పురుషుడే ఆలంబన. పురుషుని తోడు లేని స్త్రీని సమాజం హీనంగా చూస్తుంది అంటే మనం ఆశ్చర్యపడాల్సిన పనేంలేదు దీనికి మూలకారణం స్త్రీ పురుషుని బానిస అనే మూఢ నమ్మకమే. అనాదిగా స్త్రీ పురుషుడి దోపిడికి గురవుతూనే వుంది. స్త్రీ వ్యక్తిత్వానికి, స్వాతంత్ర్యానికి గౌరవం లేకుండా పోయింది. సమాజంలో సగభాగమైన స్త్రీ- ఉత్పత్తిలో ప్రధానమైన భాగం నిర్వహించే స్త్రీ సమాజంలో అట్టడుగు దిశలో అనాగరికంగా చూడబడింది. ఎవరు ఎన్ని చట్టాలు చేసినా అభి వృద్ధి కాముకులమనేవారు ఎన్ని ఉపన్యాసాలు వల్లించినా, ఎన్ని గ్రంథరాజాలు వచ్చినా స్త్రీ విలువ మాత్రం ఇప్పటికీ మారలేదనే చెప్పాలి. స్త్రీ పురుషుని బానిస. స్త్రీ కేవలం వంట ఇంటిమనిషి. బిడ్డల్ని కనే యంత్రం అనే ఆ మూఢ నమ్మకాలు పోయి సమాన స్థాయిలో చూడగలిగినప్పుడే అభ్యుదయం.

---

*** Keep away from woman do not even look at them for they are dangerious said their master (Buddha) long ago.**

**(Discovery of India Page - 172.)**

# 10. కట్నాలు - కానుకలు

కట్నం - కానుక రెండూ రూపాంతర శబ్దాలే. ఇతరులకు శుభకార్యాది సమయాల్లో ఇచ్చేవి కానుకలని సామాన్యంగా అంటారు. వివాహ సందర్భంలో వరుడుకి వధువు తల్లిదండ్రులు కొంత నగదు రూపంలోనో వస్తు వాహనాల రూపం లోనో ఇచ్చేవి కట్నాలు అని వ్యవహరించటం కద్దు. వివాహ సమయంలో వరుని కిచ్చేది కట్నం అని వధువుకు ఇచ్చేది శుల్కం (కన్యాశుల్కం) అని పిలుస్తారు. వివాహం అయిన తరువాత వధువు తండ్రి వధువుకు ఇచ్చే సంబారాన్ని అరణం అంటారు.

పురాతన కాలంనుండి ఈ కట్న-కానుకలు వివాహ వ్యవస్థలో ప్రధానమైన అంశంగా వస్తూనే వున్నాయి. గత కాలంలో వరునికి కట్నం ఇవ్వడం కంటె వధువుకు శుల్కం ఇవ్వడం ఎక్కువగా కనిపిస్తుంది. నవాబులు, ఆంగ్లేయులు మన దేశాన్ని పరిపాలించే కాలంలో బాలికలకు అతి తక్కువ వయసులో వివాహం చేసేవారు. పెళ్ళి అయిన స్త్రీకి బిడ్డలు పుట్టకపోయినా, అణకువగా వుండక పోయినా ఆమెను వదిలిపెట్టి మరొక స్త్రీని వివాహం చేసుకోవటం, బహుభార్యాత్వం కూడా వుండేది. ఈ పరిస్థితులచేత బాలికల్ని కొనుక్కోవడం జరుగుతుండేది. కొన్ని ప్రాంతాలలో పెళ్ళి సమయంలో బాలిక తల్లిదండ్రులకు ఇచ్చే ధనాన్ని 'వోలి' అని వ్యవహరించుతారు.

ప్రస్తుత వ్యవస్థ వరుడికి అనుకూలంగా వుంది. వరుడు ఎంత సంపాదన పరుడైతే అంత ఎక్కువ కట్నం. ఎంత ఎక్కువ చదువు, ఎంత ఎక్కువ వుద్యోగం అంటే అంత ఎక్కువ కట్నం. సంస్కారం - విజ్ఞానం, అందచందా లతో పని లేదు. 'వరకట్నం' నిషేధించటం- చట్టం చేయడం రాజ్యాంగ వ్యవస్థ లోని అంశం అయినప్పటికి వివాహ సమయంలో వరకట్నం మాత్రం బాహాటంగా సాగుతూనే వుంది. అధికార, అనధికారులు సైతం ఈ అంశంలో భాగస్వాములు కాక తప్పడంలేదు. మా అబ్బాయికి ఎంత కట్నం ఇచ్చారో తెలుసా అని ఇతరుల ముందు తమ పరువు ప్రతిష్ఠలు పెరిగినట్లు భావించడం- తక్కువ కట్నం తీసు కున్నవారిని 'అయ్యో' ఇంతేనా అని ఎద్దేవా చెయ్యటం నేటి సామాజిక వ్యవస్థలో

ఒక దాగింగా తయారయింది. ఎక్కువో, తక్కువో మొత్తానికి కట్నానికిమాత్రం ప్రాధాన్యం తప్పదు. కట్నంలేని పెళ్ళి నేటి వ్యవస్థలో పెళ్ళిగా పరిగణించడం లేదనే చెప్పాలి.

శారదా బిల్లు మన దేశంలో ప్రవేశపెట్టిన సమయంలోనూ అంతకు పూర్వం కన్యాశుల్కం అమల్లో వుండేది. దీన్నే పాపం గిరీశం 'సెల్లింగ్ గర్ల్స్' అని వాపోతాడు కన్యాశుల్కం నాటకంలో.

అగ్నిహోత్రావధాన్లు తన కుమారుడు వెంకటేశానికి కానీ ఖర్చు లేకుండా అంటే వాడికి కాబోయే భార్య తండ్రికి డబ్బు ఇవ్వకుండా, కనాశుల్కం చెల్లించ కుండా వివాహం చేస్తానని చెపుతాడు. అగ్నిహోత్రావధాన్లు బావమరది కరటక శాస్త్రి అంగీకరించకపోగా ఈ విధంగా అంటాడు.

"దమ్మిడి ఖర్చు లేకుండా కొడుక్కి పెళ్ళి చేస్తావుటోయ్ బావా ? ఆడపిల్లల్ని అమ్మినట్టే అనుకున్నావా యేమిటి ? పదిహేనొందలైనా పోస్తేనే గాని అబ్బికి పిల్ల నివ్వరు." 1

మగువ మాంచాల పల్నాటి వీరభారతంలో చిరకీర్తి ఆర్జించిన మహిళ. మాంచాల తల్లి రేఖాంబ. బాలచంద్రుడు బ్రహ్మనాయుడు-ఐతాంబల కుమారుడు. బాలచంద్రుడు మాంచాలల వివాహానికి వారిద్దరు కట్నకానుకల గురించి ఈ విధంగా చర్చించారు.

"ఊరికే ఇస్తాననుకుంటున్నావా నా పిల్లని, మాంచాలని.

"ఏం కావాలో అడుగు వదినా !"

"మణుగుడు బంగారు నూకలు కావాలి." 2

గాధి అనే రాజుకు ఒక అందమైన కుమార్తె ఉంది. ఒకనాడు ఋచీకుడు అనే ఋషిపుంగవుడు రాజును దర్శింప వచ్చి ఆమె సౌందర్యరూప లావణ్యానికి

---

1. కన్యాశుల్కం పు. 9

2. పల్నాటి వీరచరిత్ర పు. 185

ముగ్ధుడై తన కిచ్చి వివాహం చెయ్యమని ఆజ్ఞాపిస్తాడు. ఆ రాజు తన కుమార్తెకు కన్యాశుల్కం ఇమ్మని కోరతాడు

"అమలాత్మా నినువంటి ధన్యునకుఁ గన్యాదానముం జేయు భా
గ్యము సామాన్యమె యైనఁ జంద్రధవళాంగ శ్యామకర్ణాగ్రవా
హముల న్వేయి నొసంగఁగావలయుఁ గన్యాశుల్కమస్మత్కుల
క్రమమీ రీతి నొసంగు కైకొనుమిదె కన్యామణిన్నావుడున్" [1]

కన్యాశుల్కానికి పీఠిక రాస్తూ శ్రీ గురజాడ అప్పారావుగారు ఈ విధంగా చెప్పారు.

"ఈ మధ్య మద్రాసు హైకోర్టు తీర్పువల్ల సాంఘిక సంస్కరణోద్యమానికి గొప్ప బలం వచ్చింది. ప్రధాన న్యాయమూర్తి సర్ ఆర్నాల్డ్ వైట్, న్యాయమూర్తులు మిల్లర్, మన్రోలు ఈ విధంగా తీర్పు ఇచ్చారు. "ఒక పిల్లని వివాహం చేసుకునేందుకు తండ్రికి డబ్బు చెల్లించే ఒప్పందం నీతిబాహ్యం. ఇండియన్ కాంట్రాక్ట్ ఆక్ట్ 23 వ సెక్షన్ ప్రకారం చట్టవిరుద్ధం." [2]

కోర్టులు – శాసనాలు – పరిపాలనా వ్యవస్థలవల్ల నాటి కన్యాశుల్కం పోయిందేమో గాని నేటి వరకట్నం ప్రభుత్వం ఎన్ని శాసనాలు చేసినా అమలు జరపడంలో మాత్రం విఫలం అవుతూనే వుంది. వివాహ సందర్భంలో వరకట్నం ఇచ్చినా, పుచ్చుకున్నా నేరమే; శాసన ప్రకారం అమలు జరిగేది మాత్రం శూన్యం. దీనివల్ల వధువు తండ్రి తన కుమార్తె వివాహానికి అధికంగా ధనం వ్యయం చెయ్యాల్సిన పరిస్థితి వస్తుంది. చాలామంది సామాన్య కుటుంబీకులు, మధ్యతరగతివారు ఈ వరకట్న రాకాసికోరల్లో ఇరుక్కుపోతున్నారు. వివాహం చెయ్యడానికి కట్నం డబ్బు సేకరించలేక నిత్యం తమ ఎదుట తిరిగే వ్యక్తురాళ్ళైన ఆడపిల్లలకు వివాహాలు చెయ్యలేక, ఒకవేళ చేసినా వరకట్న మరణాలు ఆపలేక నేటి సమాజం లావాలా వుడికిపోతుంది. కలవాడు ఏదోవిధంగా తన కుమార్తెకు పెళ్ళి చేయగలుగుతాడు. కట్నకానుకలు అరణాలు చెల్లించగలుగుతాడు. పాపం ఇబ్బందుల పాలయ్యేది నిర్భాగ్యులైన పేదవాళ్ళే కదా !

---

1. దశావతార చరిత్ర – 6–12.
2. గురజాడ రచనలు–లేఖలు పు. 42.

వివాహం చెయ్యటం ఒక ఎత్తు వివాహం అయిన తరువాత వరుడికి కానుకలు చెల్లించడం మరో ఎత్తు. ఇందులో అత్తల కట్నాలు, ఆడపిడ్డల కట్నాలు, ఇంకా అనేక రకాలైన కోరికలు ఈ సమయంలోనే వస్తాయి. చుట్టాల మర్యాదలు, చీరెలు, సారెలు, సంసారానికి కావలసిన వస్తువులు ఈ అరణంలోకే వస్తాయి.

కౌంతేయుడైన అర్జునునకు యాదవ వంశస్థులు బలరామకృష్ణుల సోదరి సుభద్రకు జరిగిన వివాహ సందర్భంలో కృష్ణుడు అర్జునున కిచ్చిన కట్నకానుకలు వివరాలు ఈ విధంగా వున్నాయి.

> "అవిరళక్షరిత దానార్ద్రి గండస్థల
> గజసహస్రంబును గనకరత్న" [1]

వరూథిని మాయాప్రపంచ కుమారుడు స్వరోచి. గంధర్వరాజు ఇందీవ రాక్షుడు తన కుమార్తె మనోరమను స్వరోచికి ఇచ్చి వివాహం చేసిన సందర్భంలో కానుకలు ఇస్తాడు.

> "కోక కలహంస ముఖరి తాబ్జకరములు
> సిద్ధ చారణ గంధర్వ సేవితములు
> మందర ద్రోణి గొన్ని గ్రామములు హార్థి
> తనయ పసుపున కొసగె గంధర్వ విభుడు [2]

కుమార్తెలకు తండ్రులు, సోదరికి సోదరులు పసుపు కుంకం పేరుతో కొన్ని కానుకల్ని ఈ సందర్భంలో సమర్పించటం జరుగుతుంది వరకట్నానికి పురుషాధిక్యతే మూలకారణం. ఆర్థిక వ్యవస్థ పురుషుడి చేతిలో కేంద్రీకరింపబడి వుండటం మంచి ఆదాయమో లేక మంచి వుద్యోగంలోనో వున్న వరుడికె తమ కుమార్తెల్ని ఇవ్వడందా్వరా సుఖసంతోషాలు పొందుతారనే మిషతో ఈ వ్యవస్థ నాటికి నేటికి నిలిచిపోయిందనే చెప్పాలి. ఏ కొద్దికాలమో హిందూ మతోద్ధరణ కోసం జరిగిన వుద్యమంలో తప్ప ఎక్కువగా కన్యాశుల్కం కనిపించదు. ఒకవేళ ఎక్కడైన

---

1. ఆదిపర్వము – 8–221.
2. మనుచరిత్ర–5–102

ఈ కన్యాశుల్కం వున్నా అది కొన్ని వర్ణాలకు మాత్రమే పరిమితమైంది. ఏమైనప్పటికి వరకట్నం నేడు మండుతున్న అగ్నిగోళం. వివాహ వ్యవస్థలో వధూవరులకంటె, వారి గుణగణాల కంటె, అందచందాలకంటె వరకట్నానికే ప్రాధాన్యం వుంది. ఈ వరకట్న నిషేధానికి ప్రభుత్వం శాసనాలు చేసినా ఆచరణలో మాత్రం పూజ్యం. దీనికి సాంఘిక చైతన్యం కావాలి వరుడు తాను అమ్ముడుపోతున్నానని, వధువు ఈ వ్యవస్థలో కించపరచబడుతుంది అనే ఆలోచన కలిగినప్పుడు ఈ వరకట్నం పోవడానికి అవకాశం వుంది. స్త్రీలు స్వశక్తి పెంచుకొని వుద్యోగ వ్యవహారాల్లో ముందంజ వేసినప్పుడు ఈ వరకట్న ఆచారం పోక మానదు.

# 11. వర్ణవ్యవస్థ

వర్ణం అనే పదానికి రంగు అని అర్థం. రంగు విభేదాల కారణం చేతనే భారతదేశంలో వర్ణవ్యవస్థ ఏర్పడింది. ఈ వర్ణవిభేదాలే సాంఘిక విభేదాలకు కారణాలయ్యాయి.

"శ్వేతజాతులైన ఆర్యులు ఇండియాలో ప్రవేశించినపుడు నలుపు వర్ణులైన ఆర్యేతర జాతులవారు ఎందరో వుండేవారు. నల్లని ఈ ఆర్యేతర జాతుల్ని తెల్లనివారైన ఆర్యులు జయించి వారిని హీనంగా చూడటంతో సాంఘిక విభేదాలు అంకురించాయి. వేరు వేరు వృత్తుల్ని, వేరు వేరు తెగలవారు అవలంబించటంవల్ల ఈ విభేదాలు పెరగటానికి మూలకారణం అయింది. ఈ విధంగా రంగు (వర్ణ) భేదాలు, తెగ భేదాలు, సాంఘిక ప్రతిపత్తిలో భేదాలు అన్నీ కలిసి ఎన్నో వేల కులాలు హిందూ సమాజంలో ఆవిర్భవించటానికి దోహదం చేశాయి."[1]

మధ్య ఆసియానుంచి జీవనోపాధికై జట్లు జట్లుగా బయలుదేరిన ఆర్యజాతి చీలిపోకముందే వారిలో వర్ణ భేదాలు అంకురించాయి. అప్పటికే వారు రెండు - మూడు జాతులుగా చీలిపోయారని చరిత్రకారులంతా అంగీకరించారు. భారతదేశానికి వచ్చిన ఆర్యుల పవిత్రగ్రంథం ఋగ్వేదం కాగా ఇరాన్ వెళ్ళిన ఆర్యుల పవిత్ర గ్రంథం 'జెండ్ అవెస్త'. ఈ రెండు గ్రంథాల్లో వర్ణవ్యవస్థా బీజాలు వున్నాయి.

---

1. **Origin & growth of Caste in India - Page** 5

ఆర్యులు భారతదేశానికి రాక పూర్వం భారతదేశంలో ద్రావిడులు జీవించే వారు. వారు సింధునదీ పరీవాహక ప్రదేశం నుంచి దక్షిణాది వరకు వ్యాపించారు. వీరు గణాలు గణాలుగా జీవించారు. ఈ ఆదిమ గణతంత్ర రాజ్యంలో వర్ణవిభేదం లేదు; సాంఘికంగా హెచ్చు తగ్గులు లేవు. మాతృస్వామిక కుటుంబాలు అమలులో వున్నాయి. హారప్పా, మొహంజదారో తవ్వకాల్లో బయటపడ్డవారి సంస్కృతి వీరి జీవన విధానానికి ప్రతిబింబం.

మధ్యఆసియా నుంచి వచ్చిన ఆర్యులు హరప్పా, మొహంజదారులోని ద్రావిడులతో భయంకరమైన పోరాటాలు చేశారు. ఆధునిక యుద్ధపరికరాలు, అశ్వాల నధిరోహించి వారు చేసే నవీన యుద్ధ పద్ధతులకూ సంఖ్యా బలానికీ దేశ వాసులైన ద్రావిడులు నిలవలేకపోయారు. అటవీప్రాంతమైన దక్షిణ భారతదేశానికి వచ్చి తలదాచుకున్నారు. క్రమంగా ఆర్యులు వారిని తరుముతూ వింధ్య పర్వత ప్రాంతం వరకు వ్యాపించారు ఇందుచేతనే మొదట ఆర్యావర్తాన్ని వింధ్య పర్వత పాదం వరకూ వర్ణించారు.

ఆర్యులు ద్రావిడులను విజితులుగా చేసి దాసులుగా చేసుకున్నారు. ఆర్యుల ముఖ్యవృత్తి పశుపోషణ. భారతదేశం వచ్చి స్థిరనివాసం ఏర్పాటు చేసుకున్న తరువాత వ్యవసాయం ముఖ్యవృత్తి అయింది. వారి పశువులను మేపటానికి, వ్యవ సాయంలో సాయం చేయటానికి విజితులైన ద్రావిడులను వుపయోగించుకున్నారు. వీరిని దస్యులని, దాసులనీ వ్యవహరించారు. ఋగ్వేదంలో ఈ పేర్లు పేర్కొన బడ్డాయి.

ఆర్యుల ముఖ్య గ్రంథాలు వేదాలు. అందులో మొదటిది ఋగ్వేదం. భారతదేశానికి రాకపూర్వమే వీరు మూడుతెగలుగా జీవించారు. 'ఆర్యా స్త్రైవర్ణి కాః' అని ఋగ్వేదంలో చెప్పబడింది. అవి వరుసగా బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులుగా వివరించబడింది వీటితోపాటు మూడు వేదాలు (ఋగ్, యజుస్, సామ) అమలులో వున్నాయి

ఆర్య సమాజంలో బ్రాహ్మణులు ముందుగా పేర్కొనబడ్డారు. తరువాతి స్థానం క్షత్రియులది. చివరి స్థానం వైశ్యులది. యజన-యాజనాలు బ్రాహ్మణుల వంతు కాగా రక్షణ క్షత్రియుల వంతు అయింది. మిగిలిన పశుపోషణ, వ్యవ

సాయం వైశ్యుల పని. వారు చేసే పనినిబట్టి- పనుల విభాగాలనుబట్టి ఈ రకంగా వింగడించబడ్డారు. ఈ దశలో వైశ్యులు కింది వర్ణంగా రూపొందారు.

ఈ దశలో భారతదేశానికి వచ్చిన మూడు వర్ణాలవారైన ఆర్యులు అనార్యులైన ద్రావిడులను, భారతదేశంలోని ఇతర జాతులవారిని (కిరాతులు, మక్ ఖ్మేరులు, నిషాదులు, నాగులు మొదలైనవారిని) జయించి తమ బానిసలుగా చేసుకున్నారు. తమ పశుపోషణ, వ్యవసాయపు అవసరాలకు ఉపయోగించుకున్నారు. ఈ వర్గాన్ని నాలుగో వర్ణంగా సృష్టించి వారిని శూద్రులు అని వ్యవహరించారు ఋగ్వేదంలోని పురుషసూక్తం 12 వ ఋక్కు ఈ విధంగా వర్ణించింది.

బ్రాహ్మణోస్యముఖ మాసేత్
బాహూరాజన్య కృతః
ఊరూతదస్యయ ద్వైశః
పద్భ్యాగ్ శూద్రో అజాయతే

భగవంతుని ముఖం నుంచి బ్రాహ్మణులు, బాహువుల నుంచి క్షత్రియులు, ఊరువుల నుంచి వైశ్యులు పాదాలనుంచి శూద్రులు జన్మించినట్లుగా వివరించారు.

ఈ పురుషసూక్తం క్రీస్తుపూర్వం 8 వ శతాబ్దంలో రచించబడిందని శాస్త్రవేత్తల అభిప్రాయం.

పై వివరణలనుబట్టి ఆర్యులు భారతదేశం వచ్చేనాటికి విభేదాలు వున్నాయి. అయితే వారు చేసే పనినిబట్టి పని విధానాన్నిబట్టి విభజించబడ్డాయి. తరువాత క్రమక్రమంగా స్థిరపడిపోయి జన్మక్రమంగా ఏర్పడ్డాయి అనగా యజన యాజనాలు చేసే బ్రాహ్మణునకు కలిగిన సంతానం బ్రాహ్మణులుగాను, రక్షణలో వున్న క్షత్రియ విభాగానికి కలిగిన సంతానం అంతా క్షత్రియులుగాను, పశుపోషణ వ్యవసాయంలో వున్న వైశ్యులకు కలిగిన సంతానం వైశ్యులుగా, సేవాధర్మావలంబులైన శూద్రులకు కలిగిన సంతానం అంతా శూద్రులుగానూ అభివర్ణించారు.

"తమకన్న ఉన్నతస్థాయిలో స్థిరనివాసులైన ద్రావిడాదిమ వాసుల్తో ఆర్యులకు దగ్గర సంబంధాలు ఏర్పడటంవల్ల ఆర్యసంఘంలో వ్యవసాయం, చేతివృత్తులు, అభివృద్ధి చెందాయి. కాలువలు త్రవ్వటం, నీరు పెట్టటం పంటె పసుల్ని పీరివద్ద

నుంచి ఆర్యులు నేర్చుకున్నారు. అనేకమైన చేతివృత్తుల్ని ఆర్యులు అలవరచుకున్నారు. తత్ఫలితంగా ముత్యాల పనివారు, కంసాలులూ, మేదరులూ, కమ్మరులూ, చాకళ్ళు, మంగళ్ళు, చర్మకారులూ, తాళ్ళు పేనేవారూ, విల్లమ్ములు, రథాలు చేసేవారు యిత్యాది వృత్తులవారు ఆర్యసంఘంలో వునికిలోకి వచ్చారు." [1]

నాలుగు వర్ణాలుగా పేర్కొనబడిన వాటిలో అనేకమైన శాఖలు - విభాగాలు చోటు చేసుకున్నాయి. శ్రమ విభజన ఆధారంగా వృత్తివిద్యలు నేర్చిన అనేక మంది ఆర్యవర్గంలోనివారు సైతం ఆయా వృత్తివిద్యాకారులుగా వ్యవహరించబడ్డారు. కాలక్రమేణా నీచవృత్తులు అవలంబించినవారు శూద్రులకంటె నీచులుగా పరిగణించబడ్డారు. వీరిని నీచులుగా, అధములుగా, అంత్యజులుగా, అంత్యేవాసులుగా వ్యవహరించారు. వీరినే తరువాత కాలంలో పంచములు అని పిలిచారు.

ఆర్యసంఘంలో రానురాను వృత్తి విభజన, వృత్తివిభేదాలు ఏర్పడ్డాయి. వ్యవసాయం చేసే కర్షకులు, గోవుల్ని కాచే గోపాలురు ప్రత్యేక శాఖలుగా ఏర్పడ్డారు. వృత్తి విద్యకు గల ప్రత్యేకత ద్వారా వృత్తి విశిష్టత, వర్గవిశిష్టతా ఏర్పడ్డాయి. క్రమంగా వీరందరూ వృత్తి విభాగాల్నిబట్టి ముందు వర్ణాలుగా తరువాత కులాలుగా ఏర్పడ్డారు. చేసే వృత్తినిబట్టి గౌరవం ఆధారపడి వుండేది

ఆర్య గ్రామాల్లో ధనికులైన వైశ్యులు నగరాల్లో నివాసం ఏర్పరచుకొని వర్తకమే ప్రధానవృత్తి కలవారు కాగా పేదలైన వైశ్యులు పల్లెలలోనే వ్యవసాయం, పశుపోషణ ముఖ్యవృత్తులుగా జీవించేవారు.

ఈ విధంగా ఏర్పడిన వర్ణవ్యవస్థ తరువాతి కాలంలో నమ్మకంగా ఏర్పడిపోయింది. జీవపరిణామ సిద్ధాంతం ప్రకారం మానవుని ఉత్పత్తి క్రమంలో ఎటువంటి తేడా లేదు. వేదాలు, బ్రాహ్మణాలు, స్మృతులు - శ్రుతులు - పురాణాలు మొదలైన ఆర్యగ్రంథాలు ప్రజలపై రుద్దిన సిద్ధాంత తత్వాలవల్లనే ఈ వర్ణవ్యవస్థ మూఢనమ్మకంగా ఏర్పడింది. ఉత్పత్తి మొదట మనవారు గమనించలేకపోయారనే చెప్పాలి. భగవంతుని శరీర అంగాలనుండి బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులు జన్మించారని చెప్పిన వేదాలు ఎంతవరకు నిజాన్ని వెలువరించాయి? అయితే అగ్ర

1. **An introduction to Indology - P. 105.**

వర్ణజులైన బ్రాహ్మణులు యజన యాజన కర్మలను చెయ్యటంద్వారా ప్రజలపై కలిగించిన భావనే ఈ రూపానికి నాంది పలికింది. సంస్కృతభాష అభివృద్ధి కావడం, వేదాలన్నీ సంస్కృతంలోనే రచించబడటం కింది వర్ణాల వారికి అది అందుబాటులో లేకపోవటం, సంస్కృతం బ్రాహ్మణులకు మాత్రమే పరిమిత మవటం దీనికి కారణాలు. తరువాతి కాలంలో వర్ణవ్యవస్థ మూఢనమ్మకంగా ఏర్పడింది.

మనువు తన కాలంలో అమలులో వున్న వృత్తి పనివారిని గురించి ఈ విధంగా వివరించాడు.

"ఈ క్రింది వృత్తి పనివారిని మను స్మృతికారుడు ఉటంకించాడు. చోరులు, గాయకులు తక్షకులు ( వడ్రంగివారు ) వార్ధుషిక ( వడ్డీ వ్యాపారులు) చికిత్సక, మృగయు (వేటగాళ్లు) శైలూష, తన్నవాయ (కసాయి) కర్మార (కమ్మర్లు) నిషాద, రంగావతారిక, సువర్ణకార (కంసాలులు), వేణు (పిల్లనగ్రోవి చేసేవారు) శస్త్ర విక్రయీ (ఆయుధాలు అమ్మేవారు) శ్వవాన్ (కుక్కలు పెంచే వాళ్ళు) రంజక (అద్దకపు పనివాళ్లు) కారుక (మేదరి పనివాళ్లు) యిత్యాదులుండే వారు. వీరి ఇళ్ళలో ఎలాంటి పరిస్థితులలోనూ బ్రాహ్మణులు భోజనం చేయరాదని మనువు శాసించాడు. చికిత్సక (వైద్యులు) పుంశ్చలీ (వ్యభిచారిణి) వడ్డీ వ్యాపారి, శస్త్ర విక్రేతలు పెట్టే అన్నాన్ని మనువు మలంతో (పెంట) పోల్చిన విషయం గమనార్హం. [1]

వైద్యవృత్తి నేడు పరమ పవిత్రంగా ప్రాణప్రతిష్ఠకు మూల సాధనంగా భావించబడుతుంది. నాడు ఈ వృత్తికారులు ఎందుకు బ్రాహ్మణులచే ద్వేషింపబడ్డారు ?

వైద్యశాస్త్రంతో ప్రమేయం వున్న వారందరూ దాదాపు ప్రకృతి నియమాలపై ఆధారపడిన విజ్ఞానశాస్త్రాన్నే అనుసరించారు. వైశేషిక కర్త అయిన కణాదుని మొదలు ధన్వంతరి వరకూ అందరూ శరీరం కణనిర్మితమైనదని అంగీకరించారు. వారు కర్మ సిద్ధాంతాన్ని అంగీకరించలేదు. జీవి ప్రాణాపాయస్థితిలో నున్నపుడు వర్ణధర్మాలు పాటించకుండా తరతమ భేదం లేకుండా వైద్యులు చికిత్సకు పూనుకుంటారు. అందుచేత పురోహిత వర్గం వైద్యులపై దాడి చేసింది.

ఈ విధంగా వర్ణవ్యవస్థ ఏర్పడి ప్రజలలో నమ్మకంగా రూపుదిద్దుకుంది.

---

1. వర్ణవ్యవస్థ పు. 109,

సంస్కృత విద్య అందరికి అందుబాటులో లేకపోవటం చేతనే విద్య నేర్చిన బ్రాహ్మణుడు చెప్పిన మాటలే వేదంగా భావించటం జరిగేది.

దైవాధీనము త్రిజగము
దైవము తన్మంత్రవశము తన్మంత్రము భూ
దేవతల చేతి దగుటను
దైవములకు దైవతములు ధరణీ దివిజుల్.[1]

"వేదముకన్న వేరు మంత్రము లేదు. శూద్రునికి మంత్రాధికారము లేదు. మంత్రాధికారము లేనందున వారికి సర్వకర్మలు అమంత్రకముగనే యుండవలెను".[2]

శూద్రులకు అన్ని మంత్రాధికారాలు నిషేధించబడినవి. కలియుగంలో శూద్రుల ధర్మం

"కలియుగము దుష్టయుగమంట కల్ల మాట
కలియుగము వంటి మంచి యుగంబు లేదు
సతికి పతిభక్తి వలన మోక్షంబు గల్గు
శూద్రులకుఁ గల్గు విప్ర శుశ్రూష వలన"[3]

విప్రులకు సేవలు చేయటమే శూద్రుల ధర్మం.

పుష్పగిరి ఒక బ్రాహ్మణాగ్రహారం. వీరబ్రహ్మేంద్రస్వామి శిష్యుడు సిద్దయ్య. సిద్దయ్య అగ్రహార వీధి మధ్య నుంచి ప్రణవాక్షర మంత్రం జపిస్తూ వెళ్తుండగా బ్రాహ్మణులందరూ సిద్ధయ్యను

తరుణీ శూద్రాదుల క
క్షర యోగ్యత నీవు ధర్మశాస్త్రములం దుం
దుర కడవు నీవు ప్రణ వా
క్షరముం బలుకుటలు సాహసంబగుఁగాదె,

1. నృసింహపురాణము 1-99.
2. హిందువుల పండుగలు పు. 5.
3. ధర్మఖండము 1-282.

తురకవాడు ప్రణవాక్షరం పలకటం సాహసమని నిందిస్తూ

"ప్రణవ సహితంబులైన మంత్రములు సదువ
బ్రాహ్మజాతికి బ్రహ్మ నిర్ణయముగాఁగ
నీచ కులజుల కించుకేనియుఁదగునె
గోవధా జీవియౌ తురుష్కునకుఁ దగవె" [1]

పూజ్యమగు గోవును వధించు తురకవానికి మంత్రాధికారము లేదు. అది బ్రాహ్మణులకు మాత్రమే పరిమితం.

తెలుగు సాహిత్యంలో రచించబడ్డ గ్రంథాలన్నింటిలోనూ గ్రామ లేక పట్టణ వర్ణనలో వర్ణవ్యవస్థ వివరించబడింది. ముందుగా బ్రాహ్మణులను, తరువాత క్షత్రియులను పిదప వైశ్యులను చివరికి శూద్రులను వర్ణించటం జరిగింది. తిక్కన వంటి మహాకవి శూద్రులను తన గ్రంథాలలో వర్ణించలేదు. వారిని వదలి వేయటం జరిగింది. వీరితోపాటుగా పుష్పలావికలను చివరిగా పౌర విలాసినులను తమ తమ గ్రంథాలలో వివరించారు.

కూచిమంచి జగ్గకవిలాంటి తిట్టు కవులు మాత్రం ఈ వర్ణవ్యవస్థ సోపానాలను వదలి తన చంద్రరేఖా విలాపంలో,

"మధురతర మదిరాపాన మదభరాతి
ఖేలబాలిశ చండాల జాల తాద్య
మానతూర్య నినాద సమన్వితంబు
పాప చయవల్లిమాల బెస్తాపుపల్లి" [2]

చండాలురను, మాలలను, బెస్తలను వర్ణించటంతో కొత్తరూపు దిద్దుకుంది. ఇది అపహాస్యానికి నిదర్శనం.

ఈ విధంగా వర్ణ వ్యవస్థా పాకం ముదిరి మన రక్తంలో అణువణువునా జీర్ణించే విధంగా శాస్త్రిలు నూరిపోశాయి. ఈ వర్ణవ్యవస్థను నాశనం చేయటానికి అనాదికాలం నుండి లోకాయతులు, చార్వాక, జైన - బౌద్ధాలు ప్రయత్నించాయి.

---

1. శ్రీ వీరబ్రహ్మేంద్రస్వామి చరిత్ర 4-52, 99.
2. చంద్రరేఖా విలాపము 1-41.

లోకాయతులు- చార్వాకులు భగవంతునికి అస్తిత్వం లేదు. మానవులందరూ ఒకటే అన్నారు. బుద్ధుడు సంఘబలంతో వర్ణవ్యవస్థను మూలచ్ఛేదం చేయాలని ప్రయత్నించాడు. వర్ణవ్యవస్థను ఖండించిన బుద్ధుడు అందరి మానవుల పుట్టుక ఒక్కటే అని, జీవపరిణామంలో గాని చావు పుట్టుకల్లోగాని తేడా లేదని, అందుచేత సమాజంలో వొకరు ఎక్కువని గాని, మరొకరు తక్కువని గాని, హీనమని గాని భావించటం నీచం అంటాడు. అయితే వైదికమత ప్రాబల్యంతో పై సంఘాలన్నీ నాశనమయ్యాయి.

అత్యంత కృత్రిమమైన ఈ వర్ణవిభాగం నుండి అనేక వందల వేల కులాలుగా చీలిపోయిన నేటి భారతజాతి నికృష్టదశలో మగ్గుతున్నదనే చెప్పాలి. ఈనాడు అనేక ప్రాంతీయ ధోరణులు, అనేక సామూహిక అకృత్యాలు తలెత్తుతున్నాయి. అనేక కులసంఘాలు వెలిసాయి గ్రామస్థాయి నుండి జాతీయస్థాయి వరకు కుల సంఘాలు కుక్కగొడుగుల్లా పుట్టుకొస్తున్నాయి.

శ్రమవిభజన కోసం ఏర్పడిన ఈ వర్ణవ్యవస్థ నేటి దశలో అనేక వేల లక్షల కులాలుగా మారి భారతజాతిని ముక్కచెక్కలుగా చేసిందనటంలో విప్రతిపత్తి లేదు. ప్రాచీనకాలం నుండి నేటివరకు అనేక ప్రగతివాదులు ఈ ప్రయత్నంలో తమ ప్రాణాలు ధారపోశారు.

భారతదేశంలో జన్మించిన మనమంతా భారతీయులమే. జీవపరిణామ క్రమంలో మనుషులందరూ ఒక్కటే వర్ణదృక్పథం, కృత్రిమం అనే అభిప్రాయం కలిగిననాడు తరతరాల నుంచి వ్యాపించిన ఈ వ్యవస్థ ఛిన్నాభిన్నమై మనమంతా ఒక్కటే అన్న అభిప్రాయం కలగక మానదు.

**అ స్పృ శ్య త :**

ఆర్యులు భారతదేశానికి వచ్చిన తరువాత నాలుగు వర్ణాలు ఏర్పడ్డాయనే విషయం వర్ణవ్యవస్థవల్ల తెలుస్తుంది. అయితే తరువాతి కాలంలో అయిదవ వర్ణంగా పేర్కొనబడ్డ పంచములు అనే వర్ణం ఎలా ఉనికిలోకి వచ్చిందో తెలుసుకుందాం.

స్పృశ్యత అంటే తాకతగినది అంటతగినది అస్పృశ్యత అనగా అంట రానిది. తాకతగనిది. దీనినిబట్టి అస్పృశ్యుడు అనగా అంటరానివాడు అని అర్థం. సమాజంలో కొంతమంది వ్యక్తులను (వర్ణం) తాకరాదనే నియమం ఏర్పాటుచేయటం చేతనే ఈ పేరు వచ్చింది.

పంచములను గురించి వేదాల్లో ఎక్కడా వ్యవహరించలేదు. దీనినిబట్టి వేద యుగంలో పంచములు గాని అస్పృశ్యులుగాని లేరు "హిందూసమాజంలో కని పించే పంచములు నిషిద్ధదేశానికి చెందిన నిషాదులకు ఆర్య స్త్రీలకు జన్మించినవారు" అని సోవియట్ పండితుడు 'ఇలిన్' అభిప్రాయపడ్డారు

వృత్తి విద్యలద్వారా కరుడు గట్టిన వర్ణవ్యవస్థలో భాగమే ఈ పంచములు. క్రమంగా నీచవృత్తులు అవలంబించినవారు అధములుగా, అంత్యజులుగా, అంత్యే వాసులుగా పేర్కొనబడ్డారు.

అత్యంత నీచమైన పనులు చేయటానికి నియమించబడి, అస్పృశ్యులుగా చూడబడి గ్రామదండాలురుగా గుర్తించబడిన వీరు శూద్రబానిసల కన్న నికృష్టమైన జీవితాన్ని గడిపారు. శవాలపై కప్పిన బట్టలే వారి దుస్తులు. చచ్చిన జంతువుల కళేబరాలే ఆహారం. ఊరి బయటే నివాసం ఈ విధంగా పంచములు అనబడే వీరు నీచంగా చూడబడ్డారు

మౌర్యయుగంనాటి కౌటిల్యుని అర్థశాస్త్రంలో వీరిని గురించిన వివరణ ఈ విధంగా వుంది.

కౌటిల్యుడు తన అర్థశాస్త్రంలో నాలుగు వర్ణాలతోపాటు మరికొన్ని హీన జాతులవారిని కూడా వర్ణించాడు. వారు శూద్రులకన్న హీనులని వివరించాడు. బహుశా వీరు శూద్రులకు ఇతర వర్ణాలవారికి పుట్టినవారు అని శాస్త్రవేత్తలు భావిం చారు. వర్ణసంకరత గలిగిన వీరి జీవన పరిస్థితులు హీనాతిహీనంగా వున్నాయన టంలో సందేహం లేదు. వీరిని కౌటిల్యుడు అంత్యావాసులు అని వర్ణించాడు. అనగా గ్రామాలకు చివర నివసించేవారు అని అర్థం. వీరే పంచములు-చండాలురు- శ్వపచులు. వీరికి పొలంలో మిగిలిన తాలూ తప్ప, కుళ్ళిన కల్లు యివ్వాలని శాసించాడు వీరి పరిస్థితి శూద్రబానిసల కన్న అధ్వాన్నంగా వుంది. శూద్రులు

అగ్రవర్ణాలకు బానిసలైతే వీరు సమాజం మొత్తానికే బానిసలే. వర్ణవ్యవస్థ చరిత్రలో మొట్టమొదటిసారిగా పంచముల వివరణ మనకు మౌర్యయుగంలోనే కన్పిస్తుంది.

మను ధర్మశాస్త్రంలో చండాలురు అనబడే పంచమజాతి గురించి వివరించబడింది. వారి ధర్మాలను మనువు ఈ విధంగా వివరిస్తాడు

"చండాలురు పీనిగమీద బట్ట కట్టుకోవాలి. కుండపెంకుల్లో అన్నం తినాలి. ఇనుపముక్కలు నగలుగా ధరించాలి. (10-52)

గ్రామాలకు బయట అత్యంత హేయమైన జీవితం గడపడంచేత, అగ్రవర్ణాలవారిని తాకటం లేదా వారితో కలసి జీవించటం అసహ్యాకరంగా భావించి వుంటారు. వారికి నియోగించబడిన ఆహార-పానీయాలు, ఆచార వ్యవహారాలు ఈ పరిస్థితిని కలిగించి వుంటాయి. అందుచేత ఈ అంటరానితనం అమలులోనికి వచ్చింది.

తెలుగు సాహిత్యంలో అస్పృశ్యత గురించి చర్చ హెచ్చుగానే జరిగింది.

అంబేద్కర్ నిమ్నజాతులకు నాయకత్వం వహించిన సంఘ సంస్కర్త. ఆయన నాయకత్వంలో 19-3-1927 వ సం॥లో బొంబాయి రాష్ట్రంలోని మహద్ మున్సిపాలిటీలోని 'చౌదార్' అని పిలవబడే చెరువులోని నీరు ఐదువేలమంది హరిజనులు తాగారు.

"మహద్ పోరాటం విజయవంతమై నిమ్నజాతుల వారంతా తమ తమ ప్రాంతాలకు వెళ్ళిపోయారు మహద్ గ్రామంలోని అగ్రవర్ణస్తులంతా ఒకచోట సమావేశమై అస్పృశ్యుల ప్రవేశంవల్ల మైల పడిపోయిన 'చౌదార్' చెరువును పావనం చేసే విషయమై తీవ్రంగా ఆలోచించసాగారు. సనాతన పండితులంతా శాస్త్రాలు తిరగవేసి ఆఖరుకు చెరువును పావనం చేసే పద్ధతి కనిపెట్టారు. కొన్ని బక్కెట్ల ఆవు పేడ, మరికొన్ని బక్కెట్ల ఆవు మూత్రం, పెరుగు, నెయ్యి తీసికొని వెళ్ళి ఆ బ్రాహ్మణదళం వేదమంత్రాలు పఠిస్తుండగా ఆ మొత్తం చెరువులో కలిపారు." [1]

---

1. అంబేద్కర్ జీవిత చరిత్ర - పు 270.

బ్రాహ్మణ కన్యకు శూద్రునికి కలిగినవారు పంచములు లేక హరిజనులు అని, వీరు సంకర సంతానం అని కౌటిల్యుడు వ్యవహరించాడు. వారు బ్రాహ్మణులో లేక శూద్రులో అయి వుండాలి. కాని వారిని అస్పృశ్యులు, చండాలురు అని వ్యవహరించారు. ఇది స్వార్థపరవర్గాలు చేసిన సృష్టి,

విలోమ వివాహాల వలననే ఈ పంచములు ఏర్పడ్డారు.

"అనులోమంబునఁ బుట్టిన
తనయులకున్ ముఖ్య జాతిదగుఁ బ్రతిలోమం
బునఁ గలిగిన తనయులకున్
వినుమీ చండాలజాతి విస్పష్టముగన్" [1]

ఇటువంటి మూఢనమ్మకాలు మన చరిత్రలో చోటు చేసుకున్నాయి. వీరు గుడులలోనికి, బడులలోనికి పోకూడదని శాసనాలు విధించబడ్డాయి.

"గుడులలోనికిఁ బోవుట గూడదనిరి
బడులలోనికిఁ బోవుట పాపమనిరి
మడులఁ గట్టుకొనుట ధర్మమనిరి
చటుల దుస్తంత్ర వైదగ్ధ్య సారమార" [2]

బోయి భీమన్న ఆధునిక కవి. హరిజనుడు. ఆయన ఒకసారి తన మిత్రులు మహీధర రామమోహనరావుగారి ఇంటికి వెళ్ళటం తటస్థించింది ఆయనతో మాట్లాడిన తరువాత రామమోహనరావుగారు ఆ వూరు (అగ్రహారం) చివరి వరకు వచ్చి అక్కడ ఆగిపోయి ఈ విధంగా అన్నారు

"ఇంత జ్వరంలోనూ ఇక్కడదాకా ఎందుకు వచ్చానో తెలుసా ?" అన్నారు నవ్వుతూ.

"వీధి పొడుగునా అరుగులమీద చేరి మా బ్రాహ్మణులు చేస్తున్న పని చూసారుగా! అదే ఇక్కడ మా వాళ్ళ నిత్యకృత్యం. తాంబూలాలు వేసుకుంటూ పేకాడుకుంటూ ఉంటారు. ఎవరైనా కొత్తవాళ్లు కనిపిస్తే వీధిలో నిలవేసి అడుగుతారు. ఊరు,

1. ధర్మఖండము 3-94.
2. సూతపురాణము — పు 54.

పేరు, కులం, గోత్రం వగైరా. మీరు కొత్తవాళ్ళే కదా ! మిమ్మల్ని అడుగుతారు మీరు చెబుతారు. వాళ్ళు తన్నుతారు. అలా జరగటం నా కిష్టం లేదు. నేను ఉన్నాను కాబట్టి మీ గురించి ఎవళ్ళూ పట్టించుకోలేదు. ఇక వెళ్ళి రండి". [1]

ఇది స్వతంత్ర భారతదేశంలో జరిగిన సంఘటన. మన దేశానికి స్వతంత్రం వచ్చి అంటరానితనం నేరంగా పరిగణించబడ్డ తరువాత జరిగిన కథ.

గుర్రం జాషువాగారు జగమెరిగిన కవి. ప్రభుత్వం వారు ఆయన్ను పద్మ భూషణ బిరుదుతో సత్కరించడం జరిగింది ఆంధ్ర విశ్వవిద్యాలయం వారు కళా ప్రపూర్ణ బిరుదుతో గౌరవించారు పైగా ఆయన నవయుగ కవి చక్రవర్తి. అంత సన్మాన – సత్కారాలు పొందిన మహానుభావుడు అస్పృశ్యుడుగా తన ఆవేదన ఈ విధంగా వెలిబుచ్చారు

> నా కవితా వధూటి వదనంబు నెగాదిగఁ జూచి రూపు రే
> ఖా కమనీయ వైఖరులు గాంచి "భళీ, భళి" యన్నవాఁడే "మీ
> రే కుల" మన్న ప్రశ్న వెలయించి చివాలున లేచి పోవుచో
> బాకునఁ గ్రుమ్మినట్లగును పార్థివ చంద్ర వచింపసిగ్గగున్ [2]

ఈ హిందూ దేశంలో అస్పృశ్యులపై మిగిలిన వర్ణాలు చేసే దాడి చూసి ఆయన విపరీతంగా వ్యథ చెంది 'కసిరి బుసకొట్టు నాల్గు పడగల హైందవ నాగ రాజు' అన్నారు.

నాటికి నేటికి ఈ సమస్య అగ్నిగోళంలా మండుతుందనేది నిత్య సత్యం. హరిజనులపై దాడులు, వారి ఆస్తుల ధ్వంసం, హరిజన యువతులపై అత్యాచారాలు మనం అనుదినం వార్తాపత్రికల్లో చూస్తూనే వున్నాం. సభ్యసమాజం ఈ మూఢ నమ్మకాన్ని వమ్ము చేయాల్సిన అవసరం వుంది.

---

1. జన్మాంతర వైరమ్ పు.45
2. జాషువా ఖండకావ్యము 1-64.

# 12. విద్యావ్యాపకం

విద్యా విషయంలో భాష ప్రధానం. మనం భాషించే దాన్ని భాష అని పిలుస్తాం. 'భాష అంటే సంస్కృతాది భాషా విశేషాలు' అనే అర్థం. తెలుగు మన భాష. మన మాతృభాష. వ్యక్తి తాను జన్మించింది మొదలు తల్లి నుంచి నేర్చుకొని ఏ భాష వాడతాడో ఆ భాషను మాతృభాష అని పిలుస్తారు. మనం మాట్లాడే భాష ఏదైనా జీవద్భాష అయివుండాలి అంటే ఆ భాష చాలామంది నోళ్ళలో వుండాలి. వ్యవహారంలో వుండాలి. మన మాతృభాష అయిన తెలుగు విషయంలో భిన్నమైన రెండు విధానాలు కన్పిస్తున్నాయి. పురాతన కాలం నుంచి వచ్చిన గ్రంథాలలో వున్న భాష ఒకటి; వ్యవహారంలో వున్న భాష ఒకటి.

సంస్కృత భాషా పరిచయంలో నన్నయ తీర్చిదిద్దిన తెలుగుభాష వ్యవహారానికి దూరమై కేవలం విద్యావంతులకు మాత్రమే అందుబాటులో వుండే గ్రాంథిక భాషగా మారిపోయింది. కేవలం గ్రంథాలకు మాత్రమే పరిమితమై వ్యవహారంలో లేని భాషగా మిగిలిపోయింది. మిగిలిన పూర్వకవులందరూ నన్నయ వరవడిలోనే రచనలు సాగించారు. జాను తెనగు పేరుతో శివకవులు రచించిన గ్రంథాలు సైతం సంస్కృతచ్ఛాయను వదలలేదు. అచ్చ తెనుగు పేరుతో వెలసిన గ్రంథాలు కూడా సామాన్య వ్యవహారంలో చోటు చేసుకోలేదు. నన్నయ మొదలు చిన్నయ వరకు రచించిన గ్రంథాలు అన్నీ గ్రాంథిక భాషామయం అనడంలో సందేహం లేదు. వేమన వంటి సాంఘిక సంస్కరణవాదులు రచించిన పద్యకావ్యాలు సామాన్యుల్లో బాగా చోటు చేసుకున్నాయి. శివకవులు రచించిన వెన్నెల పదాలు శివ గీతికలు–తుమ్మెద పదాలు మొదలైనవి సామాన్యుల్లో చోటు చేసుకున్నాయి. కొందరు శతక కారులు రచించిన పద్యకావ్యాలు సామాన్యులకు అందుబాటులో వున్నాయి.

మొత్తం మీద గత భాషా చరిత్రను పరిశీలిస్తే పూర్వకాలంలో వచ్చిన గ్రంథ భాషా సాహిత్యం మొత్తం గ్రాంథికమే. అయితే ఈ గ్రాంథిక భాష సామాన్య వ్యవహారానికి దూరమైపోయింది. అందుచేత జనుల వ్యవహారంలో వున్న భాష జీవద్భాష అనే అభిప్రాయం నవ్యులకు కలిగింది. సామాన్య జన వ్యవహా

రంలో వున్న వ్యావహారిక భాషకు పట్టం కట్టటానికి జరిగిన ప్రయత్నమే వ్యావహారిక భాషా ఉద్యమం. ఆంగ్లేయులు సైతం ఈ రెండు భాషల్ని పరిశీలించి పరిశోధించి వ్యావహారిక భాషనే అంగీకరించారని తెలుస్తుంది.

"తెనుగు గ్రాంధికం మహా దుర్బలమైన ఒక భాషా ప్రక్రియ. సాంప్రదాయం దీన్ని వ్యర్ధంగా తెలుగువాళ్ళ మీద విధించిందని నా మతం. సంకెళ్ళను ప్రేమించేవాళ్లు, ఆ గ్రాంధిక భాషను ఆరాధిస్తారు గాక ! నాకు మాత్రం నా మాతృభాష జీవద్భాష. ఇది ఇటాలియన్ ఆఫ్ ది ఈస్టు. ఈ జీవద్భాషలో మన సుఖాల్ని, దుఃఖాల్ని వెల్లడించుకోవానికి మనం ఎవరం సిగ్గు పడటం లేదు. కాని దీన్ని వ్రాయడానికి మాత్రం కొంతమంది బిడియపడుతున్నారు. వ్యావహారిక భాషలో వున్న సాహిత్యం రైతును మేల్కొలుపుతుంది. భారతదేశంలో వున్న ఆంగ్లేయుడి గుండె కదుపుతుంది". [1]

మన మనసులో కలిగిన భావావేశాన్ని మనం సామాన్యంగా వ్యావహారికంలో వెల్లడించగలం గానీ సంస్కృత భాషా పరిచయంతో అనలువేసి పెరిగిన గ్రాంథిక భాషలో మాట్లాడలేం కదా. యతిప్రాస, గణాధికారంతో సాగిన గ్రాంధిక భాష కొన్ని కొన్ని సందర్భాలలో పండితులకు సైతం అర్థం కాని రీతిలో రచించబడ్డ కావ్యాలు కోకొల్లలు. శబ్దాలంకార చమత్కారాలతో, అర్థాలంకార భావ విశేషణాలతో రాయబడ్డ నాటి కావ్యాలు నేటి పండితమ్మన్యులు కూడా నిఘంటు శోధనలో మునగక తప్పడం లేదు.

వ్యావహారిక భాషా పుద్యమాన్ని గురించి కన్యాశుల్కం నాటకం రెండవ కూర్పుకు పీఠిక రాస్తూ శ్రీ గురజాడవారు

"వివిధ భావ వ్యక్తీకరణకు కావలసినంత మేర వున్న భాష వ్యావహారికం. దీని సౌకుమార్యానికి, లాలిత్యానికి విదేశీయులు సైతం ముగ్ధులయ్యారు. ఇంత ఇమ్ముగల వాడుక భాష గుణ సౌందర్యాన్ని ఆధునిక రచయితలు ఎలా గమనించలేకపోతున్నారో నా కర్థం కాకుండా వుంది. తెలుగుభాషలో మధురమైన వచనం వాడుకభాషలో వుంది. వింతగా కనిపించవచ్చునేమో గాని తెలుగు వచన ప్రారంభ వికాసాలకు కారణం; రాజుల పోషణా కాదు, పాశ్చాత్య సాహిత్య ప్రభావమూ

1. గురజాడ రచనలు పు. 5-41; 42.

కాదు ఇందుకు హేతువు ఉత్సాహి అయిన ఒకానొక ఆంగ్లేయుని శ్రమ. మన వాడుకభాషలో వున్న స్థానిక చరిత్రల సేకరణలు కొన్ని నిస్సందేహంగా సాటి లేనివి మరికొన్ని స్పష్టతలో ధారాశుద్ధిలో తూగుల నడకలో ఉత్తమ గ్రాంథిక రచనలను తలదన్న గల రచనలు" [1]

మన స్థానిక చరిత్రలు మెకంజీ పరిశీలించి వెలువరించే వరకూ ఈ వ్యావహారిక భాషా వుద్యమం ఒక రూపుదిద్దుకోలేదు. గత శతాబ్దానికి పైగా సాగిన ఈ భాషా వుద్యమం నాటి నాటక రచనల వల్ల, ప్రహసనాది ప్రక్రియల వల్ల అభివృద్ధి చెందింది. వ్యావహారిక భాషా శాస్త్రవేత్తలు ఆంధ్ర పండితుల భాషా భేషిజానికి వ్యతిరేకంగా సాగించిన వుద్యమం అపూర్వం. రాజులు, జమీందారుల పోషణలో సాగిన గ్రాంథిక వుద్యమాన్ని వ్యావహారిక భాషా వుద్యమం ఎదిరించి నిలబడింది. నాటి గ్రాంథికవాదులు ఈ వ్యావహారిక వుద్యమానికి బెంబేలుపడిపోయి తల బద్దలు కొట్టుకున్నారనడంలో సందేహం లేదు.

వ్యావహారిక భాషా వుద్యమాన్ని నాశనం చెయ్యడానికి గ్రాంథికవాదులు చేసిన ప్రయత్నాలు నిలబడలేదు. ప్రాచీన సాహిత్యం జీవద్భాష అనే మూఢ నమ్మకం అనాదిగా మనవారిలో వ్యాపించి వుంది. గ్రాంథిక వుద్యమంతో పాటు సంస్కృత భాష జీవద్భాష అని తెలుగు మృతభాష అన్న మహానుభావులు లేక పోలేదు. నేడు సంస్కృతం వాడుకలో లేదు. కేవలం గ్రంథాలలో మాత్రమే వున్న భాష మృతభాషగా మిగిలిపోతుందే తప్ప సామాన్య జన వాడకంలో లేని సంస్కృతం ఎలా జీవభాష అవుతుంది. 'సంస్కృతం నా మాతృభాష' అనే మూర్ఖులూ లేకపోలేదు. ఆ భాషపై వారికి గల నమ్మకం, ఆప్యాయత అలాంటివి. భాషపై ఎవరికి అభిమానం వుండదు. అంత మాత్రాన మృతభాష జీవద్భాష కాదు. జీవద్భాషకు మరణం వుండదు.

సామాన్యంగా మన ప్రాంతంలో పిల్లలకు విద్యాభ్యాస సందర్భంలో 'ఓం నమశ్శివాయ' అనే మంత్రోచ్చారణతో విద్యా ప్రారంభం జరుగుతుంది. ఉత్తరాది ప్రాంతంలో "విఘ్నేశాయనమః", "సరస్వతీభ్యోనమః" అనే మంత్రోచ్చారణతో విద్యారంభం జరుగుతుంది. విద్యల తల్లి సరస్వతి అని అనాదిగా ఒక నమ్మకం

1. కన్యాశుల్కం రెండవ కూర్పు పీఠిక.

వుండేది. విఘ్నేశ్వరుడు విఘ్నాలకు అధిపతి అని విఘ్నేశ్వరుణ్ణి కొలిచినట్లయితే విఘ్నం కలగదని గణపతిని కొలుస్తారు. కాని దక్షిణదేశంలో వీరశైవం వ్యాపించిన నందువల్ల 'ఓం నమశ్శివాయ' అనే షడక్షరీ మంత్రం ప్రారంభంతో విద్యాభ్యాసం ప్రారంభమైందని శ్రీ సురవరం ప్రతాపరెడ్డిగారి తమ ఆంధ్రుల సాంఘిక చరిత్రలో చెప్పారు.

ఓరుగల్లు రాజధానిగా చేసుకొని కాకతీయులు ఆంధ్రదేశాన్ని పరిపాలించారు. ప్రతాపరుద్రుడు కాకతి రుద్రమ్మ పౌత్రుడు. ప్రతాపరుద్రుని విద్యాభ్యాస సందర్భంలో

"పరగ నమశ్శివాయ యని బాలుడు పల్కు శుభక్షణాన" [1]

అని "నమశ్శివాయ" మంత్రాన్ని ప్రతాపరుద్రునిచే చెప్పించినట్లుగా ఉంది.

విద్య కొన్ని వర్ణాలకు మాత్రమే పరిమితమై వుండేది. బ్రాహ్మణులకు ప్రణవాక్షర మంత్రపఠనం, ధర్మశాస్త్ర పరిజ్ఞానం వుండేది. శ్రుతులు, స్మృతులలో బ్రాహ్మణేతరులకు విద్య నిషేధించబడింది. కాలక్రమాన రాజ్యాధినేతలైన క్షత్రియులు, వ్యాపారులైన వైశ్యులు విద్య నేర్చుకున్నారు. కాని శూద్రులకు మాత్రం విద్య నిషేధించబడింది. శూద్రులకు వేదాధ్యయనం నిషేధించబడింది. తరువాతి కాలంలో శూద్రులు కూడా విద్యాభ్యాసం చేశారు.

శూద్రుడు రాసిన కావ్యం అలంకార సహితమై వున్నప్పటికి అది గ్రహించ దగినది కాదట.

"ఉపమ గలిగిన శయ్యల నొప్పియున్న
సంక్రమిభవుని కావ్యంబు గ్రాహ్యంబుగాదు
పాయసంబైన సంస్కారపక్వమైనఁ
గాక జుష్టంబు హవ్యంబుగాని యటుల [2]

1. కీర్తి తోరణాలు పు. 80.
2. అప్పకవీయము – 1–26.

ఎంత జాత్యాహంకారం !

మనం నిత్యజీవితంలో అనుభవించే ఓ గమ్మత్తయిన నమ్మకాన్ని పరిశీలిద్దాం. అప్పు తీసుకోవాలన్నా, తన స్థిరచరాస్తులు అమ్మాలన్నా సంతకం పెట్టాలి. ఈ సందర్భంలో సుమతీ శతకకారుడు "చీటికి ప్రాణంబు వ్రాలు సిద్ధము సుమతీ" అన్నాడు. ఈ "వ్రాలు" అనే పదం ఎందుకు చేర్చారో తెలియదు. సంతకం అవసరమే కాని ఈ "వ్రాలు" ఎందుకో ఎక్కడా వివరించబడలేదు. ఆంగ్లభాషా సంపర్కం ప్రారంభమైన తరువాత క్రమక్రమంగా ఈ నమ్మకం ఈనాడు మటుమాయమయిందనే చెప్పాలి.

విద్యా పరిజ్ఞానం కొంతమందికి మాత్రమే పరిమితం అనే మూఢనమ్మకం వుంది. పండితుని కుమారుడు పండితుడే. బ్రాహ్మణుని కుమారుడు బ్రహ్మజ్ఞానే అనే నమ్మకం తరతరాలుగా వ్యాపించింది. విద్య నేర్వటం, నేర్పటం బ్రాహ్మణుల హక్కు అని భావించేవారు. ఈ మూఢనమ్మకాల్ని వమ్ము చేసి విద్యకు అందరూ అర్హులే అని నేడు భావించటం జరుగుతోంది.

# 13. దానాలు - ధర్మాలు

పుణ్యం సంపాదించడానికి, పాప పరిహారానికి ప్రవేశపెట్టిన ఉత్తమకార్యాలే దానధర్మాలు. దానధర్మాలు ఆచరించడంద్వారా నరకలోకంలో సైతం సుఖసంతోషాలు మరణించిన జీవి పొందగలుగుతాడనే నమ్మకం వుంది. జనన మరణాది సందర్భాల్లో, వివాహాది శుభకార్యాల సందర్భాలలో ఈ దానధర్మాలు విరివిగా వుంటాయి. పుణ్యదినాలలో, పండుగల సందర్భాల్లో కూడా ఇవి వుంటాయి.

దానాలు దశదానాలని వివరించబడింది.

గోదానం— గోవును దానం చెయ్యడం.

భూదానం— భూమిని దానం చెయ్యడం.

తిలదానం— నువ్వుల్ని దానం చెయ్యడం.

హిరణ్యదానం— బంగారం దానం చెయ్యడం.

ఆజ్యదానం— నెయ్యి దానం చెయ్యడం.

వస్త్రదానం— వస్త్రాల్ని దానం చెయ్యడం.
ధాన్యదానం— నవధాన్యాది ధాన్యాల్ని దానం చెయ్యడం.
గుడదానం— తీపిపదార్థాల్ని దానం చెయ్యడం.
రౌప్యదానం— రూపాయిలు (ధనం) దానం చెయ్యడం.
లవణదానం— ఉప్పు (భోజన పదార్థాలు) దానం చెయ్యడం.
దానాలు షోడశదానాలని వివరించబడింది.

గో దానం – భూ దానం – తిల దానం – హిరణ్య దానం – రత్న దానం– విద్యా దానం – కన్యా దానం – దాసీ దానం – శయ్యా దానం – గృహ దానం – అగ్రహార దానం – రథ దానం – గజ దానం – అశ్వ దానం – ఛాగ దానం – మహిషీ దానం.

రుక్మిణీదేవి తండ్రి భీష్మకుడు. యుక్తవయస్సు వచ్చిన తన కుమార్తెకు వివాహం చెయ్యదలిచి దానాలలో కన్యాదానం చాలా ఉత్తమమయిందని భావిస్తాడు.

"దానమ్ములలోఁ గన్యా
దానము ఘన పుణ్యమని బుధ ప్రకరము లిం
పూని వచింతురు గావున
మానవజాతి కది సుకర్మ మార్గం బరయన్ [1]

జనన సమయాల్లో దానాలు చెయ్యడం వల్ల పుట్టిన బిడ్డలకు సుఖసంతోషాల్ని కలగజేస్తుందని, ఆయురారోగ్యాలతో వర్ధిల్లారని, శుభం జరుగుతుందని భావిస్తారు.

జాంబవతీ కృష్ణుల కుమారుడు సాంబుని నామకరణ సందర్భంలో

"సూనుఁడు పుట్టసం భ్రమద శోభనచంద్ర నవోదయంబున
న్మానస వార్ధియుబ్బ మధుమర్దనుఁ డాగమతత్త్వ దర్శన
జ్ఞాన ధురీణులైన ద్విజసత్తములం బిలిపించి యిచ్చె గో
దాన సువర్ణదాన మహిదానము ఖానిల పుణ్యదానముల్" [2]

---

1. రుక్మిణీ కళ్యాణము – 1–111
2. సాంబోపాఖ్యానము 4–83.

దానాదులు అనేకం వున్నప్పటికి కన్యాదానం- మేదినీ దానం- విద్యా దానం వుత్తమమని పాపాల్ని హరింపజేస్తాయనే నమ్మకం వుంది.

సత్రాజిత్తు తన కుమార్తె సత్యభామను శ్రీకృష్ణునికి ఇచ్చి వివాహం చేసే సందర్భంలో ఈ విధంగా భావిస్తాడు.

"దానములలోనఁ గన్యా
దానంబును మేదినీ ప్రదానము విద్యా
దానము నుత్తమములు దురి
తానీకము సడఁచు నెపుడు నీతి ఫలదములై" 1

రాజులు రాజ్యాభిషిక్తులైన సందర్భాలలో దాన ధర్మాది విధు లాచరించడం ఒక ఆచారం. కాకతి ప్రతాపరుద్రుడు పట్టాభిషిక్తుడైన సందర్భంలో దానాలు ఈ విధంగా వున్నాయి.

"కనక కలశంబులన్ వంచి వినమితోత్త
మాంగుఁడై భూసురుల కగ్రహార వితతి
అర్ఘ్యలన్యాల కఘక ధనాదికమ్ము
ధారవోసెను దార భూదారుఁడపుడు" 2

వ్యాధులు సంక్రమించినపుడు దానధర్మాలు ఆచరించడంద్వారా రోగాలు నయమవుతాయనే నమ్మకం వుంది.

"ఫలమెత్తు బంగారంతో అరటిపండు చేయించి బ్రాహ్మణులకు దానంచేసిన వానిని భగంధర వ్యాధి విడిచిపోవుఁ గాక".

"గురుపత్నీ సమాగమం చేసినవాడు ఈ లోకంలో కండూకుష్టు(దురద గల కుష్టు)రోగి అవుతాడు. శివసేహార్థం సువర్ణ ఘంటాదానం చేస్తే ఆ రోగం పోతుంది. యదృచ్ఛాలాభసంతుష్టుడూ ఉదారుడు అయిన వానిని చూచి మూర్ఛిల్లేవానిని

1. ధర్మఖండము — 7—53.
2. కీర్తితోరణము పు. 93.

అపస్మారకరోగం తిప్పుతూ ఉంటుంది. కపిల గోవును, సువర్ణ కమలమునూ దానం చేస్తే ఆ రోగం పోతుంది. [1]

జనన కాలాన్నిబట్టి, నామవిశేషాన్నిబట్టి వ్యాధులు సంక్రమిస్తాయని, మనిషి జన్మించిన సమయంలో వుండే గ్రహ, నక్షత్ర నిర్ణయాన్నిబట్టి చెడు ఫలితాల్ని కలిగిస్తాయని, దానాలు చెయ్యడంద్వారా కష్టనష్టాలు తొలగిపోతాయనే మూఢ నమ్మకం వుంది.

మనుష్యుల ఆయురారోగ్యాలకు సూర్యుడు మూలం అని నముత్మారు. గ్రహణస్థ దశలోనున్నప్పుడు సూర్యగ్రహ శాంతికి దానాలు ఆచరించడం ద్వారా అన్ని కష్టనష్టాలు తొలగిపోతాయని నమ్ముతారు.

"గ్రహ శాంతికి సకలవిధ కష్టములు తొలగి రోగ నివారణ యగుటకు సూర్యప్రీతికి రవి దశలో స్వర్ణ పద్మ దానము, రక్తధేను దానం, గోదానం, అనడ్వాహ దానం, స్వర్ణ దానం, ఛాగ దానం, రజిత దానం, శ్వేతధేను దానం మొదలగునవి ఆయా భక్తులయందు విష్ణు బ్రహ్మ యామినోక్త ప్రకారం దాన సంకల్పాది క్రియలు జరిగించిన అన్ని విధములా ఆయురారోగ్య భాగ్య సంపన్ను లగుటకు ఎట్టి సందేహము లేదు." [2]

కార్తీకమాసంలో బంగారు ఉసిరికాయలు దానం చెయ్యడం వల్ల ముక్తి లభిస్తుందని నమ్ముతారు.

"కార్తీకమునందు నుసిరిక కాయలొక్క
దోసెడించుక హేమంబు తోడ గూర్చి
ధరణిసురునకు నెవ్వడే దానమిచ్చు
నతఁడు శ్రీ విష్ణులోకంబు నందునుండు" [3]

---

1. జైమినీ భారతము — పు. 306—308.
2. గ్రహబలము పు. 116.
3. రుక్మాంగద చరిత్ర 2–63.

మానవుడు శారీరక, మానసిక వ్యాధులకు లోనుగాక తప్పదు. ఇవి ఏర్పడినప్పుడు దాన ధర్మాలు ఆచరించడం వల్ల వ్యాధులు తొలగిపోతాయని, నక్షత్ర దోషాలు, శాంతి కార్యక్రమాలు దానాలు వల్ల తొలిగిపోతాయనే మూఢ నమ్మకాలు మనవారిలో వ్యాపించి వున్నాయి. దానధర్మాదికార్యాలు మంచివే. పేదవాడికి వున్నవాడు తనకున్నదాంట్లో కొంత పంచడం న్యాయమే కాని; దాన ధర్మాల పేరుతో పేదవాణ్ణి పీడించే వ్యవస్థ మాత్రం సహించరానిది. వ్యాధులు సంక్రమించి బాధతో వున్నవాడికి తగిన చికిత్స చేయించక ధర్మాల మిషతో వారి ఆరోగ్యాన్ని ఇంకా పాడుచేసి మరణాలకు గురి కానియ్యరాదు.

# 14. యుద్ధ సంబంధాలు

రాచరిక వ్యవస్థ, సామ్రాజ్యవాదతత్వం యుద్ధాలకు మూల కారణం. ఒక రాజు మరో రాజుతో; ఒక రాజ్యం మరో రాజ్యంతో సాగించే పోరాటమే యుద్ధం. ఒక వీరుడు మరో వీరునితో చేసే యుద్ధాన్ని దంద్వ యుద్ధం అనీ, ఒక గుంపు మరొక గుంపుతో చేసే యుద్ధం సంకుల సమరం అనీ పిలుస్తారు. ఈ యుద్ధం మూడు రకాలుగా చెప్పబడింది. ప్రకాశ యుద్ధం, కూట యుద్ధం, పార్ష్ణి యుద్ధం. ఈ యుద్ధాలలో గెలిచినవారికి ఓడినవారు దాసోహం అనక తప్పదు. విజేత విజితుని రాజ్యాన్ని తన అధికారంలోకి తీసుకొని కప్పం తీసుకుంటాడు. ఓడిన రాజు సామంతునిగాను గెలిచిన రాజు చక్రవర్తిగాను గుర్తించబడతారు.

ఈ విధంగా సాగిన యుద్ధాల విషయంలో అనేక నమ్మకాలు ఏర్పడ్డాయి. మొదట సంప్రదాయాలుగా ఏర్పడిన ఈ నమ్మకాలు చిట్టచివరకి మూఢ నమ్మకాలుగా మారాయి.

తారాకాసురుడు అనే రాక్షసుడు మునులను దేవేంద్రాది దిక్పాలురను అనేక బాధలు పెడతాడు. తారకుని చంపగల వీరుడు పరమేశ్వరునకు- పార్వతికి కలిగే కుమారుడు (కుమారస్వామి) మాత్రమే. హిమవత్పర్వతంపై తపస్సులో మునిగిన శివునికి పార్వతి ఉపచారాది సేవలు చేస్తుంటుంది. వారిద్దరు ప్రణయ పారవశ్యంలో

మునిగి నప్పుడే పార్వతి గర్భవతి కాగలదు. అందుచేత వారికి సంయోగం కలిగించ టానికి ఇంద్రుడు మన్మథుణ్ణి పిలిపించి అందుకు నియోగిస్తాడు.

"నాకుందగిన కెలసంబు గంటి దీనికంతకు మైకొంటెఁ దాంబూలంబు దయ సేయుమని వసంత సహితంబుగ వలరాజు సురరాజు చేత నపార సత్కారంబులు గొని వీడుకొని చనుదెంచునంత." [1]

యుద్ధానికి బయలుదేరే సందర్భంలో సేనా నాయకుడు రాజు వద్ద నుంచి తాంబూలం గ్రహించటం, ఆభరణ మాల్యాదులు బహుమతులుగా పొందటం ఆచారం. ఈ ఆచారం వల్ల తాము యుద్ధరంగంలో జయం సాధిస్తామనే నమ్మకం వీరికి కల్గుతుంది.

వీర తాంబూలం గ్రహించటం వీరశైవ దీక్ష పొందినవారు చేస్తారు.
బిజ్జలుడు, బసవనికి వీరతాంబూల మిస్తాడు.

"అంగద మొప్పఁగేల లికంబుఁజేర్చి
పొంగుచు వీరతాంబూలంబు గొనుడు" [2]

యుద్ధ సమయాల్లో 'కంటె' ధరించటం ఆచారం. ధర్మరాజు ఇంద్రప్రస్థ పురాన్ని రాజధానిగా చేసికొని పరిపాలించి రాజసూయయాగం చేశాడు. ఆ యాగా నికి ముందు శత్రురాజుల్ని సంహరించటం ఆచారం. జరాసంధుడు కృష్ణునికి విరోధి. కృష్ణుడు పాండవ పక్షపాతి. అందుచేత జరాసంధుని చంపటానికి కృష్ణుడు భీమార్జునులతో జరాసంధుని నగరం ప్రవేశించి తమలో ఒకరితో యుద్ధం చేయమని కోర్తాడు. జరాసంధుడు భీమునితో యుద్ధానికి తలపడతాడు.

"బలియుఁడపుడు వెంట్రుకలు పాచి ముడిచి గం
టె సగఁదాల్చి వీరరసిక వృత్తి" [3]

యుద్ధానికి బయలుదేరే ముందు తమ దేవతల్ని కొలిచి యుద్ధానికి వెళ్ళడం వల్ల తాము యుద్ధరంగంలో జయం సాధిస్తామనే నమ్మకం వీరికి కల్గుతుంది.

---

1. కుమార సంభవము 4-54.
2. బసవ పురాణము 7-208.
3. మహాభారతము - సభాపర్వము 1-201.

పల్నాటియుద్ధం దాయాదులైన పెదమలిదేవాదులకు, నరసింగరాజుకు జరిగింది. అందు పెద మలిదేవాదుల పక్షం బ్రహ్మనాయుడు వహింపగా నాగమ్మ నరసింగరాజుకు అండగా నిలిచింది. బ్రహ్మనాయుడు తన సేనతో యుద్ధరంగానికి బయలుదేరతాడు.

"యుద్ధానికి వెళ్ళిన వీరులు యుద్ధ క్షేత్రంలో 'భూతరాల్' స్తంభాన్ని పాతటం వీరుల ఆచారం. త్రిపురాంతకంలో 'భూతరాల్' స్తంభాన్ని కొలిచి వీరులు ఋళ్ళ మీద కారంపూడి రణక్షేత్రంలో ప్రతిష్ఠించటానికి తీసుకువెళ్ళారు.

పంచ లోహాలతో తయారయిన 'భూతరాల్' స్తంభానికి కొవ్విన గొర్రె పోతును బలి యిచ్చి ఆ రక్తంతో స్తంభాన్ని తడుపుతారు" [1]

ఓడిపోయిన రాజులను తన బానిసలుగా గెలిచిన రాజు చేసుకుంటాడు. వీరు తన బానిసలు లేక సామంతులు అని గుర్తించటానికి వీలుగా వారికి ముద్రలు వేయిస్తాడు.

తారాకాసురుడు దేవతలను జయించిన వీరుడు. తన చేతిలో ఓడి పారిపోయిన వారికి ఈ విధంగా మర్యాద చేస్తాడు.

"పోరఁదన కోడి పాయనీహారరోచిఁ
బట్టుకొనిపోయి దానవ ప్రభుఁడు చిటికి
వారికెల్లను నోగులవాని గాక
నుదుముపై జీడి నిత్తియచ్చొత్తి విడచి" [2]

గెలిచిన రాజులు ఓడినవారి చేత వెట్టిచాకిరి చేయించుకుంటారు.

"ఏ రాజు రాజులనెల్ల జయించి మున్వెట్టికిఁబట్టి దోర్వి క్రమముల" [3]

"గెలిచినవాడు నేడు రణకేళి ధురంధరుదగ్గజేంద్రమున్
వెలిచినవాఁడు దేవతల వెట్టికిఁబట్టినవాఁడు ధూర్జటిన్" [4]

---

1. పల్నాటి వీరచరిత్ర పు. 199.
2. కుమార సంభవము 4-16.
3. మార్కండేయ పురాణము 1-35.
4. ఉత్తర హరివంశము 5-87.

విజేతయైన రాజు విజితుల బొమ్మలను తయారు చేయించి తన కాలి గండ పెండారం దాపున కట్టుకోవటం చేత విజితుడు పాదదాసుడు అనే నమ్మకం వుంది

"మలసిన నూటొక్క బొమ్మ పెండెరంబు
చెలగిడా కాలినుంచిన మహాఘనుండు" [1]

"కకుబంత నిఖిలరాణ్ణి కరంబు జరణ మం
జీరంబు సాలభంజికలఁజేసె" [2]

"డాకాలి గండ పెండారము దాపున
బొమ్మలై వైరి భూభుజులు వ్రేల" [3]

విజేత అయిన రాజు తన విజయానికి చిహ్నంగా జయస్తంభం పాతటం ఆచారం.

"అభిరతిఁ గృష్ణరాయఁడు జయాంకములన్ లిఖియించి తాళ స
న్నిభముగఁ బొట్టునూరి కడ నిల్పిన కంబము సింహభూదర
ప్రభు తిరునాళ్ళకున్ దిగు సురప్రకరంబు కళింగ మేదినీ
విభు నపకీర్తి కజ్జలము వేమరుఁబెట్టి చరించు నిచ్చలున్" [4]

కళింగరాజును జయించి కృష్ణదేవరాయలు పొట్టునూరు వద్ద జయస్తంభం నాటాడు.

మాంధాత లంకాధిపతి అయిన రావణుని జయించాడు. పిదప మంథర పర్వతం అధిరోహించి తన జయచిహ్నంగా జయస్తంభం నాటాడు.

---

1. పల్నాటి వీరచరిత్ర 1-2.
2. మనుచరిత్ర 1-30.
3. కాశీఖండము 1-5.
4. మనుచరిత్ర - 1-39

"ఇట్లు స్వర్గపుర ప్రాంగణ క్రీడాశైలంబైన మంథర మహీధరంబు పయిం జయస్తంభంబు వేసిన" [1].

బొబ్బిలి సంస్థానాధిపతి రంగారాయుడు విజయనగర పాలకుడైన విజయ రామరాజు ప్రోద్బలంతో డచ్చి గవర్నరు అయిన బుస్సీ నలభై వేల కాల్బలం, ఫిరంగిసేన, తుపాకిసేనతో బొబ్బిలిపై దండెత్తాడు. రంగారావు సేన నాలుగువేల కాల్బలం మాత్రమే వారికి తుపాకిబలం లేదు అయినప్పటికి మూర్ఖత్వంతో పరాసు సేనతో తలపడ్డాడు. సంధి ప్రసక్తిని తీసుకురావడానికి సమ్మతించలేదు.

"మమ్ము గెలిచి గాని మా కోటఁ జేకొన" [2]

బొబ్బిలి స్త్రీలు భర్తలకంటె పౌరుషంలో తక్కువవారేమి కాదు. తమ వీరులు ఒక్కరొక్కరే నేల కొరగడం తెలిసికొని రాణి మల్లమదేవి తన కుమారుని దాది కప్పగించి కోట బయటకు పంపింది. తరువాత

"మరియు నారయ మన్నిని మానవతియుఁ
బాణితలమున శాతకృపాణిఁ బూని
దానిచే మేను దొరగె" [3]

ప్రాణత్యాగం చెయ్యటానికి వారు సిద్ధపడ్డారు. మిగిలిన వెలమ స్త్రీలందరూ చిచ్చురికి, కత్తులచే పొడుచుకొని ప్రాణత్యాగం చేశారు.

ఈ విధమైన నమ్మకాలతో యుద్ధాలు జరిగేవి. ప్రపంచ చరిత్రలో భారత దేశంపై జరిగిన విదేశ దాడులు మరే దేశంమీద జరగలేదనే చెప్పాలి. ఆర్యులు అనార్యులను జయించినప్పుడు వారి ఆయుధశక్తికి, అశ్వాలశక్తికి తట్టుకోలేక పోయారు అనార్యులైన భారతీయులు మూఢనమ్మకాల ఒరవడిలో నవీన ఆయు

1. కవికర్ణ రసాయనము – 2–234.
2. రంగరాయ చరిత్ర – 2–220.
3. రంగరాయ చరిత్రము – 3–159

ధాల్ని సంపాదించలేకపోయారు. మహమ్మదీయులు చేసిన దాడులలో భారతీయులు తమ అనైక్యతను, అసమర్ధతను రుజువు చేసుకున్నారు. వ్యాపారం కోసం భారతదేశానికి వచ్చిన ఆంగ్లేయులు మొత్తం దేశాన్ని స్వాధీనం చేసుకుంటే ఆపలేక పోయారు. ఆయుధ సంపత్తిని పెంచుకోలేకపోవటం, యంత్రసామాగ్రి వుపయోగించుకోలేకపోవటం, పాతనమ్మకాల పరిధిలో వుండటం, అనైక్యతలవల్ల జాతి నిర్వీర్యమై బానిసత్వంలో మునిగిపోయింది. విభజించి పాలించే ఆంగ్లేయ శక్తి ముందు భారతీయులు నిలబడలేకపోయారు.

# 15. పాపం - పుణ్యం

'పాపం' అంటే దుష్కృతం, అధర్మం; పుణ్యం అంటే సుకృతం, ధర్మం అని అంటారు. సామాన్యంగా చెడ్డపని పాపం అనీ, మంచి పని పుణ్యం అనీ వ్యవహరించటం కద్దు. లౌకికమైన ఈ ప్రపంచంలో మనం చేసే పనుల్నిబట్టి పాపపుణ్యాలు నిర్ణయించటం జరుగుతుంది. పాపం చేసినవారు నరకానికి పోతారని పుణ్యం చేసినవారు స్వర్గానికి పోతారని నమ్ముతారు. ఇహలోకంలో మానవుడు తాను చేసే పనుల ఫలితంగా జన్మాజన్మలుంటాయనీ, తాను చేసిన కర్మ ఫలితంగా జీవితం నడుస్తుందని నమ్మటం జరుగుతోంది. కర్మ సిద్ధాంతం, పునర్జన్మ మొదలైన విషయాలన్నీ ఒకనాడొక్కొక్క ప్రయోజనం కోసం ప్రచారంలోకి వచ్చాయి. ఇవి మౌఢ్యంగా ఆచరణలోకి వచ్చాయి. చివరికి ఇవే సమాజాన్ని పీల్చి పిప్పి చేశాయి. అయినా వీటిని మనం తెలుసుకోలేక గుడ్డిగా నమ్ముతున్నాం. కర్మ-పునర్జన్మ-పూర్వజన్మ అనే నమ్మకాలు, స్వర్గం-నరకం అన్నీ ఒకదాని కొకటి సంబంధించినవే. ఇవన్నీ మనిషికి స్వతంత్రం గాని, ఆత్మవిశ్వాసం గాని లేకుండా చేస్తున్నాయి.

"నీవు ఇప్పుడు కర్మ చేసావంటే నీవుచేసిన కర్మయొక్క ఫలితం ఇంతటితో తీరిపోదు. దీని పాపం నువ్వు చచ్చినాకయినా విడిచిపెట్టకుండా వెంబడిస్తుంది. నీవీ జన్మలో చెడుకర్మ చేస్తే వచ్చే జన్మలో ఏ మూర్ఖుడుగానో, బీదవాడుగానో, నీచమైన జంతువుగానో పుడతావు. మంచికర్మ చేస్తే నీకు మంచి జన్మ లభిస్తుంది. మోక్షం వస్తుంది అని యిట్లా చెపుతారు. ఆనాడు ఆ మాటలకు భయపడి నిజం

గానే తప్పు చెయ్యకుండా వుండేవాళ్లు. దీనితోపాటు ప్రస్తుతం మానవు డనుభవించే దుర్గతికి, దుఃఖానికి, కష్టాలకు జీవితంలో సంభవించే ప్రతిదానికి 'ఇది నా కర్మ నేనేం చేసేది' అనే ఓదార్పును కూడా పొందటం జరుగుతుంది. సంఘం కట్టుబాట్ల కోసం ఆరోజుల్లో ఇది కొంతపనికివచ్చిన మాట వాస్తవమే. కాని ఇప్పుడు సంఘాన్ని నాశనం చేయటానికే వుపయోగపడుతుంది. కర్మ పేరుతో బలవంతుడు బలహీనుణ్ణి దోచుకుంటున్నాడు. [1]

స్వర్గ నరకాలనే బూచితో మానవుడు కర్మవాద సిద్ధాంత వూబిలో కూరుకు పోయాడు. అనాదిగా వస్తున్న ఆచారాల ప్రభావం మనిషిని బానిసగా చేసింది. వ్యక్తిని వ్యక్తి దోచుకునే వ్యవస్థకు మూలకారణం అయింది. అందుకే తాత్విక వేత్తలు కర్మసిద్ధాంతాన్ని నిరసించారు.

"ఘన సూక్తమిదె 'స్వర్గ కామోయజేత'
యనట దైవము సతుర్ధ్యంతంబుగాన" [2]

మానవుడు తాను చేసిన పాపపుణ్యాలను అనుసరించి జన్మ పునర్జన్మలు కలుగుతాయని నమ్ముతారు. వీరబ్రహ్మేంద్రస్వామి తన భార్య గోవిందమాంబకు పుట్టుక క్రమంగురించి తెలుపుతాడు.

"తాను చేసిన పాపకృత్యముల వలనఁ
జచ్చి పుట్టుచుసుండు విశ్రాంతి విడచి" [3]

శైవభక్తులు చనిపోయినవారికి పరలోకవిధులు చేయరాదనిప్రచారం చేశారు.
"ఎందును శివార్థముగ మృతిఁ"
బొందిన పుణ్యాత్మ బంధుపుత్రాదులకున్" [4]

---

1. మూఢవిశ్వాస వనకుఠారము పు. 42
2. పండితారాధ్య చరిత్ర – వాదప్రకరణం
3. శ్రీ వీరబ్రహ్మేంద్ర చరిత్ర – 2–86
4. శివతత్వసారము 1–282

బంధువులకు సూతకముండదు. పరలోకవిధులు వద్దు. క్రతు కార్యాదులు చేయటం అజ్ఞానం అని నాటి తాత్త్వికులూహించారు.

దశరథుడు మృగభ్రాంతితో ఒక మునికుమారుని వధించి వాని తలిదండ్రులకు తీరని వ్యథ కలిగిస్తాడు. అందుచేత తనకు పుత్రవియోగం సంభవించిందని దుఃఖిస్తాడు.

మునుపటి దుర్జ్ఞానంబున
నొనరఁగ నొక పుణ్యుసుతు వియోగము నొందం" [1]

ఆనంద భైరవుడనే రాజకుమారుడు వేటకు వెళ్ళి మృగభ్రాంతిచే ఒక గోవును వధించాడు. గోవును వధించటం వల్ల శివసాయుజ్యం కలగదని బాధ పడతాడు.

"కాశీ పట్టణ పరిసర
దేశంబునఁ బాడియావుఁదెగటార్చిన నా
కాశివ సాయుజ్యపదం
బాశింపఁగరాని పాపమచ్చినదిగదా" [2]

రాముడు ఇంటలేని సమయంలో రావణుడు సీత నపహరించుకొనిపోయాడు. తిరిగి వచ్చిన రామునకు భార్య కనిపించలేదు తనకు కనిపించిన చెట్లను- పుట్లను, పశువులను, పక్షులను సీతను గురించి ప్రశ్నిస్తాడు. చివరికి గోదావరీ నదిని ప్రశ్నించగా గౌతమి (గోదావరి) చెప్పలేదు. కుపితుడైన రాముడు గౌతమిని శపించాడు.

"గౌతమి నేడు మొదలు నిక్కంబుగాఁగ
భావనార్థంబుగా నీదు జీవనముల

---

1. లంకా విజయము 1-42.
2. శ్రీ వీరబ్రహ్మేంద్ర చరిత్ర 1-104.

స్నాతయయగువాఁడు చండాలజాతిఁబుట్టి
జగతినప్పుడ యాత్మ తేజంబు దొఱఁగు"[1]

అందుచేత గౌతమిలో మునిగినవాడు చండాలుడు అనే నమ్మకం ఏర్పడింది. అది పాపానికి హేతువట.

భైరవపూజ చేయటం వల్ల సద్గతి కలగదట. ధర్మరాజు రాజసూయయాగం చేసే సందర్భంలో దిక్కులన్నింటని జయించటానికి తన తమ్ముల్ని పంపుతాడు. వారు దిగ్విజయయాత్ర చేస్తారు. కృష్ణుడు పాండవ పక్షపాతి జరాసంధుని మరణం జరిగితే గాని వారికి క్షేమం కలగదని జరాసంధుని మరణానికి పథకం తయారు చేస్తారు. అర్ధరాత్రి శివపూజలో వున్న జరాసంధుని యుద్ధానికి ఆహ్వానించి భీమునిచే చంపిస్తాడు. ఆ సందర్భంలో జరాసంధుడు భైరవపూజ చేసిన కారణం వలన అతనికి సద్గతి కలగదని చెప్తాడు.

"అతుల విక్రమ సంపదన్ యజ్ఞదీక్షితులైరి వు
ద్ధతిని భైరవపూజ సేసిన దాన సద్గతి కల్గునే"[2]

ఇటువంటి పాతకాల వల్ల, ఉపపాతకాల వల్ల మనిషి నరకానికి పోతాడని నమ్ముతారు.

"మనం చేసే పాపాలకు గాని, పుణ్యకార్యాలకు గాని ఫలితం అనుభవించటానికి కొంతకాలం పడుతుంది. పశువు గడ్డి తినగానే పాలు ఇవ్వదు గదా ; అలాగే పాపపు పనికి ఫలం వెంటనే కనిపించదు. కొంతకాలం గడిచిన తరువాత ఆ పాప ఫలం తప్పక అనుభవించవలసి వస్తుంది. అది సర్వనాశనం చేస్తుంది.

అధర్మం చేసినవాడు మొదట అన్నివిధాలా సుఖంగానే వుండవచ్చు. కానీ అతని సంతానానికో, మనుమలకో, ముని మనుమలకో ఆ వంశంలో ఎవరికో ఆ పాపం కొట్టి తీసుతుంది. అది ఎన్నటికీ వృథాకాదు.[3]

---

1. ధర్మఖండము 9-62.
2. మహాభారతము - సభాపర్వము 1-192.
3. సుభాషిత రత్నావళి పు. - 16.

ఇటువంటి నమ్మకమే కర్మ సిద్ధాంతానికి ప్రథమ బీజం. ఎప్పుడో ఏదో జరుగుతుందనే నమ్మకం మనిషిలో జీర్ణించి వుండటంచేత, ఇహపరలోకాల పేర్లతో కర్మ పేరుతో, పునర్జన్మ పేరుతో ప్రస్తుత దోపిడీ సమాజాన్ని సమర్థించటానికి వుపయోగపడుతుంది. బీద-ధనిక భేదాలకు, కష్టాలకు, సుఖాలకు కారణం పూర్వ జన్మ సుకృత, దుష్కృతాలని, కర్మపరిపాకమనే ఆలోచనే దోపిడీ విధానానికి బలాన్నిచ్చింది.

పుణ్యం చేసినవారు స్వర్గానికి పోతారని దానికి వుపపత్తులుగా బ్రాహ్మణులకు దానధర్మాది క్రియలు చేయటం ద్వారా పునర్జన్మ కలగదనే నమ్మకం వ్యాపించింది.

పుణ్యకార్యసాధనకు అనేకమైన పద్ధతులు వున్నాయి. ఆబోతుకు అచ్చు పోసి వదలినట్లయితే పుణ్యం కలుగుతుందనే విశ్వాసం వుంది. పులస్త్యుడు భీష్మునికి చెప్పినట్లుగా నారదుడు ధర్మరాజునకు ఈ విషయం తెలుపుతాడు.

"శ్వేతమైన యాంబోతు విడుచునోయనియును" [1]

గంగానది పరమ పవిత్రమైనది. అందులో మునిగినవారికి పుణ్యగతులుంటా యనే నమ్మకం వుంది.

సగరుడు అనే రాజు అశ్వమేధయాగం చేసిన తరువాత ఆ అశ్వం పాతాళ లోకం ప్రవేశిస్తుంది. సగరపుత్రులు అరవైవేల మంది పాతాళానికి వెళ్ళగా కపిలుని ఆశ్రమంలో యాగాశ్వం కనిపించింది. కపిలుడు అశ్వాన్ని దొంగిలించాడని భ్రమించి సగరపుత్రులు హింసించగా కపిలుడు వారిని బూడిదకుప్పలుగా చేస్తాడు. సగరుని మనుమడు అంశుమంతుడు కపిలుని ప్రసన్నం చేసుకొని తన తండ్రులకు వుత్తమగతులు కల్పించమని వేడతాడు. అంశుమంతుడు కొన్ని వేల సంవత్సరాలు తపస్సు చేసి గంగను ప్రత్యక్షం చేసికోలేకపోతాడు. అంశుమంతుని మనుమడు భగీరథుడు పదివేల ఏళ్ళు తపస్సు చేసినప్పుడు గంగ ప్రత్యక్షమవుతుంది.

"సగర వసుమతీశ్వర తనూజాతచయము
గతులు కల్పించెనంట దుర్మతులకంట" [2]

---

1. మహాభారతము - అరణ్యపర్వము 2-27౭.
2. సూత పురాణము 2-14.

ఇటువంటి మూఢనమ్మకాలు మన సమాజంలో బాగా వ్యాపించాయి. ఈ మూఢ నమ్మకాలు ఆధ్యాత్మికవాదానికి ప్రతీకలు. ఆధ్యాత్మికవాదం మానవుని నఖ శిఖ పర్యంతం బంధించింది. జ్ఞానానికి అడ్డుకట్ట వేసింది. దోపిడీవర్గాలు ఆధ్యాత్మిక వాదాన్ని దాని సంఘటిత రూపాల్ని వివిధ మతాల్ని, శాఖల్ని పెంచి పోషిస్తు న్నాయి. ఇవన్నీ మానవుని మూఢ నమ్మకాల్ని బలపరచటానికి, విజ్ఞానాన్ని అరికట్టటానికి వీటి మరుగున దోపిడీవర్గాలు తమ వ్యవస్థను నిరాటంకంగా సాగించ టానికే వుపయోగపడుతున్నాయి.

పుణ్యం పేరుతో, పాపం పేరుతో కార్మిక, కర్షకుల శ్రమశక్తిని దోచుకోవ డానికి క్రిందివర్గాన్ని చదరంగంలో పావులుగా వుపయోగించుకోడానికే వుపయోగ పడుతున్నాయి.

జన్మ-పునర్జన్మ సిద్ధాంతాన్ని సామాన్యులపై రుద్దడం ద్వారా దోపిడీ శక్తులు తమ చిత్తం వచ్చిన రీతిలో వ్యవహరించటానికే వుపయోగపడుతున్నాయి. ఎవ్వరూ చూడని స్వర్గ-నరకాల బూచిని ప్రజలపై ప్రయోగించటం ద్వారా వీరిని అజ్ఞానం లోకి నెట్టటానికి ప్రయత్నం జరిగింది. వీటిని ఆధారంగా చేసుకుని దైవపూజ ప్రారంభమయింది. దైవ ప్రార్థనలు చేయటం ద్వారా పాపం పోయి పుణ్యం కలుగు తుందని దానధర్మాలు, యజ్ఞయాగాలు, తీర్థక్షేత్ర సందర్శనాల ఫలితంగా పుణ్యం కలుగుతుందని నరకప్రాప్తి తొలగిపోయి స్వర్గలోక సుఖాల్ని అనుభవించవచ్చని ఆశించారు. చనిపోయిన వారికి పితృకర్మలు ఆచరించడం ద్వారా పునర్జన్మ లుండవని, నరకప్రాప్తి వుండదని బోధించడం జరిగింది. వేదప్రోక్తమైన సంస్కృత గ్రంథాల్లో వివరించబడ్డ మంత్రాల నాధారంగా చేసుకొని పురోహితవర్గం పాప పుణ్యాల సృష్టిని కల్పించి, పరాన్నభుక్కులై హైందవజాతికి హేతువాద దృక్పథం లేని సనాతనాచారాల్ని, మూఢ నమ్మకాల్ని పెంచిపోషించారు. ఈ వ్యవస్థ కేవలం కొంతమందికి మాత్రమే ఉపయోగకరమైంది కాగా ఎక్కువమందికి నష్టదాయక మయింది. దానధర్మాల పేరుతో, పూజా పురస్కారాల పేరుతో, తీర్థాభిషేకాల మిషతో వున్నది కాస్తా పోగొట్టుకొని పుణ్యం సంగతి ఎలా వున్నా దారిద్ర్యాన్ని కౌగలించుకుంటున్న మూఢభక్తులు. అదృష్టాన్ని ఆశించి చేసే పుణ్యకార్యాలు గమనిస్తుంటే మనం ప్రపంచ దేశాల్లో ఎంత వెనకబడివున్నామో అర్థమౌతుంది.

# 16. ఆత్మహింస - మరణాలు

దైవత్పృప్తికోసం తమ శరీరాన్ని ఐచ్ఛికంగా త్యాగం చెయ్యడమే ఆత్మహింస. శైవమత ప్రాబల్యం పెరిగిన తరువాత ఆత్మహింస ప్రాచుర్యంలోకి వచ్చింది. శైవమత పారమ్యంలో వీరశైవం ముదిరి అనేక శైవ కథల్లో ఆత్మహింస కనిపిస్తుంది. దేవీపూజల్లోనూ ఇది ఎక్కువగానే ఉంటుంది. ఆత్మహింసా ప్రక్రియవల్ల తమకు స్వర్గలోక సుఖాలు అందుతాయని కొందరు; తాము చేసిన పాపాలు పటాపంచలవుతాయని కొందరు, ముక్తికి దగ్గర మార్గమని కొందరు; తాము మొక్కుకున్న మొక్కులు చెల్లించడంకోసం భక్తులు ఆత్మహింసకు పాల్పడిన సంఘటనలు మనకు కనిపిస్తాయి. తమ శరీరంలోని కొన్ని భాగాల్ని దేవతకు కైంకర్యం చెయ్యడం, కొన్ని ప్రదేశాలలో సూదులు, కత్తులు మొదలైన సాధనాల ద్వారా హింసించుకోవడం, తమ శరీరాన్నే అర్పించుకోవడం వంటి అమానుష కృత్యాలు ఇందులో ప్రధానంగా ఉంటాయి.

దేవీపూజలో ఆత్మహింస ప్రధానమైన అంశంగా ఉంటుంది.

"భక్తులు జీవద్దీపాలుగా వెలగడం, చెవుల్లో నారసాలు, నాలుక మడపు కోర్రులు, వీపున కొంకిగాలాలు, కనురెప్పలకు సూదులు మొదలైనవి నాటించుకోవడం కనిపిస్తుంది ఇవన్నీ ఆత్మహింసా ప్రక్రియలే. ఇందులో మరో ముఖ్యమైన చర్య సిడిబ్రేలడం. ఈ ఆచారం జానపద కథలలో కనిపిస్తుంది. ఇది దక్షిణ భారతమంతటా ప్రచారములో వున్న చర్య. 1854 లో అనంతపురం జిల్లాలోనే 125 స్థలాలలో ఈ ఆచారం అవలంబింపబడ్డట్టుగా "థర్స్టన్" పండితులు సూచించారు. ఆంధ్రప్రదేశమంతటా దీనికి ప్రచారం విరివిగా వుంది." [1]

విజయనగర సామ్రాజ్యం మహావైభవంగా వెలుగొందే సమయంలో దుర్గాదేవి దయ సంపాదించటం కోసం నాటి భక్తులు అనేక ఆత్మహింసా కార్యక్రమాలలో పాల్గొనేవారని తెలుస్తుంది.

---

1. జానపద గేయాలు – సాంఘిక చరిత్ర పు. ౭౯.

"దుర్గాదేవి దయ సంపాదిస్తే అద్భుత శక్తులు సంపాదించవచ్చుననే మౌఢ్యం ఆనాటి ప్రజలలో వుంది. ఆత్మహింస ఆత్మహననం ద్వారా దుర్గ దయ సంపాదించ వచ్చునని వారి విశ్వాసం.

దుర్గ దేవాలయాలలో కొన్నింట గోళ్ళుపీకివేసే పనిముట్లు, బాణాలు, కత్తులు, గండ కత్తెరలు వున్నాయని, దుర్గాదేవి దయ సంపాదించుకునేందుకు భక్తులు వానితో ఆత్మహింసకు పూనుకునేవారని నేలటూరి వెంకటరమణయ్యగారు వ్రాసారు. దూర దర్శిని శక్తికోసం, కళ్ళుపొడిచేసుకోవడం, దూరశ్రవణ శక్తికై చెవులలో వూచపెట్టి పొడుచుకోవడం, విద్యా సంపదకోసం నాలుక కోసుకోవడం, శత్రువధ కాంక్షిస్తే తల కత్తిరించుకోవడం వంటి అఘాయిత్యాలు చేసేవారున్నారు". [1]

దుర్గ దేవాలయంలో మణిస్తంభుడు కలభాషిణిని దుర్గాదేవికి బలియివ్వడానికి తీసికొనివచ్చిన సందర్భంలో కలభాషిణి దేవాలయంలో వున్న శాసనం చూస్తుంది.

"దూరవీక్షార్థి యీ గోరుగంట హృతాక్షుఁ
డయ్యె, దూరశ్రవణార్థి చెవిని
ఘోరమైనట్టి యీ బలు నారసంబు
పఱపుకొనియె, సారస్వత ప్రౌఢిమార్థి
యీ సురియచేత నాలుక కోసికొనియు
నిమ్మహాశక్తి మెప్పించి యిష్టమొందు" [2]

కన్నులు పొడుచుకోవడం వల్ల దూరదృష్టి, చెవులలో నారసాలు పొడుచు కోవడం వల్ల దూరశ్రవణం కలుగుతాయని మణిస్తంభుడు భావించి దూరదృష్టి, దూరశ్రవణం అనే విద్యల్ని పొందుతాడు.

తన నాలుక కోసుకొని మణికంధరుడు సారస్వత సిద్ధి పొందుతాడు. కలభాషిణిని బలియిచ్చి ఉత్తరజన్మలో రాజ్యలక్ష్మి పొందుతాడు.

తమ కళ్ళను భగవంతునికి నైవేద్యరూపంలా కైంకర్యం చెయ్యడం ద్వారా ముక్తి పొందినట్లుగా భావిస్తారు.

---

1. ఆంధ్రుల సంస్కృతి – చరిత్ర పు. 2–237.
2. కళాపూర్ణోదయము 3–117.

"కన్నులు రెండును బుచ్చుచు" [1]

మనిషి తాను కోరిన కోరికలు ఇహలోకంలో నెరవేరకపోవడంతో మరో లోకంలోనయినా తన కోరికలు తీరతాయేమోననే భ్రమతోను, జీవితంలో తాను మరేమీ సాధించలేనని అసంతృప్తితోను భక్తి పారమ్యంలో ఇటువంటి చర్యలకు పూనుకుంటాడు.

"ఈ భూమిమీద జీవించేందుకు పాదర్థిక సాధనాలు లేకపోవడంతో జనం ఊహాలోక జీవితంలో పడ్డారు. అందుకు ఆత్మహింస సాధనం అనుకున్నారు.

దుర్గ దయకోసం గాలపుసిరి వేసుకొని సిరిమాను వేలాడటం, విజయనగర సామ్రాజ్యంలో చాలాచోట్ల జరుగుతున్నట్లు పోర్చుగీసు యాత్రీకులు వ్రాశారు.

ఏదో కోరిక నెరవేరితే రక్తతర్పణం చేస్తామని మొక్కుకుంటారు. మొక్కు తీర్చుకునే రోజున వారు బాజా బజంత్రీలతో పెద్ద ఊరేగింపుగా బయలుదేరుతారు. దేవాలయం ముందు ఒక కొయ్యపాతి వుంటుంది. దానిని సిడిమాను అంటారు. ఆ కొయ్యపైన ఏతాం కర్రవంటిది అడ్డంగా అమర్చుతారు. ఆ కర్రకు ఒకవైపున గాలం ఉంటుంది. రెండోవైపున తాడుకట్టి గేలాం భాగాన్ని పైకి ఎత్తేందుకు ఏర్పాటుచేస్తారు మొక్కుకున్న మనిషి ముక్కులవద్ద మాంసంలోకంటా గుచ్చి పైకి ఎత్తుతారు ఆ మనిషి మొక్కుకునట్టి గేలం కర్రను కొన్నిచుట్లు తిప్పడమో, చచ్చిపోయేవరకు తిప్పడమో వుంటుంది. చూస్తున్న ప్రజలు హర్షధ్వానాలు చేస్తుంటే మొక్కుతీర్చుకునేందుకు గేలానపున్న మనిషి సంతోషంగా వేలాడతాడు. అంటాడు సమకాలీన రచయిత బార్బోసా". [2]

రథోత్సవాలు, జాతర్లు, పండుగల సందర్భాలలో భక్తులు సిడ్లివేలటం, మంటలలో దూకడం వంటి అమానుష కృత్యాలకు పాల్పడేవారు.

కుతుబ్‌షాహి కాలంలో ఈ దేశాన్ని సందర్శించిన బెర్నియరు అనే విదేశ యాత్రికుడు పూరీ జగన్నాథ రథయాత్ర చూశాడు. ఆ రథచక్రాలకింద ముక్తి కోసం జనం ఆత్మార్పణం చేసుకుంటుంటే స్వయంగా చూసినట్లు రాసాడు.

---

1. శివతత్త్వసారము 1-399.
2. ఆంధ్రుల సంస్కృతి — చరిత్ర పు. 2-238.

"మద్రాసుకు నాలుగుమైళ్ళలో వున్న తిరువళ్ళూరు దేవాలయం చూసిన ప్రయర్ ఈ ఆత్మార్పణలు అక్కడ రథ యాత్రలో జరుగుతున్నట్లు వ్రాసాడు. యాత్రికులు పుణ్య సంపాదనకై భార్యా బిడ్డలతో సహదేవుని రథము యొక్క ఇనుపచక్రాల క్రిందపడి ఆత్మార్పణ చేసుకుంటారని వ్రాసాడు." [1]

కన్నతండ్రి తలనరికి హింసించిన భక్తులు కొందరు, తనచేతులు భగవంతునికి కైంకర్యం చేసినవారు కొందరు, తన తలనే శివునికర్పించినవారు కొందరు, తన కుమారునే త్యాగంచేసినవారు కొందరు శివతత్వసారంలో మనకు కనిపిస్తారు

తమ శరీరాల్ని అర్పణ చెయ్యడం ద్వారా పరలోక సుఖాలు పొంద వచ్చనే మూఢసమ్మకంతో ఆత్మహింస, ఆత్మత్యాగం ఆమల్లోకి వచ్చాయి. ఈ విషయంలో మతం ప్రధానాంశంగా పనిచేసింది. మతం స్వర్గం – నరకం అనే మిథ్యా కల్పనలలో పుణ్య పాపాలకు తావిచ్చింది. ఈ లోకంలో తాను సాధించలేనిది మరో లోకంలో పొందడానికి మనిషిచేసే ఆఖరి ప్రయత్నమే ఆత్మహింస.

**మ ర ణా లు :**

ప్రపంచంలో జీవులన్నీ కణ నిర్మితాలే. ఏక కణజీవి అమీబా మొదలు బహుకణ జీవులయిన మానవుల వరకు పుట్టి గిట్టడం ప్రకృతిలో ఒక భాగం. పుట్టిన ప్రతి మనుష్యుడు కొంతకాలం మనుగడ సాగించి చివరికి మరణించి తీరవలసిందే. ఊపిరి ఉన్నంతవరకు ఈ శరీరానికివున్న గౌరవ మర్యాదలు ఆసక్తి మరణించిన తరువాత మటుమాయం అవడం జరుగుతుంది. మతం, మత నియమాలు మరణానికి కొన్ని శాసనాలు విధించింది.

పుణ్య పాపాలు ఈ మరణంలో ప్రముఖస్థానం వహిస్తాయి. పుణ్యం చేసుకున్నవాడు స్వర్గలోక సుఖాలు పొందుతాడని పాపం చేసుకున్నవాడు నరకంలో కష్టాలు అనుభవిస్తాడని అనాదిగా వస్తున్న సమ్మకం. ఒకవేళ మరణించిన మనిషి ఈ లోకంలో జీవించివుండగా పుణ్యం సంపాదించకపోయినా వాళ్ళ శవాలకు జరిగే శవ సంస్కారాల వల్ల దాన ధర్మాది పుణ్యకార్యాల వల్ల పుణ్యాత్ములౌతారని మనకు ధర్మశాస్త్రాలలో వివరించారు.

---

1. ఆంధ్రుల సంస్కృతి – చరిత్ర పు. 2–366.

సహజంగా ఒక మనిషి మరణించాడు అనగానే వాళ్ళ మత సంప్రదాయం ప్రకారం దహనం చెయ్యడమో, ఖననం చెయ్యడమో జరుగుతుంది. ఆ తరువాత మరణ సంస్కారం ప్రారంభమవుతుంది. మనిషి జీవించినప్పుడు అతనిలో ఉన్న జీవకణాలు మరణించిన తరువాత నాశనం అవుతాయని; పరిణామ క్రమంలో ఇది సహజమైన చర్య అని విజ్ఞానశాస్త్రం వివరిస్తుంది. అయినప్పటికి మరణించిన మనుష్యుల్ని గురించి రకరకాల అభిప్రాయాలున్నాయి.

ఆంధ్రదేశంలో వున్న 'చెంచులు' అనబడేవారిలో మరణం గురించి

"శరీరం నశించినా అందులో ఒక భాగం అయిన జీవం అజ్ఞాతకాలంలో నివసిస్తుందని మహబూబ్‌నగర్ జిల్లా చెంచుల నమ్మకం. అది బతికివున్న తన బంధువుల్ని కనిపెట్టుకు వుంటుందనుకుంటారు. అసలు మనిషి నిద్ర పోయేటప్పుడు సంచారం బయలుదేరిన జీవుని అనుభవాలే కలలు అనుకుంటారు. బాగా జబ్బు చేసి స్మృతి లేనపుడు జీవుడు సంచారం పోయినట్లే, మరణానంతరం పిండాన్ని కాకులో కుక్కలో మరే జంతువులో తింటే జీవుడు ఆ జంతువులో ప్రవేశించాడని భావిస్తారు. ఏ జంతువులు పక్షులు ముట్టకపోతే భగవంతుడిలో ఐక్యమయ్యాడనుకుంటారు. పిండంమీద ఈగలు ఎక్కువగా వాలితే జీవుడు పిశాచం అయినట్లు భావన." [1]

ఆంధ్రప్రదేశ్‌లో జీవించే కోయవారి మరణాల గురించి ఈ రకమైన నమ్మకాలు ఉన్నాయి.

"శవాల్ని వీరు దహనం చేస్తారు. ఆవునో, ఎద్దునో బలి యిచ్చి దాని తోకను అతని చేతిలోను, ప్లీహాన్ని నోట్లోను పెడతారు. భార్య పుస్తెను అతని పక్కన పెడతారు. దహనాంతరం బూడిద పోగుచేసి ముద్దలా చేసి ఒక కన్నంలో పెట్టి దానిని రాతిపలకతో మూస్తారు. దానిమీద రాళ్ళు నిలువునా నిల్చోబెడతారు. కర్మకాండ అనంతరం విందులో, వినోదాలో జరుపుతారు. చనిపోయినవాని ఆత్మశాంతికది అవసరమని వారి అభిప్రాయం." [2]

ఆంధ్రప్రదేశ్‌లో కొండరెడ్లు తమ వారి మరణాల్ని గురించి ఈ విధంగా నమ్ముతారు.

1. ఆంధ్రులు-సంస్కృతి-చరిత్ర పు. 42

2. ఆంధ్రులు-సంస్కృతి-చరిత్ర పు. 49

"వీరిలో చనిపోయినవారిని ఖననం చెయ్యడమూ, దహనంచెయ్యడమూకూడా వుంది. అంత్యక్రియల రోజున, తరువాత మరి మూడురోజులపాటు కొద్ది బియ్యం వండి ఆ అన్నాన్ని సమాధిమీద వుంచుతారు. పెద్దకర్మ రోజున మరోమారు ఈ పిండ ప్రదానం చేస్తారు. ఆ రోజున పూజారి కర్మకాండను నిర్వహించి కొండదేవతకు నైవేద్యం పెడతాడు. దహనం చేసేటప్పుడు మృతుని భార్య తాలూకు పుస్తెలు, నగలు చితిమీద వేస్తారు. ప్రతి ఒక్కరు ఒక రాగికానీని మంటలలో వేస్తారు. చనిపోయినది పిల్లలయితే ఆకుదొప్పలో తల్లిపాలు పట్టి సమాధిమీద వుంచుతారు. అంత్యసంస్కారాల అనంతరం విందు చేస్తారు. వెజ్జు, మంత్రగాడు మరణ కారణాన్ని అది దైవనిర్ణయమో, చేతబడో బయట పెడతాడు". [1]

సహజంగా హిందూమతంలోని వివిధ శాఖలలో మరణించినవారికి జరిగే కర్మకాండల్లో దహనం చేసినా, ఖననం చేసినా పెద్ద మార్పేమీ వుండదు. దహనం జరిగిన రెండోరోజున చిన్నకర్మ చేస్తారు. ఏడవ రోజున అస్థికలు సేకరిస్తారు. తొమ్మిదవరోజున గాని, పదకొండోరోజున పుణ్యనదుల్లో కలుపుతారు. కొంతమంది పదకొండో రోజున, మరికొందరు పదమూడో రోజున మరికొందరు పదిహేనోరోజున పెద్దకర్మ చేస్తారు శక్తి వున్నవారు నిత్యకర్మ ఆచరిస్తారు. నిత్యకర్మ జరిపితే ప్రతిరోజూ పిండానికి అన్నం తయారుచేసి శ్మశానంలో సమాధి దగ్గర పిండాలు పెడతారు. కాకులు తిన్నట్లయితే ఆ జీవి పుణ్యాత్ముడైనట్లుగా భావిస్తారు. శక్తి లేనివారు పెద్దకర్మ రోజున పిండాలుపెట్టి పెద్దలకు తర్పణాలు చెల్లిస్తారు. సమాధులు ఏర్పాటు చేస్తారు.

మరణించినవారికి దానాది కార్యక్రమాలు ఎక్కువగా వుంటాయి. ఏ తిథి, ఏ నక్షత్రంలో చనిపోయారో దానినిబట్టి మంచి చెడ్డలు నిర్ణయించబడతాయి, శాంతులు చెయ్యడం, దేవాలయాల్లో అభిషేకాది కార్యక్రమం వుంటుంది. బ్రాహ్మణులకు గోదాన, భూదాన, హిరణ్యాది దానాలుంటాయి. గోవును దానం చెయ్యడం ద్వారా వైతరణి అనే చీము, నెత్తురు కలసిన నదిని దాటి వెళ్తారనే నమ్మకం వుంది.

ఇస్లాం మతంలోగాని, క్రైస్తవ మతంలో గాని ఖననం తప్పనిసరి. మరణించిన తరువాత శవసంస్కారం విషయంలో వీరిలో పెద్ద మార్పేమీ లేదు. శవ

---

1. ఆంధ్రుల సంస్కృతి-చరిత్ర పు. 51-52

పేటికలు తయారుచేసి శ్మశానంలో ఖననం చేస్తారు. ఆ ప్రదేశంపై సమాధులో లేక గుర్తుగా రాళ్ళో పాతుతారు. పీటపై వారి జననం - మరణం జీవిత విశేషాలు మొదలైనవి చెక్కుతారు.

క్రైస్తవంలో మరణించిన వ్యక్తులకు నైవేద్యం వంటి బలివిధానం లేదు. మరణించిన ఏడోరోజు గాని, పదోరోజుగాని శుద్ధిచెయ్యడం జరుగుతుంది. ప్రార్థనలు చెయ్యటం, విందులు వంటి కార్యక్రమాలుంటాయి. శవసమాధి వద్ద శుద్ధిరోజున నామవిశేషాలు గుర్తించడం జరుగుతుంది. ఈస్టర్, గుడ్‌ఫ్రైడే సందర్భాలలోను, 'మరణించిన దినం' రోజునా సమాధిని దర్శిస్తారు. మిగిలిన సమయంలో మరణించినవారి ప్రసక్తి రాదు.

ఇస్లాం మతంలో మరణించిన వ్యక్తులకు నైవేద్యం లేక బలి చెల్లించడం జరుగుతుంది. చనిపోయిన మూడో రోజున తినుబండారాలు తీసుకువెళ్ళి స్మశానంలో ఖనన ప్రదేశంవద్ద వుంచి ప్రార్థనలు చేసి ఆ ఫలహారాన్ని అందరూ ఆప్యాయంగా తింటారు. పదోరోజున హిజారత్ అనే పేరుతో కర్మవిధానాన్ని జరుపుతారు. ఆ రోజు విందు జరుపుకుంటారు. ఎంత బీదవాడైనా బంధువులకు ఖరీదైన మాంసాహార విందు చెయ్యక తప్పదు. నలభయ్యో రోజున పెద్దకర్మ జరుపుతారు. ఈ రోజు తిరిగి బంధువులందరకీ పెద్ద విందు చెయ్యవలసి వుంటుంది. దానధర్మాది కార్యక్రమం కూడా ఈ రోజే. శక్తినిబట్టి చెయ్యవలసి వుంటుంది. విందు భోజనాల పేరుతో ఈ మతం పేదవాణ్ణి పీడిస్తుంది అనడంలో సందేహం లేదు.

హిందూమతంలో పురుషుడు మరణిస్తే అతని భార్యకు పుస్తెలు, పసుపు కుంకుమలు, గాజులు-కాటుక-పువ్వులు మొదలైన అలంకరణ వస్తువులు తొలగించి వేయబడతాయి. విధవ అని పిలుస్తారు. ఆమె వివాహానికి తిరిగి అర్హురాలు కాదు. క్రైస్తవ మతంలో స్త్రీలకు అలంకరణ లేదు. అందుచేత వారికి పోయేది ఏమీ వుండదు. ప్రభువయిన ఏసుక్రీస్తు సన్నిధిలో ఆమె అవకాశాన్నిబట్టి పునర్వివాహానికి అర్హురాలే. ఇస్లాం మతంలో భర్త మరణిస్తే అలంకరణాది కార్యక్రమాలు తొలగించివేయబడతాయి. స్త్రీ పునర్వివాహానికి అర్హురాలు కాదు. అయితే ఈ రెండు మతాలు హిందూమతంలోని కొన్ని అవశేషాల్ని అనుకరించి పుస్తెలు, పూసలు, మట్టెలువంటి అలంకరణలు చేసుకుంటున్నారు. హిందూమత ప్రభావం వీటిపై

వుండటమే దీనికి తార్కాణం. అటువంటివారు ఇవి తీసివేయడం జరుగుతుంది. స్త్రీ మరణిస్తే పురుషునికి పోయేదేమీ వుండదు. అతడు పునర్వివాహానికి అర్హుడే.

దాదాపుగా హిందూ—క్రైస్తవం-ఇస్లాం మతాలు కర్మ సిద్ధాంతాన్ని నమ్ము తూనే వున్నాయి. చనిపోయినవారి ఆత్మలు భగవంతుని చేరతాయని, పునర్జన్మ వుందని, తాను చేసిన పుణ్యపాపాల ఫలితంగా మరో లోకంలో సుఖదుఃఖాలు అనుభవించక తప్పదని నమ్ముతారు.

# ఉపసంహారం

ఈనాడు సమాజంలో వ్యాపించిన మూఢనమ్మకాల్ని వాటి తీరుతెన్నుల్ని కూలంకషంగా పరిశీలించాం. ఇవి సమాజంలో సామాన్యుణ్ని ఏ విధంగా నిర్వీర్యుణ్ణి చేస్తున్నాయో గమనించాం. ఈ మూఢనమ్మకాలు ప్రగతికి ఆటంకంగా పరిణ మించాయి అనటంలో సందేహం లేదు. ఈ మూఢనమ్మకాలు తొలగించగలిగి, హేతువాద దృక్పథం ఆచరణలో పెట్టగల సామర్థ్యం, విజ్ఞానం, కార్యదీక్ష కలిగి నప్పుడే మానవునిలో నైతిక పునరుజ్జీవనం కలుగుతుంది.

సమాజంలో అసమానతల్ని సృష్టించి జాతిని పాయలు పాయలుగా చీల్చి వర్ణాలనీ, వర్గాలనే మిషతో విడగొట్టి మనిషికీ మనిషికి అడ్డుగోడల్ని సృష్టించటానికి ఈ మూఢనమ్మకాలు దోహదం చేసాయి. మతం ప్రవేశపెట్టిన కర్మ సిద్ధాంతాన్ని అనుసరించి అతీంద్రియశక్తుల్ని నమ్మి తన కనీస ఇంగితజ్ఞానాన్ని పోగొట్టుకొనే విధంగా మూఢనమ్మకాలు తయారుచేసాయి. పెరుగుతున్న విజ్ఞానశాస్త్రాన్ని అంగీక రించనియ్యక మానవునిలో మతం ప్రవేశపెట్టిన మత్తు జ్ఞానాంధుడిగా మార్చివేసింది.

సంఘంలో అసందర్భమైన మౌఢ్యంతో కూడుకున్న కట్టుబాట్లు నిర్మించి అతణ్ని ఆలోచనారహితుణ్ణి చేసింది మూఢనమ్మకాలే. అందుచేత నేటి మానవులు సుఖంగా జీవించాలంటే ఈనాటి సాంఘిక వ్యవస్థ మారాలి. ఈ సాంఘిక పరిణామ దశలో మానవుడు గ్రుడ్డినమ్మకాల్ని అంధవిశ్వాసాల్ని త్యజించి సర్వమానవ సమతకు నడుం కట్టాలి. గత తరాలు వొదిలివెళ్ళిన వెనుకటి వ్యవస్థకోసం వెతుకు లాడటం, వాటినే జీవనధ్యేయంగా భావించి గతాన్ని అనుసరించటం మూఢనమ్మ

ప్రవాహంలో కొట్టుకుపోవటమే అవుతుంది. అందుచేతనే మనం సంపాదించిన జ్ఞానాన్ని, ప్రపంచ చరిత్ర గమనాన్ని, సాంఘిక పరిణామాన్ని గ్రహించి కొత్త సామాజిక వ్యవస్థను కల్పించి ఈ మూఢ నమ్మకాల్ని రూపుమాపవలసిన అవసరం ఎంతైనా వుంది.

మనదేశంలో విద్యావంతుల సంఖ్య చాలా తక్కువ. పైగా ఇది వ్యవసాయిక దేశం. ప్రజల్లో ఎక్కువ భాగం పల్లెల్లో జీవిస్తున్నారు తరతరాలుగా వారి రక్త నాళాల్లో వ్యాపించిన ఈ మూఢ నమ్మకాలు వారి జీవన విధానాన్ని కుంటుపరచటమే కాక అభివృద్ధి నిరోధకంగా తయారయ్యాయి. ఈ జాతి జాగృతం కావాలంటే, ఈ సమాజం చైతన్యం పొందాలంటే మూఢ నమ్మకాల్ని తుడిచివేయ గలగాలి.

మేధావుల కర్తవ్యం :

నేడు భారతదేశంలో ప్రజలు మూఢ నమ్మకాలు సృష్టించిన అజ్ఞానాంధ కారంలో మునిగి ఏం చెయ్యాలో తెలియక నలిగిపోతున్నారు మూఢ నమ్మకాలకు వ్యతిరేకంగా పోరాడిన అనేక ఉద్యమాలు ఈ సమాజాన్ని కాపాడలేకపోయాయి అంటే మేధావుల్లో ఎక్కువమంది ఈ ఉద్యమాల్ని బలపరచక పోవటమే. మేధావుల్లో ఎక్కువ శాతం నూతన వ్యవస్థను నిర్మించకలిగి శక్తి సామర్థ్యాల్ని పెంచటానికి ప్రతిగా వారు సంఘ సంస్కరణ కార్యక్రమాలతోను మత ప్రచారం తోనూ కాలం గడుపుతున్నారు. మేధావులు సైతం మత కబంధహస్తాల్లో నలిగి పోతున్నారు. మతం సృష్టించిన మత్తును ఛేదించటానికి వారు భయపడు తున్నారు. మేధావులే జాతిని జాగృతం చేయగలిగిన తత్త్వవేత్తలు. వీరు ఇలాంటి జీవితం గడుపుతున్నంత కాలం ఈ సాంఘిక వ్యవస్థ మారదు. ఒకనాడు మనకు ఈ సృష్టిని గురించిన రహస్యం తెలియని రోజుల్లో ప్రకృతిని- ప్రకృతికి అతీత మైన శక్తుల్ని నమ్మాం, ప్రార్థించాం- పూజించాం. నేడు పెరిగిన విజ్ఞానశాస్త్రాన్ని ఆధారంగా చేసుకొని మూఢ నమ్మకాల్ని తొలగించాల్సిన అవసరం మేధావుల మీద వుంది గ్రహాంతర యానాలకు ప్రయాణం చేస్తున్న సమయంలో మేధావులు సైతం మూఢ నమ్మకాల్ని పాటిస్తున్నారంటే సిగ్గుపడాల్సిన అవసరం ఎంతైనా వుంది. ఈనాడు విజ్ఞానవేత్తలు అతీంద్రియశక్తుల్ని నమ్మటం- మతాధిపతులకు, బాబాలకు, అమ్మలకు అడుగులకు మడుగులొత్తటం వంటి నీచకార్యాలు కొనసాగిస్తుంటే సామాన్యుడు ఆ మార్గంలో పయనించక మానడు కదా! సామాన్యుడికి స్ఫూర్తిని

కలిగించాల్సిన మేధావులు మూఢనమ్మకాల్ని అనుసరించటం మానివేయాలి. సమాజ పరంగా నేడు సాగుతున్న మూఢ నమ్మకాల్ని తొలగించనిదే ఈ వ్యవస్థ మారదు. అందుచేత మేధావులు సగటు మనిషికి మార్గదర్శకులై ఈ మూఢ నమ్మకాల్ని కూకటి వేళ్ళతో పెకలించాలి.

**సామాజికుని కర్తవ్యం :**

సామాజికుడు అంటే సగటు మనిషి అనవలసివస్తుంది. వీరిలో ఎక్కువ భాగం గతాన్ని అనుసరించటమే ధ్యేయంగా పెట్టుకుంటారు. తరతరాలుగా వ్యాపించిన మూఢ నమ్మకాల్ని తొలగించటానికి అంగీకరించరు. మా తాత-ముత్తాతల నుంచి వస్తున్న ఆచారాల్ని, నమ్మకాల్ని వదులుకోము అంటారే తప్ప తర్కబద్ధంగా హేతువాద దృక్పథాన్ని పొందరు. తరతరాలుగా పల్లెల్లో జీవించటం, చదువు సంధ్యలు లేకపోవటం, వైజ్ఞానిక విషయాలు అందుబాటులో లేకపోవడం దీనికి కారణం.

ప్రతి విషయాన్ని లోతుగా దిగి సద్విమర్శతో, నిష్పాక్షికంగా ఆలోచించే మనస్తత్వం లేకపోవడం చేత ప్రస్తుత వ్యవస్థను సమూలంగా తొలగించి వేయాలనే ధైర్యం, ఉత్సాహం లేకపోడమే వీరిలోని లోపం. గతం నుంచి మతం పేర్చి నిర్మించిన కట్టడాల నుంచి నవ్య సమాజాన్ని చూసే ఆలోచన లేకపోవటం దీనికి కారణం. మూఢ నమ్మకాల మరుగున సామాన్యులకు జరుగుతున్న అన్యాయాల్ని గ్రహించాల్సిన అవసరం ఉంది. వేల సంవత్సరాలుగా బానిసత్వంలో మునిగిన ఈ జాతి మేల్కొని ఈ మూఢ నమ్మకాల్ని వేటాడాల్సిన అవసరం వుంది. సామాన్యుల శ్రమశక్తిని దైవం పేరుతో, మతం పేరుతో, మూఢనమ్మకాల పేరుతో సాగే దమన కాండను అరికట్టాల్సిన అవసరం వుంది. వ్యాధులకు, బాధలకు నమ్మకాల్ని అనుసరించటం కాక కార్యకారణ సంబంధాన్ని తెలుసుకొని జీవితాన్ని సుఖమయం చేసుకోవాలి. మూఢ నమ్మకాలు– మతం పేర్చిన భయాన్ని తొలగించుకోవాలి. అందుచేత వీటిని తొలగించాలంటే మతాన్ని సంస్కరించటం కాక మతాన్ని మూఢ నమ్మకాల్ని హేతువాద దృక్పథంతో పరిశీలించి సంఘ పురోభివృద్ధికి తన వంతు కర్తవ్యాన్ని నిర్వర్తించాలి.

**స్త్రీల కర్తవ్యం :**

సమాజంలో సగ భాగం స్త్రీ. తరతరాల చరిత్రను పరిశీలిస్తే స్త్రీకి స్వాతంత్ర్యం గాని, సమానత్వం గాని మృగ్యం. తల్లిగా, భార్యగా, కుటుంబాన్ని నిర్వహించే

స్త్రీకి ఏ సమాజంగాని ఏ మతం గాని, ఏ దేశం గాని ఔన్నత్యాన్ని ప్రసాదించలేదు.
మూఢ నమ్మకాల వరవడిలో గత చరిత్రను పరిశీలిస్తే స్త్రీ భావదాస్యానికి గురిచేయ
బడింది. నాటికీ, నేటికి స్త్రీ అధోగతిలోనే వుంది. బానిస జీవితాన్ని గడుపుతుంది.
స్త్రీలపై మతం గాని, మతగ్రంథాలు గాని విధించిన అసందర్భమైన మూఢ నమ్మ
కాల్ని పరిశీలిస్తే సంప్రదాయాల పేరుతో ఎన్నో అవమానకరమైన సాంఘిక
సిద్ధాంతాలు స్త్రీని కించపరుస్తూ ప్రవేశపెట్టబడ్డాయి. ప్రపంచ చరిత్రలో స్త్రీకి అను
కూలంగా గానీ స్త్రీమూర్తికి గౌరవ ప్రపత్తులు గాని ఏ సంప్రదాయం కలిగించలేదు.
స్త్రీలు పురుషుల కన్నా శారీరకంగా, నైతికంగా, మానసికంగా బలహీనులు అన్న
అభిప్రాయమే దీనికి మూల కారణం. స్త్రీ పురుషునికి బానిస అనే నమ్మకమే దీనికి
పునాది. మూఢ నమ్మకాలన్నీ స్త్రీకి ప్రతికూలంగా పురుషునికి అనుకూలంగా మలచ
బడ్డవే. స్త్రీని తన స్వంత ఆస్తిలో భాగంగా పురుషుడు ఎప్పుడు ఆలోచించాడో
అప్పటినుంచి స్త్రీమూర్తి విలువ పతనం అవుతూనే వచ్చింది. మాతృస్వామిక
యుగంలో గౌరవాధికారాలు పొందిన స్త్రీ తరువాత పరిణామంలో నీచస్థాయికి దిగ
జార్చి వేయటం జరిగింది.

వివాహం- వివాహ విధులు- సహగమనం- పతివ్రతా జీవనం, వితంతు
జీవితం, వ్యభిచారం మొదలైన మూఢ నమ్మకాలన్నీ స్త్రీలపై సంధించిన అస్త్రాలే.
ఇప్పటికే ఈ దశ కొనసాగుతూనే వుంది. అందుచేత స్త్రీలు ముఖ్యంగా ఈ మూఢ
నమ్మకాల్ని వ్యతిరేకించవలసిన అవసరం వుంది.

స్త్రీలు సమాజంలో సగభాగం అని ముందే అనుకున్నాం. ఈ సమాజాన్ని
మార్చాల్సిన అవసరం స్త్రీపైనే వుంది. తరతరాలుగా వస్తున్న ఈ మూఢ నమ్మ
కాల్ని ఉగ్గుపాలతో రంగరించి పోస్తున్న స్త్రీ-పురుష సామాజిక అసమానతల్ని
ఖండించవలసిన బాధ్యత నేడు స్త్రీలపైనే వుంది.

స్త్రీకి విద్యాజ్ఞానం అవసరం. తాను సంపాదించిన విజ్ఞానంతో సమాజాన్ని,
కుటుంబాన్ని భావితరాల సంతతిని సరియైన పద్ధతిలో తీర్చిదిద్దాల్సిన బాధ్యత స్త్రీల
పైనే వుంది. ఏ సమాజంలో స్త్రీ గౌరవించబడుతుందో ఆ సమాజ నాగరికత అత్యుత్త
మంగా వుంటుందనే గ్రహించాలి. పురుషులతో సమాన గౌరవ ప్రపత్తులు పొందా
లనే తపన వారిలో కలగాలి. తమకు తాముగా అబలలమనే నిస్పృహలో వుండక
స్త్రీ జాతి స్వతంత్ర భావనలతో హేతువాద దృక్పథంతో ఈ సమాజాన్ని నడిపిం

చాల్సిన అవసరం వుంది. సామ్యవాద దేశాలలో నేటి పరిస్థితిని పరిశీలిస్తే స్త్రీ స్వాతంత్ర్యం ఆర్థిక, రాజకీయరంగాల్లో వారి ప్రతిభను గమనించవచ్చు. అందుచేత స్త్రీలే ఈ సమాజాన్ని శాసించాలి. జాతి మూఢ నమ్మకాల ప్రవాహంలో కొట్టుకుపోకుండా చూడవలసిన బాధ్యత నేటి సగటు స్త్రీ నిర్వహించాలి.

ప్రభుత్వం - ప్రభుత్వాధికారులు :

నేడు ప్రతిదేశంలో దాదాపు ఏదో ఒక రూపంలో ప్రజాస్వామ్యం పనిచేస్తూనే వుంది. ప్రభుత్వం-ప్రభుత్వాధికారులు దీనికి ముఖ్యాంగాలుగా వుంటారు. మనదేశ రాజకీయ వ్యవస్థను పరిశీలిస్తే మన రాజ్యం లౌకికరాజ్యం. మత సంబంధం లేని రాజ్యం. అంటే ప్రభుత్వానికి, వారి విధి నిర్వహణకు మతానికి సంబంధం లేదన్న మాట. కాని కొందరు మేధావులు లౌకికరాజ్యం అంటే అన్ని మతాల్ని సమానంగా చూడటం అనే వికృతార్థాన్ని కల్పించారు. ఈ రూపకల్పనే నేటికి మూఢ నమ్మకాల్ని పెంచి పోషిస్తుంది. ప్రభుత్వ ప్రచారసాధనాలైన ఆకాశవాణి, దూరదర్శిని మొదలైనవి మతాల్ని ప్రోత్సహిస్తున్నాయి. విద్యాలయాల్ని చేరవలసిన విద్యార్థికి రిజర్వేషన్ల పేరుతో కులమతాల్ని ప్రోత్సహిస్తున్నాయి. దేవాలయాల నిర్వహణ, మతసంస్థల ప్రోత్సాహం, మతోన్మాదుల్ని స్వేచ్ఛగా వదిలేయటం వంటి చర్యలు గమనిస్తే ప్రభుత్వం- ప్రభుత్వాధికారులు మూఢ నమ్మకాల్ని ఏ విధంగా పెంచుతున్నారో తెలుస్తుంది.

పాఠశాలల్లో విద్యార్థులకు మతాన్ని బోధించటం సర్వసామాన్యం అయింది. పాఠ్య గ్రంథాల్లో మత విషయాలు, మత ధర్మాలు చేర్చటం జరుగుతుంది. విద్యార్థులకు శాస్త్రీయమైన విద్య అలవరచటం లేదు. కులంతో ప్రారంభమైన విద్యార్థి జీవితం మతంతో ముగియటం విచారించవలసిన విషయం. అందుచేత ముందు విద్యారంగాన్ని ప్రక్షాళనం చేయాలి. విద్యార్థులకు శాస్త్రీయమైన విద్యాజ్ఞానాన్ని అందించాలి. ప్రభుత్వం, ప్రభుత్వాధికారులు, విద్యార్థులు సమసమాజ నిర్మాణానికి నడుం కట్టి ఈ మూఢ నమ్మకాల్ని తొలగించినప్పుడు ఈ జాతికి విముక్తి.



# అనుబంధం - 1

తెలంగాణా ప్రాంతమైన మెదక్, మహబూబ్ నగర్ జిల్లాల్లో బాణామతి విపరీతంగా వ్యాపించిందనే వార్తను వార్తాపత్రికలు, పోలీసు శాఖ ధృవపరచడంతో నిజ నిర్ధారణకై "భారత నాస్తిక సమాజం" ఆంధ్రప్రదేశ్ శాఖ ఆధ్వర్యంలో పై జిల్లాలు 1981 వ సం॥లో పర్యటించింది. ఆ సందర్భంలో ఈ వ్యాసకర్త సేకరించిన ఛాయాచిత్రాలు.



మెదక్ జిల్లాలో బాణామతి నిజనిర్ధారణకు బయలుదేరిన భారత నాస్తిక సమాజ బృందం.



బాణామతిగా భావించబడిన రోగుల్ని ఇంటర్వ్యూ చేస్తున్న శ్రీ బి. రామకృష్ణ (ప్రధాన కార్యదర్శి భారత నాస్తిక సమాజం, ఆంధ్రప్రదేశ్ శాఖ)



కీళ్ళనొప్పి వ్యాధితో బాధపడుతున్న రోగిని తన హిప్నాటిజం ద్వారా వ్యాధి నివారించిన ప్రొ॥ విక్రమ్.

# అనుబంధం - 2

మెదక్ జిల్లాలోని గ్రామాలయాల్లో మాతంగి ఆచారం వుంది. మాతంగి అంటే మతంగ కన్య అని అర్థం. హరిజనవాడలలోని ఒక స్త్రీని గాని, అనేకమంది స్త్రీలను గాని ఆ గ్రామదేవతకు అర్పణగా ఇవ్వడం అన్నమాట. దీన్నే జోగి విడవటం అంటారు. వయసులో వున్న ఆ స్త్రీలు ఆయా ఆలయాలకు మాతంగులుగా మార్చబడతారు. ఉత్సవ సమయాల్లోను, జాతర్ల సమయాల్లోను బహిరంగంగా చిందెయ్యడం, తనకు తెలిసిన రీతిలో నృత్యం చెయ్యడం వారి నిత్యకృత్యం. మిగిలిన సమయాల్లో ఆ గ్రామంలోని పెత్తందార్ల శారీరక అవసరాలు తీర్చాలి.

మా మెదక్ జిల్లా పర్యటన సందర్భంలో జహీరాబాద్ తాలూకా 'కప్పాడు' గ్రామంలోని ఆలయంలో వున్న 'సంగమ్మ' అనే మాతంగిని కలిసాం. ఆమె వయస్సు 17-18 సంవత్సరాల మధ్య వుంటుంది. మాతంగి గుర్తుగా ఆమె మెడలో కొమ్ముతో తయారు చేసిన ఒక చిన్నబొమ్మ (దీనిని అక్కడి వాళ్ళు 'తరాయి' అంటారు) మొట్టమొదట కన్నెరికం చేసిన వూరి పెద్ద ఈ తాడు కడతాడు. దీన్ని ముద్ర అని కూడా పిలుస్తారు. ఆ వయసుకే ఆమె యవ్వనమంతా ఆ గ్రామపెద్దల చేతిలో కొల్లగొట్టబడిందని తెలుసుకొన్నాం. ఆ గ్రామంలోని హరిజన పెద్దల్ని కలిసి ఈ అన్యాయాన్ని అరికట్టాలన్నాం. మా బృందంలో వివాహం కాని ఓ మానవతావాది ఆమెను వివాహం చేసుకోవడానికి సిద్ధపడ్డాడు. అందుకు ఆ హరిజన పెద్దలు, ఆ పిల్ల తల్లిదండ్రులు చెప్పిన మాటలు వింటే మనం వున్నది ఆటవిక సమాజంలోనా అని ముక్కున వేలేసుకుంటాం.

ఆ విధంగా జరిగితే ఎల్లమ్మ తల్లికి కోపం వస్తుందన్నారు. పోనీ దేవత సంగతి వదిలినా గ్రామ పెద్దలు వాళ్ళ తోలు తీస్తారన్నారు. ఆ గ్రామపెద్దల పైశాచిక కామకేళీ కలాపాలకు ఆమె సమిధగా వుండాల్సిందేనట. ఆ గ్రామపెద్దలు మా జీపుపై దాడి చేయటానికి ప్రయత్నించిన సందర్భం కూడా గుర్తించతగింది.

మా బృందం జిల్లా పోలీసు సూపరింటెండెంట్‌ను కలసి ఈ అన్యాయాన్ని అరికట్టాలన్నాం. ఆయన తన వ్యక్తిగత సానుభూతి చూపగలిగారే తప్ప ఈ సమస్యను విడదీయలేకపోయారు.

శ్రీ సంగమ్మను మేము ప్రత్యేకంగా అడిగాం ఈ జీవితం నీకు సుఖంగా వుందా ? ఆమె కన్నీటితో తన నికృష్ట జీవితగాథను వివరించి తనకు మరో జన్మ ప్రసాదించమని మా బృందాన్ని వేడుకుంది. ఆ కరుణామయి కన్నీటిగాథ మా హృదయాల్ని కదిలించిందే తప్ప మేము కూడా ఏమీ చెయ్యలేకపోయాం. మనం నాగరికులం అని గర్వపడుతూ చెప్పుకునే సంస్కృతి ఇదేనా ? ఈ విధంగా కామాంధుల కరాళ ఉక్కుపాదాల కింద తమ జీవితాల్ని సర్వస్వం అర్పణ చేస్తున్న ఈ జాతికి నిష్కృతి లేదా ?



పెట్టుబడి, పెత్తందార్ల కామ కోరలకు బలై నికృష్ట జీవితాన్ని గడుపుతున్న
“కప్పాడు” దేవత గుడిలోని మాతంగి స్త్రీ సంగమ్మ.

# ఉపయుక్త గ్రంథసూచి

**పద్య కావ్యాలు :**

1. అప్పకవీయము — అప్పకవి
2. ఆముక్తమాల్యద — శ్రీకృష్ణదేవరాయలు
3. ఉత్తర హరివంశము — నాచన సోమన
4. కళాపూర్ణోదయము — పింగళి సూరన
5. కాశీఖండము — శ్రీనాథుడు
6. కుమార సంభవము — నన్నెచోడుడు
7. కుప్పుస్వామి శతకము — త్రిపురనేని రామస్వామి
8. కీర్తి తోరణము — ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి
9. క్రీడాభిరామం — శ్రీనాథుడు
10. చంద్రరేఖా విలాపము — కూచిమంచి జగ్గకవి
11. చంద్రహాస చరిత్రము — ముళ్ళపూడి వేంకయకవి
12. జన్మాంతర వైరమ్ — బోయి భీమన్న
13. జాషువా ఖండకావ్య సంపుటములు — గుర్రం జాషువా
14. తాలాంక నందినీ పరిణయము — ఆసూరి మఱిగంటి వేంకట నరసింహాచార్య
15. ధర్మఖండము — ఈదులపల్లి భవానీశకవి
16. నవనాథ చరిత్రము — గౌరన
17. నిర్వచనోత్తర రామాయణము — తిక్కన
18. నీలా సుందరీ పరిణయము — కూచిమంచి తిమ్మకవి
19. నృసింహ పురాణము — ఎఱ్ఱన
20. ప్రభావతీ ప్రద్యుమ్నము — పింగళి సూరన
21. పంచతంత్రము — దూబగుంట నారాయణకవి

22. పండితారాధ్య చరిత్ర — పాల్కురికి సోమన
23. పారిజాతాపహరణము — నంది తిమ్మన
24. పాండురంగ మాహాత్మ్యము — తెనాలి రామకృష్ణ
25. బసవపురాణము — పాల్కురికి సోమన
26. భీమేశ్వర పురాణము — శ్రీనాథుడు
27. భోజరాజీయము — అనంతామాత్యుడు
28. మనుచరిత్ర (స్వారోచిష మను సంభవము) — అల్లసాని పెద్దన
29. మాధవస్వామి శతకము — కార్యమపూడి రాజమన్నారు
30. మార్కండేయ పురాణము — మారన
31. రంగనాథ రామాయణము
32. రంగారాయ చరిత్ర — దిట్టకవి నారాయణకవి
33. రామాభ్యుదయము — అయ్యలరాజు రామభద్రుడు
34. రాధికా సాంత్వనము — ముద్దుపళని
35. రాజశేఖర విలాసము — కూచిమంచి తిమ్మకవి
36. రుక్మిణీ పరిణయము — కూచిమంచి తిమ్మకవి
37. రుక్మాంగద చరిత్ర — ప్రౌఢకవి మల్లన
38. లంకా విజయము లేక రావణదమ్మీయము — పిండిప్రోలు లక్ష్మణకవి
39. విక్రమార్క చరిత్ర — జక్కన
40. వేంకటాచల మాహాత్మ్యము — తరిగొండ వెంకమాంబ
41. వేమన — రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ
42. వేమన పద్యరత్నాకరము — బాల సరస్వతి బుక్ డిపో
43. వేమన యోగి పద్యరత్నములు — సి. వి. కృష్ణా బుక్ డిపో
44. వేమన — యస్. వి. గోపాల్ అండ్ కో
45. వేమన — నేదునూరి గంగాధరం
46. వేమన — బ్రౌన్
47. వైజయంతీ విలాసము — సారంగు తమ్మయ

48. శివతత్త్వసారము — మల్లిఖార్జున పండితారాధ్యుడు
49. శివరాత్రి మాహాత్మ్యము — శ్రీనాధుడు
50. శిఖినారసింహ శతకము — వావిళ్ళ రామస్వామి అండ్ సన్స్
51. శుకసప్తతి — పాలవేకరి కదిరీపతి
52. శ్రీ కాళహస్తి మాహాత్మ్యము — ధూర్జటి
53. శ్రీ మదాంధ్ర మహా భాగవతము — బమ్మెర పోతన
54. శ్రీ మదాంధ్ర మహా భారతము — నన్నయ
55. ,, ,, — తిక్కన
56. ,, ,, — ఎఱ్ఱన
57. శ్రీ వీరబ్రహ్మేంద్రస్వామి చరిత్రము — పూసపాటి నాగేశ్వరరావు
58. శృంగార నైషధము — శ్రీనాధుడు
59. సమీర కుమార విజయము — పుష్పగిరి తిమ్మన
60. సాంబోపాఖ్యానము — రామరాజు రంగప్పకవి
61. సింహాసన ద్వాత్రింశిక — కొరవి గోపరాజు
62. సూత పురాణము — త్రిపురనేని రామస్వామి
63. హరివంశము — ఎఱ్ఱన
64. హంసవింశతి — అయ్యలరాజు నారాయణామాత్యుడు

వచన కావ్యాలు :

1. అంబేద్కర్ చరిత్ర ... డా॥ ఎడ్లూరి
2. ఆధునిక ఆంధ్ర సాహిత్యము ... డా॥ సి. నారాయణరెడ్డి
3. ఆంధ్రుల సంస్కృతి – చరిత్ర ... కంభంపాటి సత్యనారాయణ
   అనువాదం మహీధర రామమోహనరావు
4. ఆంధ్రుల చరిత్ర – సంస్కృతి ... ఖండవల్లి లక్ష్మీ రంజనం
5. ఆంధ్రుల సాంఘిక చరిత్ర ... సురవరం ప్రతాపరెడ్డి
6. ఆంధ్రలో సాంఘిక తిరుగుబాటు ఉద్యమాలు ... సి. వి.

7. కన్యాశుల్కం ... గురజాడ అప్పారావు
8. కన్యాశుల్కం ... (ఎడిట్) నార్ల వేంకటేశ్వరరావు
9. కర్మవిపాకము ... బి. యన్. కృష్ణమూర్తి
10. కళ్యాణ సంస్కృతి ... డా॥ ఎక్కిరాల కృష్ణమాచారి
11. గతితార్కిక భౌతికవాదం ... నండూరి ప్రసాదరావు
12. గ్రహబలము ... బి. యన్. కృష్ణమూర్తి
13. గుప్తవాస్తు ... దోగుపర్తి గుప్త సిద్ధాంతి
14. గురజాడ రచనలు ... గురజాడ అప్పారావు
15. గుడ్డినమ్మకాల గుట్టుమట్టులు ... బి. రామకృష్ణ
16. జాతక మర్మ బోధిని ... కాలనాధ భట్టు వేంకటరమణమూర్తి
17. జాతక సరస్వతి ... పండిత నేమాని సోమేశం శర్మ అండ్ సన్ రామశాస్త్రి
18. జైమినీ భారతము ... అనంతం
19. జైన ధర్మము ... యం. రాజగోపాలరావు
20. తెలుగు జానపద గేయ సాహిత్యం ... డా॥ బి. రామరాజు
21. తెలుగు జానపద గేయాలు – సాంఘిక చరిత్ర ... డా॥ బి. రామరాజు ... డా॥ నాయని కృష్ణకుమారి
22. తెలుగు విజ్ఞాన సర్వస్వములు – తెలుగు భాషా సమితి
23. దేవాలయాల మీద బూతు బొమ్మలెందుకు ... తాపీ ధర్మారావు
24. నరమేధము ... మల్లాది వసుంధర
25. నాస్తికత్వం కావాలి ... ఛార్లెస్ బ్రాడ్లా అనువాదం నాస్తికకేంద్రం
26. నాస్తికత్వ సిద్ధాంతం ... జోసఫ్ లూయీస్ అనువాదం బి. రామకృష్ణ
27. నాస్తికులున్నారు జాగ్రత్త ... రావిపూడి వేంకటాద్రి
28. పల్నాటి వీరచరిత్ర ... చిట్టిబాబు
29. ప్రాక్పశ్చిమ తత్వశాస్త్రం ... సరివెల్ల విశ్వనాధశాస్త్రి
30. పెళ్ళి–దాని పుట్టు పుర్వోత్తరాలు ... తాపీ ధర్మారావు

31. పెళ్ళెందుకు ... ఎలమంచిలి వెంకటప్పయ్య

32. భారతీయ తత్వశాస్త్రము ... ఏటుకూరి బలరామమూర్తి

33. భారతీయ తత్వశాస్త్ర పరిశీలన ... త్రిపురనేని వెంకటేశ్వరరావు

34. భారతీయ తత్వశాస్త్రము - సులభ పరిచయము ... దేవీప్రసాద చటోపాధ్యాయ

35. మల్లమదేవి ఉసురు ... లల్లాదేవి

36. మహోదయం ... కె. వి. రమణారెడ్డి

37. మూఢ విశ్వాస వనకుఠారము ... బి. రామకృష్ణ

38. యం. యన్. రాయ్. వ్యాసాలు అనువాదం ... కె. రాధాకృష్ణమూర్తి

39. వర్ణ వ్యవస్థ ... సి. వి.

40. విశ్వదాభిరామ వినురవేమా ... త్రిపురనేని వెంకటేశ్వరరావు

41. వేమన ... జి. వి కృష్ణారావు

42. శతావతారాలు ... ముక్కామల నాగభూషణం

43. సామాజిక పరిణామంలో స్త్రీ ... డి. బి. యన్. ఆర్. సి. హెచ్. మూర్తి

44. సాక్షి వ్యాసములు (సంపుటములు) ... పానుగంటి లక్ష్మి నరసింహారావు

45. సీత జోస్యం ... నార్ల వెంకటేశ్వరరావు

46. స్త్రీ పునర్వివాహ విషయకోపన్యాసము ... కందుకూరి వీరేశలింగం

47. స్త్రీ పునర్వివాహ విషయక ప్రథమ విజ్ఞాపనము ... కందుకూరి వీరేశలింగం

48. స్త్రీ పునర్వివాహము ... కందుకూరి వీరేశలింగం

49. సృష్టికి మూలం ఏమిటి ... వి. చెంచయ్య

50. సంగ్రహ ఆంధ్ర విజ్ఞానకోశము ... మామిళ్ళపూడి వెంకటరంగయ్య

51. స్మృతి బింబాలు ... సంజీవదేవ్

52. శ్రీ పోతులూరి వీరబ్రహ్మంగారి చరిత్ర ... వడ్డాది వీర్రాజు

53. శ్రీ పోతులూరి వీరబ్రహ్మంగారి చరిత్ర (సంపూర్ణ చరిత్ర) ... కలపటాల జయ రామారావు

54. శ్రీకృష్ణ రామాభ్యుదయ సంచిక

55. హస్తరేఖా శాస్త్రము ... వడ్డాది పీర్రాజు

56. హస్తరేఖాశాస్త్ర సంగ్రహము ... ఇవటూరి షణ్ముఖరావు

57. హస్తరేఖా ఫలము ... బి. యస్. మూర్తి

58. హిందువుల పండుగలు ... సురవరం ప్రతాపరెడ్డి

59. హిందువుల పండుగలు – పర్వములు ... తిరుమల రామచంద్ర

60. హేతుత్వం – మత తత్వం ... రావిపూడి వేంకటాద్రి


నిఘంటువులు :


1. తత్వశాస్త్ర నిఘంటువు ... తెలుగు అకాడమి

2. శబ్దరత్నాకరము ... బి. సీతారామాచార్యులు

3. శబ్దార్థ దీపిక ... దాచేపల్లి ప్రచురణ

4. సూర్యరాయ ఆంధ్ర నిఘంటువు ... ఆంధ్ర సాహిత్య అకాడమి


సంస్కృత కావ్యాలు :


1. అర్థశాస్త్రం

2. ఋగ్వేదం

3. జ్యోతిర్నిబంధం

4. గౌతమ ధర్మ సూత్రములు

5. మనుస్మృతి

6. వృద్ధ హరీతస్మృతి

7. వాస్తుశాస్త్రం

8. వాస్తు రాజ వల్లభం

9. వాస్తుప్రదీపం

10. విశ్వకర్మ ప్రకాశిక

వార్తా పత్రికలు :

ఆంధ్రప్రభ, ఆంధ్ర పత్రిక, ఆంధ్రజ్యోతి, ఈనాడు, ఉదయం, నాస్తిక మార్గం, నాస్తిక యుగం, ప్రసారిత, హేతువాదం, హేతు వాద దర్శిని

## ENGLISH BOOKS

1. An introduction to Indology — Sir Walter Ruben
2. Atheism - The case against God — Smith George
3. An Idealist view of life — S. Radhakrishnan
4. Birth & Born — Dr. William Taler
5. Clinical abstracties — Dr. A. L. Mudaliar
6. Discovery of India — Pandit Jawaharlal Nehru
7. God and State — Michel Bakunin
8. Ingersal Lectures and Essays — Ingersal, Robert Green
9. Knowledge - morality and destiny — Ingersal
10. Men without Gods — Hawton Hector
11. My experience in Hayathi islands — E. Wode Davis
12. Origin and Growth of caste in India — Nru Pendrakumar Dutta
13. Philosaphy and practice of Radical Humanism — M. N. Roy
14. Phylosophical concept of Atheism an tiquies of God
15. Prineiples of Radical Humanism — M. N. Roy
16. Seience and Philosaphy — M. N. Roy
17. The Humanist revolution — Hawton Hector
18. The Human Universe — Henry Tompkins
19. The liberation of man Woman and Child — Ingersal

**Encyclopedias & Dictionaries**

1. A. Rationalist Encyelopedio — Mecab Joseph
2. The New Encyclopedia of Britanica
3. Websters New Twentieth century Dictionary

**PERIODICALS**

1. American Atheist
2. The American Rationalist
3. The Indian Liberation Rationalist supplement
4. The Indian Rationalist
5. The Plain View
6. The Rationalist Annual

* * *